# శ్రీమదాంధ్రమహాభారత

# శిల్పకళాదర్శనము

[ప్రథమ భాగము]

ఆంధ్రవిశ్వకళాపరిషత్తు వారిచే స్వర్ణపతకబహూకృతి నందుకొన్న

విశిష్టసిద్ధాంతగ్రంథము

డాక్టర్ శోభిరాల సత్యనారాయణ

యమ్.ఏ., పిహెచ్.డి

శ్రీ విశ్వకర్మా విజ్ఞానకేంద్ర

1-4(6)-7 శాంతినగర్

శ్రీకాకుళం - 532 001

Srimadandhra Mahabharata

# SILPAKALADARSANAMU

– A study of Architecture, Arts and Crafts in Andhra Maha Bharatam

**By Dr. Sobhirala Satyanarayana**



ప్రథమ ముద్రణ : ప్రభవ గ్రీష్మము 1987 జూన్

ప్రతులు : 1000

మూల్యము : **50**/-

**ముద్రణ :** నాగార్జున ప్రింటింగ్ & బైండింగ్ వర్క్స్ - తెనాలి.

ముఖపత్ర రచన :

శ్రీ పోలవరపు నారాయణమూర్తి, శ్రీకాకుళం

ప్రతులకు :

సంచాలక్

శ్రీ విశ్వకర్మ విజ్ఞానకేంద్ర
1 – 4 (6) – 7
శ్రీకాకుళం — 532 001

కుమారి శోభిరాల శ్రీవిద్య
శ్రీవిద్యానికేతన్, శాంతినగర్
శ్రీకాకుళం – 532 001

నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్
దేవీం సరస్వతీం చైవ తతో జయ ముదీరయేత్

విశ్వకర్మా మహాభాగో జజ్ఞే శిల్పప్రజాపతిః।
కర్తా శిల్పసహస్రాణాం త్రిదశానాం చ వర్ధకిః॥
భూషణానాం చ సర్వేషాం కర్తా శిల్పవతాంవరః।
యో దివ్యాని విమానాని త్రిదశానాం చకారహ॥
మనుష్యాశ్చోపజీవంతి యస్య శిల్పం మహాత్మనః।
పూజయంతి చ యం నిత్యం విశ్వకర్మాణ మవ్యయమ్॥

.... వ్యాసభారతము. ఆది. 66.26.30

నరనారాయణతత్త్వము
నరోత్తముని ధర్మమును మనంబున వెలుఁగన్
విరచింతును జయగ్రంథము
సరస్వతీదేవి కెలిఁగి సకలార్థముగా.

# AWARD OF GOLD MEDAL

## Andhra University

No. S.I. (3) /6 85,  Waltair, Dt. 22-5-1985.

## NOTIFICATION

## AWARD OF RESEARCH MEDALS/PRIZES

The following candidates whose Ph.D , theses have been adjudged to be the best among those accepted by the University, during the years mentioned have been awarded the Research Medals/Prizes noted against each.

*Faculty of Arts :*

| | Name of the Candidate | Prize/Medal | Year |
|---|---|---|---|
| 1) | ---- ---- ---- | ---- ---- | ---- |
| 2) | Dr. S. Satyanarayana, Lecturer in Telugu, Govt. Arts College, SRIKAKULAM. | Sri Tripuraneni Gopichand Memorial Medal | 1984 |

University Office,
Waltair,

Date : 28-5-1985.

Sd/- C. V. APPA RAO,
Controller of Examinations.

//True Extract//

# విషయానుక్రమణిక

## ద్వితీయోన్మేషః


Office of the Registrar & Publications
Andhra Pradesh
NOV 2002

—)0(—

# సకలాంజలి

ఓం ఐం హ్రీం శ్రీం
సకలాయై నమః

— ०० —

సకలజగజ్జనయిత్రిని
సకలాధిష్ఠానరూప సర్వాధారన్
సకల మనోన్మని సమరస
సకలేష్టద శాస్త్రసార సన్నుతిఁ జేతున్

కంజలోచన కమనీయ కారయిత్రి
కంబుకంఠి కలాలాప కావ్యలోల
కర్మఫలదాత్రి కామేశి కల్పవల్లి
కరుణ మమ్మేలు గాత విజ్ఞానకలన.

లక్షణోజ్జ్వలదివ్యాంగి లబ్ధరూప
లబ్ధనానాగమస్థితి లబ్ధభోగ
లక్షకోట్యండనాయిక లలిత మాకు
లబ్ధసంపత్సమున్నతి లభ్య మగుత।

హ్రీంకారాంగణదీపిక
హ్రీంకారసువర్ణసౌధశృంగకపోతిన్
హ్రీంకారాధ్వరదక్షిణ
హ్రీంకారేశ్వరిఁ దలంతు హృత్కమలమునన్.

— సత్యనారాయణ

# చైతన్య దీప్తి

సదాశివసమారంభాం శంకరాచార్యమధ్యమాం
అస్మదాచార్యపర్యంతాం వందే గురుపరంపరామ్

సిద్ధపురుషుఁడు కైలాసశిఖరవాసి
యొక మహాయోగి యేతెంచి యొకదినమ్ము
వెలుఁగుఁ జూపించె విద్యావివేకదీప్తి
నమ్మహాత్మునిఁ దలఁతు నత్యంతభక్తి

రాగమయికావ్యతత్త్వార్థరామణీయ
కములు విని మెచ్చి హర్షబాష్పముల తోడ
శిరముపై హస్తముంచి యాశీస్సు లిడిన
శ్రీ శ్రీయానందనాథదేశికు స్మరింతు.

♦ ♦ ♦

వేదాధ్యయనపరాయణుఁ
డాదర్శగురుండు లింగయాచార్యునకున్
స్వాదిష్ఠన కస్మత్ పితృ
పాదుల కభివాదనములు ప్రత్నర్షులకున్.

తన తనయుని బహువిద్యా
ధనయుతునిగఁ జేయ సంతతము దైవతపూ
జనములఁ గడపిన జననికి
మనస్వినికి నాగరత్నమకు వందనముల్.

♦ ♦ ♦

శతసంఖ్యాకవిమర్శకాగ్రణులు విస్తారంబు శోధించి భా
రత మందున్నవిశేషముల్ తెలిపి రశ్రాంతంబుగా; మత్పురా
కృతభాగ్యోన్నతి నే మనీషియుఁ గళాదృష్టిన్ గనన్ లేదు. సు
వ్రతుఁడై శిల్పకళారహస్యములు తెల్పన్ లేదు నా కిమ్మగా.

చూచితి నాంధ్రభారతముఁ జూచితి వ్యాసకృతార్థవేదమున్,
జూచితి నిందు నందుఁ గల సుందరశిల్పకళాప్రబంధముల్;
సూచనలన్ గ్రహించి పరిశోధనఁ జేయుచు భవ్యభారతీ
శ్రీ చరణాబ్జసేవనము చేసితిఁ బ్రాజ్ఞులు చూచి మెచ్చఁగా.

మధురాక్కర :

చెలిమి శ్రీమహాభారతశిల్పకళాదర్శనా
కలనఁ జేదోడువాదోడుగా నిల్చిన కులపాలిన్
బలుకుఁజెలి వంట నేర్పరిన్ బాలాత్రిపురసుందరిన్
గలివిఁచూపుల గ్రాల్గంటి కరుణతోఁ బ్రోచుగాత!

కూచిపూడి నృత్యకుశల, రాష్ట్రస్థాయి
పాటవంపుస్పర్థఁ బ్రథమగణ్య;
కొమరుమిగులు కూర్మి కొమిరిత శ్రీవిద్య
నేలుఁగాత జగము లేలు తల్లి.

—) 0 (—

కళాప్రపూర్ణ

డా॥ దివాకర్ల వేంకటావధాని M.A., (Hons) Ph.D.

# అపూర్వసిద్ధాంతవ్యాసము

ఆంధ్రాంగ్లభాషలయందే కాక తత్త్వశాస్త్రము నందును నిష్ణాతులైన మిత్రులు శ్రీ శోభిరాల సత్యనారాయణ గారు రచించిన "శ్రీమదాంధ్రమహాభారత శిల్పకళా దర్శన" మను అపూర్వసిద్ధాంతవ్యాసమును బఠించి యమందమైన యానందము నందితిని. రథనాభి యందరములవలె పరమపురుషుని యందు సర్వకళలు ప్రతిష్ఠితములై యున్నవనియు, వేద్యుఁడయిన యా పురుషుని తెలిసికొను మనియు ప్రశ్నోపనిషత్తు తెలుపుచున్నది.

వేదఋషులు తమ మంత్రములను రథశిల్పముతో పోల్చుకొని యున్నారు. శిల్పసంబంధులగు వర్ణనలు సహృదయులగు పాఠకులకు ఆనందకరములుగా నుండును. పూర్వకవులు వట్టి సాహిత్యశాస్త్రము నందే కాక ఇతరశాస్త్రము లందును నిష్ణాతులై ఆయా సందర్భములయందు తత్తచ్ఛాస్త్రముల యందలి విషయములను వివరించి యుండిరి.

ధర్మేచార్థే చ కామే చ మోక్షే చ భరతర్షభ ।
యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్క్వచిత్॥

-అని వ్యాసమహర్షి మహాభారతమును గూర్చి చెప్పిన విషయము పరమసత్యశోభితము. అందు లేని విషయ మేదియు లేదనుటలో అతిశయోక్తి లేదు.

అసలు శిల్పకళలను గూర్చి కాని, ప్రత్యేకముగా మహాభారతము నందలి శిల్పకళలను గూర్చి కాని సంపూర్ణముగా పరిశోధన చేసిన వారింతవఱ కెవ్వరును లేరు.

ఆ విషయము నందు సమగ్రజ్ఞానము కలవారు అరుదుగా నుండుటయే అందుకు కారణము. డా॥ సత్యనారాయణ గారు శిల్పవాస్తుశాస్త్రమునందే కాక ఆంధ్రసంస్కృతతత్త్వశాస్త్రము లందును ప్రవీణులగుటచే తమ సిద్ధాంతవ్యాసమున కీ విషయము గ్రహించి న్యాయము చేయజాలిరి.

కవిత్రయము వారు వ్యాసభారతమును యథాతథముగా ననువదించియుండలేదు. వారు కొన్నిచోట్ల దానిని పెంచిరి. కొన్నిచోట్ల తగ్గించిరి. కొన్నిచోట్ల ఔచిత్యము నకై అన్యథాకరించియుండిరి. వా రితిహాసమును కూడ మహాకావ్యముగా రూపొందింపదలచినవా రగుటచే ధర్మతత్త్వనీతిప్రతిపాదకము లయిన విషయములను వైదికకర్మశిల్పాదిశాస్త్రసంబంధము లగు విషయములను కొన్నిచోట్ల తగ్గించిరి. కొన్నిచోట్ల పూర్తిగా విడిచిపెచ్చిరి. అందుచే శ్రీ సత్యనారాయణ గారు ఆంధ్ర మహాభారతమునే కాక వ్యాసరచితసంస్కృతభారతమును కూడ నెడనెడ పరిశీలింప వలసి వచ్చినది. వ్యాసునిది పౌరాణిక నైతికదృష్టి. కవిత్రయము వారికి గూడ నాదృష్టి లేకపోలేదు, కాని వారిది ప్రధానముగా కావ్యకళాదృష్టి. అందుచే కథకుగాని కావ్యత్వమునకు గాని భంగకరములని తోచినచోట్ల వారు కొన్నిభాగములను సంగ్రహించిరి.

మహాభారతమున అనేకనగరములయు, సౌధములయు, యజ్ఞవేదికలయు, యుద్ధవ్యూహములయు, వర్ణనములు పెక్కు సన్నివేశములందు కానవచ్చును. వానిని వర్ణించునపుడు కవిత్రయము వారు కూడ తమకు గల శిల్పపరిజ్ఞానమును ప్రదర్శించి యుండిరి. ఉదాహరణమునకు ఇంద్రప్రస్థనగరమును నిర్మించునపుడు నన్నయ వ్రాసిన తొమ్మిది పురవర్ణనమునకు సంబంధించిన పద్యములు అమూలకములు. ఆ పురవర్ణనమే తరువాత ప్రబంధములలో ఆరంభమునందు కనవచ్చు పురవర్ణనమునకు మార్గదర్శకమైనది. పైన పేర్కొనబడిన విషయములలో కొన్ని లౌకికములు, కొన్ని వైదికములు. మహాభారతమును రచించునపుడు వానిలో పేని కాని పూర్తిగా విడిచివేయుట ఉచితము కాదు. అందుచే కవిత్రయము వారు వానిని కొన్నిచోట్ల విశదముగా వర్ణించినను, కొన్నిచోట్ల సూచ్యమాత్రములుగా నైన ప్రకటించి యుండిరి.

వేదకాలము నాటి నుండియు మహర్షులకు శిల్పకళ యందు అభిమానమును ఆదరమును కల వని సూచించుటకు శ్రీ సత్యనారాయణ గారు ఋగ్వేదాదుల నుండియు, ఉపనిషదాదుల నుండియు పెక్కు వాక్యముల నుదాహరించియుండిరి.

వేదముల అర్థము తెలిసికొనవలెనన్న మొన్న మొన్నటి వఱకును సాయణాచార్యులు రచించిన భాష్య మొక్కటియే ఆధారముగా నుండెను. తరువాత దయానందసరస్వతియు, అరవిందఘోషును కొందఱు పాశ్చాత్యపండితులును వేదమంత్రములకు కేవలకర్మపరముగా కాక జ్ఞానలౌకికశాస్త్రపరముగా గూడ అర్థములు చెప్పియుండిరి. శ్రీ సత్యనారాయణ గారు వానిని కూడ చూచియుండుట వారీవిషయమున కావించిన సర్వతోముఖమయిన పరిశ్రమకు తార్కాణము. దయానందాదులకు సాయణాదులపై గౌరవములేక పోలేదు, కాని అవసరమును ఉచితమును అని తోచినపుడు వారు తమ హృదయములకు తట్టిన అర్థాంతరములు కూడ ప్రదర్శించియుండిరి.

నన్నయ రచించిన భాగమున రాజసూయయాగము, మయసభ, నారదుఁడు వర్ణించిన దిక్పాలురసభలు, ధృతరాష్ట్రుఁడు దుర్యోధనునకు క్రొత్తగా నిర్మించి యిచ్చిన సభ మున్నగు వాని వర్ణనము లున్నవి. మహాభారతము నందలి వర్ణనములలోని కెల్ల మయసభ వర్ణనము అద్భుతమును, అతిలోకమును అయినట్టిది. దానిని నిర్మించిన మయుఁడు రాక్షసుల విశ్వకర్మయైనను, శిల్పశాస్త్రమునందు అద్వితీయమైన ప్రజ్ఞ కలవాఁడు. నిజమునకు మహాభారతకథ యంతయు అతని మయసభానిర్మాణము పయి ఆధారపడియున్న దనియే చెప్పవచ్చును. ఏల యన అది చూచిన తరువాతనే దుర్యోధనుఁ డసూయాగ్రస్తుఁడగుటయు, పాండవులను జూదమున కాహ్వానించి, స్వపక్షమున శకునిచే జూదమాడించి వారిని అడవులకు పంపుటయు సంభవించినది. ధృతరాష్ట్రుఁడు నిర్మించిన నూతనసభలో ద్యూతమును, ద్రౌపదీవస్త్రాపహరణమును జరిగినవి. మహాభారతయుద్ధమున కవియే కారణములు. ఈ మహాసభను వర్ణించుపట్లను, రాజసూయయాగమును వర్ణించు సందర్భమునను నన్నయ ప్రదర్శించిన శిల్పకళాపరిజ్ఞానము ప్రశంసాపాత్రమైనది. ఆ వర్ణనములు

వ్యాసభారతమున అంతకంటె విస్తృతతరములుగ నున్నవి. అయినను మూలము నందలి భావమునకు భంగము రాకుండ వాని నుచితరీతి వర్ణించుట కెంతో ప్రతిభా సంపద కావలయును.

పరీక్షిత్తు ప్రాయోపవేశమునకు ముందు ఏకస్తంభ నిర్మితసౌధమున నుండె నని భారతమును, భాగవతమును కూడ తెలుపుచున్నది. దీని నిర్మాణమునకు శిల్పశాస్త్రపరిచయ మెంతో కావలయును.

తిక్కన రచించిన భాగములో అశ్వమేధయాగము చాల ముఖ్యమైనది. ఆ యాగమునకు వేదికల నెట్లు నిర్మించెనో తిక్కన విశదముగా వర్ణించియుండెను. ఆ వర్ణనములు యథేచ్ఛాకల్పితములు కావు; శాస్త్రసమ్మతములు. అట్లే యుద్ధపర్వము లైదింట నతఁ డెన్నో వ్యూహములను విస్పష్టముగా వర్ణించియుండెను. వ్యాసుని రచనలో సంకీర్ణములుగా నున్న ఆ వ్యూహవర్ణనములు తిక్కన తీర్చి దిద్దె నని విమర్శకులు చెప్పుచుందురు. అందు కతఁడు కేవలకవియే కాక మంత్రియు, సంగ్రామశాస్త్ర విశారదుఁడును అయి యుండుటయే కారణము. అతని తండ్రి కొమ్మన దండనాథుఁడు అతని పెదతండ్రికొడుకు ఖడ్గతిక్కన మహాసేనానాయకుఁడు. అట్టి వారి వంశమున పుట్టిన తిక్కనకు వ్యూహరచనావిషయమున సమగ్రపరిజ్ఞానముండుటలో ఆశ్చర్యములేదు.

ఎఱ్ఱన కూడ ఆయా సందర్భములందు నగరములను యజ్ఞాదులను వర్ణింపవలసివచ్చినది. ఎఱ్ఱన వాని నెంతో సమగ్రసుందరముగా వర్ణించియుండెను.

అరణ్యపర్వశేషమున పురదుర్గవర్ణనములు, విశ్వకర్మ-నలవిశ్వకర్మల ప్రసంగములు, అంగిరోబృహస్పతిప్రముఖప్రభావములకు సంబంధించిన ప్రసంగములు గలవు. వీని కన్నింటికి శిల్పశాస్త్రముతో చాల సన్నిహితసంబంధ మున్నది.

శిల్పకళతో పరిచయము లేని కవులైనచో నట్టి శిల్పశాస్త్ర సంబంధములుగల విషయములను విడచివేసియుందురు. ఏల యన వానిని విడచినను కథాగమనమున

కెట్టి భంగమును రాదు. కవిత్రయము వారు క్రాంతదర్శులగుటను, సర్వశాస్త్రపండితులు నగుటచే అట్టి వానిని గూడ యథోచితముగ వర్ణించియుండిరి.

లౌకికవైదికము లయిన శిల్పనిర్మాణముల నన్నింటిని శ్రీ సత్యనారాయణ గారు పరిశీలించి అందలి శాస్త్రపరిజ్ఞానము వెల్లడించి యుండిరి. ఊరక వెల్లడించుటయే కాదు. వేదముల నుండియు ఆంగ్లేయుల అనువాదముల నుండియు ఎన్నో భాగములను ఉదాహరించియుండిరి. ఈ సిద్ధాంతవ్యాసమును చదువుచుండగా రచయితకు గల సర్వశాస్త్రపరిజ్ఞానము పాఠకులకు ఆశ్చర్యము గలిగింపకమానదు.

శ్రీ సత్యనారాయణ గారు శిల్పసంబంధమయిన సిద్ధాంత వ్యాసమునే వ్రాసినను, భాషావిషయమున గూడ విశేషమైన జాగరూకత వహించిరి. వారిశైలి నిర్దుష్టము, సర్వసుబోధము సరళమునై యున్నది. అన్యదుర్లభమైన యిట్టి సిద్ధాంత వ్యాసము వ్రాసి మన పూర్వులకు గలశిల్పశాస్త్రపరిజ్ఞానమును ప్రకటించిన శ్రీశోభిరాల సత్యనారాయణ గారికి నా అభినందనములను తెలుపుచున్నాను. వారి సిద్ధాంత వ్యాసము పెక్కు ఇట్టి సిద్ధాంత వ్యాసములకు మార్గదర్శకము కాగల దని నా అభిప్రాయము.

హైదరాబాదు
9 – 5 – 1985

(సం.) దివాకర్ల వేంకటావధాని

—)o(—

**Dr. V.V.L. NARASIMHA RAO**, M.A; Ph.D.
*Director*

A. P. Govt. Oriental Manuscripts
Library and Research Institute
Abids, **HYDERABAD** - 500 001.

# సిద్ధాంతసిద్ధాన్నము

ఈ గ్రంథము కేవలము డిగ్రీ కొఱకు వ్రాసినది కాదు. సొమ్ము చేసుకొనుట కంతకంటెను కాదు. డిగ్రీకొరకే యైనచో సముద్రమంత లోతు గల గహనమైన ఇట్టి విషయము నెన్నుకో నక్కర లేదు. సొమ్ము చేసికొనుట కైనచో తెనుగునాట ఇట్టి గ్రంథము వ్రాయతలపెట్టిన వాడు వట్టి వెంగలి.

మరి శ్రీశోభిరాల సత్యనారాయణ గా రీగ్రంథము నెందుకు వ్రాసినట్లు ? చిర కాలముగా గుండెలో కుతకుతలాడుచు ఆత్మ నెరియించుచున్న ఒక వేదనను చల్లార్చు కొనుటకు, మఱుగున పడిన ఒక మహాసంస్కృతిని త్రవ్వి తలకెత్తి లోకమునకు వెలుగుబాట చూపుటకు. ఆ తపనయే ఈ సత్యశోధకుని ఆత్మవేదన. దానికి రూప కల్పనయే ఈ పరిశోధనవ్యాసము.

భారతగ్రంథముపై వందలకొలది పరిశోధనవ్యాసములు పొటమరించినవి. తెలుగుభారతమును గూర్చియు తెంపు లేకుండ పెక్కు వ్యాసములు వెలువడినవి. కాని "భారతశిల్పకళాదర్శన" మను నీ విషయము అదృష్టపూర్వము. అదృష్ట వశమున అది శ్రీ శోభిరాల చేతిలో పడినది. సంస్కృతాంధ్రాంగ్లత త్త్వమనస్తత్త్వ శాస్త్రవిదుఁడగు ఈ సవ్యసాచికి "చక్రధర" [డాక్టర్ లకంసాని చక్రధరరావుగారు] చోదకత్వ మబ్బినది. ఇదియు నొక విశేషము.

"శిల్ప" మనగా కేవలశిలాశిల్పమో, చిత్రశిల్పమో, సాహిత్యశిల్పమో, ఛంద శ్శిల్పమో, అక్షరశిల్పమో కాక కర్మకౌశల మభివ్యక్త మగు నెల్ల శిల్పములును పరి

శిలనార్హములే. అట్టి శిల్పము యొక్క చరిత్ర ఆద్యమానవుని హస్తకౌశలస్ఫూర్తితో మొదలయినది. కూడు, గుడ్డ, ఇల్లు వాకిలి, పనిముట్టు కొరముట్టు ఇట్టి ఆవశ్యక వస్తునిర్మాణముతో మొదలైన ఆద్యమానవ హస్తకౌశలము భారతకథాకాలము నాటి కెట్టి పరిణామవికాసము లంది మహాశిల్పకళగా రూపొందెనో దానికి లక్ష్యలక్షణ నిరూపణము చేయుటే ప్రకృతవ్యాస పరమార్థము. ఇంత గ్రంథమున్నది కనుకనే ఇది సముద్రమంత లోతు గల గహనమైన విషయ మని చెప్పవలసెను.

వ్యాసావకాశము ననుసరించి శిల్పపరిణామచరిత్రను పరిమిత మొనర్చి భారత కాలము నాటి వివిధశిల్పముల నిర్మాణచరిత్రను మాత్రము సరహస్యముగా వివరించుట జరిగినది. భారతకథాపాత్రలలో తానును ఒకడైన వ్యాసమహర్షి సంస్కృత భారతములో తన కాలమునాటి శిల్పనిర్మాణముల విశేషములే తాను ప్రస్తావించియుండును. భారతమును తెనిగించిన కవిత్రయము కాలమునాటికి ఆయా శిల్పనిర్మాణములలో పెక్కు మార్పులు వచ్చియుండును. భారతకథాస్థలము ప్రధానముగా ఉత్తర భారతము. వ్యాసు డచ్చటి వానినే ప్రస్తావించియుండును. కవిత్రయమునకు దక్షిణ భారత శిల్పకృతులు మాత్రమే పరిచితములు. సంస్కృతాంధ్రభారతములు రెండింటి శిల్పకళావర్ణనములో పొడచూపు భేదములను పసిపట్టి, పరిశీలించి, పరిశోధించి బహిర్గత మొనర్చుటే ప్రకృతవ్యాసరచనము నందలి పరమక్లిష్టమగు వ్యాసఘట్టము. ఈ ఘట్టమును దాటుటకే రచయిత శిల్పకృతుల నిర్మాణములో సంస్కృతభారతము నుండి తెలుగుభారతము ఎచ్చ టెచ్చట భేదించుచున్నదో తెలుపుచు మూలానువాదములను యథాతథముగా నుటంకించెను. శ్రమసాధ్యమైన ఈ పనిని శ్రద్ధతో నిర్వహించుట వలననే పరిశోధితవిషయమునకు సునిశితత్వమును సమగ్రత్వమును సిద్ధించినవి.

పురదుర్గరాజసభాభవనాదులకు సంబంధించిన వాస్తుశిల్పము, భూజలాంతరిక్షయానములకు సంబంధించిన రథనౌకావిమానాదిశిల్పము, యుద్ధతంత్రాయుధ నిర్మాణసంబంధి యంత్రశిల్పము, ఇష్టాపూర్తాదిక యజ్ఞశిల్పము, రూపప్రతిరూపప్రతిమాలంకరణాదిక రూపశిల్పము మున్నుగా అనంతరూపవైవిధ్యము గల "శిల్పకళ"ను ఆంధ్రభారతము నడ్డుపెట్టుకొని దర్శించి, భారతీయమగు నొక ప్రాచీన మహాసంస్కృతిని పరిశోధనగ్రంథరూపమున నుద్ధరించిన మనీషి డాక్టరు శోభనాల అవశ్య మభినందనీయుడు.

విశ్వకర్మ-త్వష్ట-స్థపతి-శిల్పాచార్య-రథకార - కర్మారవర్ధకి - స్వర్ణకార-దేవబ్రాహ్మణ-విశ్వబ్రాహ్మణ-పాంచాలబ్రాహ్మణాది పర్యాయవాచకములతో పిలువబడు శిల్పిజాతి యొక్క పుట్టుపూర్వోత్తరములను సప్రమాణముగా నిరూపించుట యందు రచయిత పరమజాగరూకుడై వర్తించెను. ప్రమాణనిరూపితములుగాని యంశములకు పరిశోధనగ్రంథమున స్థానము లేదనుసత్యమును విస్మరింపక రచన సాగించెను.

ఒక్కమాట ! వాస్తుశిల్పిపర్యాయవాచకములలో "సూత్రగ్రాహి" యొకడు. "సూత్రధారు" డన్నను నిదే యర్థము. "సూత్ర" మనగా వట్టి వడంబ మనియు, సూత్రధారు డనగా వడంబపుత్రాడు పట్టి కుడ్యాదుల కొలతలు కొలుచు తాపీమేస్త్రీ యనియు నర్థము చెప్పవచ్చును. కాని సూత్ర శబ్దమునకు విశిష్టలక్షణార్థము శిల్పరహస్యము. అది యెరింగినవాడే సూత్రధారుడు. "అపరాజితపృచ్ఛా" గ్రంథమున చెప్పబడిన సూత్రధారలక్షణము లిట్లున్నవి.

శాస్త్రజ్ఞః కుశలో దక్షో వాస్తువిద్యావిబోధకః ।
సూత్రధారో మహాప్రాజ్ఞః షట్కర్మసు నిరంతరమ్॥

—అ. పృ. 50-1, 2

సువిమలవిద్యావిశారదుడును, సకలగుణపరిష్కృతుడును, సర్వశాస్త్రార్థవేత్తయును మహాత్ముడును నగు విశ్వకర్మ సురగణములకు సూత్రధారుడు.

రావణబ్రహ్మకు పిల్ల నిచ్చిన మామగారును, పతివ్రతాతిలకమగు మండోదరికి తండ్రియు, మయసభానిర్మాతయు నగు మయుడు ఎల్లదానవులకును సూత్రధారుడు. మయశిల్పమే మధ్యపాతాళము (సెంట్రల్ అమెరికా) వరకు ప్రాకి, నేటికిని వాస్తుపూజ లందుకొనుచున్నట్లు పరిశోధకమతము.

సూత్రధార శబ్దము వాస్తుశాస్త్రమందే కాక నాట్యశాస్త్రమందును ప్రసక్తము. ప్రాచీనకాలములో నాట్యప్రయోగదక్షులగు సూత్రధారులును శిల్పులే యనుట కిది యెంతయు నుపబలకము. ఇట్టివే నా దృష్టిలో ననేకాంశములు గలవు. వాని నుటంకించుటకిది సమయము కాదు — సందర్భమును గాదు.

డాక్టర్ శోభిరాల వారి కృషి నభినందించుటయే ప్రకృతకార్యము. ఈ సిద్ధాంతవ్యాసమునకు ఆంధ్రవిశ్వవిద్యాలయమున శ్రీ త్రిపురనేని గోపీచంద్ స్మారక స్వర్ణపతక బహూకృతి లభించుటయు ముదావహము. ప్రగాఢ మగు పరిశోధనకృషి కిదియు నొక గుర్తింపు గదా!

ఈ పరిశోధనకృషి నొక్కమాటలో చెప్పవలె నన్న ఇట్లు చెప్పవచ్చును "హరప్పా మొహంజొదారో త్రవ్వకముల వలన ప్రాచీనభారతీయసంస్కృతి యెంత బయల్పడెనో ఈ పరిశోధనవ్యాసము వలన అంత కిబ్బడి ముబ్బడి యగు పురాభారతీయశిల్పసంస్కృతి సిద్ధాంతసిద్ధాన్నమై బయలుపడినది.

తథాస్తు!

హైదరాబాద్
22-6-1985

(సం) వి. వి. యల్. నరసింహారావు

—)0(—

# EXTRACTS FROM THE REPORTS OF ADJUDICATORS

## Report from Dr. D. CHINNA KRISHNAIAH,

Department of Telugu, Presidency College,

MADRAS

### Adjudicator and External Examiner for Viva-Voce Examination

One of the commendable theses I had the previlege to adjudicate in the recent past is the "Silpakaladarsanamu" of Sri Sobhirala Satyanarayana.

It is an exhaustive and thorough study; forms a distinct contribution to the knowledge of the chosen subject, i e., 'the Architectural Infrastructure of our Magnum Opus, Srimat Andhra Mahabharata'.

I can, without any hesitation, state that this arduous and systematic study - verily a Research work-par excellence, is worthy of University Publication.

The voluminous and monumental work of "Sri Sobhirala" in about 650 pages and 10 precise chapters, ana'yses the Urban and Metropolitan planning and design, travel modes, Arms and Armaments, war craft, sacrificial requisites; preceptors and Artisans, of the Art of Mechanics, Idolatry, etc., in minute details, preceded by an apt introduction.

The Researcher strove his best to substantiate his view-points, frequently quoting from the sanskrit Original of the Mahabharata, other relevant treatises and monographs. Evidences from the Vedic commentaries not wanting, the dissertation is complete in all its aspects, carefully and meticuluously composed with great facility, balancing the material with a dexterous, firm and confident style of expression.

That the Scholar is an ardent and devout admirer of the Viswakarma Sect is visible throughout.

I consider this spotleess thesis as a valuable contribution and recommend the award of the Ph D. degree to the candidate, I personally feel that there is no need for any Viva-Voce Examination

I heartily congratulates the Research Scholar and also his supervisor Dr L. Chakradhara Rao garu.

*Sd - Dr Chinna Krishnaiah*

## Report from Prof. G. Appa Rao, University of Madras

I have had the pleasure of going through the thesis entitled "**Srimadandhra Mahabharata Silpakala Darsanamu**" submitted by Sri Sobhirala Satyanarayana, M.A., for the award of Doctor of Philosophy of the Andhra University.

This thesis has been well written. The relevant examples at relevant places with explanations are excellent.

The distribution of material in the parts and paragraphs in an orderly manner makes this thesis a piece of art.

The illustrations made here and there by the Scholar are not only relevent but reveal the author's deep sense of involvement in the artistic process.

The foot-notes and other references in Sanskrit and English prove that the scholar has wide knowledge of the subject, besides a researcher's proven skill.

Dr. Chakradhara Rao who supervised the thesis writing is to be congratulated for his scholarly guidance. A thesis of this kind is not often met with.

I hereby recommend that the degree of Doctor of Philosophy be conferred on the candidate for his thesis.

*Sd - Prof. G. Appa Rao*

## Report from Dr. K. Mahadeva Sastri,

*Professor of Telugu (Retd)*

ANANTAPUR

—) O (—

Report on "Srimad Andhra Mahabharata Silpakaladarsanamu"

This is a study of Silpa Kala as revealed in the Andhra Mahabharata, with special reference to Vastu Silpa. Ratha Silpa, Yantra Silpa, Yajna Silpa and Rupa Silpa (Section 2-7). The subsequent chapters deal with some minor arts and the patronage of kings and society to artists - The final Sec (Chap. 10) summarised the conclusions.

The candidate has studied the passages relating to silpa in the Telugu Bharata comparing them with the Sanskrit original and also made use of the fund of knowledge lying in the Vedic and Puranic lore. The candidate has a good knowledge of Sanskrit and the technicalities of the subject. Earlier work in this direction being rather limited the value of the study is all the greater. The achievement of the candidate in the thesis is very creditable.

It is shown that silpa kala was in a highly developed state in the mahabharata age. Two strands were clearly observable – the Aryan and the Dravidian. Viswakarma was the founder of the Aryan and Maya of the Dravidian. There was a mixing up of the two elements in Silpa as in the whole range of Indian culture. Thus God Ganesa was Aryan and Gajanana Dravidian.

It would appear that the Asva and the ratha along with a highly developed language were the factors responsible for the Aryan expansion in India. The ratha become the symbol of the onward march of victory. The king listened to its auspicious sounds early in the morning on waking up. It ceased to be a factor in warfare and in the life of the people subsequently. The study of the ratha silpa gives us much technical information and indirectly helps us to the understanding of the cultural history of the people. Similarly with regard to other art forms.

The sastras have much to speak of subjects like agricultural engineering, underground water resources, navigation, aeronautics, architecture, town planning etc. The thesis gives details in so far as they have references in the Mahabharata.

The material collected on the subject, the presentation and the illustrative pictures form a contribution to our knowledge of the subject of Silpa Sastra. I recommend the award of the Degree of Doctor of philosophy to the candidate on the basis of the thesis.

*Sd/- K. Mahadeva Sastri*

# కృతజ్ఞతా నివేదనము

నా పరిశోధనమునకు పర్యవేక్షకులై నన్ను చరితార్థుని జేసిన

డా॥ లకంసాని చక్రధరరావు గారికి

నిరంతరపరిశోధనా ప్రత్యయ ప్రతిరూపమయిన నా

శ్రీమదాంధ్రమహాభారతశిల్పకళాదర్శనమునకు

1984 సం॥లో నాకు డాక్టరేట్ పట్టమును ప్రసాదించుటయేకాక దాని

నా సంవత్సరము పరమోత్కృష్ట సిద్ధాంత గ్రంథముగా పరిగణించి

త్రిపురనేని గోపిచంద్ స్మారక స్వర్ణపదకబహూకృతి నొసగిన

ఆంధ్రవిశ్వకళాపరిషత్తు వారికి

పండితప్రకాండులయిన పరీక్షక పారిషదులకు, విశిష్టపరిశోధన గ్రంథనిర్ణాయకసంఘ

సభ్యులకు తమ యమూల్యాభిప్రాయములొసఁగి యాశీర్వదించిన

విద్వద్వరేణ్యులకు, విమర్శక చక్రవర్తులకు

నా కృతజ్ఞతాపూర్వకాభివాదనములు

♦ ♦ ♦

ఈ గ్రంథప్రచురణము నత్యంతోత్సాహముతో చేపట్టి, యెన్నియవరోధములు కలిగినను పట్టువిడువక ఓర్పుతో నేర్పుతో పరిశ్రమించికృతకృత్యుఁడైన చిరంజీవి ఎ. ప్రఫుల్లచంద్రకు అనేక మంగళానుశాసనములు.

మేము కోరిన వెంటనే ఈ గ్రంథమునకు ముఖపత్రాలంకరణము చేసి యిచ్చిన బ్రహ్మశ్రీ పోలవరపు నారాయణమూర్తిగారికి మా కృతజ్ఞతా పూర్వక వందనములు.

ఈ సిద్ధాంత గ్రంథమును సర్వాంగ సుందరముగా ముద్రించిన నాగార్జున ప్రింటింగ్ అండ్ బైండింగ్ వర్క్స్, తెనాలి వారికి, ముద్రణాలయాధిపతులయిన మిత్రులు, సహృదయులు శ్రీ రాచాబత్తుని శివలింగేశ్వరరావు గారికి నా నమస్సుమనస్సులు.

♦ ♦ ♦

ఈ గ్రంథ ముద్రణమునకు ఐదువేల రూపాయల ఆర్థిక సహాయము నందించిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము సాంస్కృతిక వ్యవహారాలశాఖ వారికి సర్వదా కృతజ్ఞుఁడను.

♦ ♦ ♦

సన్మానసభలు జరిపి నన్ను సత్కరించిన అభిమానులకు,
సాహిత్య శిల్పకళాభిమానులకు,

ప్రచురణపూర్వ విరాళములిచ్చి, గ్రంథముద్రణమును ప్రోత్సహించిన బంధుమిత్రులకు, సాహితీ బంధుమిత్రులకు హార్దికాభివందనములు.

ఈ గ్రంథప్రచురణము నందనేక విధములుగా సాయపడిన అజ్ఞాత మిత్రులకు, ఆప్తులకు, నా శ్రేయోభిలాషులకు గ్రంథప్రకాశనమున కెదురు చూచుచున్న సాహితీప్రియులకు నెల్లరకు నా నమస్కారములు.

— శోభిరాల సత్యనారాయణ

♦ ♦ ♦

## విజ్ఞాపన

ఈ గ్రంథమునే కాక శిల్పకళలకు, విశ్వకర్మలకు సంబంధించిన తదితర గ్రంథములు ప్రచురించుటకయి విరాళము లొసఁగిన విజ్ఞులకు, వితరణశీలులకు, మా హృదయపూర్వక ధన్యవాదములు.

శ్రీ మదాంధ్రమహాభారతశిల్పకళాదర్శనము - ద్వితీయభాగము, తదితర గ్రంథముల ముద్రణ కార్యక్రమము త్వరలో చేపట్ట గలమని మనవి చేయుచున్నాము.

సంచాలక్

శ్రీ విశ్వకర్మా విజ్ఞాన కేంద్ర
శ్రీ కాకుళం

# శ్రీమదాంధ్రమహాభారత శిల్పకళాదర్శనము

## కళాముఖము

ఈ విశ్వమందు చతుష్షష్టికళాసృష్టికి ప్రేరణము కలిగించునది సకలకళలకు నధిష్ఠాత్రియైన లలితపరమేశ్వరియే. అట్టి కళానాథముఖికి నమస్కారము.

కారయిత్రియు కర్మఫలప్రదయు నైన యా కళాస్వరూపిణి కరుణాకటాక్ష వీక్షణము వలననే శ్రీ మదాంధ్రమహాభారతశిల్పకళాదర్శన మను నీ సిద్ధాంత వ్యాసము సిద్ధించినది.

రథచక్రమధ్యము నందాకుల వలె షోడశకళ లెవనియందు నెలకొని యున్నవో వేద్యుఁ డగు నట్టి పరమపురుషుని తెలిసికొనుఁ డని ప్రశ్నోపనిషత్తు చెప్పుచున్నది.

> ఆరా ఇవ రథనాభౌ కలా యస్మిన్ ప్రతిష్ఠితాః।
> తం వేద్యం పురుషం వేద .... .... .... ॥
>
> – ప్రశ్నోపనిషత్ 6-6-6

షోడశకళాపూర్ణుఁడగు పురుషుని అరాయుక్త మగు రథచక్రముతో నుపమించుట నాకు ఆశ్చర్యము గొలిపినది.

అట్లే మరియొక ఉపనిషద్వాక్యమునందు జీవుని ఆత్మ సంస్కారము హిరణ్యకారుని స్వర్ణశిల్పముతోఁ బోల్పఁబడినది.

> "తద్యథా పేశస్కారీ పేశసో మాత్రా మపాదాయాన్య
> న్నవతరం కల్యాణతరం రూపం తనుత ఏవ మే
> వాయ మాత్మానం శరీరం నిహత్యావిద్యాం
> గమయిత్వాన్య న్నవతరం కల్యాణతరం రూపం కురుతే

పిత్ర్యం వా గాంధర్వం దైవం వా ప్రాజాపత్యం వా
బ్రాహ్మ్యం వాన్యేషాం వా భూతానామ్".

- బృహదారణ్యకోపనిషత్ 4-4-4

హిరణ్యకారుఁ డే విధముగా అకృతహిరణ్యశకలమును తీసుకొని దానితో నూతనమును విచిత్రమునయిన యాభరణమును చేయుచున్నాడో అదే విధముగా నీ యాత్మయు పంచభూతముల నుండి యొక యంశమును గైకొని యవిద్యను నివృత్తి చేసికొని నూతనమును కల్యాణతరమును నైన మరియొక రూపమును, పితృ గాంధర్వదేవప్రాజాపత్యబ్రహ్మాదిరూపములలో నొకదానిని ధరించుచున్నది.

వేదర్షులు తమ మంత్రములను రథశిల్పముతోఁ బోల్చుకొనుటయు నాశ్చర్య కరమయిన విషయమే.

అహం తష్టేవ వంధురం పర్యచామి హృదా మతిమ్।

— ఋగ్వేద 10-119-4

అవి నేను తత్త్వశాస్త్రాధ్యయనము చేయుచు వేదములు ఉపనిషత్తులుపఠించు చున్నదినములు.

## స్పందన :

శిల్పసంబంధములగు వర్ణనములు కళాదృష్టి గల కవుల హృదయములను స్పదింపఁ జేయును. అట్టి స్పందన తోడనే నేను ప్రాచీనసాహిత్యము నందలి శిల్పకళామయవస్తువర్ణనములను చదివి యానందించుచుంటిని. చాలకాలము తరు వాత మహాభారతము నందలి యద్భుతావహ మయిన పురవర్ణనములు, మాయామయ మయిన మయసభావిశేషములు మనసున మెదలి మహాభారతము నందలి శిల్పకళలను గూర్చి పరిశోధన చేయవలె నను సంకల్పము నాకుఁ గలిగినది.

నా సంకల్పము డా॥ లకంసాని చక్రధరరావు ఎం.ఏ., పిహెచ్.డి., గారికి తెలిపి పర్యవేక్షకులుగా నుండ నర్థించితిని. "భారతములో శిల్పకళ" అను విషయ ముపై నితఃపూర్వ మెవ్వరును పరిశోధనము చేయలే దనియు నది పరిశోధింపఁదగిన యంశ మనియు వారు నా యభ్యర్థనము నంగీకరించి నన్ను ప్రోత్సహించిరి.

మనోవికాసమును గలిగించు శిల్పకళలు సంస్కృతిని, భౌతికసుఖములు కలిగించు శిల్పకళలు నాగరకతను వెల్లడించును.

మహాకావ్యముల యందలి శిల్పకళాభివర్ణనములు ఆ కావ్యరచనాకాలము నాటి యా దేశప్రజల సంస్కృతి-నాగరకతలను చెప్పక చెప్పుచుండును.

## రచనా ప్రణాళిక :

భారతమొక మహాకావ్యము. అర్థశాస్త్రవేత్తల కదియొక యర్థశాస్త్రము.

"అర్థశాస్త్ర మిదం ప్రోక్తమ్ .... .... "

శిల్పశాస్త్రము అర్థశాస్త్రాంతర్గతము. కావున శిల్పశాస్త్రవేత్తల కది శిల్పకళా విషయము. అందలి శిల్పకళావస్తువర్ణనములలో శిల్పశాస్త్రార్థము లిమిడి యుండ వచ్చును. ఇది పరిశోధించి తెల్పుకొనవలసిన యంశము.

ఈ సిద్ధాంతవ్యాసము నందు వాస్తుశిల్పము, రథశిల్పము, యంత్రశిల్పము, యజ్ఞశిల్పము, రూపశిల్పము ననునవి ప్రధానాంశములు. తదితరశిల్పకళలను గురించి చర్చించుటకు, "ప్రకీర్ణశిల్పము"లను నొక యధ్యాయమును చేర్చితిని.

భారతకాలీన సమాజము నందు స్థపతుల స్థితిని దెలుపుట కొక యధ్యాయమును, శిల్పాచార్యుల చరిత్రలను సంగ్రహముగా తెలుపుట కింకొక యధ్యాయమును వ్రాసితిని.

ఉపక్రమోపసంహారములతో నీ వ్యాసము మొత్తము పదిభాగము లయినది. వీనికి ఉన్మేషము లని పేరు పెట్టితిని.

## రచనా విధానము :

ఆంధ్రమహాభారతము నుండి శిల్పకళాసంబంధమగు నొక్కొక్క యంశమును తీసికొని దానిని వ్యాసభారతముతో సరిపోల్చి చూచితిని. కొన్ని సందర్భములలో నీ మూలగ్రంథము నందలి యంశములు శ్రుతిస్మృతిపురాణేతిహాసములలో నెంతేని గలవేమో పరిశీలించితిని.

నన్నయాదులు చెప్పక విడిచిన కొన్నియంశములను వ్యాసభారతము నుండియే గ్రహించితిని.

వైదికయుగము నందు రచింపబడిన మహాభారతము పంచమవేదముగా ప్రసిద్ధికెక్కినది. కావున నే నీ సిద్ధాంతవ్యాసము నందు వేదపురాణేతిహాసశిల్పాగమ శాస్త్రగ్రంథముల నుండియు. తదితర విమర్శగ్రంథముల నుండియు ననేకాంశముల నుద్ధరించి, విషయమును విపులీకరించి, భారతీయశిల్పకళా ప్రాచీనతను శిల్పాచార్యుల ప్రతిభాప్రాభవములను సోపపత్తికముగా స్థాపించితిని.

వేదములకు సాయణభాష్యమే పరమప్రమాణ మని కొందరు పండితులు భావింతురు. మరి శ్రీ అరవిందఘోషు, శ్రీ దయానంద సరస్వతి వంటి మహనీయుల భాష్యములను కాదనగలమా ? అంధవిశ్వాసముతో సమ్యగ్దృష్టి నలవరచు కొనని సత్యపరాఙ్ముఖుల కొక నమస్కారము చేసి సత్యమును గ్రహింపుడని సవినయముగా మనవి చేయుచున్నాను.

శ్రీ దయానంద సరస్వతి వేదమంత్రములలో శిల్పవిజ్ఞానము నిక్షిప్తమై యున్నదని, యనేకమంత్రములకు శిల్పపరమైన యర్థములు చెప్పి భాష్యము వ్రాసినాడు. వాని నెల్ల గ్రహించి సందర్భోచితముగా నిందు పొందుపఱచితిని. కొన్ని చోట్ల సాయణభాష్యము, కొన్నిచోట్ల గ్రిఫిత్, బ్లూంఫీల్డు, పీటర్సన్ వంటి పాశ్చాత్య విద్వాంసుల ఆంగ్లానువాదములనుండి వివరణములు గ్రహించితిని.

నన్నయాదులు వ్యాసభారతప్రతులను పెక్కింటిని చూచి యన్నింటినుండియు సముచితము లయిన భాగములను గ్రహించి నా రని చెప్పనొప్పును. ఏల యన నేడు ప్రక్షిప్తము లని చెప్పబడు చున్న కొన్ని భాగములను నన్నయ గ్రహించి నాడు.

సంహితాభ్యాసుడు, బ్రహ్మాండాదినానాపురాణవిజ్ఞాననిరతుడునైన నన్నయ భట్టారకుడు భారతాంధ్రీకరణమునం దవలంబించిన పద్ధతి ననుసరించి ప్రధాన మయిన ప్రసన్నకథాకలితార్థయుక్తి కనుగుణముగా శిల్పకళాకలితార్థముల నను సంధించినాడు.

వ్యాసభారతము నందలి శిల్పవిషయికవర్ణనములకు నన్నయ కొన్నిచోట్ల సంక్షేపించినాడు. అలకా ద్వారకాపురవర్ణనములు మిక్కిలి సంక్షేపింపబడినవి,

కొన్నిచోట్ల యథామూలముగా ననువదించినాఁడు, కొన్నిచోట్ల పూర్తిగా వదలినాఁడు.

మరికొన్నిచోట్ల స్వకపోలకల్పనములతో మూలాతిశాయిగా వర్ణించినాఁడు. ఇంద్రప్రస్థవారణావత పురవర్ణనము లట్టివి.

ఏకస్తంభహర్మ్యనిర్మాణమునకు పరీక్షిన్మహారాజు సర్వక్రియాదక్షు లయిన తక్షకకోటులను నియమించినట్లు యథార్థస్థితిని వర్ణించినాఁడు.

విశ్వకర్మ, మయవిశ్వకర్మల శిల్పకళాచమత్కృతులను నన్నయ యత్యంత మనోహరముగా వర్ణించినాఁడు.

నన్నయకాలమున శిల్పుల కాచార్యశబ్దము బిరుదవాచకముగా నున్నది. మూలమునందున్నను లేకున్నను సర్పయాగమండపనిర్మాతలను, పురోచనసచివుని, ధృతరాష్ట్రసభాభవన నిర్మాతలను గౌరవపురస్సరముగా శిల్పాచార్యులని పేర్కొని నన్నయభట్టు శిల్పాచార్యులయెడ తనకుఁ గల యాదరాభిమానములను ప్రకటించినాఁడు.

తిక్కన భారతము నందు విశ్వకర్మత్వష్టృమయవిశ్వకర్మల శిల్పచాతుర్య ప్రశంస, త్వష్టృప్రజాపతికుమారుఁడైన విశ్వరూపాచార్యుని దేవపురోహితత్వము మున్నగు విశేషము లున్నవి. పురదుర్గనిర్మాణాది విధులు, రథశిల్పము, శస్త్రాస్త్ర శతఘ్న్యాది యంత్రములు, యుద్ధోపకరణములు మిక్కిలిగా వర్ణింపఁబడినవి.

తిక్కన చెప్పినను చెప్పకున్నను పని యందు శిల్పులప్రాధాన్యము విశద మగుచున్నది.

"అమలోదాత్తమనీష నే నుభయకావ్యప్రౌఢిఁబాటించు శి
ల్పమునం బారగుఁడం గళావిదుఁడ .... .... .... "

- నని చెప్పికొన్న తిక్కన్న శిల్పులను శిల్పి లని పేర్కొనక "నేర్పరు" లనియు, "దక్షు" లనియు పేర్కొని తన కవితాశిల్పకళాచాతుర్యమును జూపినాఁడు. కాని పరమేశ్వరునకు రథాదులను నిర్మించి యిచ్చిన విశ్వకర్మను విస్మరింపలేదు. ధానవపూజితుఁ డయిన మయవిశ్వకర్మను మఱవలేదు. అంతేకాక, తిక్కన

యజ్ఞవాటములు నిర్మించిన శిల్పినికాయమునకు ధర్మరాజు చేత పసదన మిప్పించి నాఁడు.

ఎఱ్ఱాప్రగడ తెనిగించిన యారణ్యపర్వశేషమునందును, పురదుర్గవర్ణనములు, యజ్ఞయాగాదుల వర్ణనములు గలవు. విశ్వకర్మ నలవిశ్వకర్మల శిల్పవిజ్ఞానవిశేష వర్ణనములు గలవు. భృగ్వంగిరఃప్రభృతుల ప్రతిభా ప్రభావప్రసంగములును గలవు.

శ్రీ మదాంధ్రమహాభారతమునకు మూలము వ్యాసభారతమే. కావున వ్యాసభారతరచనాకాలము నాటికి (క్రీ. పూ. 4వ శతాబ్దినుండి క్రీ. శ. 4వ శతాబ్ది వఱకు) భారతము నందు వర్ణింపఁబడిన శిల్పకళ లన్నియు వర్ధిల్లు చున్న వని స్పష్టమగుచున్నది.

మహాభారతకాలమునాటి శిల్పకళావైభవమునకు, శిల్పాచార్యుల శిల్పకళా కౌశలమునకు, మహిమోదంతములకు నిదర్శనముగా నీ మహాభారతశిల్పకళాదర్శనము చేయఁబడినది.

ఈ దర్శనము విద్వజ్జనమనోరంజకమై విజ్ఞానచంద్రికలు వెదజల్లు గాక!

ఇతి శమ్.

—) 0 (—

# శ్రీ మదాంధ్ర మహాభారత శిల్ప కళాదర్శనము

## ప్రథమోన్మేషము

## సాహిత్యము : శిల్పము

సౌందర్యదేవత యగు శ్రీదేవియే సకల కళలకు మూలము. ఆ జగన్మాతయే కళావతియై, కలాత్మికయై, కలానాథయై, కలానిధియై, కలారూపయై ప్రవర్తిల్లు చున్నది.[1]

సంస్కృతమున కలా శబ్దమునకు అనేకార్థములు గలవు.[2]

1. కిరణములు : [16 చంద్రకళలు, 10 అగ్నికళలు, 24 సూర్యకళలు]
2. అకారాది క్షాంతపర్యంతము గల యక్షరములు
3. జాగ్రత్ స్వప్న సుషుప్తి మోక్షము లనెడు అవస్థాచతుష్టయము
4. అమ్మవారి పాదముల యందుద్భవించెడు 360 కిరణములు.
5. చతుష్షష్టి కళలు.

1. శ్రీ లలితా సహస్రనామస్తోత్రము : వరుసగా 327, 611, 612, 797, 394 నామములు.
2. అదే, 611 నామము. వ్యాఖ్యానము డా॥ చాగంటి సూర్యనారాయణమూర్తి.

భక్తుల ధ్యానయోగమును సుకరము చేయుటకై అమ్మవారీ కళలను ధరించిన దని శ్రీ శంకర భగవత్పాదులు భాష్యీకరించినారు.*

చతుష్షష్టికళామయి యైన లలితాపరమేశ్వరియే కలాలాపయు, కావ్యకళయు' కావ్యకళావినోదినియునై యొప్పుచున్నది.*

పరమేశ్వరుఁడును కళాధరుఁడే. కళాధరుఁడన చంద్రకళాధరుఁ డనియే, కాక చతుష్షష్టి కళాధరుఁడనియుఁ జెప్పవచ్చును.[1]

కావున కళలన్నియు దైవదత్తములే.

చతుష్షష్టి కళలలో, "మానసీ కావ్యక్రియ" యొకటి.[2] కావ్యనిర్మాణ మొక కళ. ఉత్తమ కావ్యరచనము ధర్మార్థకామమోక్షము లందును, కళలయందును నేర్పును, ఆనందమును, కీర్తిని గలిగించును.

ధర్మార్థకామమోక్షేషు వైచక్షణ్యం కలాసు చ
ప్రీతిం కరోతి కీర్తించ సాధుకావ్యనిబంధనమ్॥

భామహ : కావ్యాలంకార : 1-1-2

కావ్యసముదాయమే సాహిత్యము. విద్యాకళాది సహితమై, హితమగు రసముతోఁ గూడినది సాహిత్యము. "హితేన సహితం సాహిత్యమ్". కావున సాహిత్య మొక కళగా పరిగణింపఁబడుచున్నది.

కావ్య మనఁగా కవి కర్మ. కవి యనఁగా నెవఁడు ?

ప్ర వేధసే కవయే వేద్యాయ గిరం భరే యశసే
పూర్వ్యాయ ।

- ఋగ్వేద. 5-15-1

[సృష్టికర్తయు, కవియు, వేద్యుఁడు, యశస్వి, సనాతనుఁడు, నగు వాని కొఱకు నా వాక్కును పూరించుచున్నాను.]

* శ్రీ లలితా త్రిశతీభాష్యము : డా॥ చాగంటి సూర్యనారాయణమూర్తి
ఆంగ్లానువాదము

1. చూడు :- శివపురాణము - వాయుసంహిత - [సంక్షిప్తప్రతి] - వ్యాఖ్యాత - శ్రీరామశర్మా ఆచార్య

2. వాత్స్యాయన కామసూత్రములు. అ. 3

అగ్నియందు పరమాత్మను దర్శించి వేదర్షి చేసిన స్తోత్ర మిది. వేధ యన సృష్టికర్త. కవి యనఁగా క్రాంతదర్శి; సర్వజ్ఞుడు; ఋషి. సత్యదర్శనము చేసి సృజించువాఁడు కనుక స్రష్ట. అందుచేతనే కవి శబ్దము పరమాత్మపరముగా ప్రయోగింపఁబడినది.

ఆ కవి సృష్టించిన కావ్యమే యీ విశ్వము.

దేవస్య పశ్య కావ్యం మహిత్వా ॥

- ఋగ్వేద-10-55-5

[జగత్ప్రభువు యొక్క సామర్థ్యముతో, క్రాంతదర్శిత్వముతో నిర్మింపఁబడిన జగద్రూప కావ్యమును జూడుము.]*

ఈ జగద్రూపకావ్య నిర్మాత ఇంద్రుడు.

ఇంద్రుడు దైవసంకల్పమునకు ప్రతీక; దైవసంకల్ప మనఁగా స్వయం ప్రకాశక మగు శుద్ధతత్త్వము యొక్క శక్తి.[1]

ఇంద్రుడు కవులలో శ్రేష్ఠుఁడు.

త్వా మాహు ర్విప్రతమం కవీనామ్ ॥

- ఋగ్వేద-10-112-9

సకల వాక్కులకు, మంత్రములకు, బ్రహ్మజ్ఞానమునకు నధిపతియైన బ్రాహ్మణస్పతి కవి కవులకు కవి.

కవిం కవీనా ముపమశ్రవస్తమమ్ ॥

- ఋగ్వేద-2-23-1

* చూడు : పం. బిహారీలాల్ శాస్త్రి : ఋగ్వేదభాషాభాష్యము-దయానంద సంస్థాన్-ఢిల్లీ. [దేవస్య = ఉస్ ప్రభు కే; మహిత్వా = మహాన్ సామర్థ్య సే యుక్త; కావ్యం పశ్య = మహాన్ క్రాంతదర్శితా సే బనాయే గయే ఇస్ జగత్ రూప కావ్య కో దేఖ్.]

Cf : Hymns of the Rigveda. Tr. Ralph. T. H. Griffith. "Behold the God's high wisdom in its greatness."

1. Aurobindo : The Doctrine of the Mystics : "Hymns to the Mystic Fire." P. 90.
"Indra .... .... is the power of pure existence self-mainfested as the Divine Mind."

మఱియొక సూక్తములో మిత్రుఁడును కవియై నట్లు వర్ణింపఁబడినది.

కవిః కవిత్వా దివి రూప మాసజత్ ॥

- ఋగ్వేద-10-124-7

[కవి తన కవితా చాతుర్యముతో ఆకసము నందు తన తేజస్సును, సౌందర్యమును నెలకొల్పినాఁడు.]

[క్రాంతదర్శి యైన పరమాత్మ తన రచనా కౌశలముతో నాకసమునందు సౌందర్య సృష్టి చేసినాఁడు.]

మిత్రుని వలె వరుణుఁడును కవియే. ఆ కవి తన కావ్యముతో-కవితాశక్తితో- ఆకాశము వోలె బహురూపములను పెంపొందించుచున్నాడు.

స కవిః కావ్యా పురురూపం ద్యౌరివ పుష్యతి ॥

ఋగ్వేద-8-41-5

ఈ కవి కర్మ బహురూపసమాశ్రిత మయినది.

ఇంద్ర మిత్ర వరుణుల వలె నగ్నియు కవియే. అతని కర్మయు కావ్యమే.

అగ్నిదేవుని గుఱించిన ఈ స్తోత్రమును జూడుఁడు :-

సుదక్షో దక్షైః క్రతునాసి సుక్రతు
రగ్నే కవిః కావ్యేనాసి విశ్వవిత్ ॥

- ఋగ్వేద-10-91-3

[యజ్ఞాది శిల్పకర్మము లందు నేర్పరులలో మిక్కిలి నేర్పరివి; జ్ఞానాధిక్యము చేత ధీమంతులలో ధీమంతుఁడవు నగు ఓ అగ్నీ ! నీ కావ్యము చేత - శ్రేష్ఠమయిన కర్మచేత - సర్వజ్ఞుఁడవయిన కవి వగుము.]

అగ్ని శిల్పవిద్యాప్రకాశకుఁడు. అగ్నియే సకల యజ్ఞములకు సమస్త శిల్పములకు మూలకారకుఁడు.

అగ్నిం దూతం వృణీమహే హోతారం విశ్వవేదసమ్ ।
అస్య యజ్ఞస్య సుక్రతుమ్ ॥

- ఋగ్వేద-1-12-1

ఈ మంత్రమునకు శ్రీ దయానంద సరస్వతి భాష్య మిట్లున్నది :-

ఎవని వలన శిల్ప విద్యారూపమయిన యజ్ఞము యొక్క ఉత్తమ క్రియలు సిద్ధించుచున్నవో, ఎవని వలన శిల్పులకు సమస్త శిల్ప సంపత్సమృద్ధి కలుగుచున్నదో ఎవని వలన వేగవంతములయిన యానములు కలాయంత్రములు సిద్ధించుచున్నవో, ఎవని సాహాయ్యము వలన వివిధ పదార్థములు ఒకచోటి నుండి మఱియొక చోటికి కొనిపోఁబడుచున్నవో, అట్టి అగ్నిని, సంపత్ప్రదాతను, హోతను, దూతను క్రియా శీలుర మయిన మేము సేవించుచున్నాము.[1]

మానవులకు దేవతలకు సాన్నిహిత్యమును గూర్చు దూతయు నగ్నియే. సకల శిల్పములు అగ్నిరూపముననే సాక్షాత్కరించుచుండును. అందువలననే వేదర్షి, "నీవే యింద్రుఁడవు, నీవ విష్ణుమూర్తివి, నీవ మిత్రుఁడవు, నీవ వరుణుఁడవు .... " - అని బహు విధములుగా స్తోత్రములు చేయుటయే గాక సమస్త శిల్పములకు కారణ భూత మయిన అగ్నిని శిల్పాధిపతియైన త్వష్టగాఁ గూడ స్తుతించినాఁడు.

త్వమగ్నే త్వష్టా విధతే సువీర్యం ॥

- ఋగ్వేద -2-1-5*

[ఓ అగ్నీ ! నీవు త్వష్టవు. నిన్ను స్తుతించువారిని వీర్యవంతులను జేయుము.]

ఈ విధముగా వేదర్షులు విశ్వమునందు ప్రకృతి సిద్ధమయిన వస్తుజాలమునకు మానవాంతః ప్రకృతి సహజమయిన గుణములకు ఆకృతి కల్పించి ఇంద్రాద్యనేక రూపములుగ భావించి, వారియందు పరమాత్మ స్వరూపమును దర్శించుటకు ప్రయత్నించినారు.

ఆ యా వస్తుధర్మముల కచ్చెరువంది, తత్తద్వ్యాపారములకు కవితాధర్మమగు సృజనశక్తి నాపాదించి, ఆ దేవతలను కవులుగా నెంచి వారి కవిత్వమును మెచ్చుకొని స్తోత్రములు చేసినారు.

మేధావంతులగు ఋషులు - కవులు - పరమాత్మ ననేకరూపములలో స్తుతించినను ఆ సత్పదార్థ మొక్కఁడే యనియు గుర్తించినారు.

1. చూడు : దయానంద సరస్వతి - ఋగ్వేద భాషా భాష్యము.

* 1. Aurobindo : Hymns to the Mystic Fire
"O Fire, thou art Twastri and fashionest fullness of force for thy worshipper." — R. V. 2.1-5

2. Hymns of the Rigveda Tr. Ralph. T. H. Griffith.
"Thou givest strength, as Tvaṣṭar to the worshipper."

ఇంద్రం మిత్రం వరుణ మగ్ని మాహు
రథో దివ్యం స సుపర్ణో గరుత్మాన్
ఏకం స ద్విప్రా బహుధా వదం
త్యగ్నిం యమం మాతరిశ్వాన మాహుః ॥

- ఋగ్వేద-1-164-46

ఈ మంత్రములో సుపర్ణుఁడగు గరుత్మంతుఁడు సత్పదార్థ మగు పరమాత్మకు సంకేతము.[1]

ఈ సుపర్ణుఁడు - పరమాత్మ - యొకడే యైనను విప్రులు కవులు కనుక తమ వచస్సులతో వాని కనేక రూపములు కల్పించిరి.

సుపర్ణం విప్రాః కవయో వచోభి
రేకం సంతం బహుధా కల్పయంతి ॥

- ఋగ్వేద-10-114-5

మన కెల్లరకు జనకుఁడు, జగదుత్పాదకుఁడు, పోషకుఁడునై సమస్త భువనములను, సమస్త ధర్మములను తెలిసినవాఁడై అనేక దేవతా నామములను ధరించుచు ఎవఁడు తా నొక్కఁడేయై వెలుఁగుచున్నాడో అట్టివానిని గూర్చి తెలిసికొనుటకే తదన్యము లయిన సకల ప్రాణులు జిజ్ఞాసువులై ప్రశ్నించుచున్నారు.

యో నః పితా జనితా యో విధాతా
ధామాని వేద భువనాని విశ్వా
యో దేవానాం నామధా ఏక ఏవ
తం సంప్రశ్నం భువనా యన్త్యన్యా ॥

- ఋగ్వేద-10-82-3*

ఆ పరమాత్ముఁ డెవఁడు ? అతఁడే విశ్వశిల్పి యైన విశ్వకర్మ.

1. A. C. Bose : Call of the Vedas. P. 130.
"Fine winged (bird), is a mystical symbol in veda for the ultimate reality " – R V. 1-164-46.

* Ibid : P. 83.
"GOD IS ONE, Gods are differently named Ideas of ONE BEING.
[The Diety is Vishvakarman, the creator (lit. architect) of the universe ]

# కవి — మనీషి

కవి ర్మనిషీ పరిభూః స్వయంభూః।

— ఈశావాస్యోపనిషత్

స్వయంభువును సర్వవ్యాపియునై సకల స్థావర జంగమాత్మక మగు జగత్తునకు సృష్టికర్తయైన విశ్వశిల్పిని కవి యనియు మనీషియనియు ఉపనిషత్తులు వర్ణించుచున్నవి.

మనీష యనఁగా ప్రతిభ. కల్పనాశక్తి. మనీషి యనఁగా ప్రతిభ గలవాఁడు.

సతో బంధు మసతి నిరవిందన్
హృది ప్రతీష్యా కవయో మనీషా ॥

— ఋగ్వేద-10-129-4*

కవులు తమ మనీషచేత బుద్ధి చాతుర్యము చేత హృదయమునందు దర్శించి లోకమునందు లేని నూతన వస్తువులు సృష్టింతురు.

కవి యన సృజనశక్తి గలవాఁడనియు, రూపక్రియా దక్షుఁడగు శిల్పియనియు మేధావి యనియు, సమ్యగ్దృష్టి గల జ్ఞాని యనియు మహర్షుల భావన.

ఈ సర్వలక్షణములు గల పరమాత్మయు కవియే. కావున కవి సృష్టికర్త వంటివాఁడు.

అపారే కావ్య సంసారే కవి రేవ ప్రజాపతిః
యథాస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే ॥

— ధ్వన్యాలోకము**

అపారమయిన కావ్యప్రపంచమునకు కవియే ప్రజాపతి. ఈ ప్రపంచమంతయు నాతఁడు కోరినట్లే పరివర్తనము చెందుచుండును.

ఇది భారతీయాలంకారికుల పైఖరి. అదియే కళాధర్మము. "వీరి వివేచనము కవిత్వపరమైనను, దానిని సర్వకళా ధర్మముగనే పరిగణింపవచ్చును." 1

---

* చూడు : పం. శ్రీహరిలాల్ శాస్త్రి : ఋగ్వేదభాషాభాష్యము ద్వి. సం. పు. 500 దయానందసంస్థాన్-ఢిల్లీ.

**"Sages who searched with their heart's thought discovered the existents kinship with the non-existent." – Hindu Scriptures. P. 37.**

** ఆనంద వర్ధనాచార్య = ధ్వన్యాలోక: తృతీయోద్యోత: శ్లో 100.
పోల్చు : అగ్నిపురాణ. అ. 339-10.

1. డా॥ పి. యస్. ఆర్. అప్పారావు : నాట్యశాస్త్రము. పు. 22.

కవి యన శిల్పి కావ్య మన శిల్పము ననుకొన్నచో, శిల్ప జగత్తునకు శిల్పియే ప్రజాపతి.

"రసో వై సః" అనునది శిల్ప విద్యాతంత్రము. దీనికి అధిష్ఠాత సృష్టికర్త యగు బ్రహ్మ. ఋషి సుందరమ్; సత్యశివములు పార్శ్వమూర్తులు. ఛందస్సు ఇంద్రియ సంచలనము. ప్రవృత్తి నివృత్తులు పరికరములు. యోగము సాధనము. చతుర్వర్గఫలావాప్తి వినియోగము. సమస్త కళలు ఉపచారములు.[1]

వస్తుజాలమును తన సంకల్పానుసారము మలచుకొనుటయే కళ.[2] అట్లు మలచుకొనుటకు కవికిఁ గాని శిల్పికిఁ గాని తగిన ప్రతిభ యుండవలెను.

ప్రతిభ యనఁగా "క్రొంగ్రొత్తగా వికసించు స్వభావము గల బుద్ధి" యని భట్ట తౌతుఁడు చెప్పినాఁడు.

ప్రజ్ఞా నవనవోన్మేషశాలినీ ప్రతిభా మతా ॥

— ఔచిత్య విచారచర్చ. కారిక-౩౫

"అపూర్వ వస్తు నిర్మాణము చేయఁగల ప్రజ్ఞయే ప్రతిభ" యని యభినవ గుప్తాచార్యుఁడు.

ప్రతిభా అపూర్వ వస్తు నిర్మాణక్షమా ప్రజ్ఞా॥

— లోచనవ్యాఖ్య 92, 93

ప్రతిభ, శక్తి, ప్రతిభానము అను పదముల నాలంకారికులు పర్యాయపదములుగా వ్యవహరించిరి.[3]

ప్రతిభా శబ్దమునకు ఆంగ్లమున **Genius, bright conception, vivid imagination** - అని అర్థములు చెప్పఁబడినవి.[4]

అట్టి ప్రతిభావంతుఁడే మహాకవి - మహాశిల్పి. అతడే లోకోత్తర చమత్కార రచన చేయఁగలఁడు.

"ఈ లోకోత్తర చమత్కారమునే వైచిత్ర్యము, విచ్ఛిత్తి, చారుత్వము, సౌందర్యము, హృద్యత్వము, రమణీయత్వము - అను పెక్కు పదములతో వ్యవహరింతురు."*

1. ముట్నూరు కృష్ణారావు : సమీక్ష, పు. 117.
2. "Art is subjecting of things to mind." – Francis Bacon.
౩. సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి - కావ్యాలంకారసంగ్రహము - పు. 119.
4. V. S. Apte : The Student's Sanscrit - English Dictionary.

*. సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి : కావ్యాలంకార సంగ్రహము సవ్యాఖ్య. పు. 119

ప్రతిభ దైవదత్తము. దైవానుకూల్యమునకు తప స్సవసరము. తపస్సంపన్నుఁ డగు వానికే అది లభ్యసుగును. అన్యులకు గాదు. అందుచేతనే అందరును మహా కవులును మహాశిల్పులును కాఁజాలరు.

ఈ విషయమునే మమ్మటాచార్యుఁ డిట్లు చెప్పినాఁడు.

'శక్తిః కవిత్వ బీజరూపః సంస్కార విశేషో
యాం వినా కావ్యం న ప్రసరేత్, ప్రసృతం వా
ఉపహసనీయం స్యాత్'

- కావ్య ప్రకాశము-ప్రథమోల్లాసము

[కవిత్వ బీజరూపమయిన శక్తి పూర్వజన్మ సంస్కార విశేషము. అది లేనిచో కావ్యము రచింపఁబడదు. ఒకవేళ రచింపఁబడినను అది నవ్వుల పాలగును.]

లలితా సహస్ర నామములలో "కావ్యకళ" యనున దొకటి. కావ్యోత్పాదక శక్తియే - ప్రతిభయే - కళాస్వరూపముగా నున్నదనియు, తద్విశేషము చేత కావ్య నిర్మాణ సామర్థ్యము కలుగుచున్న దనియు, అందుచేత పరాశక్తియే ప్రతిభా స్వరూపిణి యనియు వ్యాఖ్యాతలు వివరించినారు.*

ప్రతిభా సంపన్నులయిన వ్యాస వాల్మీక్యాది మహర్షులు తమ దివ్యదృష్టితో తత్త్వదర్శనము చేసి, తాము దర్శించిన సత్యములను లోకోత్తర వర్ణనా నైపుణ్యముతో భారత రామాయణాది మహాకావ్యములు రచించి జగద్వంద్యులయిరి.

ఋషికల్పులు, సర్వజ్ఞులు నైన మహాకవులే యట్టి విశ్వజనీనములగు కావ్యములు రచింపఁగలరు. అన్యుల కది సాధ్యము కాదు.

కావుననే, "కవయః క్రాంతదర్శినః" [కవులు సర్వజ్ఞులు], "నా నృషిః కురుతే కావ్యం" [ఋషి కానివాఁడు కావ్యమును రచింపఁజాలఁడు.] అను లోకోక్తులు గలిగినవి.

కవిత్రయములోని వాఁడగు తిక్కన తన నిర్వచనోత్తర రామాయణములో తనను గూర్చి,

* శ్రీ లలితా సహస్రనామ స్తోత్రము : 798 వ నామము.

"She is the literary art as the inspiration of all true literary art-forms like drama etc." - C. Suryanarayana Murthy.

"అమలోదాత్తమనీష నే నుభయకావ్య ప్రౌఢిఁ బాటించు శి
ల్పమునన్ బారగుఁడన్ గళావిదుఁడ ...." - నని చెప్పికొన్నాఁడు.[1]

తిక్కన సంస్కృతాంధ్ర కావ్య నిర్మాణ కౌశలమునందు పారంగతుఁడగుటయే కాక బహుకళావిదుఁడును. కావ్యశిల్పపారంగతత్వమును కళావేతృత్వమును అమలమును, ఉదాత్తము నైన మనీష వలన - ప్రజ్ఞావిశేషము - వలన సిద్ధించినవి. ఇట్టి ప్రజ్ఞావిశేషమునే "చిత్త సంస్కార" మని పింగళి లక్ష్మీకాంతముగారు చెప్పినారు.[2]

కవి యగు వాని కీ చిత్త సంస్కారమే కాక భావుకతయు, భావ వ్యక్తీకరణ శక్తియు నుండవలయును. అట్లే శిల్పికిని చిత్తసంస్కారము, భావుకత్వము, భావ వ్యక్తీకరణ శక్తియు నుండవలయును.

ఏ కళాకారునకైనను తన యభిమానకళయందు ప్రావీణ్యమేకాక, తదితర కళలయందు కొద్దిపాటి పరిజ్ఞాన మయినను నుండవలయును. లేనిచో ఆ కళ రాణింపునకు రాదు.

ఛందోఽలంకారశాస్త్రములందు ప్రవీణుఁడై-అన్యకళాపరిజ్ఞానము కలిగియున్న కవి రమణీయము లయిన కావ్యములను రచించి రాణించును.

అట్లే శిల్ప శాస్త్రమునందు పండితుఁడై తదితరశాస్త్రకళాభినివేశము గల శిల్పి అద్భుత కళాఖండములను సృష్టించి ఖ్యాతి గడింపఁగలడు.

"ఏ కళయైనను వికాసము నంది ఫలింప వలె నన్నచో, దానిని
అన్యకళా పరిజ్ఞాన మనెడి క్షేత్రమున నాటవలె."

- నని గుడ్‌హార్డ్ రెండల్ అను పాశ్చాత్యవిమర్శకుఁ డభిప్రాయపడి నాఁడు.[3]

1. తిక్కన : నిర్వచనోత్తర రామాయణము. 1-13.
2. పింగళి లక్ష్మీకాంతము : సాహిత్య శిల్ప సమీక్ష. పు. 106
3. అదే పు. 107

"Some general knowledge of all sorts is the soil in which particular knowledge in any one of them should be planted, if it is to flourish and bear fruit." — Goodheart Rendell.

# కవి - కారువు - శిల్పి

త్వం నో అగ్నే సనయే ధనానాం యశసం కారుం
కృణు హి స్తవా నః ।
ఋధ్యామ కర్మాపసా నవేన దేవై ర్ద్యావాపృథివీ
ప్రావతః నః ॥

- ఋగ్వేద - 1 - 31 - 8

(పరమేశ్వరా ! లోకములో ఉత్తమ ధనదాయకము లగు సమస్త శిల్పవిద్యల నెఱింగిన కారువును (శిల్ప పండితుని) యశోవంతుని జేయుము. వాని నిత్యనూతన శిల్ప క్రియలతో, కర్మానుష్ఠానముతో మేము పృథివి పై గల సకల పదార్థములను సద్వినియోగము చేసికొందుము గాక ! నూత్నపురుషార్థములను సంపాదించుకొందుము గాక.*

వైదిక వాఙ్మయములో "అపస్" అనఁగా శుభకర్మ - శిల్పకర్మ యని యర్థము.

'శర్యాపసః పుర ఋతోః ॥

ఋగ్వేద - 1 - 28 - 5

అను మంత్రమున కర్థము వ్రాయుచు "అపస్" అనఁగా శిల్పి యనియు, అపస్ శబ్దము నందలి ప్రథమ స్వరము ఉదాత్తమయిన కర్మము, నిర్మాణము, విస్తారము నని యర్థము లనియు పీటర్సన్ మహాశయుఁడు వివరించినాడు.[1]

ఇట్టి శిల్ప కర్మములు చేయువాఁడు కారువు.

పై మంత్రమునందు [ఋ.1-38 8] కారు వన స్తుతి ప్రయోక్తయని కొందఱు పండితు లనువదించినారు.[2] కాని యట కారు వన శిల్ప పండితుఁడని చెప్పుటయే లెస్స.

* దయానంద సరస్వతి : ఋగ్వేదభాషాభాష్యము. పు. 44.

1. Peterson = Hymns from Rigveda-Second Selections. P. 226
   అపస్ = Is an artist or artisan.
   అపస్ = (first syll - accented) is work, (ii) Structure (iii) mass or extent.
   "Let nct the artist's structure fall to pieces before its time." R. V. 1-28-5.
2. R. V. 1-31-8. "Make cur Singer famous" — Griffith.

కారు రహం తతో భిషక్ .... ।

ఋగ్వేద -9_112-

ఈ మంత్రమునందు మంత్రద్రష్ట (కవి) తానొక "కారువు" నని చెప్పికొన చున్నాఁడు. ఇట కారు వన శిల్పియే.*

ఋగ్వేదమునందు కారు శబ్దము శిల్పములు_యజ్ఞాది కర్మలు, చేయువాఁడన నర్థమునను స్తోత - కవి యను నర్థమునను ప్రయోగింపఁబడినది.

లౌకిక సంస్కృతములో కారు వన శిల్పి; విశ్వకర్మ.

కారవ శ్శిల్పిన స్సర్వే కులికాస్తే కులో త్తమాః ॥

- వైజయంతీ

కారుస్తు విశ్వకర్మాపి ॥

— వైజయంతీ.

ఎప్పటికప్పు దేదోయొక క్రొత్తఁదనమును కూర్చుట కారు లక్షణము. అదియే కవి లక్షణము కూడ; శిల్పియు కవియు నూత్నప్రయోగాభిలాషులే. ఇరువురును సృజన శక్తి గలవారే.

ఈ సృజనశక్తియే సమస్త కళాకారుల యందు గోచరించుచుండు నను టలో విప్రతిపత్తి లేదు.

"ఫల మిష్టమై, ఇష్టము జ్ఞాతమై, జ్ఞాతము కృతమై, యెవ్వనికర్మము సిద్ధించునో వాఁడు శిల్పి - కవి."[1]

* 1. చూడు : పం. ఆర్యముని - పం. శివశంకర్ :- ఋగ్వేదభాషాభాష్య-ద్వితీయ భాగ_దయానంద సంస్థాన్ ప్రచురణ.

'కారు: అహం = మై శిల్పవిద్యా కీ రఖ్‌తా ॥'

2. Dr. V. Raghavan : Yantras or Mechanical Contrivances in Ancient India. P. 3.

"The poet referred to himself as a Karu architect. Later, the great Epic refers to the architect Maya as a Mahakavi, a great poet."

1. డా॥ పాటిబండ మాధవశర్మ : ఆంధ్ర మహాభారతము-ఛందఃశిల్పము పు. 2

"ప్రాక్తన జన్మ సంస్కారవశమున నతనిలో జనించిన కవిత్వమే సంగీతముగా చిత్రలేఖనముగా, శిల్పముగా వ్యక్తమగుచున్నది."[1]

కవితా శిల్పములు రెండును రసరామణీయకములే. రెండును రసహృదయము నుండి యావిర్భవించినవే. రెండింటికిని మూలకారణము మానవునియందు నిగూఢముగ నున్న సృజనశక్తియే.

ఒక దృశ్యమును జూచినపుడో, ఒక విషయమును దలంచికొనినపుడో, ఒకానొక సమయమున రసహృదయము స్పందించును. ఒక మధురభావము పొడమును. అది హృదయము నందు దడఁగిపోక, భావావేశముతో వెలి కుబికినచో నది కవిత్వము. లయ తాళబద్ధమై, గానయోగ్యమై, గాన మొనర్పఁబడినచో నది సంగీతము. ఆ భావమే పటకుడ్యాదులందు చిత్రీకరింపబడినచో నది చిత్రలేఖనము; శిలాదారులోహాదులందు శిల్పింపఁబడినచో నది శిల్పము.

కవిత యే విధముగ లయాత్మకమై పదపద్యాది వివిధ రూపములు ధరించు చున్నదో, శిల్పము నట్లే సౌష్ఠవాత్మకమై బహురూపములు దాల్చుచున్నది.

ఆనందానుభూతియే కవితా శిల్పముల పరమ ప్రయోజనము.

నియతికృత నియమరహితాం హ్లాదైకమయీం
అనన్య పరతంత్రాం।
నవరస రుచిరాం నిర్మితి మాదధతీ భారతీ కవే ర్జయతి ॥*

అని మమ్మటాచార్యుఁడు చెప్పినమాట సర్వశిల్ప కళలయందును వర్తించు చున్నది.

## కవి = శిల్పి

శ్రేష్ఠం వః పేశో అధిశాయి దర్శితం
స్తోమో వాజా ఋభవ స్తం జుజుష్టన
ధీరాసో హి ష్ఠా కవయో విపశ్చితః
స్తాన్వ ఏనా బ్రహ్మణా వేదయామసి ॥

- ఋగ్వేదము - 4 - 36 - 7

1. డా॥ పాటిబండ మాధవశర్మ : 'భావకవిత్వము' అను వ్యాసము.

* మమ్మటుడు : కావ్య ప్రకాశిక 1-1

[ఓ, వాజులార ! ఋభువులార ! మీ కొఱకు స్తోత్రరూపమయిన చక్కని యాభరణమును చేసినాము. దానిని చూచి యానందింపుడు. మీరు బుద్ధి చాతుర్యము గలవారు, రచనా కౌశలము గలవారు, వివేచనాశక్తి గలవారు. మా స్తోత్రముతో మి మ్మాహ్వానించుచున్నాము.]

శిల్ప విద్యా ప్రతిపాదకమగు ఋభుసూక్తము నందలి యీ మంత్రములో రథకారు లయిన ఋభువులు ధీరులుగను కవులుగను పండితులుగను వర్ణింపఁబడినారు.

అథర్వవేదము నందును కవిశబ్దము శిల్పిపరముగా ప్రయోగింపఁబడినది.

బ్రహ్మణా శాలాం నిమితాం కవిభి ర్నిమితాం మితామ్ ।
ఇంద్రాగ్నీ రక్షతాం శాలా మమృతౌ సోమ్యం సదః ॥

- శాలాసూక్తము-అథర్వ. 9-3-19*

[ఉత్తమ శిల్ప విద్వాంసులు శాస్త్రప్రకారము మాపన మొనర్చి నిర్మించిన శాల యందును వేదవిదులగు బ్రాహ్మణులు సకలర్తు సౌఖ్యావాయకముగ నిర్మించిన శాల యందును నివసించువారిని నాశరహితులయిన యింద్రాగ్నులు (వాయువు - అగ్ని) రక్షింతురు గాక ! ఇది ఆయురారోగ్యైశ్వర్యముల నొసఁగు ఉత్తమ గృహమగు గాక ! ]

ఈ శాలా నిర్మాతలు శిల్పకార బ్రాహ్మణులు.[1]

ఇంద్రుఁడు తనను విజ్ఞానవేత్త యయిన శుక్రాచార్యునితోఁ బోల్చుకొనినట్లు ఋగ్వేదము నందుఁ గలదు.

* చూడు : (1) మహర్షి దయానంద సరస్వతి : సంస్కార విధి: పు. 191.
కవిభి: = ఉత్తమ విద్వాన్ శిల్పియోం సే,
మితామ్ = ప్రమాణయుక్త అర్థాత్ మాప్ మే ఠీక్ జైసీ.
నిమితామ్ = బనాఈ హుఈ; శాలామ్ = శాలాకో . . .
రక్షతాం = రక్షా కరే॥
(2) క్షేమకరణదాస్ త్రివేదీ = అథర్వవేదము-భాషాభాష్యము పు. 187
దయానంద సంస్థాన్ ప్రచురణ.

1. శ్రీ స్వామీ రామేశ్వరానంద జీ ఆచార్య = శిల్పి బ్రాహ్మణ పు. 8

అహం కవి రుశనా పశ్యతా మా ॥

- ఋగ్వేద-4-26_1

[నేను కవిని; ఉశనుఁడను. నన్నుఁ జూడుఁడు.]

ఉశనా కవి యనఁగా సర్వజనహితముఁ గోరు సంపూర్ణశాస్త్రజ్ఞానము గల విద్వాంసుఁ డని దయానందసరస్వతి వివరించినాఁడు.*

మహాభారతము నందును, భగవద్గీతలో శ్రీకృష్ణుడు, "....కవీనా ముశనాకవిః" [కవులలో నే నుశనా కవిని] - అని చెప్పికొనినాఁడు. [వ్యా. భా. భీష్మ 34.37]

దీనికి "కవీనాం క్రాంతదర్శినా ఉశనాకవి రహమస్మి." - అని శ్రీ మచ్ఛంకర భగవత్పాదులు భాష్యము వ్రాసినారు.

అసుర గురువు, అమిత ప్రజ్ఞుఁడు నైన శుక్రాచార్యుఁడు మహాకవి.[1] అనఁగా విజ్ఞానవేత్త.

ఆతని విజ్ఞానము, విద్యాబలము అమోఘము.

అమోఘం తవ విజ్ఞాన మస్తి విద్యాబలం చ తే ॥

- వ్యా.భా. ఆది-80-26

విజ్ఞాన మనఁగా బ్రహ్మానుభవ మనియు, విద్య యనఁగా మృతసంజీవనీవిద్య యనియు నీలకంఠుఁడు వివరించినాడు.[2]

విజ్ఞాన మనగా మోక్షము కంటె వేఱయిన శాస్త్రమునందును, శిల్పమునందు నున్న బుద్ధిపేరు.

మోక్షే ధీర్ జ్ఞాన మన్యత్ర విజ్ఞానం శిల్పశాస్త్రయోః ॥

- అమరకోశము. 1-141

- అగ్ని పురాణము-359-50

* చూడు : దయానంద సరస్వతి : ఋగ్వేద-భాషాభాష్యము.

1. వ్యా. భా. ఆది. 80-13

ఏవముక్త స్తథేత్యాహ వృషపర్వా మహాకవిః ।
దేవయాన్యంతికం గత్వా తమర్థం ప్రాహ భార్గవః ॥

2. వ్యా. భా. ఆది. 80_26 (చిత్రశాలాప్రతి)
"విజ్ఞానం బ్రహ్మానుభవః విద్యా మృతసంజీవినీ." - నీలకంఠ.

శుక్రాచార్యుడు భృగుకుల శ్రేష్ఠుడు.[1] భృగుమహర్షి కుమారుడు కవి. కవి పుత్రుడు శుక్రుడు. అతనిని కవి యనియు కావ్యుడనియు నందురు.[2] అతని మృత సంజీవినీ విద్యకు "కావ్యకళ" యని పేరు. భృగువులు రథకార బ్రాహ్మణులు, శిల్పాచార్యులు. భార్గవుండయిన శుక్రాచార్యుడు శిల్ప శాస్త్రవేత్తయు, మృతసంజీవనీ విద్యాబలము గలవాడు నగుటయే కాక బ్రహ్మానుభవమును గలవాడని తెలియుచున్నది.

మహాశిల్పియైన మయుడు కూడ తానొక "మహాకవి" నని చెప్పికొన్నాడు.

అహం హి విశ్వకర్మా వై దానవానాం మహాకవిః ॥

- వ్యా. భా. సభా-1-6

ఈ శ్లోకపాదమునకు నీలకంఠవ్యాఖ్య యిట్లున్నది :

విశ్వం కర్మ కృతి సాధ్యం యస్య సః విశ్వకర్మా ।
మహాకవిః శిల్పపండితః ॥

[సర్వ (శిల్ప) కర్మములు చేయుటకు ఎవనికి సాధ్యమగునో వాడు విశ్వకర్మ. మహాకవి యనగా శిల్ప పండితుడు.]

పై శ్లోకార్థమును నన్నయభట్టు, "ఏను దానవ విశ్వకర్మ ననేక శిల్పకలా కుశలుండ" నని యాంధ్రీకరించినాడు.

కావున కవి యనగా శిల్పి; మహాకవి యన శిల్పాచార్యుడు, విజ్ఞానవేత్త.

# కవితారథ శిల్పకల్పనము

అభి తష్టేవ దీధయా మనీషా మత్యో న
వాజీ సుధురో జిహానః ।
అభి ప్రియాణి మర్మృశత్ పరాణి కవీన్రిచ్ఛామి
సందృశే సుమేధాః ॥

- ఋగ్వేద. 3-38-1

1. వ్యా. భా. ఆది. 80-1. 'కావ్యో భృగుశ్రేష్ఠః'
2. వ్యా. భా. ఆది. 76-22.
'ఆదిష్టం కవిపుత్రేణ శుక్రేణోశనసా స్వయమ్'
'భృగోః పుత్రః కవి స్తత్పుత్రః శుక్రః కావ్యః స కవి రిత్య
పృపచాలా దుచ్యతే । శుక్రేణ రుద్రశుక్రరూపేణ ॥
- నీలకంఠ-చిత్రశాలాప్రతి. పు. 14.7

దారుశిల్పి వలె [తష్టేవ] ధ్యానమగ్నుఁడనై, సంయోజితమైన జవనాశ్వము వలె చురుకైన బుద్ధితో, చక్కగా భావించి, నే నొక మంత్రమును రచించినాను. ఉదాత్త భావములతో ఉన్నతాదర్శములతో విద్వాంసుల సందర్శనము కోరుచున్నాను.[1]

కవి తష్ట వంటి వాఁడు. దారుశిల్పి తన బుద్ధిచాతుర్యముతో రథమును నిర్మించు నట్లు ఋషితుల్యుఁ డగు కవి తన భావనాపటిమతో తన హృదయము నందలి భావమును భవ్యకవితారూపమున నావిష్కరించుచున్నాఁడు.

అహం తష్టేవ వంధురం పర్యచామి హృదా మతిమ్ ॥
ఋగ్వేద. 10-119-4[2]

కవితారథ శిల్పములు సమానధర్మము గలవి. రెండును కల్పనాచమత్కారము గలవే. కావుననే వైదికఋషులు తమ సూక్తములను రథశిల్పముతోఁ బోల్చికొనినారు.

## శిల్ప ప్రాశస్త్యము

యేభిః శిల్పైః పప్రథానా మదృగ్ంహత్ ।
యేభి ర్ద్యా మభ్యసిగ్ంశత్ ప్రజాపతిః ।
యేభి ర్వాచం విశ్వరూపాగ్ం సమవ్యయత్ ।
తే నేమ మగ్న ఇహ వర్చసా సమఙ్ధి ॥

తైత్తిరీయ బ్రాహ్మణ-2-8-15-50*

1. Cf : Jeanine Miller : The Vedas (Vedic Meditation) P. 53.
"The clearest and most striking comparison between the Seer's activity and that of a carpenter or builder (Tvastr) is made in Rigveda. III-38-1"
"It is a specialised process, just as is a building of a chariot, or any carpenter's work."
2. Cf : Prof . S. V. Dixit : Kavya Prakasa of Mammata-Introduction. P. XXI.
"The Vedic seers likened the Poet's craft to the Carpenter's craft.
అహం తష్టేవ వంధురం పర్యచామి హృదామతిమ్.
A poet chiselled by his heart a fine poetic composition like a carpenter making a beautiful chariot. The normal word for a poem was మనీషా, మన్మ, మతి."


* తైత్తిరీయ కృష్ణయజుర్వేదే బ్రాహ్మణభాగః ॥ మైసూరు ప్రతి పుట. 285

ఈ శ్రుతి రాజ్యాభిషేక సమయమునం దాచార్యుఁడు చెప్పునది.

ప్రజాపతి యనగా విశ్వకర్మ.

"ప్రజాపతి ర్విశ్వకర్మా మనోగంధర్వః" అను యజుర్వాక్యము వలనను, "విశ్వకర్మాభవత్ ప్రజాపతిః" - అను నైతరేయ బ్రాహ్మణ వచనము వలనను, "విశ్వకర్మా మహాభాగ స్తస్యాం జజ్ఞే ప్రజాపతిః" అను భారతాదిపర్వవచనము వలనను విశ్వకర్మ యగు;

నట్టి విశ్వకర్మ బ్రహ్మర్షి యే శిల్పకౌశలము వలన సవిస్తరమైన యీ భూమిని బలమైన దానినిగాఁ జేసెనో, యెట్టి క్రియాకౌశలము చేత నాకాశము నందంతటఁ జంద్ర తారకాదులచేఁ జక్కనిరూపము గలదానిని జేసెనో, మఱియు నెట్టి కలానైపుణిచే సమస్త పదార్థముల పలుకుఁబడి గలదగుటచే ననేకరూపమైన వాక్కును సంపాదించెనో యట్టి కలాకౌశలము చేత నా నేర్పరితనముతోఁ గూడిన బలముచేత నో యగ్నీ ! యీ రాజును నీ లోకమున సమృద్ధివంతునిగాఁ జేయుము. అట్టి సామర్థ్యముతో సమకూర్చుము. - అని చెప్పుటచే శిల్ప మన భూలోకద్యులోకములను బలవంతముగను తేజోవంతముగను నొనర్చి రూపక్రియావికారముల నుచ్చరించు వాఙ్మయమును గూడఁ గల్పించునదియై కన్పట్టు చున్నది.[1]

[ఈ వివరణము సాయణభాష్యానుసారముగా వ్రాయఁబడినది.]

## దేవమానుష శిల్పములు

శ్రుతి॥ "శిల్పాని శంసంతి దేవశిల్పా న్యేతేషాం వై శిల్పానా
మనుకృతీహ శిల్ప మధిగమ్యతే । ....
ఆత్మ సంస్కృతి ర్వావ శిల్పాని చ్ఛందోమయం వా
ఏతై ర్యజమాన ఆత్మానం సంస్కురుతే ॥"

- ఐతరేయ బ్రాహ్మణము*

1. చూడు : వడ్డెపాటి నిరంజనశాస్త్రి : విశ్వకర్మ బ్రాహ్మణవంశాగమము. పుటలు. 102, 103.

* : ప్రక్క పేజీలో చూడుము.

శిల్ప మనగా నాశ్చర్యకర మగు కర్మ. శిల్పము ద్వివిధము దేవశిల్పము, మానుషశిల్పము. దేవతలకు ప్రీతిహేతువు లయినవి దేవశిల్పములు నాభానేదిష్ఠాది శస్త్రములకు దేవశిల్పము లని పేరు. దేవశిల్పముల కనుకృతిగాఁ జేయబడు నవి మానుషశిల్పములు.

దేవశిల్పములు ఆత్మసంస్కారహేతువులు. ఈ శిల్పములచే యజమానుఁడు "జీవాత్మ వేదమయుఁ డగు" నట్లుగా సంస్కరించుకొనును.[1]

దేవశిల్పములను వివరించుచు నిరంజన శాస్త్రి గా రిట్లు వ్రాయుచున్నారు.

"దేవతాసంబంధములయిన శిల్పము లన్నియు దేవశిల్పములే. దైవోపయోగము లెవ్వి యన యజ్ఞకుండ, యజ్ఞవేది, యజ్ఞపాత్ర, దేవాలయ, దేవమూర్తి, దేవోప కరణపాత్ర, సువర్ణాలంకార, రథశస్త్రాస్త్రములు మున్నగు సువర్ణతామ్రలోహకాష్ఠపాషాణా దులగు పంచవిధములగుశిల్పములు దేవశిల్పము లని చెప్పఁబడుచున్నవి. దేవశిల్పము లత్యంతపవిత్రవంతములు. దేవశిల్పముల వలన బాహ్యాంగములు, దేవమూర్తి, యజ్ఞోప కరణముల వలన నంతరంగములను పవిత్రము లగును. స్వర్ణాదిశిల్పకర్మలు కామ్యములే. యజ్ఞాది వేదకర్మలు కామ్యములే."[2]

దేవశిల్పముల వలె మానుషశిల్పములను ఆత్మసంస్కార హేతువులే.

* చూడు : ఆచార్యసత్యవ్రత సామశ్రమి : ఐతరేయాలోచనమ్. పు. 118.

> 'శిల్పశబ్దశ్చాఽశ్చర్యకరం కర్మ బ్రూతే । తచ్చ శిల్పమ్ ద్వివిధమ్ దేవశిల్పం మానుషశిల్పం చేతి । నాభానేదిష్ఠాని యాని శిల్పాని సంతి దేవానాం ప్రీతిహేతుత్వా ద్దేవశిల్పానీ త్యుచ్యన్తే ఏతేషామేవ । దేవశిల్పానా మనుకృతి సదృశరూప మిహ మనుష్యలోకే శిల్ప మధిగమ్యతే ప్రతీయతే ॥ ...
>
> వక్ష్యమాణాని నాభానేదిష్ఠాది శిల్పా న్యాత్మసంస్కృతి ర్జీవాత్మనః సంస్కార కారణాని తస్మా దేతై ర్యజమానో జీవాత్మనం ఛందోమయం వేదమయో యథా భవతి తథాసంస్కురుతే ॥ - సాయణ భాష్యము.

పోల్చు : గోపథ బ్రాహ్మణము. ఉ. 6-7.
"ఆత్మసంస్కృతి ర్వై శిల్పాని."

1. హరిసోదరులు : భారతీనిరుక్తి - పుటలు. 586-87.

2. వడ్డెపాటి నిరంజనశాస్త్రి = విశ్వకర్మ బ్రాహ్మణపంచాగమము. పు. 105.

"భారతీయుల దృష్టిలో శిల్పము లనఁగా రమణీయార్థములను దర్శింపఁజేసి యలౌకికానందరసపూర్ణులఁ గావించు లక్ష్యము గలవి. ఇదియే భారతీయసంస్కృతి ఈ సంస్కృతిని ప్రతిబింబింపఁ జేయు నవియే చతుష్షష్టికళలు. ఇవి దేవశిల్పముల ప్రతిరూపములు. దేవశిల్పము లాత్మసంస్కారహేతువులు. అట్లే తదనుకృతిరూపవ అగు మానుషశిల్పములకును ఆత్మసంస్కారమే లక్ష్య మని పై శ్రుతి వలనఁ దె యును. జీవాత్మ వేదమయుఁ డగు నట్లుగ, అనఁగా భారతీమయుఁడగు భరతుఁ డగ నట్లుగ నుద్దీపింపఁ జేయుటకే దేవాలయ విమానగోపురప్రాకారాదు లన్నియు శిల్పమయ ములై వెలసినవి."[1]

విశ్వకర్మోపజ్ఞక మయిన క్రియ దేవశిల్ప మనియు, మానవసంకల్పోపచిత మయిన కర్మ మానుషశిల్ప మనియు బనారస్ విశ్వవిద్యాలయ వాస్తుశిల్ప శాఖాధ్యక్షుఁడు వాసు దేవ శరణ్ అగ్రవాలా అభిప్రాయ పడినాఁడు.

"The Devasilpa is the work of the creator's mind. The manushasilpa that of the human mind."[2]

## వైదికావైదిక శిల్పములు

వేదమంత్రములు పఠించుచుఁ జేయు వస్తువులు వైదికశిల్పములు.

మంత్రరహితముగాఁ జేయఁబడు శిల్పములు అవైదికములు.

యజ్ఞశాలలు, యజ్ఞవేదికలు, స్రుక్స్రువాదులు, వాజపేయ యజ్ఞప్రయోగమ లగు రథములు, దేవాలయములు, దైవతప్రతిష్ఠలు, శివ, విష్ణు, దేవ్యాది మూర్తులు వాపీకూపాదులు, దుర్గరచన, క్షేత్రరచన, గ్రామరచన, ఆరామప్రతిష్ఠ, ఇష్టకోపధానము పశ్యైకృతి యజ్ఞకుండ రచనము, ........ అథర్వవేదోక్తమంత్ర రచనము లగు శస్త్రా స్త్రములు, ధనుస్సు, బాణము, ఖడ్గము, చక్రము, వజ్రము, త్రిశూలము, గద, పాశము, మంగళసూత్రము, శ్రోత్రకుండలములు_ఇత్యాదులు వైదిక శిల్పములు. వీనిని బ్రాహ్మణ శిల్పము లనియు నందురు. వీనిని రచించు సమయమున శాస్త్రోక్తములగు తత్తద్వేద మంత్రములఁ బఠింపవలెను.[3]

1. హరిసోదరులు = భారతీనిరుక్తి. పుటలు. 588-9.
2. V. S. Agrawala = Studies in Indian Art. P. 24. 1965 ed. Viswavidyalaya Prakasan – Varanasi
3. చూడు : వడ్డెపాటి నిరంజన శాస్త్రి : విశ్వకర్మ బ్రాహ్మణవంశాగమము. - రథకారకాండము-పు. 257, 258

యజ్ఞములలో అశూద్రకృతములు, త్రైవర్ణికకృతములు నగు నగ్నిహోత్ర స్థాల్యాదులనే గ్రహింప వలయు నని "హిరణ్యకేశి సూత్రము"లోఁ జెప్పబడినది.[1]

'అశూద్రకృతాం త్రైవర్ణికే నైవకృతా మగ్నిహోత్రస్థాలీమ్.'

మహాభారతము నందును ఇట్లే చెప్పఁబడినది.

ఆహరేదథ నో కించిత్ కామం శూద్రస్య వేశ్మనః ।
న హి యజ్ఞేషు శూద్రస్య కించి దస్తి పరిగ్రహః ॥
- వ్యా. భా. శాంతి. 165-8

యజ్ఞోపయోగములగు శిల్పముల నొనరించువారు శిల్పబ్రాహ్మణులు. పంచార్షేయులును విశ్వకర్మకులోద్భవులును నయిన వీరిని పాంచాల బ్రాహ్మణులనియు, విశ్వకర్మ బ్రాహ్మణులనియు, విశ్వబ్రాహ్మణులనియుఁ బిలుచుచున్నారు.

వాస్తు పూజాదికము లేకుండ నిర్మింపబడు కొన్ని గృహములు, గృహోపకరణములు, పాత్రలు, శయ్యాసనములు, శకటములు మొదలగు సాధారణ వస్తుజాలమును చేయునపుడు వేదమంత్ర పఠన మావశ్యకము కాదు. కావున నా శిల్పము లవైదికము లనవచ్చును. కాని యా శిల్పము లొనర్చు శిల్పకారులెవరు ? వారు శిల్పి బ్రాహ్మణులు కావచ్చును. కాకపోవచ్చును. శిల్పి బ్రాహ్మణులవద్ద శిల్పవిద్య నభ్యసించిన వా రెవరయినను గావచ్చును. కాని భారతదేశమునందు శిల్పవిద్య కులక్రమాగతమయినది కావున వైదికావైదికాది సమస్త శిల్పముల నొనర్చు శిల్పులెక్కువగా విశ్వకర్మ కులజులై యున్నారని చెప్పవచ్చును.

## శిల్పకళాధర్మము

శిల్పకళలు ఆదర్శవంతములుగ నుండవలయు నని పలువుర తలంపు. కళ కళ కొఱకే, శిల్పము శిల్పము కొఱకే (Art for Art's sake) అను నొక వాదము లేకపోలేదు. కాని ఆదర్శహీన మయిన శిల్పము (కళ) సకలజనామోదము పొందఁ జాలదు. మానవుఁడు చేయి ప్రతి పనికి నేదియో యొక ప్రయోజన ముండి తీరును.

"సమస్త శిల్పకళలకు మూలాధారము మానవుని హృదయానుభూతియే ఆ అనుభూతిని మానవీకరించి సంస్కృతిని సాకూత మొనరించుటయే కళాధర్మము." [2]

1. చూడు : వడ్డెపాటి నిరంజన శాస్త్రి : విశ్వకర్మ బ్రాహ్మణవంశాగమము.
- రథకారకాండము-పు. 257, 258.

Cf : I. ART TODAY. P. 523. ed. Faulkner : Ziegfeld : Hill,

"వ్యక్తిని, కాలమును, పరిస్థితులను అధిగమించుటయే కళయొక్క పరమధర్మ" మని హెర్బర్ట్ రీడ్ అను కళావిమర్శకుడు వ్రాసినాడు. [1]

"కళ మానవజీవితము యొక్క ఆధ్యాత్మికసాధన" మని టాల్‌స్టాయి వచించినాడు. [2]

"సత్పదార్థ మగు పరమాత్మ పిలుపునకు సృజనాత్మకశక్తి గల జీవాత్మ యిచ్చు ప్రత్యుత్తరమే కళ" యని రవీంద్రనాథఠాగూరు వ్రాసినాడు. [3]

భారతదేశము నందు ప్రసిద్ధిఁ జెందిన కళ లన్నియు, పరమేశ్వరతత్త్వానుసంధానములయి పరిఢవిల్లు చున్నవి.

## శిల్పము . కళ

మానవుఁ డాది నుండియు తన కానందమును గూర్చు సాధనసంపత్తి కొఱకు ప్రయత్నించుచునే యున్నాడు. ఆ ప్రయత్న ఫలితమే శిల్పము లేక కళ.

"శిల్పము లేక కళ యనఁగా ఆహ్లాదకరములగు రూపములను సృష్టించుటకు మానవుఁడు చేయు ప్రయత్నమనియు, నట్టి రూపములు మన సౌందర్యబోధను సంతృప్తి పఱచు" ననియు,

"ఇంద్రియోపలబ్ధము లయిన పదార్థములలో నొక సామరస్యమును సమైక్యమును మనము గ్రహింపఁగలిగినపుడు సౌందర్యబోధ తృప్తి చెందు" ననియు హెర్బర్టు రీడ్ అను కళా విమర్శకుఁడు తెలుపుచున్నాడు. [4]

Cf : 1. Herbert Read : The Meaning of Art. P. 191.
"The ultimate Values of art transcend the individual and his time and circumstances."

2. Tolstoy : "What is art and essays on Art."
Tr. by Aylmar Mande : C. U. P. P. 264.

3. Tagore : On Art and Aesthetics. P. 58.
"Art is the response of man's creative soul to the call of the Real."

4. Herbert Read : The meaning of Art. P. 16.
A Pelican Book. ed-1954.
" .... and art is most simply and most usually defined as an attempt to create pleasing forms. Such forms satisfy our sense of beauty."
"and the sense of beauty is satisfied when we are able to appreciate a unity or harmony of formal relations among our sense-perceptions."

మన సౌందర్యబోధ తృప్తిఁజెందవలె ననిన దృశ్యమానమగు వస్తువు సుంద రముగ నుండ వలెను గదా!

"సుందరమైన వస్తువు సంతతానందసంధాయక మని కీట్సు అను ఆంగ్లమహా కవి చెప్పినాఁడు.[1]

అతఁడే మఱియొకచోట, సత్యసౌందర్యముల కభేదము తెలిపినాడు.[2]

కావున సుందరమయిన వస్తువుల నుత్పత్తి చేయుటయే శిల్పము.

సౌందర్య మన నేమి ? కంటి కింపుగొలుపు రూపురేఖావిలాసాది గుణసంయో జనమే సౌందర్యము. నైతికబోధను బుద్ధివికాసమును గలిగించు సద్గుణసంయోజనము కూడ సౌందర్యమే. అది ఆత్మ సౌందర్యము.

Beauty అను మాటకు ఆంగ్లకోశ[3] మిచ్చుచున్న యర్థమిది :

Beauty = Combination of qualities, or shope, proportion, in human face or form or in other objects, that delights the sight; combined qualities delighting the other senses, the moral sense, or the intellect.

"శుక్రనీతి" యందు శుక్రాచార్యుఁ డిట్లు వచించినాడు.

ఏకాషా మేవ తద్రమ్యం లగ్నం యత్ర చ యస్య హృత్॥ [4]

[ఎవని మనసు దేని యందు లగ్న మగునో అది వానికి రమ్యమైనది.]

ఇది సామాన్యజనవిషయము. విద్వాంసుల దృష్టి యిది కాదు. వారికి శాస్త్ర విరుద్ధముగా రచింపబడునది రమ్య మయినది కాదు. అందచందములకు గూడ శాస్త్రమా యన వచ్చును. దైవశిల్పమునకు శాస్త్రము లేదు కాని మానవశిల్పమునకు శాస్త్రమున్నది. తొలుదొల్త లేకున్నను మానవుఁడు విజ్ఞానాభిముఖముగా అభివృద్ధి చెందుచున్న కొలఁది అనేకశాస్త్రములు రచింపబడినవి.

1. John Keats : Endymion–Bk I–I.
   "A thing of beauty is a joy for ever."
2. John Keats : Ode to the Grecian Urn. V. 9-10.
   "Beauty is truth, truth beauty, – that is all
   Ye know on earth, and all ye need to know."
3. Fowler and Fowler : The concise Oxford Dictionary. P. 47. ed-1944. O. U. P.
4. శుక్రనీతి : 4-4-107 లోకధర్మ నిరూపణ ప్రకరణమ్.

విద్యా హ్యనంతాశ్చ కలాః సంఖ్యా తు నైవ శక్యతే।
విద్యా ముఖ్యాశ్చ ద్వాత్రింశ చ్చతుష్షష్టి కలాః స్మృతాః॥
- శుక్రనీతి. 4-3-23*

లోకములో విద్య లనంతముగ కళ లసంఖ్యాకములుగ నున్నవి. విద్యలలో ముప్పది రెండు విద్యలును, కళలలో చతుష్షష్టికళలును ముఖ్యములు.

ఈ ముప్పది రెండు విద్యలలో శిల్పశాస్త్ర మొకటి [1]

మహర్షులు దివ్యదృష్టితో చేసిన శాస్త్రనిర్ణయములు తరువాతి వారి కనుసరణీయములు. ఇది లోకధర్మము.

కోశము లందు శిల్ప శబ్దమునకు కళ యనియు, కళాశబ్దమునకు శిల్ప మనియు నర్థము చెప్పఁబడినది.

శిల్పం కర్మ కళాదికమ్॥ అమరకోశము. ద్వి. కాం. 722.

కళాదికమ్ – వాత్స్యాయనుఁడు చెప్పిన నృత్తగీతాది బాహ్యక్రియలు 64 ను, ఆలింగనచుంబనాద్యాభ్యంతర క్రియలు 64 ను కళ లనఁబడును. అవి మొదలైన కర్మ – అనఁగా స్వర్ణకారాది క్రియలను శిల్పమ్॥న॥ శిల్ప మనబడును.

కలా శిల్పే కాలభేదే స్యాత్॥–అమరము తృ. కాం. 353.

శిల్పము = 1. చిత్తరువులు వ్రాయుట లోనగు శిల్పుల పని
2. నృత్తగీతవాద్యాది చతుష్షష్టి బాహ్యక్రియలు
3. ఆలింగనాది చతుష్షష్ట్యాభ్యంతర క్రియలు

కళ = శిల్పము; కళలు అరువది నాలుగు

—అని శబ్దరత్నాకరము నందు వ్రాయఁబడినది. కాని కళలపట్టిక భిన్నముగ నున్నది.

సూర్యరాయాంధ్రనిఘంటువు నందు కళ యన, "గీతావాద్యాది చతుష్షష్టి కళలలో నేదే నొకటి" యనియు, "శిల్ప" మనియు వ్రాయఁబడినది.

తక్కిన కోశము లందును శిల్పకళా శబ్దములు పర్యాయములుగనే చెప్పఁబడినవి.

* శుక్రనీతి : 4-3-23 విద్యాకలానిరూపణ ప్రకరణమ్.

1. శుక్రనీతి : 4-3-27

'కలాంశమాత్రే శిల్పాదే కలనా కాలభేదయోః ।'

- నానార్థరత్నమాల

'కాలే శిల్పే విత్తవృద్ధే చంద్రాంశే కలనే కళే'

- వైజయంతి

శిల్పమ్ - An art, afine or mecharical art; (64 such arts are enumerated.) 2. Skill (in any art) craft. 3. Ingenuity. 4. work, manual work, labour 5. A rite ceremony; 6. A kind of ladle or spoon at sacrifices.

కలా - Any Practical art (mechanical or fine) 2-skill, ingenuity.

— V. S. Apte - S. S. E. D.

తక్షణము మున్నగు చేతిపనులు (హస్తకళలు) శిల్పము (Handi crafts) లనియు, చిత్రలేఖనాదులు కళ (arts) లనియు వ్యవహరింపఁబడుచున్నవి.

## శిల్పము = కర్మకౌశలము

లోకోత్తర వర్ణనానిపుణుఁ డగు కవి కర్మ కావ్యము.

లోకోత్తర చమత్కారక్రియాకుశలుఁ డగు కవి (శిల్పి) కర్మ శిల్పము.

శిల్పశబ్దము శీల ధాతువు నుండి నిష్పన్న మయినది.

"శీల ఉపధారణే" అనియు, "శీల సమాధౌ" అనియు శీల ధాతువునకు రెండర్థములు.

శీల్ – శీలయతి = పునఃపునరభ్యస్యస్తి తదితి శిల్పమ్॥

To practice repeatedly.

శీల్ – శీలతి = ధ్యానముచేయు, యోజించు

To meditate, contemplate.

యాస్కాచార్యుఁడు "శీలయతి – శీలతీతి వా" –అని నిర్వచించి, యీ క్రింది శ్రుతిని ఉదాహరించినాఁడు. *

యత్తే శిల్పం కశ్యప రోచనావత్ ॥

- తై: బ్రా. 2-7-25-8

* యాస్క : నిరుక్తమ్. 1-2 పుటలు. 186.7

దీనికి సాయణభాష్య మిట్లున్నది.

[హే కశ్యప ప్రజాపతేః తే తవ శిల్పం కర్మకౌశలమ్ రోచనావత్ దీప్తిమత్]

కనుక శిల్ప మనఁగా కర్మకౌశలము. క్రియల యందు కౌశల మని మనోరమ. మహాభారతము నందు శిల్పశబ్దము కౌశల మను నర్థమున ప్రయోగింపఁబడినది.

విరాటుఁడు ధర్మరాజు నిట్లు ప్రశ్నించినాఁడు.

"కించాపి శిల్పం తవ విద్యతే కృతమ్ ?"

- వ్యా. భా విరాట-7-11

దీనికి "శిల్పం కౌశలం కిం విషయం తవ త్వయా కృతమ్ సంపాదితమ్" అని నీలకంఠునివ్యాఖ్య.*

క్రియల యందు కౌశల మెట్లు గలుగును ?

శిల్ప మనఁగా నాశ్చర్యకర మైన కర్మ యనియు నది ఆత్మసంస్కారహేతు వనియు చెప్పఁబడినది. అట్టి శిల్పకార్యనిర్వహణమునకు శిల్పికి అభ్యాసము ధ్యానము అవసరము.

అభ్యాసము బాహ్యప్రయత్నము. సమాధి యాంతరప్రయత్నము. ఈ సమాధ్యభ్యాసములు రెండును శక్తిని వికసింపఁ జేయును.

సమాధి రాంతరః ప్రయత్నో బాహ్య స్త్వభ్యాసః ।
తావుభావపి శక్తిం సముద్భాసయతః ॥

— రాజశేఖర-కావ్యమీమాంస. అ-4

అభ్యాసము వలన శిల్పికి ఏకాగ్రత కుదురును. ఏకాగ్రత వలన సమాధి యేర్పడును. శిల్పి సమాధిగతుఁడైన కాని తాను చేయు పనిని చక్కఁగా నిర్వహింప లేడు. చక్కఁగా నిర్వహించుట యనగా శిల్పి తన కర్మ యందు కౌశలమును జూపుటయే. అప్పుడే రూపసిద్ధి కలుగును. రూపమే శిల్పము.

యద్వై ప్రతిరూపం తచ్ఛిల్పమ్ ॥

[ఏది ప్రతిరూపమో అది శిల్పము]

- శతపథబ్రాహ్మణము. 3-2-1-5

* చూడు : వ్యాసభారతము - విరాటపర్వము - చిత్రశాలా ప్రతి, పు. 12.

"శిల్పి యేకాగ్రభావనానిమగ్నుఁడై యే శిల్పరచనముం జేయునో యది ప్రేక్షకునికి, లేదా సౌందర్యారాధకునకు సమాధిగమ్యమగు నానందమును గూర్చుచున్నది."*

ఇందుకు నిదర్శనముగా ద్వారకానగరమును విశ్వకర్మ నిరంతరాభ్యాసము చేతఁ గలిగిన శిల్పవిద్యానైపుణ్యమున కవధిగా నిర్మించె నని మాఘకావ్యము నందును, మానసప్రయత్నము చేత నిర్మించె నని హరివంశము నందును వర్ణింపఁబడినది.

త్వష్టు స్సదాభ్యాస గృహీత శిల్ప
విజ్ఞాన సంపత్ప్రసరస్య సీమా ॥

- మాఘకావ్యము. 3.35

తతః సా నిర్మితా కాంతా పురీ ద్వారవతీ సదా ।
మానసేన ప్రయత్నేన వైష్ణవీ విశ్వకర్మణా ॥

- హరివంశే-విష్ణుపర్వే-ద్వారవతీ నివేశః ॥ శ్లో. 40

కావున శిల్పకళానైపుణికి బాహ్యాభ్యంతర ప్రయత్నములు రెండును ముఖ్యములే. కావ్యోత్పత్తికి వలె శక్తియు, లోకశాస్త్రకావ్యాద్యవేక్షణము వలనఁ గలుగు నిపుణతయు, శిల్పాచార్యుల యొద్ద శిక్షాభ్యాసములు — ఈ మూడును శిల్పసృష్టికి హేతువులు.

## శిల్పకళాసృష్టి

శిల్పకళాసృష్టికి మూలము చిత్తమే. చిత్తము నం దనేక చిత్రవిచిత్రము లయిన రూపములు పుట్టుచున్నవి. వాని నుండి తనకు నచ్చిన వానిని బహుజనామోద యోగ్యము లయిన వానిని ఎన్నుకొని శిల్పి నానావిధశిల్పములు, చిత్రములు రచించుచున్నాఁడు.

చిత్తము నం దుదయించు రూపమునకు మూల మేది ?

ఈ ప్రశ్నకు సమాధానము ఋగ్వేదము నందుఁ గలదు.

రూపం రూపం ప్రతిరూపో బభూవ
తదస్య రూపం ప్రతిచక్షణాయ ।
ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే
యుక్తా హ్యస్య హరయః శతా దశ ॥

- ఋగ్వేద. 6-47-18

* డా॥ కొండూరు వీరరాఘవాచార్యులు : శిల్పదర్శనము. పు. 49

రూపము లన్నింటికి మూలరూప మింద్రుఁడే. ఇంద్రుఁడు తన మాయ చేత బహురూపములను దాల్చుచున్నాఁడు. అట్టి వాని స్వరూపమునే మనము విశ్వమునం దంతటను జూచుచున్నాము. ఇట ఇంద్రుఁ డన సృష్టికర్త యగు పరమాత్ముఁడే. [1]

అతఁడే, ఆ యింద్రుఁడే యీ విశ్వమున కంతటికి ప్రతిరూపము. [2]

యో విశ్వస్య ప్రతిమానం బభూవ ||

- ఋగ్వేద. 2-12-9

వైదికవాఙ్మయము నందు ఇంద్రుఁడు చిత్తమునకు ప్రతీక. కావున మన చిత్తమే సమస్తరూపములకు నెలవు. అది పరమాత్మ స్వరూపమే.

గ్రీకు తత్త్వవేత్త యగు అరిస్టాటిలు "కళ ప్రకృతి ననుకరించు' నని చెప్పినాడు. Art imitates Nature. [3]

ప్రకృతి యనఁగా విశ్వము నందలి సృజనశక్తి యని వ్యాఖ్యాత వివరించినాడు. [4]

శిల్పకళాఖండములు తన్మూలశక్తికి కేవలానుసరణము గాదు. శిల్పి ప్రకృతిని ఉన్నదున్నట్లు గాక అది తన మనోనేత్రమునకు గోచరించి నట్లు చిత్రించును. [5]

1. Cf : A. C. Bose = The Call of the Vedas. PP. 181-82
   'For every form He has been the Model that form of His is the one to look on everywhere. Indra by His Maya (creative illusion) moves in many forms.' God is ONE, His glory multiplying in many forms.
2. Ibid :
   "He who is the Model of all this world."
3. Cf : S. H. Butcher : Aristotle's Theory of Poetry and Fine Art : 4-ed. Dover Publications Inc. P. 116.
4. Ibid :
   " ..... ..... for nature in Aristotle is not the outward world of created things; it is the creative force, the productive principles of the Universe'' – Butcher.
5. Ibid : P. 127.
   "A work of art reproduces its original not as it is in itself but as it appears to the Senses."

మానవునిలో సృజనాత్మకశక్తి సహజముగ నున్నది. కళాహృదయము గల మానవుఁడు ఈ సహజశక్తిని సద్వినియోగము చేసికొనును.

శిల్పములో చిత్రలేఖనములో సంగీతములో సాహిత్యములో సువర్ణదారుదంత శిలాది బహువిధసామగ్రిని వివిధ సంకేతములను ఉపయోగించి ప్రతిసృష్టి చేయుటకు కావలసిన సృజనశక్తి శిల్పకళాకారులలో అపరిమితముగా నున్నది. శిల్పసాహిత్యముల లోను, తదితర లలితకళల లోను దాని ప్రాచుర్య మింతింతని చెప్ప నలవి కాదు. *

## కావ్యశిల్ప కళానుబంధము

కావ్యములు శ్రవ్యము లని దృశ్యము లని రెండు విధములు. వీనిలో దృశ్య కావ్య మగు నాటకము రమ్యమైనది. "కావ్యేషు నాటకం రమ్యమ్."

కావ్యాంగముగ నుపయుక్తము గాని, శబ్దము గాని, యర్థము గాని, న్యాయము గాని, కళ గాని లేదని భామహుఁడు చెప్పినాఁడు.

> న శబ్దో న తద్వాచ్యం న స న్యాయో న సా కలా ।
> జాయతే య న్న కావ్యాంగ మహో భారో మహాన్ కవేః ॥
>
> \- కావ్యాలంకారః - 5-4

సప్తద్వీపముల యందలి భావముల కనుకరణమే నాట్య మనియు నాట్యము నందు గోచరము గాని జ్ఞానము గాని, శిల్పము గాని, విద్య గాని, కళ గాని, కర్మము గాని లే దనియు సర్వశాస్త్రములందలి విషయములు, సకలశిల్పములు, వివిధములైన కర్మలు నాట్యము నందుఁ గల వనియు భరతముని తెలిపినాఁడు.

> న తజ్జ్ఞానం న తచ్ఛిల్పం న సా విద్యా న సా కలా
> నాఽసౌ యోగో న తత్కర్మ నాట్యేఽస్మిన్ యన్న దృశ్యతే ॥

* Rabindranath Tagore : On Art and Aesthetics. P. 83.

"Making use of a great variety of symbols and of materials, wood, stone, gold, ivory in painting, in sculpture, in words and in music this urge to create has been so strong that it is difficult to measure the abundance it has provided in literature and art and other artistic disciplines.'"

సర్వశాస్త్రాణి శిల్పాని కర్మాణి వివిధాని చ
అస్మిన్ నాట్యే సమేతాని తస్మా దేతన్మయాకృతమ్॥
సప్తద్వీపానుకరణం నాట్య మేతద్భవిష్యతి। ....

- నాట్యశాస్త్రము I. 115-118.*

శిల్ప మనఁగా మాలాచిత్రపుస్తాదియోజన మనియు, గీతవాద్యాదికములు కళ లనియు వ్యాఖ్యాతలు వివరించినారు.[1]

దేవతల కోరికపై బ్రహ్మదేవుఁడు సర్వశాస్త్రము లందలి యర్థములతోఁ గూడి యుండునట్లును, సర్వశిల్పములకు ప్రవృత్తిహేతు వగు నట్లుగను, పంచమవేద మగు నాట్యశాస్త్రమును ఇతిహాసయుక్తముగా నిర్మింప సంకల్పించి నట్లు చెప్పఁబడినది.[2]

సర్వశాస్త్రార్థసంపన్నం సర్వశిల్ప ప్రవర్తకమ్।
నాట్యాఖ్యం పంచమం వేదం సేతిహాసం కరోమ్యహమ్ ॥

- నాట్యశాస్త్రము. 1-15.

నాట్యప్రదర్శమునకు శిల్పకళామండితము లయిన నాట్యమందిరములు కావలయును. శ్రవ్యకావ్యములు విని యానందించుటకు సభామండపములు కావలయును. ఈ విధముగా కావ్యములకు శిల్పములకు నవినాభావసంబంధము గలదు.

## శిల్పసాహిత్యములు: ఛందఃప్రస్తారము

ఛందఃప్రస్తార మనఁగా గురులఘువుల నొక క్రమములో నమర్చుట.

సాహిత్యములో పద్యవిద్య ఛందఃప్రధాన మయినది. గురులఘువుల నొకానొక నిర్దిష్టక్రమములో నిబద్ధించుట వలన పద్యము లేర్పడును. కావున పద్యరచనకు ఛందస్సు ముఖ్య మని లక్షణకర్తలు భావించుచున్నారు.

* Cf : 'The Natya Sastra' – ascribed to Bharata Muni.
ed. by. Manomohan Ghosh, M. A , Ph. D. Kavye Tirtha.
– Calcutta - 1967. ed.

1. చూడు : డా॥ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి - నాట్యశాస్త్రమ్-ఆంధ్రభారతీ - మొదటి సంపుటము.

2. - అదే -

సంగీతములో గీతరచనము ఛందోబద్ధమై యుండును. సంగీతమునకు తాళము ప్రధానము. తాళమునకు కాలము, మార్గము, క్రియ, అంగము, గ్రహము, జాతి, కళ, లయ, యతి, ప్రస్తారము అను నీ పదియు ప్రాణములు. [1]

శిల్ప [వాస్తు] శాస్త్రములో ఛంద స్సనగా నొకానొక రచనాక్రమము; కట్టడము; ఆ నిర్మాణము కనిపించుతీరు. సాహిత్య సంగీతశాస్త్రములలో వలె వాస్తు శాస్త్రము నందును ప్రధానమైన ఛందము లారు. ఇవియు గురులఘువుల సమ్మేళనము వలననే యేర్పడును. [2]

వాస్తుశాస్త్రము నందు భిత్తి గురువు; అళిందము లఘువు. భిత్త్యళిందముల [గురులఘువుల] ప్రస్తారము వలన వివిధ శాలాగృహము లేర్పడుచున్నవి.

ఏ క ద్వి త్రి చతుశ్శాలం గృహం ప్రస్తారతో భవేత్ ॥

- వాస్తుమండపము

కావున ఛందోబద్ధమైన కవిత్వము, సంగీతము, వాస్తువు సమానధర్మములు గలవి.

## సాహిత్యవిద్య - ఉపవిద్యలు

శబ్దార్థయో ర్యథావత్ సహభావేన విద్యా సాహిత్యవిద్యా
ఉపవిద్యాస్తు చతుష్షష్టిః తాశ్చ కలా ఇతి విదగ్ధవాదః।
స ఆజీవః కావ్యస్య

— రాజశేఖర : కావ్యమీమాంస.

1. చూడు : ఏకా సుబ్బారావు : సంగీత విద్యాదర్పణము-తాళప్రకరణము.
2. Cf : Popatbhai Ambasankar Mankad : Introduction to Aparajita Priccha of Bhuvana Deva. P. XV.

ఛందః = an arrangement, disposition

వాస్తు = a structure

ఛంద of వాస్తు means 'Disposition of Structure.'

'View of a Structure as presented by its contour against the sky,' - 'Perspective view.'

"These Chandas of Vastu are Primarily six in number, according to the rules of architecture as laid down by writers of the Northern School. In this respect, Sahitya Sangeeta and Vastu stand upon a common flatform, as they have, each six primary chandas as unitary basis 's

శబ్దార్థములు రెండును, పరస్పరానుకూలముగ కలసియుండు విద్య సాహిత్యవిద్య. ఉపవిద్యలు అరువది నాలుగు. వాటిని కళ లని విద్వాంసులు చెప్పుదురు. ఉపవిద్యలు కావ్యమునకు జీవనాధారములు

కావ్యహేతువు సం దొక భాగమయిన వ్యుత్పత్తి లోకశాస్త్రకావ్యాద్యవేక్షణము వలనఁ గలుగు నని మమ్మటుడు చెప్పినాఁడు.

శక్తి ర్నిపుణతా లోకశాస్త్ర కావ్యాద్యవేక్షణాత్ ।
కావ్యజ్ఞ శిక్షయాభ్యాస ఇతి హేతు స్తదుద్భవే ॥

- కావ్యప్రకాశిక. 1-3

ఇట శాస్త్రములలో శిల్ప (కళా) శాస్త్రమును గ్రహింపఁబడినది. "శాస్త్రాణాం ఛందోవ్యాకరణాభిధానకోశకలాచతుర్వర్గ గజతురగ ఖడ్గాదిలక్షణ గ్రంథానామ్." —అని వ్యాఖ్యాత

కావ్యరచనోద్యుక్తుఁ డగువాఁడు విద్యలను – ఉపవిద్యలను అభ్యసించిన పిమ్మట కావ్యరచనమునకు ప్రయత్నించవలెను. నామధాతుపారాయణము, శబ్దకోశము, ఛందః శాస్త్రము, అలంకారశాస్త్రము అనునవి కావ్యవిద్యలు. అనఁగా కావ్యరచనమున కుప యోగించు ప్రధానవిద్యలు, చతుష్షష్టికళలు ఉపవిద్యలు.

- రాజశేఖర కావ్యమీమాంస. 10-1

చతుష్షష్టికళలు కావ్యరచనమున కెట్లు తోడ్పడును ?

ఆలంబన విభావేషు భావానుద్దీపయంతి యే ।
చతుష్షష్టి కలా ద్వేధా కర్మాద్యై ర్గీతికాదిభిః ॥

- అగ్నిపురాణము. అ. 339-42,43

చతుష్షష్టికళలు ఆలంబనవిభావము లందు భావముల నుద్దీపింపఁ జేయును. అవి కర్మాదుల చేత గీతాదుల చేత రెండువిధములు.

చతుర్విధనాయకులలో నొకడయిన ధీరలలితుడును కళాపరుఁడని సాహితీపరుల కెల్లరకు విదితమే.

నిశ్చింతో మృదు రనిశం కలాపరో ధీరలలితః స్యాత్ ॥

- సాహిత్య దర్పణము

# దేవజనవిద్య

'ఋగ్వేదం భగవో ఽధ్యేమి యజుర్వేదం సామవేద మాథ ర్వణం చతుర్థ మితిహాసపురాణం పంచమం వేదానాం వేదం పిత్ర్యం రాశిం దైవం నిధిం వాకోవాక్య మేకాయనం దేవవిద్యాం బ్రహ్మ విద్యాం భూతవిద్యాం క్షత్రవిద్యాం నక్షత్రవిద్యా సర్ప దేవజన విద్యా మేతద్భగవో ఽధ్యేమి'

- ఛాందోగ్యోపనిషత్. 7-1-1-2

ఋగ్వేదము మొదలు దేవజనవిద్య పర్యంతము గల పదునెనిమిది విద్యలను నేర్చితి నని నారదుఁడు సనత్కుమారునితో చెప్పినాఁడు.

దేవజనవిద్య యనఁగా నేమి ?

దేవజనవిద్య యనఁగా గంధర్వవిద్య [సంగీత, నర్తనశాస్త్రము] అని వ్యాఖ్యా తలు వివరించినారు. 1

దేవజనవిద్య యన నృత్యగీతవాద్యవిద్య, శిల్పాదివిజ్ఞానము. 2

దేవజనవిద్య యన లలితకళలకు సంబంధించిన విద్య. 3

అగుచో దేవజను లనఁగా గంధర్వులు, శిల్పులు, కళాకారులు నని చెప్ప వలయును.

పదునెనిమిది విద్యలలో గాంధర్వవిద్య యొకటి యని భారతము గూడ చెప్పు చున్నది. 4

ప్రాచీనకాలమున నృత్యగీతవాద్యములు తదితర లలితకళలు వేదాదివిద్యలతో సమానప్రతిపత్తి గలిగియుండుట గమనింపఁదగినది.

1. చూడు : 1) వావిళ్ల రామస్వామిశాస్త్రులు : ద్వాదశోపనిషత్తులు. ఆంధ్రవచనము-పుట. 150.

   2) Cf: F. E. Keay : Indian Education P. 33
   "Devajana Vidya : The sciences of the genii such as the making of perfumes, dancing, singing, playing and other fine arts."

2. Dr. Radha Kumud Mookerji : Hindu Civilisation Part-I. P. 113.

   "Devajana Vidya = the arts affected by the lesser gods such as perfumery, dancing, singing, playing on musical instruments (vadya) and other fine arts and crafts (silpadi Vijnana.)

3. Dr. D. S. Sarma : The Upanishads - An Anthology. P. 172

 4. తిక్కన : భార. శాంతి. 8-119.

# లలితకళలు

లలితకళ లనఁగా మనోహర మైన కళలు. వీనినే మనోజ్ఞకళ లనియు నందురు.

పూర్వకాలమున స్త్రీ పురుష లిరువురును నీ లలితకళల నభ్యసించుచుండి నట్లు మహాకవి కాళిదాసు రచనల వల్లఁ దెలియుచున్నది.

అజుఁడు ఇందుమతిని గూర్చి విలపించుచు,

'ప్రియశిష్యా లలితే కలావిధౌ।'

- అనెను. [రఘు. 8-67]

"లలితే మనోహరే కలావిధౌ వాదిత్రాది చతుష్షష్టికలాప్రయోగే ప్రియశిష్యా. (వాద్యాది చతుష్షష్టికళ లందు- మనోహరకళాప్రయోగము నందు శిష్యురాలు) –అని మల్లినాథసూరి వ్యాఖ్యానించినాఁడు. [1]

కాని చతుష్షష్టికళ లన్నియు లలితములు కాఁజాలవు. వానిలో క్రియాలాలిత్యము గల కొన్ని మాత్రము లలితకళ లని చెప్పఁదగినవి.

శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగా రిట్లు వ్రాయుచున్నారు.

"లలితకళలను మాటను కవి సాభిప్రాయముగా వాడెను. లలితశబ్దమునకు మధుర మను అర్థమును వ్రాసి మల్లినాథుఁడు 64 కళల పట్టికను ఇచ్చెను. మానవ హృదయమునకు ఆపాతమాధుర్యము నిచ్చు సంగీత చిత్ర కవితా నాట్యములకే ఈ మాటను వాడుట సమంజస మనితోచును. ఏమనఁగా అజునకు ఇందుమతి శిష్యురాలైనది ఈ మధురకళల లోనే గాని కుట్టుట (సీవ్యం), దండకట్టుట (మాల్యవిధి) వంటి సామాన్యవిషయము లందు కాదు గదా" [2]

మహాకవి కాళిదాసు శిల్ప శబ్దమును గూడ లలితకళావిజ్ఞాన మను నర్థము నందు ప్రయోగించినాఁడు.

మాలవికాగ్నిమిత్రనాటకము నందలి యీ సంభాషణము గమనింపుడు.

విదూషకః : భోః న కేవలం రూపే శిల్పే ఽప్యద్వితీయా మాలవికా ।

[మాలవిక సౌందర్యము నందే కాదు, శిల్పము నందును అద్వితీయ]

---

1. కాళిదాసు : రఘువంశము-8-67_సంస్కృత హిందీ టీకా సహితము. పు. 80 - చౌఖాంబా సంస్కృత సీరీజ్-వారణాసి-1961 ప్రతి.
2. ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి : కాళిదాస కళామందిరము. పు. 222.

రాజా : అవ్యాజసుందరీం తాం విజ్ఞానేన లలితేన యోజయితా।
పరికల్పితో విధాత్రా బాణః కామస్య విషదిగ్ధః॥*
[సహజసౌందర్యవతి యైన ఆమెను లలితవిజ్ఞానముతో సంయోజనము చేసి విధాత కాముని యొక్క విషదిగ్ధమైన శరము నొనర్చినాఁడు.]

- మాలవికాగ్నిమిత్ర. 2-12-15

ఇట శిల్ప మన కళాచాతుర్య మనియు, లలితవిజ్ఞాన మనన్నృత్యాది లలితకళా నైపుణ్య మనియు వ్యాఖ్యాత వివరించినాఁడు. [1]

ఈ రెండు పదములను పర్యాయములుగా నుపయోగింపఁబడుటచే శిల్ప మన్నను లలితకళావిజ్ఞాన మన్నను ఒక్కటియే.

"శిల్ప మనఁగా నీతని (కాళిదాసు) దృష్టిలో చెక్కడపుపనియే గాక లలితకళ లన్నియు చేరును. "పాత్రవిశేషన్యస్తం గుణాంతరం వ్రజతి శిల్ప మాధాతుః" అను మాళవికలోని శిల్పశబ్దమును, "శిల్పకార్య ఉభయేన వేదితాః"– అను రఘు – 19 సర్గము నందలి వాక్యమును ఈ అభిప్రాయమును బలపరచును." [2]

వాస్తుశిల్పకళలు గూడ లలితకళలుగనే పరిగణింపఁబడుచున్నవి. వ్యక్తిగతాభిరుచిని బట్టి యొక్కొక్కనికి ఒక్కొక్క కళ యందు అభినివేశము కలుగుచుండును.

వేదము షడంగము. షడ్దర్శనము లున్నవి. అట్లే

1. సంగీతము 2. నాట్యము,నృత్యము 3. కావ్యము 4. వాస్తుకళ 5. శిల్పము 6. చిత్రలేఖనము —అను షట్కళలు ముఖ్యములు. [3]

* ఈ శ్లోకము మోచర్ల రామకృష్ణ కవిచే నిట్లను వదింపఁబడినది :
కం॥ ఆ వెలదికి నైసర్గిక లావణ్య నిధానమునకు లలితాకళా వి
ద్యావిభవము నొసగిన విధి కావించె విషాక్తశరము కాముని కరయన్.

1. శిల్ప : Skill in arts, లలితవిజ్ఞాన is the Skill in arts such as dancing. —R. D. Karamarkar

2. ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి : కాళిదాసుకళామందిరము. పు. 229

3. D. N. Sukla : Silpa Sastra – Hindu Achievements in Aeronautics and Fine Arts.

లలితకళలలోఁ సంగీతమే ఉన్నతమయినది. తక్కిన కళలు—చిత్రలేఖనము, శిల్పము, నాట్యము, వాస్తువు, కవిత్వము —ఏదో యొక విధముగా సంగీతస్థాయిని పొందును. [1]

ఈ షట్కళలలో కవిత్వసంగీతములను శ్రవ్యకళ లనియు, వాచికకళ లనియు నందురు. నాట్యము సమాహారకళ. ఈ మూటిని చరకళ లందురు. తక్కిన మూఁడును స్థిరకళలు.

వాస్తుకళ యన ప్రాసాదభవనాదినిర్మాణము (Architecture)

శిల్పకళ యన మృద్దారుశిలాలోహప్రతిమానిర్మాణక్రియ. (Sculpture)

చిత్రకళ యన చిత్రలేఖనము—ఆలేఖ్యము. (Painting)

ఈ మూడును దృశ్యకళలు. వీనిని కాయికకళ లనియు నందురు. (Manual arts) వాస్తు శిల్ప చిత్రలేఖనములు స్థాపత్యమున కంగములు. ఇంకను అనేకము లయిన కళలు స్థాపత్యము నం దంతర్భూతము లగుచున్నవి.

ఈ కళ లన్నియు శ్రవణనయనేంద్రియముల ద్వారమున మనసుల నలరించి మనోజ్ఞము లగుచున్నవి.

లలితకళల కానందమె పరమప్రయోజనము. కాని యవి మన కనేకవిధములుగా నుపయోగపడవచ్చును. తక్కిన కళల యందు ఆనందము కంటె నుపయోగిత్వము హెచ్చు. ఐనను వాని వలనను మన కానందము కలుగవచ్చును. [2]

—[సాహిత్య శిల్పసమీక్ష]

1. R. Srinivasan : Facets of Indian culture. P. 77
   "And of all arts music is considered to be the highest. All other arts - Painting, Sculpture, Drama, Architecture, Poetry - in some way tend to reach the condition of music."

2. Good Heart Rendell. (Quoted by P. Lakshmi Kantham Sahitya Silpa Sameeksha.)

# అష్టాదశ విద్యలు : అర్థ శాస్త్రము

వినుము, ఋగ్వేదాదివేదముల్ నాలుగుఁ
గల్పాదు లైన యంగంబు లాఱుఁ
బెరసి విద్యలు పది; పేర్చు పురాణము
లన్నియు నొకవిద్య; యధిప! ధర్మ
విదులు సెప్పెడు శాస్త్రవితతి యంతయు నొక
విద్య; సర్వన్యాయ విస్తరంబు
నొకటి, మీమాంస దా నొక్కటి యిట్టులు
వివరింపఁ బదునాల్గు విద్య లయ్యె,

వైద్య కోదండ గాంధర్వ విద్య లర్థ
శాస్త్ర మగు నీతివిద్య తత్సహితవృత్తి
వెలయఁగాఁ బదునెనిమిది విద్య లభవుఁ
డేర్పరించె జగత్త్రయహితము పొంటె.

- తిక్కన. భార. శాంతి. 3. 119

ఋగ్యజుస్సామాథర్వవేదములు నాలుగు, శిక్షాకల్పవ్యాకరణనిరుక్తఛందోజ్యోతిషములు షడంగములు, పురాణము లన్నియు నొకటి, శాస్త్రము లన్నియు నొకటి, న్యాయ మొకటి, మీమాంస యొకటి, ఇట్లు విద్యలు పదునాలుఁగు. వీనికి ఆయుర్వేదము, ధనుర్వేదము, గాంధర్వవేదము, అర్థశాస్త్రము నను నాలుఁ గుపవేదములను* కలుపఁగా అష్టాదశవిద్య లగును.

చతుర్దశ విద్యాస్థానములకు వార్తా, కామసూత్రము, శిల్పశాస్త్రము, దండనీతి —అనునాల్గింటిని చేర్పఁగా అష్టాదశవిద్య లగునని కొందఱిమతము.

"వార్తా, కామసూత్రం, శిల్పశాస్త్రం, దండనీతి రితిపూర్వైః
సహాష్టాదశ విద్యాస్థానాని." ఇత్యపరే.—

- రాజశేఖర కావ్యమీమాంస

అథర్వవేదోపవేదమయిన అర్థశాస్త్రమునందు రాజనీతిశాస్త్రము, శస్త్రాస్త్ర విద్యలు, విశ్వకర్మాదులచే రచింపఁబడిన శిల్పశాస్త్రము నంతర్భూతములై యున్నట్లు "చరణవ్యూహ" మను వైదికగ్రంథము నందుఁ జెప్పఁబడినది.

---

* ప్రక్క పేజీలో చూడుము.

అథర్వవేదస్యార్థశాస్త్రం నీతి శాస్త్రం శస్త్రశాస్త్రం
విశ్వకర్మాదిప్రణీత శిల్ప శాస్త్రమ్॥

- చరణవ్యూహ- చతుర్థఖండ. పు. 48

"అథర్వవేదోపవేద మయిన అర్థవేదమునకు "శిల్పశాస్త్ర"మనియు పేరు· విశ్వకర్మ త్వష్ట మయుఁడు దైవజ్ఞుఁడు మొదలుగా గల శిల్పాచార్యులు రచించిన సంహితాగ్రంథములున్నవి. వీని యందలి విమానతారాభూగర్భాది విద్యల నభ్యసించుట కారేండ్లుపట్టును." —అని దయానందసరస్వతి తెలిపినాఁడు. [1]

పూర్వము కృతయుగాదిని, విశ్వకర్మ శిల్పశాస్త్రమును ద్వాదశసహస్రగ్రంథముగా రచించినాఁడనియు, కలియుగము నందలి శిల్పపండితులు దానిని నాలుగువేల గ్రంథముగా సంక్షిప్తము చేసినారనియు భారద్వాజకృత మైన "అపరాజిత" గ్రంథము వలనఁ దెలియుచున్నది.

ఉపవేదార్థశాస్త్రం తు చాథరణస్య కథ్యతే।
అర్థశాస్త్రం తు విధివ చ్ఛిల్పశాస్త్రం తథైవ చ॥

*. ఉపవేద : 'Seccndary knowledge;' N. of a class of writing subordinate or appended to four Vedas. (viz. the Ayurveda or Science of medicine to the Rigveda, the Dhanurveda or Science of archery to the Yajurveda; the Gandha·vaveda or Science of music to the Samaveda; and Sastra-Sastra or Science of arms to the Atharv veda) This is according to the Charanavyuha, but Susr. and Bhpr. make the Ayurveda belong to Atharvaveda; according to others the Sthapatyaveda or Science of architecture and Silpa Sastra or knowledge of arts are reckoned· as the fourth Upaveda.

– Momier Williams : Sanscrit-English Dictionary

1. చూడు : దయానంద సరస్వతి సంస్కారవిధిః॥ పు. 101
"అథర్వవేద్ కా ఉపవేద అర్థవేద జిస్‌కో శిల్పశాస్త్ర కహ్‌తే హై జిస్‌మే విశ్వకర్మా త్వష్టా ఔర్ మయ కృత సంహితాగ్రంథహై। ఉస్‌కో 6 ఛః వర్షకే భీతర్ భీతర్ పఢ్‌కే విమాన తారా భూగర్భాది విద్యాఓం కో సాక్షాత్ కరే॥

శాస్త్రిద్వాదశసాహస్రం కృతాదౌ విశ్వకర్మణా।
తేషాం చతుస్సహస్రస్తు కలౌ చైవ ప్రవర్తతే॥

- అపరాజిత.*

విశ్వకర్మకృత మయిన 'అర్థవేదము' నందు దశవిధ శిల్పవిద్యావిషయములు చెప్పఁబడినవి.•

1. కృషిశాస్త్రము ; కర్షణోపయుక్తమగు లాంగలాదినిర్మాణము.
Agricultural Engineering.
2. జలశాస్త్రము : భూగర్భజల వినియోగపద్ధతులు.
Underground water resources
3. ఖనిశాస్త్రము : భూగర్భశాస్త్రము Mining.
4. నౌకాశాస్త్రము : జలయానోపయోగి నౌకానిర్మాణము.
Navigation
5. రథశాస్త్రము : దూరప్రయాణముల కుపయోగపడు రథ నిర్మాణము
Science of vehicles; Automobile Engineering
6. విమానశాస్త్రము : అంతరిక్షయాన నిర్మాణము Aeronautics
7. వాస్తుశాస్త్రము : గృహభవనప్రాసాదవాపీకూపతటాకాదినిర్మాణము
Architecture
8. ప్రాకారశాస్త్రము : నగరరక్షణార్థము దుర్గప్రాకారనిర్మాణాదికము
Construction of forts and compound walls.
9. నగరరచనాశాస్త్రము : సకలజననివాసయోగ్య స్థానములు, వీధులు, రాజవీధులు గల నగరములు రచించు ప్రణాళిక.
Town Planning
10. యంత్రశాస్త్రము : సకలవిధయంత్రనిర్మాణ పద్ధతులు
Mechanics-Science of Machinery

* చూడు : 1. నిరంజనశాస్త్రి : విశ్వకర్మబ్రాహ్మణవంశాగమము పు 131,132
2. శివజీ శర్మ : వ్యాసము : 'రాష్ట్రకే వైజ్ఞానికోం కా నామ్'.
- విశ్వశిల్పి. హిందీమాసపత్రిక_నవంబరు, డిసెంబరు 1978

• చూడు : 1 వఘే కృష్ణశర్మా కలానిధిః - కాశ్యపశిల్పోపోద్ఘాతము.
2. శివజీశర్మ : వ్యాసము. 'రాష్ట్రకే వైజ్ఞానికోం కే నామ్.'
. 'విశ్వశిల్పి' -మాసికపత్రిక-నవంబర్, డిసెంబర్ 1976

# స్థాపత్య వేదోత్పత్తి

ఋగ్యజుస్సామాథర్వాఖ్యాన్ వేదాన్ పూర్వాదిభిర్ముఖైః ।
శస్త్ర మజ్యాం స్తుతి స్తోమం ప్రాయశ్చిత్తం వ్యధాత్ క్రమాత్॥
ఆయుర్వేదం ధనుర్వేదం గాంధర్వం వేద మాత్మనః ।
స్థాపత్యం చాసృజద్ వేదం క్రమాత్ పూర్వాదిభి ర్ముఖైః॥

- వ్యాస. భాగ. స్కంధ. 3 - అ12- 37,38

బ్రహ్మదేవుని ఉపవేముఖము నం దుత్పన్న మయిన స్థాపత్యవేదము విశ్వకర్మ కృతమై విశ్వకర్మశాస్త్రముగా ప్రసిద్ధికెక్కినది. కావుననే పోతన మహాకవి శ్రీ మదాంధ్రభాగవతమునందు -

'ఆయుర్వేద ధనుర్వేద గాంధర్వవేదంబులను నుపవేదంబులును విశ్వకర్మశాస్త్రం బగు స్థాపత్యంబున బ్రాగాదిముఖంబుల నుత్పన్నంబు లయ్యె' -నని యనువదించినాఁడు. [1]

స్థాపత్యవేదమునకు శిల్పవేద మనియు పేరు. అది అథర్వణవేదమున కుపవేదము కావున శిల్పుల కెల్లరకు ఆధర్వణు లని పేరు.

అథర్వణస్యోపవేదః శిల్ప వేద ప్రకీర్తితః।
తస్మా దాథర్వణాః ప్రోక్తాః సర్వే శిల్పిన ఏవ చ॥

- శైవాగమము. [2]

స్థాపత్యవేద మనఁగా వాస్తుశాస్త్ర మనియు, శిల్పశాస్త్ర మనఁగా తక్కిన శిల్పకళలకు సంబంధించినశాస్త్ర మనియు, నీ రెండును కలిసి యొకటిగా అథర్వణ వేదమున కుపవేదముగా భావింపఁబడుచున్న దనియు కొందఱి అభిప్రాయము. [3]

1. పోతన : శ్రీమదాంధ్రభాగవతము. స్కంధ- 3. అ 32- 388
2. చూడు . హరికృష్ణశాస్త్రి : బ్రాహ్మణోత్పత్తిమార్తాండ -పాంచాలబ్రాహ్మణోత్పత్తి ప్రకరణమ్. (లింగేశైవాగమే) అ. 51. శ్లో. 37.
3. Cf : Momier Williams : Sanscrit-English Dictionary.
   " .... according to others the Sthapatya Veda or Science of architecture and Silpa Sastra or knowledge of arts are reckoned as the fourth Upaveda."

ప్రాసాదభవనాదుల నిర్మాణపద్ధతులను దెలుపునది వాస్తుశాస్త్రమని మత్స్యపురాణము పేర్కొనఁగా, దేవరాజ ప్రాసాదములు గృహములే కాక ప్రతిమలు, వాపీకూపతటాకనిర్మాణ ప్రతిష్ఠావిధులు తెలుపునది శిల్పశాస్త్రమని శుక్రాచార్యుఁడు తెలిపినాఁడు.

ప్రాసాదభవనాదీనాం నివేశం విస్తరా ద్వద।
కుర్యా త్కేన విధానేన కశ్చ ద్వాస్తు రుదాహృతః॥

- మత్స్యపురాణము-అ. 256. 39

ప్రాసాదప్రతిమారామగృహవాప్యాది సత్కృతిః।
కథితా యత్ర త చ్ఛిల్పశాస్త్ర ముక్తం మహర్షిభిః॥

- శుక్రనీతి : 4-3-58

నానావిధములయిన వస్తువులకు, యంత్రములకు, వ్యూహరచనములకు, సువర్ణాది ధాతువులచే నిర్మింపఁబడిన వస్తుజాలమునకు గృహభవనాదివాస్తువులకు శిల్పము అని పేరని భృగుమహర్షి చెప్పినాఁడు.

నానావిధానాం వస్తూనాం యంత్రాణాం కల్పసంపదామ్।
ధాతూనాం సాధనానాం చ వాస్తూనాం శిల్ప సంజ్ఞితమ్॥

- భృగుసంహిత*

శిల్పశాస్త్ర మనగా మూర్తినిర్మాణకళాశాస్త్రమే యైనను, దాని యందు గృహనిర్మాణపద్ధతులు కూడ చెప్పఁబడి యున్నవి కనుక దానిని వాస్తువిద్య యనియు వాస్తుశాస్త్రమనియు నందురు. [1]

మహాభారతము నందు 'వాస్తువిద్య' అనియే చెప్పఁబడినది.

* చూడు : డా॥ శ్రీధర్ భాస్కర్ వర్ణకర్ = భారతీయవిద్యా. పు. 28

1. A. A. Mac Donell : India's Past. P. 117. ed-1956.
"The term Silpa Sastra, though strictly speaking the lore of plastic art, is especially applied to architecture which is also called Vastu-Vidya, a science of building."

# వాస్తుశిల్పము

దేవతానాం నరాణాం చ గజగోవాజినా మపి।
నివాసభూమిః శిల్పజ్ఞై ర్వాస్తు సంజ్ఞ మితీరితే॥

- విశ్వకర్మవాస్తు శాస్త్రమ్-7-1*

దేవతలు, మనుష్యులు, గోవులు, గజములు, నశ్వములు మున్నగు జంతువులు నివసించుభూమిని శిల్పపండితులు వాస్తువనుచున్నారు.

వస నివాసే అను ధాతువు నుండి వాస్తు శబ్ద ముత్పన్నమైనది.

నివాసస్థానము నర్థమున వాస్తు శబ్దము ఋగ్వేదము నందును ప్రయోగింపఁ బడినది.

తాం వాం వాస్తూ న్యుశ్మసి గమధ్యై॥

- ఋగ్వేద. 1-156-6

వాస్తువనే వస్తువనియు నందురు. మయుఁడు, మానసార మునియు వస్తువనియే చెప్పినారు.

అమర్త్యాశ్చైవ మర్త్యాశ్చ యత్ర యత్ర వసంతి హి।
త ద్వస్త్వితి మతం తద్జ్ఞైః .... ....॥

- మయమతము

[దేవతలు మనుష్యులు నివసించు స్థలమును వస్తువనుచున్నారు.]

త్రైతిలాశ్చ నరాశ్చైవ యస్మిన్ యస్మిన్ పరిస్థితాః।
త ద్వస్తు సూరిభిః ప్రోక్తం .... ....॥

- మానసారము

వస్తు వనఁగా నివాసయోగ్య మగు భూమి. వస్తు సంబంధమగు శుభాశుభములను శాసించునది వాస్తు శాస్త్రము.

'వస్తుసంబంధి శుభాశుభం శాసయతీతి వాస్తుశాస్త్రమ్.'

* Viswakarma Vastu Sastram. ed. by K. Vasudeva Sastri and Major N. B. Gadre. 1958. T. N. S. S. N. Library — Tanjore.

పంచభూతములలో నాదిభూతమును జగత్స్థితి కాధారభూతమునయి నట్టిది కావున భూమియే ముఖ్యవస్తువు. ఆ భూమిపై పుట్టినట్టి వస్తుసంశ్రయము వలన దానిపై నిర్మింపఁబడిన ప్రాసాదాదులు వాస్తువులు. వాని విషయమైన గుణదోషాదులను శాసించునది వాస్తుశాస్త్రము.

భూతానా మాదిభూతత్వా దాధార జ్జగతః స్థితేః।
భూరేవ ముఖ్యవస్తుస్స్యాత్ తత్ర జాతాని యాని హి॥

ప్రాసాదాదీని వాస్తూని వస్తుత్వాద్ వస్తుసంశ్రయాత్।
వస్తూన్యేవ హి తాన్యేవ ప్రోక్తా న్యస్మిన్ పురాతనైః॥

- మయమతము. *

ప్రతిమానవునకు నివాసయోగ్య మగు గృహ మవసరము. స్వగృహము లేనిచో గృహస్థాశ్రమధర్మము లయిన క్రియాకలాపము లెవ్వియును సిద్ధింపవు. పర గృహము లందు నిర్వర్తింపఁబడు శ్రౌతస్మార్తాది శుభకర్మము లన్నియు నిష్ఫలము లగును. ఏల యన తత్ఫలము లా గృహయజమానుని పొందును,

గృహస్థస్య క్రియా స్సర్వా న సిద్ధ్యన్తి గృహం వినా।
యత స్తస్మా ద్గృహారంభప్రవేశ సమయం బ్రువే॥

- మత్స్యపురాణము

పరగేహకృతా స్సర్వాః శ్రౌతస్మార్త క్రియా శ్శుభాః।
నిష్ఫలా స్స్యు ర్యత స్తాసాం భూమీశః ఫల మశ్నుతే॥

- భవిష్యోత్తరపురాణము **

గృహము నం దుండునది గృహయజమానుఁ డొకడే కాదు. కుటుంబసభ్యు లెల్లరు నుందురు. అందరు నాయురారోగ్యైశ్వర్యములతో నుండవలెను. కావున గృహస్థుఁ డగువాఁడు వాస్తుశాస్త్రానుసారము గ్రామక్షేత్రార్వణములు చూచికొని, భూమిపరీక్ష చేసికొని, శుభప్రద మయిన దినమున, శుభముహూర్తమున ప్రారంభించి గృహనిర్మాణము చేసికొనవలయును.

ఈ వాస్తువు (నివాసయోగ్యమయిన నిర్మాణము,) నిరలంకృతమైనచో శిల్ప మనియు, నది సాలంకృతమై మనోజ్ఞమయినచో కళ యనియుఁ జెప్పనొప్పును.

* చూడు : దోగుపర్తి స్వామిగుప్త సిద్ధాంతి : గుప్తవాస్తు

** చూడు : వాస్తురత్నాకరః భూపరిగ్రహప్రకరణమ్. 1-7,8.

# వాస్తుకళ - నాగరికత

వాత్స్యాయనుఁడు చెప్పిన చతుష్షష్టికళలలో 37 వది వాస్తువిద్య. దీనినే శుక్రాచార్యుఁడు, "తడాగవాపీప్రాసాదసమభూమిక్రియా కలా' యని చెప్పినాఁడు.

వస్తుసముదాయమును సాలంకృతముగా సక్రమముగా నమర్చి యాకృతి కందమును ప్రయోజకత్వమును సిద్ధింపఁ జేసి, దాని దర్శనీయత నధికముచేయు గృహ నిర్మాణకళకే "వాస్తుకళ" యని పేరు.[1]

భారతదేశములో వాస్తుకళ ప్రధానశిల్పము. తక్కిన కళలన్నియు నించుమించుగ తదనుబంధములుగ అభివృద్ధి చెందినవి.[2]

వాస్తుకళ నాగరికతకు మూల మని లెథబి మహాశయుఁడు వచించినాఁడు. "చారిత్రకముగా చూచినచో వాస్తుకళ తరతరాలుగ పరిణామము చెందుచున్న మానవుని బుద్ధివికాసమునకు మూర్తిమంతమై దృగ్గోచరమగుచున్న ప్రమాణము' —అను నిర్వచనమును గూడ దానికిఁ జేర్ప వచ్చు నని పెర్సీ బ్రౌను వ్రాసినాఁడు.[3]

అధునాతన కళావిమర్శకు లీ యభిప్రాయముతో నేకీభవించుచున్నారు.

"స్థాపత్యము లేక వాస్తుకళ సకలకళలకు తల్లి వంటి దని చెప్పుట సమంజసము గనే యున్నది. ఏలన,యన పెక్కు కళలు దాని నుండి యుద్భవించుచున్నవి లేదా దాని కనుబంధములుగ నున్నవి."[4]

1. Architecture = the art of building to secure beauty and utility by arranging plan masses and embellishments of a structure to enhance its appearance. — Encyclopaedia Britanica-Vol II. P. 276

2. "Architecture is the dominent art in India and almost all other modes of art have been developed as accessaries to it." — Encyclopaedia of Religion and Etheics. — ed. James Hasting. Vol I. P. 740.

3. "Lethebe has stated that 'Architecture is the matrix of civilisation." To such a definition it may be added that viewed historically architecture remains as the principal, visible and material record through the ages of man's intellectual evolution." — Percy Brown–Indian Architecture (Buddhist and Hindu periods) – Ch. I. P-l

4. "Architecture has been called and Justly so the mother of the arts, for most of the arts spring from or related to it." — ART TODAY -ed, Faulker Ziegfeld & Hill, P. 523.

"భారతీయ స్థపతి వాస్తువిద్యను యాంత్రికవిద్యగా కాక లలితకళగనో స్వచ్ఛంద కళగనో గుర్తించాడు' —అని పెర్సీ బ్రౌన్ వ్రాసినాడు.[1]

మొహంజొదారో – హరప్పా త్రవ్వకములలో బయల్పడిన కట్టడములను చూచినచో వేదకాలమునకు ముందే భారతదేశములో వాస్తుకళ అభివృద్ధి చెంది నట్లు తెలియును. కాని మొహంజొదారో వాస్తుశిల్పముఅనలంకృతముగను, ఉపయోగకారిగను, రమ్యత కంటె దార్ఢ్యము గలదిగను గన్పట్టుచున్నది.[2]

సింధులోయలో బయల్పడిన కట్టడములలో సామాన్యగృహములు, విశాల భవనములు, సర్వజనోపయోగి స్నానకుండములు ముఖ్యములు. స్తూపమునకు సమీప మందున్న దృఢతర మగు గోడలు గల బృహన్నిర్మాణమును విద్యాభవన మని చెప్పు చున్నారు. బహుశః ఆ భవనము నం దెవరేని ఉన్నతోద్యోగి కాని, పురోహితుఁడు కాని యుండియుండవచ్చును. లేదా అది బ్రాహ్మణావసథమై యుండవచ్చును.[3]

ఈ కట్టడములకు బాగుగా కాల్పఁబడిన ఇటిక లుపయోగింపఁబడినవి. కొన్ని కొండ ప్రాంతములలో రా ళ్లుపయోగింపఁబడినవి. పై కప్పునకు కొయ్య గూడ నుపయోగింపఁబడినది.

వైదికయుగము నందు భారతదేశము నందు వివిధప్రాంతములలో దారునిర్మిత పట్టణములు వెలయఁజొచ్చినవి. క్రీ. పూ ఐదవ శతాబ్దములో ఉత్తరభారతమున పెక్కు పట్టణములకు నగరరచనాప్రణాళికలను తయారుచేసినవాఁడుమహాగోవిందస్థపతిసత్తముఁ డని బౌద్ధసిద్ధాంత వ్యాఖ్యాత యగు ధర్మపాలుని రచనల వలనఁ దెలియుచున్నది.

1. Percy Brown : Indian Architecture. P. 79
   "The Indian builder knew architecture as fine art or a liberal art but not a mechanical art."
2. A. D. Pusalkar : "The Indus Valley Civilization" -
   — The Vedic Age – P. 170
   "The architecture of Mohenjodaro in general is plain and utilitarian rather solid than beautiful."
3. Ibid. Page. 172.
   "The great structure near the Stupa, with extra thick outer walls has been called the collegiate building and probably housed some high official, the high priest or college of priests,"

"Cities largely of wooden construction, therefore, began to appear in various parts of the country, and according to Dhammapala, the great Buddhist commentator, they were planned by an architect of the name of Maha Govinda who is stated to have been responsible for the lay out of several of the capitals of northern India in the fifth century B.C."[1]

## తక్షణము : దారుశిల్పము

వాత్స్యాయనుఁడు చెప్పిన చతుష్షష్టి కళలలో తక్షణ మొకటి. 'తక్షణ మితి వర్ధకి కర్మ శయనాసనాద్యర్థమ్" – అను జయమంగళవ్యాఖ్య అనఁగా శయనాసనాదులు నిర్మించుటకు తక్షకుఁడు చేయు కొయ్యపని.

తక్షణము [దారుశిల్పము] భారతదేశము నం దతిప్రాచీనకాలము నుండియు నున్నది.

ఋగ్వేదము నందు 'తక్ష' ధాతువు బహుధా ప్రయోగింపఁబడినది.

అట్లే తక్ష, తష్ట, త్వష్ట యను శబ్దము లున్నవి. ఇవి యన్నియు దారుశిల్పిని సూచించు పదములు.

'తక్షారిష్టం'

– ఋగ్వేద 9–112-1

వైదికయుగమునందు జనులు తినుటకు త్రాగుటకు నుపయోగింపఁబడు పాత్రలను కొయ్యతోఁ జేసికొనెడివారు. దారునిర్మితము లయిన గృహములలో నివసించెడి వారు.[2]

యజ్ఞోపకరణములగు, 'స్రువము, చమసము, ఇధ్మము, ఉపమద్దిని –అను నీ పాత్రములను మేడిమ్రానితోఁ జేయవలయుఁ' -నని బృహదారణ్యకోపనిషత్తు చెప్పుచున్నది.[3]

1. Percy Brown : Indian Architecture (Buddhist and Hindu Periods (P. 4
2. V. S. Apte : 'Social and Economic Conditions' in The Vedic Age P. 399.
   "Houses were of wood, the beams (vamsi) being made of bamboo (also vamsi). The Socalled strong-holds or forts probably had a series of concentric cells."
3. బృహదారణ్యకోపనిషత్తు- షష్ఠాధ్యాయము - తృతీయబ్రాహ్మణము - 13
   (చూడు : ద్వాదశోపనిషత్తులు - పు. 256. వావిళ్ల ప్రతి. 1950.)

యజ్ఞములో యూపములు చేయువారు తక్షకులే.

చషాలం యే అశ్వా యూపాయ తక్షతి॥

- ఋగ్వేద. 1-162-6 శుక్లయజుర్వేద. 25-29;కృ. య. 4-68

వేదమంత్రములందు తక్షణముతోడను రథశిల్పము తోడను జెప్పఁబడిన రూపకోపమానములను బట్టి యా కాలమున తక్షణ మభివృద్ధిఁ జెంది దారుశిల్పము గౌరవప్రదమయిన వృత్తిగా నున్నట్లు తెలియుచున్నది.

ప్రయాణసాధనములుగను వ్యవసాయమునందును ఉపయోగింపఁబడు శకటములు రథధావనక్రియ యందును, యుద్ధరంగము నందును నుపయోగింపఁబడు రథములు నిర్మించువాఁడు తక్షకుఁడే.

దారువుతో ననేకశిల్పములు చేయు తక్షకుఁడే సూత్రధారియు, రథకారుఁడును. క్రియాలాలిత్యముతోఁ గూడిన చెక్కడపుపనియు నతని సొత్తే.[1]

ఈ విధముగా శకటములు రథశిల్పములు చేయు తక్షకుఁడు—దారుశిల్పి— వైదిక సమాజము నందు శిల్పులలో నగ్రగణ్యుఁడుగా పరిగణింపఁబడినాడు.[2]

వేదకాలమున రథనిర్మాణ మొక ప్రత్యేకకళ. అది రథకారుని మేధాశక్తికి నిదర్శనము.

రథనిర్మాణమునకు హస్తనైపుణ్యమే కాకబుద్ధి చాతుర్యము నవసరము. రథకారుఁ డట్టి ధీశక్తి శిల్పకౌశలము గల ధీరుఁడు.

1. V. M. Apte: "Social and Economic conditions" in The Vedic Age P. 397.
"It appears from the larger number of similies and metaphors drawn from the art of fashioning chariots for war and race and carts for agriculture and transport that carpentary was an honoured profession, the carpenter being also a wheelwright and joiner. He did all sorts of work in wood and even carved work of finest type was not beyond his skill."

2. Dr. Radha Kumud Mookerji: Hindu Civilization Part I P. 76
"The carpenter, Takshan (R. V. ix-112-1) was foremost making the chariot, ratha, for war or sport, as also the draft wagon an as [R V. iii-39-9] which had sometimes a covering chadis [X-85-10].

ఏతం తే సోమం తువిజాతా విప్రో
రథం న ధీరః స్వపా అతక్షమ్॥

- ఋగ్వేద. 5-2. 11*

మహాభారతము నందు దారుశిల్పవర్ణనము లెక్కువగా నున్నది.

# యంత్రశిల్పము

వాత్స్యాయన కామసూత్రము లందు పేర్కొనఁబడిన చతుష్షష్టికళలలో 50 వ కళ "యంత్రమాతృక."

దీనికి జయమంగళ వ్యాఖ్య యిట్లున్నది.

'యంత్రమాతృకేతి- సజీవానాం నిర్జీవానాం యంత్రాణాం యానోదకసంగ్రామార్థం ఘటనాశాస్త్రం విశ్వకర్మప్రోక్తమ్.'**

యంత్రమాతృక సజీవ మని నిర్జీవమని ద్వివిధము. ఈయంత్రములు ప్రయాణము లందు జలక్రీడ లందు యుద్ధము లందు మూడు విధములుగా నుపయోగపడును. ఇట్టి యంత్ర నిర్మాణశాస్త్రము విశ్వకర్మ ప్రోక్తము.

సజీవ మన మనుష్యప్రవర్తకమును నిర్జీవ మన స్వయంప్రవర్తకమును కావచ్చునని డా॥ వి. రాఘవన్ వివరించినాఁడు. [1]

---

* R. V. V-2-11. "As a skilful steady fellow constructs a chariot."

** చూడు : వాత్స్యాయన కామసూత్రమ్-జయమంగళవ్యాఖ్య - పుట. 35.

1. Cf : Dr. V. Raghavan : Yantras or Mechanical Constrivances in Ancient India. P. 9.

'The valuable gloss Jayamangala on the Kamasutras explains Yantra Matrika as the Science of making different kinds of Yantras and in this connection refers to the treatise of the architect Viswakarman where they are dealt with. The Jayamangala informs us also that these mechanical contrivances were of two kinds Sajiva and Nirjiva, meaning perhaps those requesting constantly a human agent for operating them and automata not requiring such an agent and that these Yantras served three main purposes - Yana, Udaka and Samgrama, that is, as vehicles, as aids to water sports and as military equipment."

నీరు, గాలి, నిప్పు —వీని సంయోగముతో గాని, నిరోధముతోఁ గాని చేయఁబడు చమత్కారక్రియ కళ యని శుక్రాచార్యుఁడు తెలిపినాఁడు.

'జలవాయ్వగ్నిసంయోగనిరోధైశ్చ క్రియా కలా.'

- శుక్రనీతి. 4-86,

శుక్రాచార్యుఁడు చెప్పిన చతుష్షష్టికళలలో నిది 35 వ కళ.

భారతదేశములో యంత్రశిల్పము వేదకాలము నుండియు నున్నట్లు పండితు లూహించుచున్నారు.

తక్షన్ నాసత్యాభ్యాం పరిజ్మానం సుఖం రథమ్।
తక్షన్ ధేనుం సబర్దుఘామ్॥

- ఋగ్వేద. 1-20-3

[ఋభువులు అశ్వనీకుమారుల నిరంతరప్రయాణమునకు సుఖకర మయిన రథము చేసిరి. ఎల్లప్పుడు పాలిచ్చు ధేనువును చేసిరి.]

తక్ష ధాతువునకు కొయ్య మొదలగు వానిని చెక్కుట యని యర్థము. ఇట రెండుకార్యములకు "తక్షన్" అని చెప్పుట చేత దారువును చెక్కి రథమును చేసినట్లే ధేనువును గూడఁ జేసి యుండవచ్చు నను అభిప్రాయము కలుగుచున్నది.

'కాశ్యపశిల్ప' మను శిల్పశాస్త్రగ్రంథమున కుపోద్ఘాతమువ్రాసిన వఝే కృష్ణశర్మ కలానిధి పై మంత్రము నందలి 'సబర్దుఘామ్' అను పదమునకు బదులు 'కామదుఘామ్' అను పాఠాంతరమును గ్రహించి శిల్పశాస్త్రజ్ఞులయిన ఋభువులు కోరిన కోర్కెల నిచ్చు కామధేను వను మహాయంత్రమును నిర్మించి నారనియు, తక్ష ధాతు ప్రయోగము వలన దాని కృత్రిమత్వము స్పష్ట మగు చున్న దనియు విశదీకరించుచు నీ మంత్రమును యంత్రశాస్త్రమున కుదాహరణముగా నొసగినాఁడు.[1]

శస్త్రాస్త్రములును యంత్రకళా సంబంధములే.

1. వఝే కృష్ణశర్మ కలానిధి : కాశ్యపశిల్పమ్ - ఉపోద్ఘాతము పు. 6
ఆనందాశ్రమ ముద్రాలయ.

"శిల్పజ్ఞా ఋభవోఽభీష్టం దత్త స్నేహయుతాం సబర్ఘాం ధేనుం నిర్మముః అనేన కామధేను నామ్నా ప్రసిద్ధం కించి న్మహాయంత్రం భవతీతి తర్కయామి విశేషతః తక్షధాతోః ప్రయోగాత్ కృత్రిమత్వం లక్ష్యతే."

త్వష్ట యింద్రునికి వజ్రాయుధమును నిర్మించి యిచ్చినట్లు ఋగ్వేదము నందు వర్ణింపఁబడినది.

త్వష్టాస్మై వజ్రం స్వర్యం తతక్ష।

— ఋగ్వేద 1-32-2

మహిషాసురమర్దని యగు జగన్మాతకు విశ్వకర్మ గండ్రగొడ్డలిని, అనేక రూపములు గల అస్త్రములను, అభేద్య మగు కవచమును చేసి యిచ్చినట్లు మార్కండేయ పురాణము చెప్పుచున్నది.

విశ్వకర్మా దదౌ తస్యై పరశుం చాతినిర్మలం।
అస్త్రాణ్యనేకరూపాణి తథా ఽభేద్యం చ దంశనం॥*

ఆపత్కాల మందు రాజును అంతఃపురస్త్రీలును శత్రువులకుఁ జిక్కకుండ తప్పించుకొని పాఱిపోవుటకు వీలుగా, రాజ్యాధిపతులు నిర్మించి కొనఁదగిన "మోహనగృహ" లక్షణము నొక దానిని కౌటిల్యుఁ డర్థశాస్త్రములోఁ జెప్పినాఁడు.

"శ్రేయఃకామి యగు రాజు వాస్తుశాస్త్రరీత్యా ప్రశస్తమైన ప్రదేశమునందు ప్రాకారపరిఘాద్వారసముపేతమై అనేకకక్ష్యలు గలిగి కోశాగారమును బోలు అంతఃపురము నిర్మించుకొనవలెను. లేదా గోడల యందు రహస్యమార్గములు గల మోహనగృహము మధ్య గాని చైత్యములు దేవతావిగ్రహములు చెక్కఁబడిన ద్వారబంధములు గలిగి సురంగమార్గములు గల భూగర్భగృహమును గాని, గోడల మధ్యలో రహస్యముగా నమర్పఁబడిన సోపానములతో రాకపోకలకు వీలుగా సుషిరస్తంభములు గలిగి యంత్రబద్ధమై అవసరమయినప్పుడు కూలద్రోయుటకు వీలుగా నుండు ప్రాసాదమును గాని తన నివాస గృహముగా నిర్మించికొనవలయును." 1

పుష్పకాదివిమానములు యంత్రసంబంధు లనుటలో సందేహము లేదు.

రామాయణమహాభారతముల యం దిట్టి యంత్రశిల్పవిశేషము లున్నవి.

---

* మార్కండేయపురాణే సావర్ణికే మన్వంతరే దేవీమాహాత్మ్యే మహిషాసురవధో నామ ద్వితీయోఽధ్యాయః శ్లో॥ 27,28

1. కౌటిల్య : అర్థశాస్త్రం- అధికరణ. 1 -అధ్యాయం 20- నిశాంతగృహప్రణిధి-పు.౭౯

# యజ్ఞశిల్పము

యస్యాం వేదిం పరిగృహ్ణంతి భూమ్యాం।
యస్యాం యజ్ఞం తన్వతే విశ్వకర్మాణః।*
సా నో భూమి ర్వర్ధయత్ వర్ధమానాః॥

- అథర్వణ-12-1-13

సకలశిల్పక్రియాదక్షులయిన విశ్వకర్మలు ఏ భూమి పై యజ్ఞవేదికను -హవన కుండమును- పరిష్కృత మొనరించుచున్నారో (సుందరముగా నిర్మించుచున్నారో), ఏ వేది యందు అగ్నికార్యమును చేయుచున్నారో, ఆ విధముగా వృద్ధిపొందు నా భూమి మమ్మెల్లరను వృద్ధి పొందించు గాక!**

యజ్ఞశిల్పములో ముఖ్యమయినది యజ్ఞవేది. యజ్ఞవేదికలు నిర్మించువారు శిల్పిబ్రాహ్మణులు.

యజ్ఞవేదికలు త్రికోణాకృతిగను, చతుష్కోణములు గలదిగను, రథచక్రాకృతిగను, పక్ష్యాకృతిగను నిర్మింపఁబడుచుండెడివి.

వివిధాకృతులు గల యజ్ఞవేదికలు నిర్మించుట వలన రేఖాగణితము తెలియుచున్నది. వేదిక పరిమాణమును బట్టి నిర్దిష్టమయిన కొలతలు గల యిటికలు ఎన్ని కావలయునో తెలిసికొనవలసియుండును. కావున గణితవిద్యయు తెలియనగును. [1]

వివిధాగ్నివేదికలు నిర్మించు పద్ధతులు, ముఖ్యముగా 10,800 ఇటికలతో రెక్కలు పఱచిన శ్యేనము వలె ఉత్తరవేదిని నిర్మించు అగ్నిచయన విధానము శుక్ల యజుర్వేదము నందు చెప్పఁబడినది. [2]

* విశ్వకర్మాణః = విశ్వకర్మా సప్కామొంకేవతుప్ లోగ్

** చూడు : శ్రీ స్వామి రామేశ్వరానంద జీ ఆచార్య "శిల్పిబ్రాహ్మణ"-పు. 54

1. చూడు : దయానంద : ఋగ్వేదభాష్యభూమికా

2. చూడు : శుక్ల యజుర్వేదము- వాజసనేయసంహితా. 11-18 కాండలు
Cf : Griffith : White Yajurveda. P. 87

ఇట్టి యజ్ఞవేదికలను నిర్మించుటలో వైదికశిల్పుల వాస్తుకళా కౌశలము గనిపించు చున్న దని డా॥ రాధాకుముద్ ముఖర్జీ వ్రాసినాడు.*

వైదికయుగమున యజ్ఞనిర్వహణము నందు శిల్పిబ్రాహ్మణులు ప్రధానపాత్ర వహించుచుండిరి.

దశరథుడు హయమేధము నొనరింప సంకల్పించినపుడు, వశిష్ఠమహర్షి యాజకులను, స్థాపత్యవేదప్రవీణు లయిన శిల్పిబ్రాహ్మణులను తదితరకర్మకరులను యజ్ఞోపయోగి సాధనసంపత్తిని సమకూర్పు డని చెప్పినట్లు వాల్మీకి రామాయణము నందు వర్ణింపబడినది.

తతో ఽబ్రవీద్ ద్విజాన్ వృద్ధాన్ యజ్ఞకర్మ సునిష్ఠితాన్।
స్థాపత్యే నిష్ఠితాంశ్చైవ వృద్ధాన్ పరమధార్మికాన్॥

- వా. రా. బాల. కాం. 13-5

ఇట స్థాపత్య మనగా స్థపతి యొక్క కర్మ- రథకారుని కర్మ అనియు, యాగ విషయిక శిల్పకర్మ మనియు వ్యాఖ్యాతలు వివరించినారు.

1. స్థాపత్యం స్థపతే రథకారస్య కర్మ తత్ర నిష్ఠితాః ప్రవీణాన్॥

— తిలకవ్యాఖ్య

2. స్థాపత్యే యాగవిషయిక శిల్పకర్మణి నిష్ఠితాః॥

— శిరోమణివ్యాఖ్య

ఈ శ్లోకమున కాంగ్లానువాద మిట్లున్నది.

"The sage Vasistha then spoke to elderly Brahmins well-versed in ritual acts as well as to elderly and most pious Brahmins skilled in architecture (relating to sacrifices) .... [1]

"experienced car-makers and highly pious and aged people."[2]

---

* 1. Dr. Radha Kumud Mookerji : Glimpses of India
"The Vajasaneya Samhita (XI-XVIII) refers to an alfar made of 10,800 bricks and shaped like a bird with out-spread wings, with some amount of architectural skill."

2. Dr. Radha Kumud Mookerji : Hindu Civilization - Part. 47
"Architectural skill is indicated in the construction of the Fire-alfar with 10,800 bricks and shaped like a large bird with outspread wings.

1. Cf : Srimad Valmiki Ramayana with Sanscrit Text and English Translation. Part I Page. 43-44. Gita Press. Gorakhpur.

2. Cf; The Cultural Heritage of India P. 38. R. K. Mission.

యజ్ఞోపయోగములగు యూప స్తంభముల నొనరించు తక్షకులు శిల్పశాస్త్రజ్ఞులే, దశరథుని హయమేధయాగము నందు శిల్ప - శుల్బ - శాస్త్రజ్ఞుల చేతను. యజ్ఞవిధానము నెఱిగిన పండితుల చేతను చక్కగను దృఢముగను, అష్టకోణ యుక్తముగను, మృదువుగను, నుండునట్లు చేయఁబడిన ఏకవింశతియూపములు యథా విధిగా స్థాపింపఁబడినవి. అవి యన్నియు యజ్ఞశోభార్థము కాంచనపట్టికలతో నలంక రింపఁబడినవి.

కారితాః సర్వ ఏవైతే శాస్త్రజ్ఞై ర్యజ్ఞకోవిదైః।
శోభార్థం తస్య యజ్ఞస్య కాంచనాలంకృతా భవన్॥
ఏకవింశతి యూపాస్తే ఏకవింశత్యరత్నయః।
వాసోభి రేకవింశద్భి రేకైకం సమలంకృతాః॥
విన్యస్తా విధివత్ సర్వే శిల్పిభిః సుకృతా దృఢాః।
అష్టాశ్రయః సర్వ ఏవ శ్లక్ష్ణరూపసమన్వితాః॥

- వా. రా. బాల. కాం. స. 14-24-26

ఇట శాస్త్రజ్ఞు లనగా శిల్పశాస్త్రము - శుల్బశాస్త్రము - నెఱిగిన వా రని చెప్పబడినది.

కాంచనాలంకృతా భవ న్నిత్యత్ర అడభావాచ్ఛాందసః।
శాస్త్రజ్ఞైః శాస్త్రం శిల్పశాస్త్రం శుల్బశాస్త్రం చ॥

- తిలకవ్యాఖ్యా*

శిల్ప శబ్దము శుల్బ శబ్దము నుండి నిష్పన్నమయిన దను నొక యభిప్రాయము కూడఁ గలదు.[1]

* చూడు : వాల్మీకి రామాయణమ్ తిలక శిరోమణి భూషణేతి టీకా త్రయోపేతమ్- పు 135-6 : గుజరాతీ ప్రింటింగ్ ప్రెస్. బొంబాయి
ed. by Sastri Srinivasa Katti Mudhalkara.

1. Cf: Prof R. V. Vaidya: A Study of Sulba Sastra and the Pre-Vedic-Age. - The Astrological Magazine- Annual Number. 1977 - P 77.

"People sometimes think that the word Silpa may have been derived from Sulba."

యజ్ఞారంభము నుండి తత్సమాప్తి పర్యంతము ప్రధానస్థపతులకు సహాయకులుగా నుండవలసిన కర్మకరులను గూర్చియు చెప్పఁబడినది,

కర్మాంతికాన్ శిల్పకరాన్ వర్ధకీన్ ఖనకా నపి।
గణకాన్ శిల్పిన శ్చైవ తథైవ నటనర్తకాన్॥

- వా. రా. బాల. కాం. 13-7

ఈ శిల్పులను గురించి వ్యాఖ్యాతలు చేసిన వివరణములు ఈ క్రింది పట్టికలో చూడనగును.*

| శిల్పిసంజ్ఞ | రామాయణ శిరోమణి టీకా | శ్రీ గోవిందరాజీయభూషణాఖ్య టీకా |
|---|---|---|
| 1. శిల్పకరాః | ఇష్ట్యాది నిర్మాణకర్తుం చ | ఇష్టకాది నిర్మాతౄన్ |
| 2. వర్ధకీన్ | యూపాది నిర్మాణకర్తౄ తక్షణశ్చ | తక్షణః స్రుక్స్రువ చమసగ్రహ యూపాదినిర్మాతౄన్ |
| 3. ఖనకాన్ | యాగోపయోగికుండాది ఖననకర్తౄశ్చ | వాపీకూపాది కృతః |
| 4. గణకాన్ | జ్యోతిశ్శాస్త్రనిపుణాన్ | లేఖకాన్ |
| 5. శిల్పినః | చిత్రాదినిర్మాతౄం చ | చిత్రాదికరాః |
| 6. నటనర్తకాన్ | నటా రసాభినయకర్తారః నర్తకాన్ భావాభినయకర్తారః | నటాన్ రసాభినయకృతః నర్తకాః భావాభినయకృతః |

యజ్ఞకర్మము నందు నిమగ్నులయిన శిల్పుల కెల్లరకు యథోచిత సత్కారములు చేయవలయుననియు చెప్పఁబడినది.

యజ్ఞకర్మసు యే వ్యగ్రాః పురుషాః శిల్పినస్తథా ॥
తేషా మపి విశేషేణ పూజాకార్యా యథాక్రమమ్॥

- వా. రా. బాల 13. 15,16

* They are : 1. artists 2. carpenters 3. diggers 4. astrologers 5. artisans 6. dancers and conductors of theatres.

మహాభారతము నందును రాజసూయాశ్వమేధాది యజ్ఞశిల్పములు వర్ణింపఁబడినవి.

యజ్ఞవాటికలను నిర్మించువారు, ప్రుక్స్రువచమసగ్రహయూపాది యజ్ఞోపకరణములు చేయువారు, యజ్ఞమును జూడ వచ్చిన వారు విశ్రమించుటకు వారికిఁ దగినరీతిగా మండపములు నిర్మించువారును శిల్పులే. వారుచేయు కర్మములు శిల్పములే.

-)O(-

# ప్రాసాదప్రతిమాశిల్పములు

శివబ్రహ్మార్క విఘ్నేశచండీ లక్ష్మ్యాది కాత్మనాం।
దేవాలయకృతేః పుణ్యం ప్రతిమాకరణే ఽధికమ్॥
ప్రతిమాస్థాపనే యాగే ఫలస్యాంతో న విద్యతే।

- అగ్నిపురాణము*

శివుడు, బ్రహ్మ, సూర్యుడు, విఘ్నేశ్వరుడు, చండి, లక్ష్మి, మున్నగు దేవతలకు దేవాలయములు నిర్మించుట వల్ల పుణ్యఫలావాప్తి. వారి ప్రతిమలు చేయుట వల్లఁ గలుగు పుణ్య మంతకంటె నధికము. ఆ ప్రతిమాస్థాపనయాగ ఫలమున కంతము కానఁబడదు. అది అనంతము.

యజ్ఞాదికర్మలును నిర్గుణోపాసనయు సామాన్యజనుల కసాధ్యములు. ఆధ్యాత్మికదృష్టి యలవడవలయు నన్నచో వారికి సగుణోపాసనయే సరళమార్గము. అందుకు కొన్ని ప్రతీకలు, ప్రతిమలు కావలయును. వానిని స్థాపించుటకు దేవళములు కావలయును. సంపన్నులు వారి యభీష్ట దైవతములకు దేవాలయములు కట్టించి దేవతాప్రతిష్ఠలు చేయవచ్చును. తత్తదనురూపపుణ్యఫలములు పొందవచ్చును.

దేవాలయము నం దెన్ని పరమాణువు లుండునో దానిని గట్టించిన వాఁడు స్వర్గము నం దన్ని వేలేండ్లుండు నని విశ్వకర్మప్రకాశిక చెప్పుచున్నది.

* అగ్నిపురాణము - దేవాలయనిర్మాణఫలమ్. అ. 38. శ్లో 31, 32

సురవేశ్మని యావంతో ద్విజేంద్రాః పరమాణుతః।
తావ ద్వర్షసహస్రాణి స్వర్గలోకే మహీయతే॥

- విశ్వకర్మప్రకాశిక - ప్రాసాదలక్షణమ్ - శ్లో-౯.*

ప్రతిమలు మట్టితోఁ జేయఁబడిన వాని కంటె గట్టితోఁ జేయఁబడినవియు, దారువుతోఁ జేయఁబడిన వాని కంటె నిష్టకలతోఁ జేయఁబడినవియు, నిష్టకలతోఁ జేయఁబడిన వాని కంటె శిలలతోఁ జేయఁబడినవియు, వాని కంటె బంగారు మున్నగు లోహములతోఁ జేయఁబడినవియు అధికాధికపుణ్యఫలదాయకములు.

మృణ్మయా ద్దారుజే పుణ్యం దారుజా దిష్టకా భవేత్।
ఇష్టకోత్థా చ్ఛైలజే స్యా ద్ధేమాదే రధికం ఫలమ్॥

- అగ్నిపురాణము. అ. ౬౪- ౩౨,౩౩

శిల్పశాస్త్రగ్రంథములలో ప్రతిమాలక్షణములు చెప్పఁబడినవి.

పురుషదైవత విగ్రహములు దశతాలప్రమాణములోను, స్త్రీ దేవతావిగ్రహములు నవతాళప్రమాణములోను, మనుష్యవిగ్రహములలో పురుషవిగ్రహములు అష్టతాళ ప్రమాణములోను, స్త్రీ విగ్రహములు సప్తతాళప్రమాణములోను బాలవిగ్రహములు షష్టతాళప్రమాణములోను చేయఁబడవలె నని 'ఆత్రేయతిలకము' సూచించుచున్నది. [1]

తాళ మనఁగా ద్వాదశాంగుళప్రమాణము. దీనికే వితస్తి, ముఖము అని పేర్లు.

ఇట్లు శాస్త్రానుసారము నిర్మింపఁబడిన దేవతావిగ్రహము అందముగా నున్నచో ప్రజలకు సౌఖ్యము, కంబుగ్రీవ మైనచో సర్వసిద్ధులను గూర్చు నని చెప్పఁబడినది. [2]

సుకృతిః సా భవే దర్చా జాయతే సుసుఖాః ప్రజాః।
కంబుగ్రీవా భవే దర్చా సర్వసిద్ధికరీ సదా॥

- ఆత్రేయతిలకము

* అగ్నిపురాణమ్ - అ. 38. శ్లో. 48,49

"ఇష్టకాచయ విన్యాసో యావం త్యబ్దాని తిష్ఠతి।
తావ ద్వర్షసహస్రాణి తత్కర్తుః దివి సంస్థితిః॥
ప్రతిమాకృ ద్విష్ణులోకే స్థాపకో లీయతే హరౌ॥

1. చూడు : వాద్రేవు సూర్యనారాయణమూర్తి : వాస్తునారాయణీయము.
ఆత్రేయ తిలకము - ప్రతిమాలక్షణము.

2. అదే ... ... ... శ్లో. 73

ప్రతిమ యొక్క పొడవు - వెడల్పులు సరిగా లేనిచో దాని వలన దుర్భిక్షము, రాష్ట్రభంగము కలుగును.*

దుర్భిక్షో రాష్ట్రభంగస్స్యాత్ హీనా విస్తారదైర్ఘ్యయోః॥
— ఆత్రేయ తిలకము

కావున స్థపతివర్యు లీ విషయమున జాగరూకత వహింపవలెను.

శ్రేయస్కరములును, స్వర్గదాయకములును గావున దేవతాప్రతిబింబములు చేయవలెననియు, మానవాదుల ప్రతిబింబము లట్టివి కా వనియు శుక్రాచార్యుఁడు తెలిపియున్నాడు.

దేవానాం ప్రతిబింబాని కుర్యా చ్ఛ్రేయస్కరాణి చ।
స్వర్గ్యాణి మానవాదీనా మస్వర్గ్యాణ్యశుభాని చ॥
- శుక్రనీతిః**

శుక్రాచార్యుని యాదేశమిట్లున్నది కనుక శ్రేయస్కామము లగు భారతీయ శిల్పులు సాధారణముగా నిష్ప్రయోజనము లయిన శిల్పములు చేయ నిచ్చగింపరు.

'భారతీయుఁ డెవ్వడును ఆలయశిల్పముతో నిమిత్తము లేకుండ ఐచ్ఛికముగా కేవల శిల్పదృష్టితో విడిగా నొక విగ్రహము చెక్కుటకుఁ గాని, చిత్రమును గీయుటకుఁ గాని ప్రయత్నింపఁ డను నొక యభిప్రాయముకూడ నున్నది'. [1]

ఇందులో కొంత సత్యము లేక పోలేదు. ఆలయశిల్పాంతర్భాగములై అనేక స్త్రీ పురుషయక్షరాక్షసకిన్నెరకింపురుషాది విగ్రహములు, మృగవిహంగాదులు, లతాకుసుమాదిబంధములు కన్పించుచున్నవి. అవి అచ్చట నున్నచో ఆలయశోభ హెచ్చును. విడిగనున్నచో నట్టి ప్రయోజనముండదు గదా।

* చూడు :- వాడ్రేవు సూర్యనారాయణమూర్తి : వాస్తు నారాయణీయము, ఆత్రేయ తిలకము—ప్రతిమాలక్షణము. శ్లో॥ 75

** శుక్రాచార్యః : శుక్రనీతిః లోకధర్మ నిరూపణప్రకరణమ్ అ4 శ్లో77 పుట 248

1. Cf : Encyclopaedia of Religion and Ethics. ed. James Hastings. Vol-I. P. 740. T & T Clark.
"No Hindu ever spontaneously set to work to produce a statue or a picture for its own sake, as a thing of beauty itself, without reference to architecture."

దేవాలయములు ధర్మప్రబోధ ప్రతిపాదకములు. మానవుని మనస్సునకు శాంతి కలిగించి, పారమార్థిక చింతను విస్ఫురింపఁ జేయు పవిత్రస్థలములు ధ్యానయోగమున దైవదర్శనము చేయించి తత్సన్ముఖుని జేయు తరుణోపాయములు.

దేవాలయము లందలి శిల్పములు పెక్కు మతవిషయకములయి యుండును. దేవతావిగ్రహములు చూచినతోడనే భక్తిపారవశ్యమును ఒక విధమగు తన్మయత్వమును గలుగఁజేయును. అదియే దేవాలయశిల్ప వైశిష్ట్యము.

మతవిషయక మైన శిల్పము జీవితాదర్శములతోను, మాహాత్మ్యములతోను, పరమధర్మములతోను నిండి, ఐహికజీవితముతోనే గాక ఆముష్మిక జీవితము తోను సంబంధము గలిగియుండును. ఈ విధముగా నది కాలరాహిత్యమును అనంతత్వ మును గాంచుచున్నది. [1]

-)O(-

## శిల్పిలక్షణము

దివ్యశిల్పములు, దేవతావిగ్రహములు రచించుటకు శిల్పాచార్యుఁడు శిల్పశాస్త్రములు, క్రియాయోగము, మంత్రతంత్రార్థములు తెలిసినవాఁడును నిత్యము దేవతార్చనము, యజ్ఞాదికర్మలు చేయువాఁడును ఉపాసనాతత్పరుఁడును విశ్వకర్మకులాచారపరుఁడును, పూర్వాచార విధివ్రతములు నెఱిఁగిన వాఁడును గావలయు నని శిల్పశాస్త్రములు తెలుపుచున్నవి.

'సూత్రశాస్త్రక్రియాయజ్ఞ మంత్రతంత్రార్థకోవిదః।
సంకల్పసూక్తపఠనం మార్జనం చాఘమర్షణమ్॥

---

1. "ART TO DAY-ed. Faulkner-Ziegfeld - H.II. P 105.

Religious art, dealing with ultimate purposes, values and goals of life, involves not only this life but life in the here-after. In this way it approaches the infinite, the timeless."

స్నానం సంధ్యా జపో హోమః స్వాధ్యాయో
బ్రహ్మతర్పణమ్।
విశ్వకర్మకులాచారః పూర్వాచారవిధిక్రమః॥

మయవాస్తు శాస్త్రము 3-17.*

ఇట 'విశ్వకర్మకులాచారః' అనుటలో నొక విశేషమున్నది. పూర్వకాలము నందీ విద్య లన్నియు కులక్రమాగతములై యున్నవి. గ్రంథముల ద్వారమున శాస్త్రము తెలుగ వచ్చును గాని, శాస్త్రరహస్యములు తెలియవు. ఇట్టి శాస్త్రరహస్యము లనేకములు వంశపారంపర్యముగా కొన్ని కుటుంబములలోనే నిలిచియున్నవి.

శిల్పాచార్యుఁ డథర్వణవేదవిదుఁడై ద్వాత్రింశచ్ఛిల్పశాస్త్రముల నధ్యయనము చేసి, మంత్రవేత్తయై, వివిధదేవతాహ్వానమంత్రతంత్రకుశలుఁడై, బహుశాస్త్రకోవిదుఁడై, సదాచారశీలుడై పరమనిష్ఠాగరిష్ఠుఁడై యుండవలయు ననియు నట్టివాఁడే నిజమైన శిల్పాచార్యుఁ డనియు "మానసారము" కూడ తెలుపుచున్నది.

> "The artificer should understand the Atharvaveda, the Thirty two craftmanuals (Silpa Sastr s) and the vedic mantras by which the deities are invoked. He should be one who wears the sacred thread[i.e. he should be a member of one of the upper, twice born class], a necklace of holy beads, and on his finger, a ring of sacred kusa grass in the worship of God. He should be faithful to his wife, avoiding strange women and should have acquired' piously a knowledge of the various sciences. Only such a one is truely a craftsman — Manasara Silpa Sastra. *

* చూడు 1) మయ వాస్తుశాస్త్రము – వావిళ్ళప్రతి – 1935. పు. 29.
2) వాద్రేవు సూర్యనారాయణమూర్తి. వాస్తునారాయణీయము- మార్కండేయ మతము- ప్రతిమా లక్షణము– పు. 100,101

*1) Quoted in the "The Art of Indian Asia" —P 320 completed and edited by. Joseph Camp bell— Pantheon Books.

2) Also quoted slightly differently in "The Dance of Siva" by Dr. Ananda kumara swamy.

శిల్పి ధ్యానయోగరతుఁడు కావలె నని శిల్పలాక్షణికుఁడైన శుక్రాచార్యుడు నిర్దేశించినాడు.

స్వారాధ్యదేవతాధ్యానైః ప్రతిమా స్తేషు యోజయేత్ ।
ధ్యానయోగస్య సంసిద్ధ్యై ప్రతిమా లక్షణం స్మృతమ్॥
ప్రతిమాకారకో మర్త్యో యథా ధ్యానరతో భవేత్ ।
తథా నాన్యేనమార్గేణ ప్రత్యక్షేణాపి వా ఖలు ॥
— శుక్రనీతి 4-73, 74, 75

శిల్పి తాను నిర్మింపఁదలచిన ప్రతిమారూపమును ఏకాగ్రచిత్తుఁడై ధ్యానింప వలయును. ఈ ధ్యానయోగము సిద్ధించుట కొఱకే ప్రతిమాలక్షణము చెప్పఁబడినది. కనుక ప్రతిమాకారకుఁడగు మానవుడు – శిల్పి – ధ్యానరతుఁడు గావలెను. ప్రతిమా నిర్మాణము చేయవలసిన పద్ధతి ఇదే. ఇంతకంటె వేఱొండు మార్గము లేదు. శిల్పి యేకాగ్ర చిత్తుఁడు కానిదే ప్రతిరూపము (Model) ప్రత్యక్షముగ నున్నను ప్రయోజనము లేదు.

యోగ మనఁగా చిత్తవృత్తులను నిగ్రహించుట. శిల్పి అన్యచింతన లేక తదేకధ్యానరతుఁడై యుండవలయును. అదియే సమాధి. సమాధి తపస్సాధ్యము. తపోబలమున సాధ్యపడనిదే మున్నది?

చిత్రలేఖనమునకును ఇట్టి సమాధి యవసరమే. శిథిల సమాధి వలన రూప చిత్రణము నందు లోపము గలుగు నని మహాకవి కాళిదాసు నుడివి యున్నాడు.

మాలవికాగ్నిమిత్రములో మాలవికను జూచిన అగ్నిమిత్రుఁడనుచున్నాడు :
"చిత్రగతాయా మస్యాం కాంతివిసంవాదశంకి మే హృదయమ్ ।
సంప్రతి శిథిలసమాధిం మన్యే యేనేయ మాలిఖితా ॥

[చిత్రము నందుఁ జూచినప్పు డామె యింత చక్కఁగా నుండునా యని నా హృదయము శంకించినది. కాని యామెను జూచిన తరువాత నా చిత్రకారుఁడు శిథిలసమాధి - ఏకాగ్రత కుదురని వాఁడు - అనిపించుచున్నది.]*

* కాళిదాసు = మాలవికాగ్నిమిత్రమ్-అం 2. శ్లో 2.

"సమాధి = Concentration. It is well-known that an artist must have full concentration of mind if the picture is to be exact reproduction of the original."
—R. D. Karmankar

రూపసాక్షాత్కారమున కింకొక పద్ధతి యున్నది.

శిల్పులు తాము నిర్మింపఁ దలఁచిన సమస్తదేవతావిగ్రహస్వరూపములను తమకు స్వప్నసాక్షాత్కారములు కావలయు నని స్వప్నాధిపతియు విశ్వరూపుఁడు నగు విష్ణువును ప్రార్థించు నాచారము ప్రాచీనకాలములో నున్నట్లు అగ్నిపురాణము వలన దెలియుచున్నది.

శిల్పిభిశ్చ చరుం ప్రాశ్య స్వప్నమంత్రం జపే న్నిశి ॥

ఓం నమః సర్వలోకాయ విష్ణవే ప్రభవిష్ణవే ।
విశ్వాయ విశ్వరూపాయా స్వప్నాధిపతయే నమః ॥

ఆచక్ష్వ దేవదేవేశ ప్రసుప్తోస్మి తవాంతికమ్ ।
స్వప్నే సర్వాణి కార్యాణి హృది స్థాని తు తాని మే । *

[శిల్పారంభమునకు ముందు శిల్పులు దేవతారాధన చేసి, చరువును భక్షించి, రాత్రి స్వప్నమంత్రమును జపించి, 'ఓ దేవదేవ ! నేను నీ చెంత నిదురించుచున్నాను. నా హృదయము నందలి సర్వకార్యములును నాకు స్వప్నము నందు సాక్షాత్కరింపఁ జేయు' మని విష్ణువును ప్రార్థింపవలయును.]

శిల్పుల దృష్టిలో విష్ణు వన విశ్వకర్మయే.
విష్ణుసహస్ర నామములలో విశ్వకర్మ యనున దొకటి.
విశ్వకర్మా మను స్త్వష్టా స్థవిష్ఠః స్థవిరో ధ్రువః ॥

వ్యా. భా. ఆనుశాసనిక. 149-20.

ఇది యొకవిధమగు స్వోక్షేపకము. Autc-Suggestion. ఈ పద్ధతి మనస్తత్వశాస్త్ర సమ్మత మయినదే.

> "There remains however the possibility of a purely endogencus process (Japa) which might perheps be validly called Auto suggestion" — says Mc Dougall.**

* అగ్నిపురాణే త్రిచత్వారింశో ఽధ్యాయః - ప్రాసాదదేవతాస్థాపనమ్
అ. 43. శ్లో-22-24.

** Cf . V,M, Bhat, Yogic powers and God realisation P. 77.
Bharatiya Vidya Bhavan- 1964.

స్వప్నము నందు నిద్ర యందుఁ గలిగెడు జ్ఞానమును గూర్చి భావించుట వలన మనఃప్రసన్నత కలుగును. అట్లే తన కభిమత మగునే విషయము నైనను ధ్యానింపవచ్చును. అట్లు ధ్యానించు యోగి చిత్తమునకు పరమాణువు మొదలుకొని అనంతత్వము వఱకు సర్వము వశపడి యుండు నని పాతంజల యోగసూత్రములు తెలుపు చున్నవి.

స్వప్ననిద్రాజ్ఞానావలంబనం వా ।
యథాభిమతధ్యానా ద్వా ।
పరమాణుపరమమహత్త్వాంతో ఽస్య వశీకారః ॥

—సమాధి పాదము. 1-38, 39, 40.

అట్లు కానిచో, విశుద్ధవర్తనము చేతఁ గాని జన్మాంతర సంస్కారవశమునఁ గాని ప్రతిభ గలిగిన వానికి ప్రయత్న మక్కఱలేకయే సమస్తమును ప్రత్యక్షముగా గోచరించును.

ప్రాతిభా ద్వా సర్వమ్ ॥

— విభూతి పాదము. 3-34.

ఇట్టి ప్రతిభావిశేషము గలుగుట కడు దుర్లభము. కావున దేవతావిగ్రహ నిర్మాణోద్యుక్తుఁ డగు శిల్పికి తత్తద్దేవతాస్తవధ్యానాదు లత్యంతావశ్యకములు.

మహర్షులు మహాకవులు రచించిన స్తోత్రములు, రూపధ్యానములు ప్రతిమా శిల్పము నందు మూర్తి నిర్మాణకళయందు శిల్పుల కెంతగానో తోడ్పడుచున్నవి.

అట్లే తపస్సంపన్నులయిన మహాశిల్పులు రచించిన విగ్రహములు, శిల్పములు కావ్యరచనము నందు కవులకు సహాయపడుచున్నవి. కవులు చేయువర్ణనములకు మూల ముండవలయును గదా !

ప్రతిమారచనము నందు శిల్పులకు కవులు, తద్వర్ణనము నందు కవులకు శిల్పులు సహాయకారులుగ నుందురు.

నిశ్చలసమాధినిష్ఠుఁడైన పరమేశ్వరమూర్తిని మహాకవి కాళిదాసు తన "కుమారసంభవము" లో పరమరమణీయముగ వర్ణించినాఁడు.

భుజంగమోన్నద్ధజటాకలాపం ।
కర్ణావసక్త ద్విగుణాక్షసూత్రమ్ ।
కంఠప్రభాసంగవిశేష నీలాం ।
కృష్ణత్వచం గ్రంథిమతీం దధానామ్ ॥

కించిత్ప్రకాశ స్తిమితోగ్రతారై ।
భ్రూవిక్రియాయాం విరతప్రసంగైః ।
నేత్రై రవిస్పందిత పక్ష్మమాలై ।
ర్లక్ష్యీకృతఘ్రాణ మధో మయూఖైః ॥

అవృష్టిసంరంభ మివాంబువాహ
మపా మివాధార మను త్తరంగమ్ ।
అన్తశ్చరాణాం మరుతాం నిరోధా
న్నివాతనిష్కంప మివ ప్రదీపమ్ ॥

—కు. సం. 3-46, 47, 48.*

శ్రీనాథుఁ డీ శ్లోకములనే తెనిగించి సీసములో పోతఁబోసినాడు.

సీ॥ పయిడ కెంజడకొప్పు పదలి పిడక యుండఁ
పసుపాప తలపాగ బిగియఁ జుట్టి,

మెడకప్పులోఁ గూడి మిక్కిలి నలుపైన
కమనీయకృష్ణాజినము ధరించి,

భ్రూవికారము లేని పొదవు రెప్పలలోని
ఘనదృష్టి నాసికాగ్రమున నిల్పి,

యోగపట్టికఁ జెంది యురముపైన నిలుకడ
నాసనస్థిరబంధ మనువు పఱచి.

నిస్తరంగక మైన మన్నీరు పోలె
గర్జితము లేని ఘనఘనాఘనము పోలె
ధ్యాననిశ్చలుఁ డగు నిందుధరుని జూచి
ప్రసవనారాచుఁ డతిభయభ్రాంతుఁ డగుచు.

హరవిలాసము. ౬ [illegible]

కాళిదాసు మథుర లోని ధ్యానిబుద్ధ విగ్రహమును చూచియే యీ మనోహర మూర్తి వర్ణనమును చేసి యుండ వచ్చు నని పండితు లూహించుచున్నారు.

"తపోనిష్ఠుడై నిశ్చలముగ వీరాసనమునc గూర్చుండిన పరమ శివుని నిస్పష్టరూపచిత్రణము కేవలము కాళిదాస కవి ఊహాజనిత మని యంగీకరింప జాలము. దీని ప్రతిరూపము మథుర యందలి బుద్ధ-బోధిసత్వ—విగ్రహములలో నున్న దని నొక్కి—వక్కాణింప వచ్చును."
— అని బి. యస్. ఉపాధ్యాయ వ్రాసినాడు.[1]

"అది బోధివృక్షము క్రింద పద్మాసనములో గూర్చుండి ధ్యానముద్రలో నున్న యోగి వలె నున్న" దని రాధాకుముద్ ముఖర్జీ వ్రాసినాడు.[2]

ఈ విగ్రహము క్రీ. శ. ఒకటవ శతాబ్దికి చెందినది.

భారతరామాయణాది కథాచిత్రములు శిల్పులకు, చిత్ర కారులకు ఆదర్శవస్తువులై అనేక దేవాలయకుడ్యముల నలంకరించుచున్నవి.

కావున శిల్పులకు పురాణేతిహాసకావ్యనాటకాది గ్రంథ పరిశీలనమే కాక, మనోహరఘట్టముల నెంచికొనcగల వివేచనాశక్తియు, సూక్ష్మేక్షికయు నుండ వలయును.

1. Cf :- B.S. Upadyaya: India in Kalidasa–ch-13-P 244

"It may be asserted that this picture of the meditation of Siva has the reflex of its form buried in these Buddha and Bodhisathva images of Muttra for the vivid picture that Kalidasa has drawn of Sivas meditation cannot be accepted to have been the result of mere fancy."

Cf : also :– Radha kamal Mukerjee.

The Calture and Art of India. P 244-45

2. Cf :- Radhakumud Mookerjee : Glimpses of Ancient India P 66
" It is the type of a yogi, seated, crosslegged in meditation in Padmasana under the Bodhi tree."

# శిలాశిల్పము

శ్రేయస్కరము లగు దేవప్రతిబింబములు చేయుట మంచి దని శుక్రాచార్యుఁడు నిర్దేశించినను, దేవతాప్రతిమలే కాక తత్సదృశము లగు మహాపురుషుల విగ్రహములు రచింపఁబడిన సందర్భములు చరిత్రలోను సాహిత్యము నందును కనిపించుచున్నవి.

దివంగతు లయిన మహాపురుషుల జ్ఞాపకార్థము వారి శిలా ప్రతిమలు చేయించి ప్రత్యేకముగా ప్రతిమాగృహములందు ప్రతిష్ఠించునాచార మతిప్రాచీనకాలము నందున్నట్లు భాసకృతప్రతిమానాటకము వలనఁ దెలియుచున్నది.

మేనమామల యింటి నుండి అయోధ్యకు తిరిగి వచ్చునప్పుడు తత్పుర సమీపమున గల ప్రతిమాగృహమును దర్శించి యందలి స్తంభము లందు మలచఁబడిన విగ్రహములను జూచి, భరతుఁ డిట్లు ప్రశంసించును.

అహో ! క్రియామాధుర్యం పాషాణానామ్ ।
అహో ! భావగతిరాకృతీనామ్ ! దైవతోద్దిష్టానా
మపి మానుషవిశ్వాసతాసాం ప్రతిమానామ్ । ....
అస్తి తావ న్మే మనసి ప్రహర్షః ॥

[అహో ! ఏమి యీ శిలల శిల్పసౌందర్యము ! ఏమి యీ యాకృతుల భావస్ఫూర్తి, దైవతోద్దిష్టము లయ్యును ఈ ప్రతిమలు సజీవమానవమూర్తు లనిపించుచున్నవి........నా మనస్సున కెంతయు హర్షమగుచున్నది]*

భరతుఁడు ప్రతిమాగృహములో చూచిన ప్రతిమలు కీర్తిశేషులయిన దిలీపాదుల స్మారకచిహ్నములు.

ఇట్టి అనుకృతియే ప్రతిమాశిల్పమునకు మూల మని తెలియనగును.

"The fact that imitation ... .... ... was used as a Principle of production of works of scuptural art is testified by the ancient practice of making images of stone for preservation of the memory of king and great men"[1]

* భాసమహాకవి : ప్రతిమానాటకము - తృతీయాంకము -

— వ్యాఖ్యాత పాటిబండ మాధవశర్మ.

1. Dr. Kanti Chandra Pandey : Comparative Aestheties Vol. II. Page. 545.

# చిత్ర శిల్పము

చిత్రాద్యాలేఖనము కళ యని సూత్రాచార్యుఁడు వాత్స్యాయనుఁడు దీనినే ఆలేఖ్య మనినాఁడు.

ఆలేఖ్యము రూపభేదము, ప్రమాణము, భావము, లావణ్యయోజనము, సాదృశ్యము, వర్ణికాభంగము నను షడంగకములు కలిగియున్న దని వ్యాఖ్యాత యశోధరుఁడు వివరించినాఁడు.

రూపభేదాః ప్రమాణాని భావలావణ్యయోజనే ।
సాదృశ్యం వర్ణికాభంగ మితి చిత్రం షడంగకమ్ ॥*

రూపభేద మనఁగా చిత్రమును జూచిన తోడనే బాలుఁడో, వృద్ధుఁడో, రాజో, సేవకుడో, నవోఢయో, ప్రౌఢయో గుర్తింపఁ గలుగు నట్లు వ్రాయుట.

ప్రమాణ మనఁగా ఏయే యవయవము లెంతెంత ప్రమాణములో నుండ వలయునో శాస్త్రప్రకారము పొందికగా వ్రాయుట.

భావ మనఁగా చిత్రితమైన వ్యక్తి తత్కాలికావస్థ యందలి మనోగతభావము సువ్యక్త మగు నట్లు వ్రాయుట.

లావణ్యయోజిత మనఁగా ఏ వస్తువు నెట్లు చిత్రించిన రమణీయముగ నుండునో యోజించి వ్రాయుట.

సాదృశ్య మనఁగా చూచుట తోడనే యిది 'ఫలానా' చిత్ర మని గుర్తింపఁ గలుగు నట్లును, ప్రతిరూపమునకు (Model) ఇంచుక యైనను భేదము లేకుండునట్లును రచించుట.

వర్ణికాభంగ మనఁగా ఏ వర్ణ మెచట వేసిన, చిత్రమునకు వన్నెఁ దెచ్చునో యోచించి వర్ణసమ్మేళనము చేయుట.

---

* చూడు : వాత్స్యాయన కామసూత్రమ్ । జయమంగళాఖ్యయా టీకాసహితమ్ ॥
అ. 1-3 పుట. 30.

Cf : (I) Aurobindo: The Foundations of Indian Culture . P.79.
(2) Kewal Motwani = India - A Synthesis of Cultures. P 001

ఇట్లు షడంగయుక్తముగా రచింపఁబడిన చిత్ర మాశ్చర్యకరమై యానందము గొలుపుననుటలో సందియము లేదు. ఈ లక్షణము లన్నియు సమగ్రముగా నుండి సమష్టి మీద చైతన్యవంతమై యుండవలయును. శిల్పచిత్రలేఖనముల కీ చేతనయే ముఖ్యము.

చిత్ర లేఖనమున సాదృశ్యకరణము ప్రధాన మని విష్ణుధర్మోత్తర పురాణము నందు చెప్పఁబడినది.*

దృష్టం సు సదృశం కార్యం సర్వేషామ్ విశేషతః
చిత్రే సాదృశ్యకరణం ప్రధానం పరికీర్తితం ॥

విష్ణుధర్మోత్తరపురాణమ్. ౩౩౭.

హరివంశపురాణము నందు చిత్రరచనావిధానప్రయోజనములను దెల్పు నొక ఘట్టము గలదు.

బాణాసురునిపుత్రిక యగు ఉష కలలో నొకపురుషుని గాంచి, యాతఁ డెవరో తెలియక కలవరపడుచుండగా, చెలికత్తె యగు చిత్రలేఖ యుషాకన్య నూరార్చి,

"యోగవిద్యావిదిత యైన యుమ్మహానుభావ
యేకాంతంబున నుండి.

సీ॥ అధికవిస్తీర్ణమై యమరు నాలేఖ్యప
టంబున వలయు వర్ణంబు లెల్ల

నొడఁగూర్చి తూలిక యొప్పఁ గైకొని పదు
నాలుగు జగముల నోలి నెవ్వ

*Cf : Dr. Kanti Chandra Pandey-Comparative Aesthetics. Vol-II. P 544-1956 ed.

Chowkhamba Sancrit Series Office-Banares. "And Vishnu Dharmottara Purana in the section dealing with Painting, recognises the production of likeness as the main purpose of Painting".

రెవ్వరు ముఖ్యులై యెందుఁ బ్రఖ్యాతిఁ బొం
దుదు రట్టి పురుషులఁ జదురెలర్ప
నాకారములుఁ జాయ లంబరాభరణాదు
లొప్పులు నిలుకడ లొకడు దప్ప
కుండ సప్తరాత్రంబున నొనర వ్రాసి
తెచ్చి నెచ్చెలి ముందట నిచ్చి చూపి
యచ్చెరువు నొందు నమ్ముగ్ధ కవ్విధంబు
వేఱు వేఱ యిట్లని చెప్పె విస్తరించి.

ఈ యఖిలాండసృష్టి నొడ లెత్తిన ధన్యుల నెల్ల నేను నీ
కై యిది యస్మదద్భుతకళాతిశయంబున నాహరించి, బా
లా యిటు చిత్రవిన్యసనలక్ష్యులఁ జేసితి నిందు నీ ప్రియున్
శ్రీయుతు నొప్పఁగాఁ దడవి చెప్పుము నిక్క మెఱింగి క్రమ్మఱన్*

—అని పలికినది.

ఉషాకన్య చిత్రపటము నందలి యనిరుద్ధుని జూచి,

"...............యాకార కౌతుకాద్భుతవిలోక
తారకంబయి నిలుకడఁదగలఁదగిలి
మనసు తోడ్తోడ మన్మథోన్మాదమొంద"

కాంత తడ వీక్షించి చిత్రరేఖ వచనాశక్తి నిట్లు కొనియాడినది.

* ఎఱ్ఱాప్రెగడ : హరివంశము—ఉత్తరభాగము. 7-129, 130, 131.

వ్యాస : హరివంశము "తతస్తు సప్తరాత్రేణ కృత్వా లేఖ్యగతాంస్తు తాన్ ।
చిత్రపటగతాన్..................॥

నీ కౌశల మేమని చెలి, యాకొనియాడుదు మదీయ
మగు మదికిం జి
త్రాకృతి మును గలఁగలసిన యాకారం బెంత సేసె
నంతియ చేసెన్.

— ఎఱ్ఱన-హరివంశము-ఉ.భా-అ 7. 143-151.

ఇందు నాలు గంశములు గుర్తింప వలసియున్నది.

1) చిత్రరేఖ యోగవిద్యావిశారద. యోగాభ్యాసము చేత ఏకాగ్రచిత్తత గలిగి నట్టిది.

2) నేర్పును జూపి తన యద్భుతకళాతిశయమును బ్రదర్శించినది. కావున చిత్రములు చక్కఁగా నున్నవి.

3) చిత్రపటమును జూచిన ఉష తాను కలలోఁ గాంచిన పురుషు నాకృతిని గుర్తించినది. కుతూహలమును, ఆశ్చర్యమును దెలుపు చిత్రమగు చూపులతో నా చిత్రమును దిలకించినది. చిత్రకారిణి రచన సార్థక మయినది.

4) కలలోఁ గలసిన యాకారము చేసినంతపని యీ చిత్రము చేసిన దని ఉష చిత్రరేఖ రచనాకౌశలమును బ్రశంసించినది.

అనిరుద్ధు రూపము నింత సాదృశ్యసమాహితముగా చిత్రించిన చిత్రరేఖయే పురాణసాహిత్యము నందు బ్రప్రథమచిత్రకారిణి.

దీనిని బట్టి చిత్రకారులకు ఏకాగ్రతయు, కౌశలమును గలిగిననే కాని సాదృశ్యకరణము సాధ్యము కాదనియు, సాదృశ్యసముజ్జ్వల మైననే కాని చిత్రము మనోహరము కాఁజాల దనియు తేలుచున్నది.

* * *

భాస విరచిత మైన, 'స్వప్నవాసవదత్త' నాటకములో చిత్రఫలక ప్రసక్తి యున్నది.

వాసవదత్తావియోగదుఃఖితుఁడైన వత్సరాజునకు, అంగారవతీ మహాసేనులు పంపిన చిత్రఫలకములను గొనివచ్చిన ధాత్రి వసుంధర, అంగారవతి [వాసవదత్త తల్లి] చెప్పు చున్నట్లుగా నిట్లు చెప్పినది.

"....అనగ్నిసాక్షికం వీణావ్యపదేశేన దత్తా ఆత్మన శ్చపలతయా నిర్వృత్త వివాహమంగల ఏవ గతః అథ చావాభ్యాం తవ చ వాసవదత్తాయాశ్చ ప్రతికృతిం చిత్రఫలకాయా మాలిఖ్య వివాహో నిర్వృత్తః। ఏషా చిత్రఫలకా తవ సకాశం ప్రేషితా। ఏతాం దృష్ట్వా నిర్వృతోభవ ॥"

స్వప్నవాసవదత్త — షష్ఠాంకము.

['వీణావాదనాభ్యాసవ్యాజమున వాసవదత్త ననగ్నిసాక్షికముగా నీ కొప్పఁ జెప్పితిమి. కాని నీవు నీ బుద్ధిచాపల్యముచే వివాహము జరుగకుండగనే వాసవదత్తను గొనిపోయితివి. అప్పుడు మేము నీ యొక్కయు వాసవదత్త యొక్కయు చిత్రఫలకములు వ్రాయించి వానికి వివాహము జరిపితిమి. ఇప్పు డాచిత్రములు నీకు పంపుచున్నాము. వానిని జూచి యైన నూరడిల్లుము' -అని.]

చిత్రఫలకము నందలి ప్రతిరూపమును చూచిన పద్మావతి తనవద్ద న్యాసముగ నున్న అవంతికయే వాసవదత్త యని గుర్తించి యీ ప్రతికృతిని బోలిన స్త్రీ యిచ్చటనే నివసించుచున్న దని రాజుతో చెప్పినది.

పద్మావతి : ఆర్యపుత్ర। సదృశీ ఖల్వియ మార్యాయాః।

రాజా : న సదృశీ। సైవేతి మన్యే। ........

పద్మావతి : ఆర్యపుత్ర। అస్యాః ప్రతికృత్యాః సదృశీహైవ। ప్రతివసతి.*

ఇచ్చట సాదృశ్యకరణమే ప్రధానముగ నున్నది. చిత్రరచనము నందు చిత్రకారుని కళాకౌశల మట్టిది.

మహాభారతమునందు చిత్రోపమలు, చిత్రశాలాప్రసంగములు గల సందర్భములున్నవి. కావున భారతదేశమునందలి ప్రాచీనకాలము నుండియు చిత్రలేఖనము ప్రసిద్ధికెక్కి యున్నట్లు తెలియుచున్నది.

* భాస : వాసవదత్త - షష్ఠాంకము.

పోల్చిచూడు : కథాసరిత్సాగరము - తృతీయతరంగము_94.

"అచలితానిరా క్షేషా చస్యాః శిల్ప మిదమ్ మహత్."

# సువర్ణ శిల్పము

## స్వర్ణాద్యలంకారకృతిః కలా ॥

శుక్రనీతి - అ 4.*

చతుష్షష్టికళలలో స్వర్ణాద్యాభరణములు చేయుట యొకటి. దీనినే వాత్స్యాయనుఁడు 'భూషణయోజన' మని చెప్పినాడు.

అలంకారప్రీతి మానవునకు సహజగుణము స్త్రీ పురుషులు జన్మతః సౌందర్యము గలవారైనను, కాకున్నను ఉన్న సౌందర్యము నతిశయిల్లఁ జేసి కొనుటకు క్రొత్త క్రొత్త యలంకరణవిధానముల నన్వేషించుచున్నారు. స్త్రీల యందీ యలంకరణ మత్యంతశోభాకరమై, ఆకర్షణహేతువై పురుషుల కానందదాయక మగుచున్నది. అందుచేతనే సాలంకృత కన్యాదానము చేయు నాచారము ప్రబలముగ నున్నది. ఇది నాగరిక లక్షణము.

వైదికార్యుల కంటె ముందు భారతదేశము నందు నివసించిన జనులు కూడ కంఠహారములు, కేయూరాంగదములు, అంగుళీయకములు, ఒడ్డాణములు, నూపురములు మున్నగు నాభరణములు ధరించుచుండిరి. స్త్రీ పురుషు లిరువురు నంగుళీయకములు కర్ణకుండలములు నుపయోగించుచుండిరి. వీరిలో ధనవంతులు బంగారు, వెండి, గజదంతము, రత్నములు మొదలగు వానితోఁ జేయబడిన యాభరణములు, పేదలు రాగి మొదలగు లోహములతోను, శంఖాదులతోను చేయఁబడిన భూషణములు ధరించుచుండిరి.[1]

* శుక్రాచార్యః : శుక్రనీతిః చతుర్థాధ్యాయే - విద్యాకలానిరూపణ నామ తృతీయప్రకరణమ్.

1. Cf: Dr. Radha Kumud Mookerji: Hindu Civilisation - Part I-P-17 Bhawan's Vidya Bhavan Publication.

"Ornaments included chiefly necklaces, fillets and finger rings for both sexes, and girdles, ear-rings and anklets. For the rich these were of gold, silver, faience, ivory or semiprecious stones; for the poor, shell, bone, copper and terra-cotta".

కంఠస్య తస్యా స్స్తనబంధురస్య ముక్తాకలాపస్య చ
నిస్తలస్య ।
అన్యోన్యశోభా జననాద్బభూవ సాధారణో
భూషణభూష్యభావః ॥

—కుమారసంభవము. 1-42

[పార్వతీదేవి కంఠమును, తాను కంఠమునందు ధరించిన ముత్యాలహారమును. పరస్పరము శోభాజనకముగా నున్నవి.]

........సితేతరస్య తన్మేఖలా మధ్యమణే రివార్చిః ॥

—కుమారసంభవము 1.38.

[ఆమె నూగారు మేఖలా మధ్యము నందున్న నల్లని ఇంద్రనీలమణి కాంతి వలె నున్నది.]

మహాభారతము నందు సువర్ణాద్యాభరణవిశేషవర్ణనములు కోకొల్లలుగా నున్నవి.

హిరణ్యాభరణధారణము వలన దీర్ఘాయువును, వర్చస్సును, ఐశ్వర్యమును, పుష్టియు గలుగు నని వేదము లందుఁ జెప్పఁబడినది.

ఆయుష్యం వర్చస్యమ్ రాయస్పోష మౌద్భిద్యమ్ ।
ఇదం హిరణ్యం వర్చస్వ జ్జైత్రాయా విశతాద్ మామ్ ॥

శుక్ల యజుర్వేద. 34-50 *

[దీర్ఘాయువును, వర్చస్సును, ఐశ్వర్యమును, పుష్టిని ఒసఁగు హిరణ్యమును నేను ధరించుచున్నాను.]

నవరత్నధారణము వలన సర్వగ్రహపీడలు తొలఁగు నను భావము ప్రాచీనులకే గాక యర్వాచీనులకుఁగూడ నున్నది.

* పోల్చు : ఋగ్వేద ఖిల. 10-126.8; అథర్వ 1-35-2.

ధారణం నవరత్నానాం గ్రహసంతోషకారకమ్ ।
సర్వపీడాహరం చైవ లోకానాం ప్రీతివర్ధకమ్ ॥

— నిఘంటురత్నాకరము.*

ఈ విధముగా సువర్ణశిల్పము శోభాయమానముగా మానవజీవితము నందు చోటుచేసికొన్నది.

## మహాభారతము - శిల్పకళలు

అర్థశాస్త్ర మిదం ప్రోక్తం ధర్మశాస్త్ర మిదం మహత్ ।
కామశాస్త్ర మిదం ప్రోక్తం వ్యాసే నామితబుద్ధినా ॥

- వ్యా. భా. ఆది. 2-383.[1]

వ్యాసభారతము ధర్మార్థకామమోక్షపురుషార్థములను తద్విశేషములను తెలుపు శాస్త్ర స్థాయిగల మహాకావ్యము.

అర్థశాస్త్రజ్ఞుల కది యర్థశాస్త్రము.

అర్థశాస్త్రమున కర్థవేద మనియు నర్థవిద్య యనియు నామాంతరములు. ఇది అథర్వణవేదమున కుపవేదము.

అర్థశాస్త్రము నందు ధనార్జనోపాయములు, చతుష్షష్టికళలు, శిల్పశాస్త్రము, పదార్థవిజ్ఞానశాస్త్రము, తత్త్వశాస్త్రము, రాజనీతిశాస్త్రము - వీని యందలి విశేషములు చెప్పబడియున్నవి.[2]

* చూడు : పద్మనాభ నిరంజనశాస్త్రి = విశ్వకర్మబ్రాహ్మణవంశాగమము - పు. 116.

1. పోల్చు : వ్యా. భా. ఆది-62-23.

"ధర్మశాస్త్ర మిదం పుణ్య మర్థశాస్త్ర మిదం పరమ్ ।
మోక్షశాస్త్ర మిదం ప్రోక్తం వ్యాసేనామితబుద్ధినా ॥

2. Cf: V. A. K. Iyer : Hindu Sastras and Samskaras. P.17.
"The last of the Upavedas i.e. Arthasastra dealing with the acquisition of material things like wealth by righteous means. Under this head, NITI SASTRA, SILPA SASTRA the sixty four kalas, and also other physical and metaphysical subjects are included."

అర్థ శబ్దమున కనేకార్థములున్నవి. అర్థమనగా ధనము ధనార్జనోపాయము లనేకములున్నవి. వానిలో నరువది నాలుగు చతుష్షష్టికళలుగా పరిగణింపఁబడు చున్నవి. అవి ఇవి :-

1. ఇతిహాసములు 2. ఆగమములు 3. కావ్యములు అలంకారములు, నాటకములు 4. గాయకత్వము 5. కవిత్వము 6. కామశాస్త్రము 7. దురోదరము. 8. దేశభాషాలిపిజ్ఞానము. 9. లిపికర్మ. 10. వాచకము. 11. సర్వ విధావధానములు 12. స్వరశాస్త్రము 13. శకునశాస్త్రము 14. సాముద్రికము 15. రత్నశాస్త్రము 16. రథాశ్వగజకౌశలము 17. మల్లశాస్త్రము 18. సూదకర్మ. 19. భూరుహాణము 20. దోహదము 21. గంధవాదము 22. ధాతువాదము 23. ఖనివాదము 24. రసవాదము 25. జాలవాదము 26. అగ్నిస్తంభనము. 27. ఖడ్గస్తంభనము. 28. జలస్తంభనము. 29. వాచస్తంభనము. 30. వయస్తంభనము 31. వశీకరణము 32. ఆకర్షణము 33. మోహనము 34. విద్వేషము 35. ఉచ్చాటనము 36. మారణము 37. కాలవంచనము 38. పరకాయప్రవేశము. 39. పాదుకాసిద్ధి. 40. వాక్సిద్ధి. 41. ఘుటికాసిద్ధి 42. ఐంద్రజాలికము. 43. అంజనము 44. పరదృష్టి వంచనము. 45. పర వంచనము. 46. మణిసిద్ధి 47. మంత్రసిద్ధి 48. ఔషధసిద్ధి 49. చోరకర్మ 50. చిత్రకర్మ 51. లోహక్రియ 52. అశ్మక్రియ 53. మృత్క్రియ 54. దారుక్రియ 55. వేణుక్రియ 56. చర్మక్రియ 57. అంబరక్రియ 58. అదృశ్యకరణము 59. దండకరణము - మృగయావిధి 60. వాణిజ్యము 61. పాశుపాల్యము 62. కృషి 63. ఆసవకర్మ 64. లావకుక్కుటమేషాది యుద్ధకారకకౌశలము.

ఈ చతుష్షష్టికళ లందు కొన్ని బుద్ధివర్ధనములైనవి. కొన్ని భావప్రధానములు, తక్కినవి వృత్తిరూపములు. ఇవి యన్నియు ధనార్జనోపాయములే కావున నివి యర్థశాస్త్రము నందుఁజేర్పబడినవి.*

* చూడు : 1. శిరప్ప రామకృష్ణశాస్త్రి : ఆర్ష విజ్ఞాన సర్వస్వము - ప్రథమ భాగము పు. 61, 62, 63, 64.

ఈ చతుష్షష్టికళల పట్టిక శబ్దరత్నాకరము నందించుమించుగానిట్లే యున్నది, కాని 'వాత్స్యాయన కామసూత్రము' నందు, 'శుక్రనీతి' యందు నొసంగ బడినదానికంటె భిన్నముగానున్నది.

వాత్స్యాయనుఁడు సకలకళలకు మూలమయినఁవాస్తువిద్య,నొకకళగా చెప్పినాడు[1] దీనినే శుక్రాచార్యుడు 'తటాగవాపీ ప్రాసాదసమ భూమిక్రియా కలా' యని వివరించి చెప్పినాడు.[2]

లాక్షణికులందరు చిత్రలేఖన మొకకళగా చెప్పినారు. కాని వాత్స్యాయనుఁడు గీత వాద్య నృత్యాలేఖ్యాలంకరణముల నొక వరుసలో చెప్పినాఁడు. ఇవి యన్నియు లలితకళలు.

అర్థశాస్త్రము నందు చెప్పబడిన చతుష్షష్టికళలలో చిత్ర లోహాశ్మమృద్దారు వేణు చర్మాంబరక్రియలను నెనిమిది శిల్పపారిశ్రామికవృత్తులు. వీనిని హస్తకళలు (Handicrafts) అనుచున్నారు.

శిల్పశాస్త్రవేత్త యైన శుక్రాచార్యుఁడు మృత్తికాకాష్ఠపాషాణధాతు భాండాది క్రియలను నాల్గింటి నొక వర్గముగా పేర్కొని, 'స్వర్ణాద్యలంకారకృతి' నొక కళగాఁ జెప్పినాఁడు.

చతుష్షష్టికళలలో అయోదారులోహపాషాణస్వర్ణశిల్పములను వృత్తులుగా నవలంబించి, వంశపారంపర్యముగా నీ పంచశిల్పముల నొనరించు విశ్వకర్మ కులోద్భవులు, పాంచాల బ్రాహ్మణులనియు, శిల్పి బ్రాహ్మణులనియు, విశ్వకర్మలనియు, విశ్వకర్మ బ్రాహ్మణులనియు, విశ్వబ్రాహ్మణులనియుఁ బిలువఁబడుచున్నారు. ఈ పాంచాల బ్రాహ్మణులే యాంధ్రదేశమునందు 'పంచాణమువారు' గా ప్రసిద్ధికెక్కినారు.

పంచాణము = శిల్పము; పంచాణమువాఁడు = శిల్పి*

ఈ దేశమునందు సమస్తశిల్పకళలు కులక్రమాగతముగా పాంచాలబ్రాహ్మణాధీనములై యున్నవి.

కృషి వాణిజ్యము గోరక్ష్యము వివిధశిల్పములు ధనోపార్జన కుత్కృష్టసాధనము లని మహాభారతము నందు చెప్పఁబడినది.

1. వాత్స్యాయన కామసూత్రములు : 1-3-14. చతుష్షష్టికళలు-37 వ కళ.
2. శుక్రాచార్యుడు : శుక్రనీతి : 4-3-చతుష్షష్టికళలు-31 వ కళ.

* సూర్యరాయాంధ్రనిఘంటువు.

కృషి వాణిజ్య గోరక్ష్యం శిల్పాని వివిధాని చ
అర్థ ఇత్యేవ సర్వేషాం కర్మణా మవ్యతిక్రమః ॥

వ్యా. భా. శాంతి. 167-11.

కావున 'అర్థశాస్త్ర' మని ప్రస్తుతింపఁబడిన మహాభారతమునందు శిల్ప కళావిశేషము లుండుటలో నాశ్చర్యమేమున్నది ?

# పంచమవేద ప్రాశస్త్యము

సంచితపుణ్యుఁ డంబురుహసంభవు నంశముఁ దాల్చి పుట్టి లో
కాంచితుఁ డైనవాఁడు, నిఖిలాగమపుంజము నేర్పడన్ విభా
గించి జగంబులందు వెలిగించి సమస్తజగద్ధితంబుగా
పంచమవేదమై పరఁగు భారతసంహితఁ జేసె నున్నతిన్.

—నన్నయ-ఆది. 3-47*

చతుర్వేదములు, షడంగములు, ఉపనిషత్తులు చదివినను మహాభారతము చదువని వాఁడు విజ్ఞుఁడు కాఁజాలఁడు.

యో విద్యాచ్చతురో వేదాన్ సాంగోపాంగనిషదో ద్విజః ।
న చాఖ్యాన మిదం విద్యా న్నైవ స స్యా ద్విచక్షణః ॥

—వ్యా. భా. ఆది. 2-382.

* వ్యా. భా. ఆది. 63-89.

'వేదానధ్యాపయామాస మహాభారతపంచమాన్'

[భారతం పంచమోవేదః। సర్వప్రతిసమూహోయ మిత్యాసకృదుక్తేః ।
ఇతరపురాణ వదిదం న మన్తవ్య మిత్యర్థః ॥—నీలకంఠ.]

పోల్చు : తిక్కన-విరాట. 1-17,

"పారాశర్యుని కృతియయి భారత మనుపేరఁ బరఁగు పంచమవేదం
బారాధ్యము జనులకు............................"

భారతమునం దున్న ధర్మార్థకామమోక్షప్రతిపాదకము లయిన విషయము లితర గ్రంథములలో కన్పించును గాని యందు లేని విషయము లెందును గాన్పించవు.

ధర్మే చార్థే చ కామే చ మోక్షే చ భరతర్షభ ।
య దిహాస్తి త దన్యత్ర యన్నేహాస్తి న తత్ క్వచిత్ ॥

—వ్యా. భా. ఆది. 62-52.

పంచమవేద మైన భారతమొక విజ్ఞానసర్వస్వము.

భారతం సర్వశాస్త్రాణా ముత్తమం భరతర్షభ ।

—వ్యా. భా. స్త్రీ. 27-34

భారతము "సర్వవేదశాస్త్రముల యశేషసారము." 1

అందుఁ గల విషయవైవిధ్యమును బట్టి దానిని విద్వాంసులు పలువిధములుగా భావింతురు.

ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని
యధ్యాత్మవిదులు వేదాంత మనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రం బని
కవివృషభులు మహాకావ్య మనియు
లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహ మని
యైతిహాసికు లితిహాస మనియుఁ
బరమపౌరాణికుల్ బహుపురాణసముచ్చ
యం బని మహిఁ గొనియాడుచుండ

వివిధవేదతత్త్వవిదుఁడు వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరఁగుచుండఁ జేసె భారతంబు.

నన్నయ-భార-ఆది, 1-31

1. నన్నయ-భార-ఆది, 1-19.

భారతము ధర్మశాస్త్రము. సనాతనధర్మమును ప్రతిపాదించు గ్రంథము - సనాతన ధర్మ మనఁగా యజ్ఞయాగాదులు, పితృదేవాతిథిపూజలు, ఇష్టాపూర్తములు - ఇత్యాదులు. యజ్ఞములు, దేవతాయతనములు శిల్పమయములు. గృహస్థాశ్రమధర్మ నిర్వహణము నకు శిల్పినిర్మిత గృహాదులు, వాపీకూపతటాకాదులు, వివిధవస్తుజాలము నవసరమే.

నీతిశాస్త్రజ్ఞులు భారతమును రాజనీతిశాస్త్రముగా భావింతురు. నీతిశాస్త్ర మర్థ శాస్త్రములో నొకభాగము. శిల్పకళలను పోషించుట రాజధర్మము. అంతియె కాక ప్రజల జీవనోపాధి కొఱకు అనేక విధములగు వృత్తులు కల్పించుటయు రాజధర్మమే. వృత్తులలో కొన్ని శిల్పసంబంధములై యుండక తప్పదు.

కావ్యము నం దుండవలసిన అష్టాదశవర్ణనములలో పురవర్ణనము ముఖ్యమైనది. అది వాస్తువిద్యావిషయము. భారతమునం దనేక పురవర్ణనములే కాక నానావిధశిల్ప వర్ణనములు గలవు. కావుననది మహాకావ్యమైనది.

లాక్షణికు లనఁగా శాస్త్రజ్ఞానము గలవారు. వివిధశాస్త్రజ్ఞులకుఁ గావలసిన లక్ష్యములు భారతమునం దున్నవి. ద్వాత్రింశద్విద్యలలో శిల్పశాస్త్రమొకటి[1]. కావున భారతము నందు శిల్పశాస్త్రజ్ఞులకు కావలసిన విషయము లున్న వని భావింపఁదగును.

పద్మాది పురాణములు పదునెనిమిది. అగ్ని, మత్స్య, గరుడ, బ్రహ్మాండాది పురాణము లందు వాస్తువిద్యావిషయములు, శిల్పకళా విశేషములు నెక్కువగ నున్నవి. కావున బహుపురాణసముచ్చయ మని చెప్పబడిన భారతము శిల్పకళా నిలయము.

ఋగ్యజుస్సామాథర్వణాది చతుర్వేదము లందు శిల్పశాస్త్ర రహస్యములు నిగూఢముగ నిక్షేపింపఁబడి యున్నవి. 'సర్వవేద శాస్త్రముల యశేషసార' మయిన పంచమవేదము శిల్పకళామయమై యుండక తప్పదు.

భారతము కామశాస్త్ర మనియుఁ జెప్పబడినది.[2]

1. శుక్రాచార్య : శుక్రనీతి : చతుర్థాధ్యాయే - విద్యాకళానిరూపణ ప్రకరణమ్ - శ్లో-29.

2. అదే ... ... ... ...
గాంధర్వాతకాస ప్తకము : 1. నర్తనము 2. వాద్యయంత్రములు చేయుట, వాయించుట 3. వస్త్రాలంకార సంధానము 4. రూపప్రకాశనము 5. శయ్యాస్తరణాలంకారము 6. ద్యూతాది క్రీడలు 7. రతిబంధములు.

అంతఃపురములు, అభ్యంతరగృహములు, శయ్యాసనములు శిల్పకళావిలసితములు; నృత్యగీతాది గాంధర్వకళాసక్తతము కామశాస్త్రానుషంగికమే. భారతమునందీ వర్ణనము లన్నియు నున్నవి.

ఏ విధముగా జూచినను మహాభారతము నందు శిల్పకళా ప్రసంగము లున్నవని చెప్పవచ్చును.

లోకము నందు శిల్పము చరిత్ర కందని కాలము నుండియు నున్నది. కాని దాని ప్రాశస్త్యము వైదికవాఙ్మయము నుండియే తెలియవచ్చుచున్నది. అది రామాయణమహాభారతము లందు బహుధా వ్యక్త మయినది.

మహాభారతకాలమున శిల్పకళ లెట్లు లభివృద్ధి చెందినవో, ఆకాలమున శిల్పు లెంతటి యున్నతస్థితి యందున్నారో పరిశీలించుటయే నా ప్రధానలక్ష్యము.

ఈ లక్ష్యసిద్ధికి కవిత్రయము వారి శ్రీమదాంధ్రమహాభారతమునం దే యే శిల్పకళ లెట్లు చిత్రింపఁబడినవో యవి యెంత వఱకు మూలానుసరణములో పోల్చి చూచి ప్రాచీనభారతశిల్పకళావైభవమును మహాభారతకాలీనసమాజము నందు శిల్పకళాకారులకు గల స్థానమును స్థాపించుటకు ప్రయత్నము చేసెదను.

శిల్పసాహిత్యములు రెండును ఆనందదాయకములే.

'రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్ ।
పర్యుత్సుకో భవతి య త్సుఖితోఽపి జంతుః ॥

త చ్చేతసా స్మరతి నూన మబోధపూర్వం
భావస్థిరాణి జననాంతర సౌహృదాని ॥

— కాళిదాసు శాకుంతలము. 5-2.

మధురములగు శబ్దములలో వర్ణింపఁబడిన మనోహరశిల్పములు మఱింత ఆనందదాయకములై మన హృదయములను గదలించి అపూర్వానుభూతిని కలిగింపఁగల వనియే నా తలంపు.

ఈ నా ప్రయత్నమును వాచస్పతి యైన విశ్వకర్మభగవానుఁడు సఫలీకృత మొనర్చి నన్ను చరితార్థుని జేయుగాక:

వాచస్పతిం విశ్వకర్మాణ మూతయే ।
మనోజువం వాజే అద్యా హువేమ ॥



# శ్రీ మదాంధ్ర మహాభారత శిల్పకళా దర్శనము

## ద్వితీయోన్మేషము

## వాస్తుశిల్పము

విశ్వకర్మా మహాభాగో జజ్ఞే శిల్పప్రజాపతిః ।
కర్తా శిల్పసహస్రాణాం త్రిదశానాం చ వాస్తుకృత్॥*

—వ్యా. భా. ఆది. 66-28.

సమస్తవాస్తుశిల్పములకు మూలము ప్రభాసవసుపుత్రుఁడైన విశ్వకర్మయే.

ఆ విశ్వకర్మ సముదంచితశిల్పవిద్యా
ప్రావీణ్యతం త్రిదశపట్టణతక్షకుండై
భావంబునందు బహుభంగుల నేమి యైనన్
గావించుచుండుఁ దన కౌశల ముల్లసిల్లన్.

వెన్నెలకంటి సూరన :
ఆంధ్ర శ్రీవిష్ణుపురాణము. 2-271.

---

* 'త్రిదశానాం చ వర్ధకిః ।'—అనిపాఠాంతరము.

పోల్చు : 1) వాయుపురాణము. ఉ. భా. 22-17.
"త్వష్టా విరాజో రూపాణాం ధర్మపౌత్ర ఉదారధీః ।"

2) మత్స్యపురాణ. అ. 5. 27, 28.
"విశ్వకర్మా ప్రభాసస్య పుత్రః శిల్పి ప్రజాపతిః ।"
ప్రాసాదభవనోద్యాన ప్రతిమాభూషణాదిషు ।
తడాగారామకూపేషు స్మృతః సోఽమరవర్ధకిః ॥

పై దికయుగమున దేవతల శిల్పి త్వష్ట, వాని శిష్యులయిన ఋభువులు, భావన విశ్వకర్మ, తక్షుఁడు మున్నగువారు ప్రసిద్ధి కెక్కిన శిల్పులు. ఇతిహాసయుగమున సురశిల్పిగా విశ్వకర్మయు, అసురశిల్పిగా మయుఁడు వీరి స్థానము నాక్రమించి ఖ్యాతిఁ గాంచినారు. పురాణేతిహాసము లీ మహాశిల్పుల శిల్పచమత్కారములతో నిండి యున్నవి.[1]

పురవర్ణనము లేని కావ్య ముండదు. కవివృషభులచే మహాకావ్యముగా భావింపఁబడిన మహాభారతము నందు విశ్వకర్మ నిర్మితములు, మయకృతములు నగు పురదుర్గాదివాస్తుశిల్పవర్ణనము లెన్నియో యున్నవి. వీనిని పరిశీలించినచో మహాభారతకాలమున స్థాపత్యము – వాస్తుకళ – యెంతగా నభివృద్ధి చెందినదో తెలియఁ గలదు.

మహాభారతకాలము నాటికి దేశము నందంతట పల్లెలు, గొల్లపల్లెలు, మునిపల్లెలు, బ్రాహ్మణాగ్రహారములు, నగరములు, మహాగ్రామములు నెలకొని యున్నవి.

నలదమయంతులఁ 'జూచ్చొని వచ్చిన వారికి గోసహస్రంబులు, నగ్రహారంబు లిత్తు' నని విదర్భేశ్వరుఁడు ప్రకటింపగా,

జగతీచక్రమునం గల
నగరమహాగ్రామపక్కణంబులు కలయన్
జగతీదేవో త్తము లి
మ్ముగ రోసిరి నిఖిలదేశముల కరిగి వడిన్.

— నన్నయ. భార-అరణ్య-2. 140-141.

1. Cf : Dr. V. Raghavan : Yantras or Mechanical Contrivances in Ancient India. P. 3.

"The Ribhus, Viswakarman and Tvastar of the Vedas and the anonymous Vedic Takshan are succeeded in the epics by the two great architects of the Devas and the Asuras, Visvakarman and Maya. The epics form indeed the great age of the exploits of Visvakarman and even to a greater extent of Maya."

మూలము నం దిట్లున్నది.

అగ్రహారాంశ్చ దాస్యామి గ్రామం నగరసమ్మితమ్....
పురరాష్ట్రాణి చిన్వంతో నైషధం సహ భార్యయా ॥
- వ్యా. భా. వన. 68-4, 5.

తే పురాణి సురాష్ట్రాని గ్రామాన్ ఘోషా స్తథాశ్రమాన్ ॥
- వ్యా. భా. వన. 69-49.

శుకమహర్షి మేరునగము నుండి మిథిలానగరము వఱకుఁగల 'పలు తెఱఁగుల దేశములను .... గడచి వచ్చె భరతఖండమునకు' —అని తిక్కన వ్రాసినాడు.
[భార. శాంతి. 6-262]

శుకమహర్షి యనేక పట్టణములు, నగరములు, పల్లియలు, గొల్లపల్లెలు, చూచియుఁజూడ నట్లే వచ్చినాఁడని మూలము నందు వర్ణింపఁబడినది.

పత్తనాని చ రమ్యాణి స్ఫీతాని నగరాణి చ ।
వస్త్రాణి చ విచిత్రాణి పశ్యన్నపి నపశ్యతి ॥

తత్ర గ్రామాన్ బహూన్ పశ్యన్ బహ్వన్నరసభోజనమ్ ।
పల్లీ ఘోషాన్ సమృద్ధాంశ్చ బహుగోకులసంకులాన్ ॥
వ్యా. భా. శాంతి. 326-17.

కాని, మహాభారతము నందు సామాన్యప్రజానీకము నివసించు పల్లెటూళ్ల వర్ణనములు లేవు. లేకున్న నేమి ? అందలి పురవర్ణనములను బట్టియే యాకాలము నాటి వాస్తుకళావిశేషములు తెలియవచ్చును.

—)o(—

# ఇంద్రప్రస్థపురము

మహాభారతము నందలి పురవర్ణనములలో ఇంద్రప్రస్థపుర వర్ణన మత్యంత మనోహర మయినది.

పురగోపురదుర్గప్రాకారహర్మ్యాదివర్ణనములు చేయుటలో నన్నయ వ్యాస భారతము ననుసరించి నట్లగపడదు. ఆయన కొంత స్వతంత్రించి స్వకపోలకల్పనము లతో పది పద్యములు వ్రాసినాఁడు. వాని యందము వానిది.

వ్యాసభారతము నందలి యింద్రప్రస్థపురవర్ణనము కూడ కొంత కల్పనాగంధము కలిగియున్నను శిల్పకళాకౌశల్యాభివ్యంజకమై సలక్షణముగ నున్నది. ప్రాచీనభారత శిల్పాచార్యుల ప్రతిభా విశేషములు, శిల్పకల్పనములు మనోనేత్రమునఁ జూచువారి కబ్బురము గొల్పు నట్లున్నవి.

మహాకవి చేయు వర్ణనములలో కొన్ని చోట్ల యుత్ప్రేక్షాతిశయోక్త్యాద్య లంకారము లుండక తప్పదు. ఆ యుత్ప్రేక్షలను అతిశయోక్తులను పరిహరించినచో వస్తుతత్త్వము నయనగోచర మగును. అప్పు డా వస్తువు నిజస్వరూపము బయల్పడును.

నన్నయ వర్ణనల యందలి వన్నియను, వ్యాసభారతము నందలి వాసిని పరి శీలించినచో తెలుఁగు భారతమునందలి జిలుఁగును, మూలము నందలి వెలుఁగును జూడనగును.

ధృతరాష్ట్రుఁడు పాండవుల కర్ధరాజ్య మిచ్చి, ధర్మరాజు నభిషిక్తుం జేసి, ఖాండవప్రస్థము నివాసముఁ జేసికొనియుండు డని పనిచెను. పాండవులు వాసుదేవ సహితులయి చనిరి. అంత

హరి యింద్రుఁ దలఁచె నింద్రుఁడు
కర మనురాగమున విశ్వకర్మను బనిచెన్
సురపురమున కెన యగు పుర
మరుదుగ నిర్మింపు ముర్వి నని కడుఁ బ్రీతిన్.

ద్వైపాయనుండును ధౌమ్యుండు నాదిగా
భూసురుల్ సూత్రవిన్యాస మమరఁ
జేసి శాంతికవిధుల్ సేయంగ, సుప్రశ
స్తంబైన రమ్యదేశంబు నందు
వాసవాదిష్టుఁడై వసుధకు నేతెంచి
పేర్మితో నవ్విశ్వకర్మ పురము
నిర్మించె, నదియును నిరుపమలీలలఁ
ధనరి యింద్రప్రస్థ మనఁగ నింద్రు

పురము తోడఁ గుబేరపురముతో వరుణుని
పురము తోడ నీశపురము తోడ
సురగపురముతోడ సురువిలాసంబుల
సరి యనంగ నొప్పు ధరణి మీఁద.

నన్నయ. భార-ఆది. 8-69, 70

పాండవులు ద్వైపాయనపురోగములై ఖాండవవనము నందు శుభప్రదేశమున వాస్తూపశమనము చేసి నగరనిర్మాణార్థము భూమాపనము చేసినట్లు మూలమునందున్నది.

తతః పుణ్యే శివే దేశే శాంతిం కృత్వా మహారథాః ।
నగరం మాపయామాసు ర్ద్వైపాయనపురోగమాః ॥

—వ్యా. భా. ఆది. 207-29.

ఇట శాంతి యనఁగా వాస్తూపశాంతి యని యర్థము.

నూతన నగరగ్రామదుర్గప్రాసాదగృహాది సమస్తవాస్తు నిర్మాణములు ప్రారంభించుటకు ముందుగా స్థలనిర్ణయము చేసికొని, వాస్తుశాంతి చేసి భూమాపనము చేయవలయును.

నగరగ్రామదుర్గాదౌ గృహప్రాసాదవృద్ధయే ।
ఏకాశీతిపదై ర్వాస్తుం పూజయేత్ సిద్ధయే ధ్రువమ్ ॥*

—అగ్నిపురాణము. అ. 105-1.

ఏతద్వాస్తూపశమనం కృత్వా కర్మ సమాచరేత్ ।....
వాస్తూపశమనంకృత్వా తతః సూత్రేణవేష్టయేత్ ॥

—మత్స్యపురాణము, అ. 256.

స్థలనిర్ణయము చేసికొని, వాస్తూపశమనము చేయవలసిన వారు యజమానులు. ఇట పాండవులు.

వాస్తుపూజాది శాంతిక పౌష్టికములు చేయింపువారు అథర్వవేదవిదు లయిన పురోహితులు.

* వాస్తుపూజా-వాస్తోష్పతిపూజా-విధానము వేఱొక ప్రకరణము నందు వివరింపఁబడినది.

సూత్రము పట్టి భూమాపనము చేయవలసినవారు స్థపతులు[1] సూత్రము పట్టువారు కావున వారికి సూత్రధారు లని పేరు.

ధౌమ్యాదిభూసురులు సూత్రవిన్యాసము చేసినట్లు నన్నయ వ్రాసినాడు. ధౌమ్యాదులు పురోహితులే కాక శిల్పశాస్త్రజ్ఞులయిన విశ్వభూసురులై యుండవచ్చును.

ఇంద్రప్రస్థపురమును విశ్వకర్మ నిర్మించినాఁ డని నన్నయ వ్రాయుటకు మూలము వ్యాసభారతము నందలి యీ క్రింది శ్లోకములు.

వాసుదేవో జగన్నాథ శ్చింతయామాస వాసవమ్ ।
మహేంద్రశ్చింతితో రాజన్ విశ్వకర్మాణ మాదిశత్ ॥

మహేంద్ర ఉవాచ ॥

విశ్వకర్మన్ మహాప్రాజ్ఞ అద్యప్రభృతి తత్పురమ్ ।
ఇంద్రప్రస్థ మితిఖ్యాతం దివ్యం రమ్యం భవిష్యతి ॥

వైశంపాయన ఉవాచ ॥

మహేంద్రశాసనాత్ గత్వా విశ్వకర్మా తు కేశవమ్ ।
ప్రణమ్య ప్రణిపాతార్హం కిం కరోమీత్యభాషత ॥
వాసుదేవస్తు తచ్ఛ్రుత్వా విశ్వకర్మాణ మూచివాన్ ।

వాసుదేవ ఉవాచ ॥

కురుష్వ కురురాజాయ మహేంద్రపుర సన్నిభమ్ ।
ఇంద్రేణకృతనామానా మింద్రప్రస్థం మహాపురమ్ ॥*

నన్నయ కీ శ్లోకములు గల ప్రతి దొరికి నట్లున్నది.

1. చూడు : ఎఱ్ఱాప్రెగడ. హరివంశము. ఉ. భా. అ. 2-154.

"అనుపమసర్వసాధనసమగ్రతతో శుభవేళ వాస్తుపూ
జన బలిహోమ తంత్రములు సద్విధిఁ జేయఁగ,
సూత్రహస్తులై మనుకొని కోవిదస్థపతిముఖ్యులు
శిల్పము లుద్యమించి" నట్లు వర్ణింపఁబడినది.

* చూడు : శ్రీమన్మహాభారతమ్ గోరఖ్‌పూరుప్రతి. పు. 257.
ఆది. అ. 206-18. రచవాచ.

వ్యాసకృత భాగవతాదిమహాపురాణము లందును ఇంద్రప్రస్థపురము విశ్వకర్మ చేత నిర్మింపఁబడినట్లు వర్ణింపఁబడినది.* కావున నన్నయ పై శ్లోకార్థములను గ్రహించి,

'వాసవాదిష్టుఁడై వసుధకు నేతెంచి పేర్మితో నవ్విశ్వకర్మ పురము నిర్మించె' నని యనువదించినాఁడు. ఇది యెంతయో సముచితముగా నున్నది.

ఏదేని పురమును నిర్మింపవలె నన్న దాని కొక ప్రణాళిక యుండవలయును గదా! నగరరచనాప్రణాళికను సిద్ధముచేసి, నిర్మాణకార్యక్రమమును నిర్వహించు ముఖ్యశిల్పి యొక డుండక తప్పదు. అతఁడే విశ్వకర్మ. లోకము నం దట్టి విశ్వకర్మ లనేకు లుండురు. ఏ కాలము నం దేవిశ్వకర్మ యే పురమును నిర్మించినాఁడో తేల్చి చెప్పుట కష్టము. విశ్వకర్మ యన స్థపతిముఖ్యుఁ డనియు ప్రధానశిల్పాచార్యుఁ డనియు భావింపవచ్చును.

ఇంద్రప్రస్థమును నిర్మించిన విశ్వకర్మ వాసవాదిష్టుఁడై వసుధకు నేతెంచినవాఁ డగుటచే నీ విశ్వకర్మ సురశిల్పి యనియు, త్రివిష్టపవాసి యనియు నింద్రసభలో నుండువాఁడనియు తెలియవచ్చును.

సురశిల్పి యగు విశ్వకర్మ చేత నిర్మింపఁబడిన యింద్రప్రస్థము నిరుపమానమై,

* చూడు : 1. వ్యాస : భాగవతమహాపురాణము. స్కం. 10-58-24.
"యదైవ కృష్ణః సందిష్టః పార్థానాం పరమాద్భుతమ్ ।
కారయామాసనగరం విచిత్రం విశ్వకర్మణా ॥"

2. ఆంధ్ర. భాగ-దశమ స్కంధము — ఉత్తరభాగ. 130.
"హరియు...ధర్మరాజు కడకుం జని వారలు గోరిన
విశ్వకర్మను రావించి వారి పురం బతివిచిత్రంబు సేయించె ॥"

3) Dr. A. B. L. Avasthi = Studies in Skanda Purana-Part-I-P. 107.

"Indra at the instance of Vasudeva, asked Visvakarma to build a fine town, named khandaprastha or Sakra Prastha."

— Sk. II 1-29; 10-10.

'ఇంద్రుపురముతోఁ గుబేరుపురముతో వరుణేంద్రుపురవరంబు
తోడ, సురగరాజపురవిభూతి తోడ సురవిలాసంబుల
సరియనంగ నొప్పు ధరణి మీఁద.' 1

అట్టి యింద్రప్రస్థపుర విభూతివిలాసము లెట్టివో విలోకింతము.

## కాంచన హర్మ్యములు.

ఇమ్ముగ విశ్వకర్మ రచియించిన కాంచనహర్మ్యతుంగశృం
గమ్ముల రశ్మిరేఖలు ప్రకాశములై కడుఁ బర్వి తత్సమీ
పమ్మునఁ బారుచున్న ఘనపంక్తుల యం
దచిరద్యుతిప్రతా
నమ్ములఁ గ్రేణి సేయుచు ననారతమున్ విలసిల్లుఁ
దత్పురిన్.*

నన్నయ. భార. ఆది. 8-71,

విశ్వకర్మచే మనోహరముగా నిర్మింపఁబడిన యింద్రప్రస్థపురము లోని మేడలు మిక్కిలి యెత్తైనవి. ఆమేడల పై భాగములందు బంగారు కాంతిరేఖలు ప్రకాశించుచుండును. వాని సమీపమునఁ బరువు మేఘపంక్తుల యందలి మెఱుపుఁదీగలు స్థిరమయినవి కావు; కావున వాని నవి గేలి సేయుచుండును.

హర్మ్య మనఁగా ధనికుల గృహము.

హర్మ్యాదిర్ధనినాంవాసః ॥ — అమరకోశము. 2 కాండ.

1. నన్నయ. భార. ఆది. 8-70. (వ్యా. భా. 207-31, 36)
'యయౌ తత్పురశ్రేష్ఠం నాగైర్భోగవతీమివ' — 207, 31.
'తత్త్రివిష్టపసంకాశ మింద్రప్రస్థం వ్యరోచత' — 207-36.

* పోల్చు: 1. ఆంధ్రమహాభాగవతము. 4. 744.
పురంజనుఁడు చూచిన నవద్వారపురము
'సౌవర్ణరౌప్యాయసఘనశృంగముల.....................
రమణీయవివిధగేహముల మించి' యున్నది.

2. వ్యాస. భాగ. 4-25-14.
"స్వర్ణరౌప్యాయసైః శృంగైః సంకులాం సర్వతో గృహైః ।"

హృదయమున కాహ్లాదము గలిగించుగృహము హర్మ్యము.[1]

శృంగ మనఁగా హర్మ్యపరిభాగము.

The top of a building, turret, elevation.[2]

ఉపరితలమునను గోడలమీఁదను విమానకలశాదిశిల్పరచనము చేయఁబడిన విశాలమైన భవనము హర్మ్య మని శిల్ప శాస్త్రజ్ఞులు చెప్పుదురు.

> 'మౌలిభాగే చ భిత్తిప్రాంతే చ విమానకలశరచనోపేతం
> ..................హర్మ్యం'
>
> — విశ్వకర్మ వాస్తుశాస్త్రము. పు. 242.

ఈ శిల్పసంప్రదాయము ద్వారకానగరము నందు పాటింపబడినది. ద్వారకా నగరము నందు సౌధాగ్రములు హేమకుంభములతో నలంకరింపఁబడి యున్నట్లు భాగవతము నందు వర్ణింపఁబడినది.

> సరస నడచుచుండి సౌధాగ్ర హేమకుం
> భముల లోన నినుఁడు ప్రతిఫలింప
> నేర్పరింప లేక నినులు పెక్కండ్రంచుఁ
> బ్రజలు చూచి చోద్యపడుచు నుండ్రు.
>
> — ఆంధ్ర. భాగ. స్కం. 10-పూ. భా. 1602.

కావున నింద్రప్రస్థము నందలి హర్మ్యపరిభాగములు కాంచనకలశములతో నలంకరింపఁబడియున్నవనియు, వాని కాంతులు మెఱుఁగుదీగెల నధఃకరించుచున్న వనియు తెలియుచున్నది.

1. Cf: Sir Monier Monier Williams - A Sanscrit - English Dictionary

   Harmya: n. (said to be from √hri; to captivate or charm the mind; but rather connected with √ghri and gharma and perhaps originally signifying the domestic fire hearth.)

   a large house, palace, mansion, any house or large building or residence of a wealthy person.

2. Cf: V. S. Apte = The Students' Sanscrit English Dictionary.

# భవనములు

ఇంద్రప్రస్థము నందలి భవనములను వర్ణించునట్టియొక పద్యము కొంచెము క్లిష్టమయ్యును శిల్పకళావిశిష్టమై మనోహరముగ నున్నది.

అలఘుతరంబులై తుహినహారిసుధారుచి నింపరోచిరా
కుల శశికాంతవేది పృథుకుంజ[1] గళజ్జలనిర్ఝరంబులన్
విలసితజాహ్నవీ విమలవీచివిలోల లసత్పతాకలన్
బొలుపగుఁ దత్పురీభవనముల్ హిమశైలముఁ బోలి యున్నతిన్.

నన్నయ-భార. ఆది. 8-72

ఆ పురము నందలి భవనములు హిమశైలము వలె నున్నతమైనవి. వానికి మంచువలె మనోజ్ఞమయిన సున్నము వేయఁబడినది. అట్టి తెల్లని మేడల ముందు చంద్రకాంతులను కలవరపెట్టు చంద్రకాంతశిలల చేత నిర్మింపఁబడిన వేదిక లున్నవి. ఆ వేదికల యందు చేరఁబడుటకు వీలుగా యొరగుడు దిండ్లు కట్టఁబడినవి. వానికి 'మత్తవారణము' అని పేరు.[2] సుధాకరకిరణములకుఁ గరగెడు చంద్రకాంత శిలల నుండి స్రవించు జల మా మత్తవారణగండస్థలముల నుండి జాలువారు చున్నట్లుగ శిల్పరచన చేయఁబడినది. ఆ నీరు సెలయేళ్లై ప్రవహించుచున్నది. ఆ భవనములపై పతాకలు గంగాతరంగముల వలెఁ గదలాడుచున్నవి.

1. కుంజ మను చోట 'కుడ్య' మను పాఠాంతరము గలదు.
కుంజ మన నికుంజ మని కొందఱు చెప్పుచున్న యర్థ మిచట పొసఁగదు.
కుంజ మనఁగా చెక్కిలి. 'కుంజోఽస్త్రీ గహ్వరే హనౌ'.
— ఇతి వైజయంతీ.

పృథుకుంజ మనఁగా విశాలమైన గండస్థలము. కనుక మత్తవారణ గండస్థల మను స్ఫూర్తి కలుగుచున్నది. ఇందలి సామంజస్యమును శ్రీయుతులు చాగంటి గోపాల కృష్ణమూర్తి గారును, డా॥ కొత్తపల్లి వీరభద్రరావు గారును అంగీకరించినారు.

2. మత్తవారణము అనఁగా నేఁడుగల మన్నాఁటి వాని యాకారమున నుండు పిట్ట యరుగులు. (చూడు : మాఘకావ్యము. ౩-౫౮. వ్యాఖ.)
'వితర్ది నిర్యూహ విటంకనీడః' —నిర్యూహాః మత్తవారణాఖ్యా ఉపాశ్రయాః । నిర్యూహో మత్తవారణ-ఇతి వైజయంతీ.

వ్యాసభారతము నందలి యింద్రప్రస్థపురవర్ణన మెట్లున్నదో చూడుఁడు.

విరోచమానం వివిధైః పాండురై ర్భవనోత్తమైః ।
తత్త్రివిష్టపసంకాశ మింద్రప్రస్థం వ్యరోచత ॥
మేఘవృందమివాకాశే విద్ధం విద్యుత్సమావృతమ్ ।

— వ్యా. భా. ఆది. 207–36, 37.

తెల్లగా వెల్లవేయబడిన వివిధభవనములతో నింద్రప్రస్థము విద్యుల్లతలతో సమాశ్లిష్ట మైన మేఘపంక్తులతో నొప్పారు నాకాశము వలె నున్నది. అది యింద్ర పురి యగు నమరావతిని బోలి యుండుటచే నింద్రప్రస్థ మని పిలువఁబడుచున్నది.

ఇట్టి సుధాధవళితహర్మ్యములు పురద్వారముల చెంతఁగూడ నున్నవి.

ద్విపక్షగరుడప్రఖ్యై ర్ద్వారైః సౌధైశ్చ శోభితమ్ [1] ॥

— వ్యా. భా. ఆది. 207-32.

ఇంద్రప్రస్థము నందలి హర్మ్యములు రాజప్రాసాదములు మిక్కిలి యున్నత ములై యొకదానితో నొకటి పోటీపడుచున్నవి.

హర్మ్యప్రాసాదసంబాధం నానాపణ్యవిభూషితమ్ ।
విస్పర్ధయేవ ప్రాసాదా [2] అన్యోన్యస్యోచ్ఛ్రితా భవన్ ॥*

ఈ వర్ణనము వలన నింద్రప్రస్థము నందు వివిధగృహములు హర్మ్యములు, సౌధములు, రాజప్రాసాదములు, తత్సదృశములైన భవనరాజములు గల వని తెలియుచున్నది.

---

1. సౌధోఽస్త్రీ సుధయా శ్వేతం మేటో హర్మ్యంచ మాలికా ।

— ఇతి వైజయంతీ.

సౌధోఽస్త్రీ రాజసదనమ్ ॥ — అమరకోశము.

2. ప్రాసాదో దేవభూభుజామ్ ॥ — అమరకోశము.

ప్రాసాద మనగా రాజగృహము లేక దేవాలయము.

* చూడు : శ్రీమత్సంస్కృత మహాభారతము — శ్రీ పి. పి. సుబ్రహ్మణ్యశాస్త్రి సంశోధిత ప్రతి. — ఆది. అ. 198-64.

## పాండవుల నివాసగృహము

పురమధ్యమున రమ్యమును శుభప్రదము నైన ప్రదేశము నందు పాండవుల నివాసగృహము నిర్మింపఁబడినది. అది సర్వసంపదలతో నిండి కుబేరభవనము వలె నున్నది. అందే యద్దము వలె తళతళ లాడు క్రీడాగృహములు, లతాగృహములు, మనోహరమైన చిత్రశాలలు, వినోదార్థము కృత్రిమపర్వతములు నిర్మింపఁబడినవి.

తత్ర రమ్యే శివే దేశే కౌరవ్యస్య నివేశనమ్ ॥
శుశుభే ధనసంపూర్ణం ధనాధ్యక్షక్షయోపమమ్ ।
గృహై రాదర్శవిమలై ర్వివిధైశ్చ లతాగృహైః ।
మనోహరై శ్చిత్రగృహై స్తథాఽజగతిపర్వతైః ।*
— వ్యా. భా. ఆది. 207-45, 46.

## రాజభవనము

పాండవుల నివాసగృహముల మధ్య దేవేంద్రభవనము వలె రమణీయమైన రాజభవనమును విశ్వకర్మ నిర్మించినాఁడు.

వేశ్మ మధ్యే శుభం దివ్య మిన్ద్రవాసగృహోపమమ్ ।
రాజ్ఞో వాసగృహం రమ్యం విశ్వకర్మాఽత్యకారయత్।**
వ్యా. భా. ఆది. అ. 198-70.

* అజగతిపర్వతైః నృపలీలాయాత్రార్థైః కృత్రిమైః పర్వతైః ।

'అజశ్ఛాగే హరౌ బ్రహ్మణిస్మరహరే నృపే । గతిః స్త్రీ మార్గదశయోః జ్ఞానే యాత్రాభ్యుపాయే । — ఇతి మేదినీ. ॥ — నీలకంఠ.

— వ్యా. భా. చిత్రశాలాప్రతి. పు. 330.

** చూడు : శ్రీ మత్సంస్కృత మహాభారతము. శ్రీ పి. పి. సుబ్రహ్మణ్యశాస్త్రి సంశోధితము. — వావిళ్ల ప్రతి.

# విశాలమైన వీథులు

ఇంద్రప్రస్థపురము నందలి రాజమార్గములు చక్కగా విభజింపఁబడియున్నవి. కావున ప్రమాదభీతిలేదు.

సువిభక్తమహారథ్యం దేవతాబాధవర్జితమ్ ॥

వ్యా. భా. ఆది. 207_35*

రథ్య యనఁగా రథములు పోవుమార్గము. రాజమార్గము.

మహాభారతకాలమున రాజధానీనగరము లన్నియు నిట్లువిశాలమైన రాజమార్గములతో నొప్పుచున్నవి.[1]

# సుందరోద్యాన వనములు

ఇంద్రప్రస్థము చుట్టును సుందరోద్యానవనములున్నవి. అవి పుష్ప ఫల భరితములయిన వివిధ లతా వృక్షములతో నొప్పుచున్నవి.

సరళ తమాల తాల హరిచందన చంపక నారికేళ కే
సర కదలీ లవంగ పనసక్రముకార్జున కేతకీ లతా
గరు ఘనసార సాల సహకార మహీరుహరాజరాజి సుం
దర నవనందనావళులఁ దత్పురబాహ్యము లొప్పఁ జూడఁగన్.

నన్నయ భార. ఆది. 8-78.

ఈ యుద్యానవనవర్ణన మించుమించు మూలానుసరణమే.

* "And the streets were all wide and laid out excellently. And there was no fear in them of accidents."

— P. C. Ray Mbh. P. 577.

1. చూడు : మిథిలానగర పట్టనము. వ్యా. భా, వన పర్వము.

'పత్తనైశ్చ బహుభిర్యుక్తాం సువిభక్తమహాపథామ్.'

— అ. 207-8.

ఉద్యానాని చ రమ్యాణి నగరస్య సమంతతః ।.... ....

.... .... .... .... .... .... ....

నిత్యపుష్పఫలోపేతైర్ నానాద్విజగణై ర్యుతైః ॥

వ్యా. భా. ఆది. 207-40-44.

ఇట్టి యుద్యానవనములపై నుండి వీచు గాలి యానందకరమైనదే కాక యారోగ్యప్రదమయినది కూడ.

## వాపీ కూపతటాకములు

ఇంద్రప్రస్థము నందంతట స్వచ్ఛమైన నీటితో నిండిన బావులు, పద్మాకరములు, జలపూర్ణము లైన పుష్కరిణులు, రమ్యమైన తటాకములు నున్నవి.

వాపీభి ర్వివిధాభిశ్చ పూర్ణాభిః పరమాంభసా ॥

సరోభి రతిరమ్యైశ్చ పద్మోత్పలసుగంధిభిః ।

హంసకారండవయుతై శ్చక్రవాకోపశోభితైః ॥

రమ్యాశ్చ వివిధా స్తత్ర పుష్కరిణ్యో వనావృతాః ।*

తడాగాని చ రమ్యాణి బృహంతి సుబహూని చ ॥

వ్యా. భా. ఆది. 207, 46-48.

వాపీకూపతటాకాదుల లక్షణము వరాహమిహిరకృత జలార్గళశాస్త్రము నందిట్లు చెప్పఁబడినది.

ద్వారాహీనో భవేత్ కూపో ద్వారేణై కేన వాపికా ।

నైకద్వారా పుష్కరిణీ దీర్ఘాకారా తు దీర్ఘికా ।

కుల్యా విభూతతోయాశ్చ తటాకాః పరికీర్తితాః ॥

జలార్గళ శాస్త్రము. శ్లో. 7.

* వనావృతాః వనైః ఆరామైః ఆవృతాః జలపూర్ణా వా॥ —నీలకంఠ.

ద్వారరహితముగ నుండినది కూపము. ఒక ద్వారము గలది వాపి. అనేక ద్వారములు గలది పుష్కరిణి. దీర్ఘాకారముగ నుండునది దీర్ఘిక. జల ప్రవేశనిర్గమనమార్గములు గలిగి సమృద్ధిగ నుదకము ఉండునది తటాకము.

ఈ జలాశయము లన్నియు శిల్పశాస్త్రానుసారము నిర్మింపఁబడవలయును.

## పురరక్షణము

ఇట్టి యింద్రప్రస్థపురము ఎత్తైన ప్రాకారములతోను, లోతైన యగడ్తలతోను, భయంకరమైన కవాటములు గల తోరణ ద్వారములతోను, బహువిధశస్త్రాస్త్రములు గల కోటబురుజులతోను రక్షింపఁబడుచున్నది.

## 1. పరిఖా ప్రాకారములు

పరిఖజలంబు లం దమలపంకరుహోత్పలకైరవాది సుం
దరకుసుమంబులున్, ఘనపథంబున నుజ్జ్వలతారకా నిరం
తరకుసుమంబులున్ వెలయుఁ దత్పురవప్రము పాదపీఠికా
శిరముల కొప్ప నర్చనలు సేసిన పువ్వుల యవ్విధంబునన్.

నన్నయ. భార. ఆది. 8-76.

వప్ర మనఁగా కోటగోడ.

వప్రః ప్రాకారమూలికా

-ఇతి. వైజయంతి. *

* 1. వప్రమ్ = దుర్గనగరే పరిఖాయా ఉద్ధృతః మృత్తికా స్తూపబద్ధే;
యదుపరి ప్రాకారో నివేశయతే తత్; వయః ॥
—హలాయుధ కోశః । (ప్రక్క పేజి)

పరిఖ యనఁగా చుట్టును త్రవ్వఁబడినది. అగడ్త.

పురవప్రము యొక్క పాదపీఠిక పరిఖ; శిరము ఘనపథము. అగడ్తలో పంకరుహాది కుసుమములు, ఆకసములో తారకాకుసుమములు పురవప్రము (కోటగోడ) యొక్క పాదములకు శిరస్సునకు పూజలు చేసిన పూవులో యనునట్లున్న వని యుత్ప్రేక్షింపఁబడుటచే నా పుర ప్రాకారము లాకసము నంటుచున్న వని చెప్పకయే చెప్పినట్లైనది.

మూలము నందు పరిఖలు సముద్రము వలె లోతైన వనియు, ప్రాకారములు తెల్లని మేఘముల వలెను, చంద్రకాంతుల వలెను. ప్రకాశించుచు నాకసము నంటు చున్నట్లు వర్ణింపఁబడినది.

> సాగరప్రతిరూపాభిః పరిఖాభిరలంకృతమ్ ।
> ప్రాకారేణ చ సంపన్నం దివమావృత్య తిష్ఠతా ॥
> పాండురాభ్రప్రకాశేన హిమరశ్మి నిభేన చ ।
> శుశుభే తత్పురశ్రేష్ఠం నాగైర్భోగవతీ తథా ॥

— వ్యా. భా. ఆది. ౨౦౭-౩౦, ౩౧.

౨. వప్రము = 1. అగడ్తలో నుండి యెత్తి ప్రాకారము చుట్టును పోయు మట్టిదిబ్బ, 2. కోట యొ. దానిచే సంరక్షింపఁబడు పట్టణము యొక్క ద్వారము.

— సూర్యరాయాంధ్ర నిఘంటువు,

౩. వప్రః, వప్రమ్ ॥ A rampart earth work, mud-wall.

The foundation of a building, the gate of a fortified town.

— V. S. Apte : S. S. E. D.

4. Cf : V. S. Agarwala : Stndies in Indian Art. P. 97.

"In ancient architecture the Prakara and Vapra go together. As stated by Dr. Coomara Swamy, 'on the city side of the moat rises the wall (Pakara skt. Prakara) from a fourdation or plinth (Vapra)'.................. Vapra and Prakara sometimes treated as synomymons."

# 2. గోపురములు

ఇంద్రప్రస్థపురగోపురములను నన్నయ మనోహరముగా చిత్రించినాఁడు.

తమము నడంచుచున్ వెలుఁగు తత్పురగోపురశాతకుంభ కుం
భముల విచిత్రసన్మణిగభస్తివితానములన్ విచిత్ర వ
ర్ణము లగు నాత్మవాహముల నమ్మక పల్మఱుఁ జూచి యన్యవా
హము లని సంశయప్రణిహితాత్ముఁడగున్ హరిదశ్వుఁ డెప్పుడున్.

—నన్నయ. భార. ఆది. 8-77

గోపురము లనఁగా పురద్వారములు. ప్రాకారము నాశ్రయించి యుండు ద్వారములు.

"యత్ ప్రాకారాశ్రితం ద్వారం పురే గోపురం విదుః ।"

—సమరాంగణ సూత్రధారః । అ. 18-52.

ఇంద్రప్రస్థపుర ద్వారములపై బంగారుకలశములున్నవి. అవి విచిత్ర రత్న స్థగితములు కాపున వాని కాంతులకు చీకటు లడఁగుచున్నవి. సూర్య రథాశ్వము లా రత్నకాంతులకు రంగులు మాఱి విచిత్రవర్ణము లగుచున్నవి. వానిని చూచి హరి దశ్వుఁ డవి తన గుఱ్ఱము లగునో కాదో యని సందేహించుచున్నాడు.

పురగోపురముల పైనున్న స్వర్ణకలశముల కాంతికి సూర్యరథాశ్వములు రంగులు మాఱుచున్న వనఁగా నవి యంత యెత్తైన వన్నమాట.

పూర్ణకుంభము సంపత్సమృద్ధికి శాశ్వతత్వమునకు ప్రతీక. అది అష్టమంగ ళములలో నొకటి. దాని యునికి శుభప్రద మయినది.

పురద్వారములను పూర్ణకుంభములతో నలంకరించు సంప్రదాయము బహు పురాతనమైనది.

అథర్వవేదము నందలి శాలాసూక్తములో పూర్ణకుంభప్రశంస యున్నది.

పూర్ణం నారి ప్రభర కుంభమేతం
ఘృతస్య ధారామమృతేన సంభృతామ్ ।
ఇమాం పాతౄ నమృతేనా సమజ్
గ్ధిష్టాపూర్త మభి రక్షాత్యేనామ్ ॥

అథర్వ — 3-12-8.

[ఓ నారీ ! గృహపత్నీ ! అమృతఘృతధారలతో నింపిన పూర్ణకుంభమును మావద్దకుఁ గొనిరమ్ము. ఈ పానప్రియులను అమృతములో ముంచెత్తుము. మా చేయు నిష్టాపూర్త ఫలము లీ శాలను రక్షించుఁగాక ।]

ఈ సంప్రదాయము ననుసరించి నన్నయ యింద్రప్రస్థపుర గోపురములపై శాతకుంభకుంభముల నుంచి మూలాతిశాయిగా వర్ణించినాఁడు.

వ్యాసభారతము నందలి గోపురవర్ణనము వలన కోటగవనుల ప్రయోజనమును, తన్నిర్మాణము నందలి శిల్పచమత్కారమును తెలియుచున్నది.

ద్విపక్ష గరుడప్రఖ్యై ర్ద్వారైః సౌధైశ్చ శోభితమ్ ।
గుప్త మభ్రచయప్రఖ్యై ర్గోపురై ర్మందరోపమైః ॥*

వ్యా. భా. ఆది. 207-32

ఇంద్రప్రస్థము మందరపర్వతము వలె నున్నతములును, మేఘ మాలికల వలె తెల్లనివియు నగు గోపురములతో — పురద్వారములతో — రక్షింపఁబడుచున్నది.

* పాఠాంతరము :

విపక్ష గరుడప్రఖ్యై ర్ద్వారైర్ఘోరప్రదర్శనైః ।
గుప్త మభ్రఘనప్రఖ్యై ర్గోపురై ర్మందరోపమైః ॥

చూడు : వ్యా. భా. దాక్షిణాత్య ప్రతి. శ్రీ పి. పి. సుబ్రహ్మణ్యశాస్త్రి సంశోధితము, ఆది. అ. 198–60

సాధారణముగా కోటతలుపులు పక్షి ముక్కుల వంటి గుబ్బలతో భయంకరముగా నుండును. కాని యింద్రప్రస్థపుర ద్వారముల రెక్కతలుపులు రెండును గరుడపక్షిరెక్కల వలె నున్నవి. అనఁగా ద్వారకవాటములు గరుడపక్షి పక్షద్వయ విక్షేపముల వలె వాటి కవియే తెఱచుకొనుచు మూసికొనుచు చూపఱకు వెఱపు గలిగించుచున్నవన్నమాట.*

అది యానాటి శిల్పుల పనితనమునకు నిదర్శనము.

పురగోపురప్రాంతమున పెద్దపెద్ద మేడలున్నవి. (సౌధైశ్చ శోభితమ్)

# 3. శస్త్రాస్త్రములు

ఇంద్రప్రస్థపుర దుర్గము నందు యుద్ధోపయోగి శస్త్రాస్త్రము లనేకము లున్నవి. కావున నది శత్రుదుర్భేద్యముగా నున్నది.

వివిధైరపి నిర్విద్ధైః శస్త్రోపేతైః సుసంవృతైః ।
శక్తిభిశ్చావృతం తద్ధి ద్విజిహ్వై రివ పన్నగైః ॥33॥**

* 1. ఒక్కొక్క ద్వారమునకు గల రెండేసి తలుపులు భయంకరముగా నుండుటచే నవి గరుడ ప్రఖ్యములని నీలకంఠుడు వివరించినాఁడు.

(చూడు : వ్యా. భా. చిత్రశాలా ప్రతి)

"ద్వాభ్యాం పక్షాభ్యాం కవాటాభ్యాం గరుడ ప్రఖ్యాని భయానకత్వాత్ ॥" — నీలకంఠ.

2. "It stood adorned with Palatial buildings and numerous gates, each furnished with a couple of panels resembling the outstretched wings of Garuda and it was protected with gateways looking like clouds and high as Mandara mountains" — P. C. Roy. Mbh.-P. 577.

** నిర్విద్ధైః అచ్ఛిద్రైః అభేద్యై ర్వా ।
శక్తిభిః హస్తక్షేప్యాభిః లోహమయాభిః ॥౨౨॥

తల్పైరివాభ్యాసకైర్యుక్తం శుశుభే యోధరక్షితమ్ ।
తీక్ష్ణాంకుశ శతఘ్నీభి ర్యంత్ర జాలైశ్చ శోభితమ్ ॥34॥*

ఆయసైశ్చ మహాచక్రైః శుశుభే తత్పురోత్తమమ్ ॥
— వ్యా. భా. ఆది. 207-33, 35.

వివిధశస్త్రములు, శస్త్ర్యాయుధములు, పాములవలె రెండునాల్కలు గల పదునైన యాయుధములు, తీక్ష్ణములయిన యంకుశములు, శతఘ్నులు, యంత్రములు, లోహమయములైన చక్రములు మున్నగు యుద్ధసామగ్రి యా దుర్గము నందు పొందుపఱుపఁబడినది.

ఆ కోటబురుజులపై సైనికులు యుద్ధవిద్యాభ్యాస మొనరించు చుందురు. వివిధాయుధములు ధరించిన యుద్ధవీరులచే నింద్రప్రస్థము రక్షింపఁబడుచున్నది.

## ఇంద్రప్రస్థములో శిల్పపండితులు

ఇంద్రప్రస్థమున నివసించుటకు ఋగ్యజుస్సామాథర్వణాది సకల వేదవేత్త లయిన ద్విజులు, సకలభాషాకోవిదులు, నానాదిక్కులనుండి ధనార్థులయిన వణిజులు సర్వశిల్పశాస్త్రపారంగతులయిన శిల్పాచార్యులు వచ్చిరి.

తత్రాగచ్ఛన్ ద్విజా రాజన్ సర్వవేదవిదాం వరాః ॥
నివాసం రోచయంతి స్మ సర్వభాషావిదస్తథా ।

* తల్పైః రక్షకైః పురుషైః తైరేవ విశేషణ మభ్యాసకైః ఉపమిత్రాః తత్రాభ్యాసకైరిత్యస్య శస్త్రాభ్యాసే నియుక్తైః పురుషైః ॥ తీక్ష్ణాశ్చ తే అంకుశాశ్చ శతఘ్న్యశ్చ తాభిః । అగ్నియంత్రవిశేషోఽత్రైవ ప్రసిద్ధోఽయమేవ యా యుగపచ్ఛతం సహస్రం వా మనుష్యాన్ ఘ్నంతి తాభిః శతఘ్నీభిర్ దుర్గాలంకారాభిః ॥34॥
— నీలకంఠ-చిత్రశాలా ప్రతి-పు. 330.

శిల్పము = [illegible] — (సూ. ని.)

వణిజశ్చాయయు స్తత్ర నానాదిగ్భ్యో ధనార్థినః ॥
సర్వశిల్పవిదస్తత్ర వాసాయాభ్యాగమం స్తదా ।*

వ్యా. భా. ఆది. అ. 207-శ్లో 28-40.
(చిత్రశాలా ప్రతి)

మఱియొకచోట, నింద్రప్రస్థపురమంతయు చాతుర్వర్ణ్యము తోడను మాన్యులయిన శిల్పుల తోడను నిండియున్న దని చెప్పఁబడినది.

చాతుర్వర్ణ్యసమాకీర్ణం మాన్యైశ్శిల్పిభిరావృతమ్ ॥

వ్యా. భా. ఆది. అ. 198–61**

అయోధ్యానగరము కూడ శిల్పులతో నిండియున్నట్లు వాల్మీకి రామాయణమునందు వర్ణింపఁబడినది.

సర్వయంత్రాయుధవతీ ముషితాం సర్వశిల్పిభిః ।

వా. రా. బాల. అ. 5.

ఇట్లుండుటయే నగరలక్షణము.

పణ్యక్రియాదినిపుణై శ్చాతుర్వర్ణ్యజనైర్యుతమ్ ।
అనేకజాతిసంబంధం నైకశిల్పిసమావృతమ్ ।
సర్వదైవతసంబంధ నగరం త్వభిధీయత్ ॥

—భృగుసంహిత.✝

* ఈ శ్లోకములు కొలఁది మార్పులతో దాక్షిణాత్యప్రతులలో ఔత్తరాహప్రతులలోను ఉన్నవి. దాక్షిణాత్య ప్రతి. అ. 198. గోరఖ్‌పూరు ప్రతి, అ. 206. ఇతర భాషలలో ననువదింపఁబడినవి.

1. చూడు : చతుర్వేదీ ద్వారకానాథ్ శర్మ : హిందీ మహాభారతము. పు. 665.
"ఇస్ నగర్ మే చతురశిల్పకార్ భీ బసేథే."

2. Cf: P. C. Roy. Mahabharata. CCIX - P 578.
"And there also came numerous persons well-skilled in all the arts wishing to take up their abode there."

** 1. దాక్షిణాత్య ప్రతి, శ్రీ పి. పి. సుబ్రహ్మణ్యశాస్త్రి సంశోధితము — వావిళ్ల ప్రకటితము.

2. గోరఖ్‌పూర్ ప్రతి. పు. 246. వ్యా. భా. ఆది. అ. 206. శ్లో 48. ఉపవాద.

✝ చూడు : విష్ణుపురాణము, 1-6-18 శ్రీధరీయ వ్యాఖ్య. వావిళ్ల ప్రతి పు. 37.

# విశ్వకర్మ పూజ

"ఇట్టి యింద్రప్రస్థపురంబున నింద్రవిలాసంబుతో వ్యాసవాసుదేవానుమతుండై ధర్మతనయుండు ధౌమ్యపురస్సరమహీసురప్రవరవేదఘోషంబులు సకలజనాశీర్వాదనాదంబులు మృదుమధురమంగళసంగీతరవంబులు వివిధతూర్యధ్వనులు నతిసమృద్ధంబులై యెసంగ వర్గచతుష్టయంబుం బోని యనుజవర్గంబుతో శుభముహూర్తంబునం బురప్రవేశంబు సేసి" నట్లు నన్నయ వ్రాసినాఁడు.

— భార, ఆది. 8-60.

దీనికి మూలము వ్యాసభారతము నం దిట్లున్నది.

పురీం సర్వగుణోపేతాం నిర్మితాం విశ్వకర్మణా ।
పౌరాణా మధిపతిః కుంతీపుత్రో యుధిష్ఠిరః ॥
కృతమంగళసత్కారో బ్రాహ్మణై ర్వేదపారగైః ।
ద్వైపాయనం పురస్కృత్య ధౌమ్యస్యానుమతే స్థితః ॥
భ్రాతృభిః సహితో రాజన్ కేశవేన సహాభిభూః ।
తోరణద్వారసుముఖం ద్వాత్రింశద్ద్వార సంయుతమ్ ।
వర్ధమానపురద్వారం[1] ప్రవివేశ మహాద్యుతిః ॥
శంఖదుందుభి నిర్ఘోషాః శ్రూయంతే బహవో భృశమ్ ।
జయేతి బ్రాహ్మణగిరః శ్రూయంతే చ సహస్రశః
సంస్తూయమానో మునిభిః సూతమాగధవందిభిః ॥
ఔపవాహ్యగతో[2] రాజా రాజమార్గ మతీత్య చ ।
కృతమంగళసంస్కారం ప్రవివేశ గృహోత్తమమ్ ॥
ప్రవిశ్య భవనం రాజా సత్కారై రభిపూజితః ।

— వ్యా. భా. ఆది. అ 206.*

1. వర్ధమానపుర ద్వారమ్ = ముఖ్య ద్వారమ్ — నీలకంఠ.
[చూడు : వ్యా. భా. ఆది. 126-9 — చిత్రశాలాప్రతి.]

2. ఔపవాహ్యమ్ : పట్టపుటేనుఁగు. [సూర్యరాయాంధ్ర నిఘంటువు]
: రాజరథము.

* చూడు : వ్యా. భా. గోరఖ్‌పూర్ ప్రతి. అ. 206 శ్లో 48-49
మధ్య కుండలీకరణములలో నున్నవి.

ఈ వర్ణనము వలన సర్వగుణోపేతముగా విశ్వకర్మ నిర్మించిన యింద్రప్రస్థ పురమునకు ముప్పదిరెండు ద్వారములున్న వనియు నం దొకటి ముఖ్యద్వార మనియు ధర్మరా జా ముఖ్యద్వారము గుండ పుర ప్రవేశము చేసి పట్టపుదేనుఁగు నెక్కి రాజ మార్గము గుండ రాజభవనము చేరి మంగళధ్వనులతో నందు ప్రవేశించినాఁ డనియు తెలియుచున్నవి.

గృహప్రవేశానంతరము ధర్మరాజు విప్రులను, కృష్ణుని పూజించి, యటు పిమ్మట ఇంద్రప్రస్థమును, అందు తమ నివేశనమును, రాజభవనమును నిర్మించిన విశ్వకర్మను పూజించినాడు.

పూజయామాస విప్రేంద్రాన్ కేశవేన యథాక్రమమ్
.... .... .... .... .... .... .... .... ....
తతస్తు విశ్వకర్మాణం పూజయిత్వా విసృజ్య చ ॥
—వ్యా. భా. ఆది. అ 206.*

ఈ భాగము నేలనో నన్నయ తెనిగింపలేదు. కాని పురగృహాదులను నిర్మించు శిల్పాచార్యులను బూజించు సంప్రదాయము మహాభారతకాలము నందున్నది.

ద్వారకాపురనిర్మాత యైన విశ్వకర్మను కృష్ణుఁడు పూజించినట్లు హరివంశము నందు వర్ణింపఁబడినది.

హరిచే నభిపూజితుఁడై
సురవర్ధకి దివికి నేగి సురపతి కాత్మా
చరణం బెఱిగించి తదా
దరమున నత్యంత ధన్యతముఁడై యుండెన్.
— ఎఱ్ఱన-హరివంశము. ఉ. భా. అ. 2-108.

వారణావత మందు పాండవులు, 'పురోచనశిల్పాచార్యులం బూజించి పుణ్యాహ పురస్సరంబుగా గృహప్రవేశంబు సేసి' నట్లు నన్నయయే వ్రాసినాడు.
(భార. ఆది. 6—150)

* చూడు : వ్యా. భా. గోరఖ్‌పూర ప్రతి. ఆది. అ. 206. శ్లో 51—52 ముఖ్య.

పురగృహాదిసమస్త ప్రదేశములందు వాస్తుపూజ చేసి, దైవజ్ఞులను, పురోహితులను, స్థపతులను సంతోషపెట్టవలయునని శిల్పశాస్త్రములు చెప్పుచున్నవి.

పురోహితం చ దైవజ్ఞం స్థపతీన్ పరితోష్య చ ।

— విశ్వకర్మ ప్రకాశిక—అ. 10-114.

ఈ సంప్రదాయము మహాభారతకాలమునుండె కాక, నేటికిని పాటింపబడు చున్నది.

## అమరావతి

యయాతి........ 'మహాఘోరతపంబు సేసి దివ్యవిమానంబున దేవలోకంబున కుం జని యందు దేవర్షిగణపూజితుండై బ్రహ్మలోకంబునకుం జని బ్రహ్మర్షిగణ పూజితుండై యనేకకల్పంబు లుండి క్రమ్మఱ నింద్రలోకంబునకు' వచ్చెను.

నన్నయ-భార, ఆది. 3-201

ఇంద్రపురి నూఱు యోజనముల పొడవు—వెడల్పులు గలిగి సహస్రద్వారములు గలిగి రమ్యముగా నున్న దనియు యయాతి యందు వేయి సంవత్సరములున్నాఁడనియు మూలము నందున్నది.

తతః పురుహూతస్య పురీం రమ్యాం
సహస్రద్వారాం శతయోజనాయతాం
అధ్యావసన్ వర్షసహస్రమాత్రం
తతో లోకం పరమభ్యుపేతః ॥

వ్యా. భా. ఆది. 89-16*

శక్రపురి పేరు అమరావతి.

తతో దదర్శ శక్రస్య పురీం తా మమరావతీమ్ ।

వ్యా. భా. వన. 42-42.

* ఈ శ్లోకము కొంచెము మార్పులతో మత్స్యపురాణము నందున్నది.
చూడు : మత్స్యపురా. 36-15.

అమరావతి దేవతలకు నెలవు. దేవత లనఁగా నెవరు ?

విద్వాగ్ంసో హి దేవాః ॥ — శతపథ. కాం. 3-7-3-10.

'విద్వాంసులు, సత్యవాదులు, సత్యము నంగీకరించువారు, సత్యకర్మల నొన రించువారు దేవత లనఁబడుదురు.' 1

'స్థిర మగు పుణ్యకర్మమున దేవభవం బగు....'

— ఎఱ్ఱన. ఆరణ్య. 5-17

పుణ్యాత్ములు నివసించుటకు రమ్యహర్మ్యములు, సంచరించుటకు విమానములు గలిగి యమరావతి దివ్యకాంతులతో వెలుఁగుచుండును.

మహేంద్రానుమతంబున మాతలి ప్రయుక్తంబైన దివ్యరథం బెక్కి........ "అమరావతికిం బోయి వచ్చెద నని మందరనగంబు వీడ్కొని పురందరనందనుండు దేవపథంబున కరిగి

పరమధర్మస్థితిఁ బ్రజఁ గాచి యేలిన
రాజర్షులకు, నుగ్రరణము నందుఁ
బతులప్రస్తవమునఁ బ్రాణముల్ విడిచిన
వీరులకును, యజ్ఞవిధులఁ జేసి
సురలను వసుమతీసురులను దనిపిన
ధర్మాత్ములకు మహాతాపసులకు
నిలయంబులై రమణీయంబు లగు రమ్య
హర్మ్యవిమానసంహతుల దాని

సకలభువనంబులం గల సత్పురముల
కెల్ల నుపమానమై దహనేందురవుల
దీప్తి లేకున్నఁ దనదైన దీప్తి
విస్తరించిన నెప్పుడు వెలుఁగు దాని.*

1. దయానంద సరస్వతి — వేదతత్త్వ ప్రకాశము — ఆంధ్రానువాదము — అను. పండిత గోపదేవ్ — పు. 458.

* వ్యా. భా. వన. అ. 42. శ్లో 32, 33.



114

మఱియు ననాహితాగ్నులకు నతీర్థసేవకులకు ననృతవాదులకు వేదవిరుద్ధాచారులకు రణపరాఙ్ముఖులకుఁ జొరని విషయంబును, నతిగహ్వారంబును నైన దాని నమరావతిఁ జొచ్చి" నట్లు వర్ణింపఁబడినది.

— నన్నయ-భార. అరణ్య. 1-347, 348.

అర్జునుఁడు, 'తద్గోపురసమీపంబున ననవరతగండస్థలగళదవిరళమదజలకుల్యాభిరామంబై, నిరంతరనిర్ఝరనీహారనగంబునుంబోలె నొప్పుచున్న నైరావతంబుఁ,' జూచినాఁడు.[1]

మూలము నందిట్లున్నది :-

తతోఽపశ్యత్ స్థితం ద్వారి శుభం వైజయినం గజమ్ ॥
ఐరావతం చతుర్దంతం కైలాసమివశృంగిణమ్ ।

వ్యా. భా. వన. 42-39, 40

గోపుర మనఁగా పుర బహిర్ద్వారము.

అమరావతీ పురద్వారములు స్ఫటికమణులతోఁ జేయఁబడిన వనియు, ద్వార కవాటములు కనకపట్టబద్ధము లనియు భాగవతమహాపురాణము నందు వర్ణింపఁబడినది.

రుక్మపట్టకపాటైశ్చ ద్వారైః స్ఫటికగోపురైః ।

వ్యాస. భాగ 8-15-15.

"అర్జునుండు నయ్యమరావతీపురభవంబు చూచి హర్షించుచు నప్సరోగీయమాన మంగళహితగీతావహితమానసుండగుచు సిద్ధమునిగణాశీర్వాదంబులు సేకొనుచుం జని మాతలినిర్దేశంబున దివ్యరథావతీర్ణుండై శతమఖునకు .... .... కృతప్రణాముఁ డయ్యెను.' [2]

దదర్శాద్భుతరూపాణి విమానాని సహస్రశః ।
న తత్ర సూర్యః సోమో వా ద్యోతతే న చ పావకః ॥32॥
స్వయైవ ప్రభయా తత్ర ద్యోతన్తే పుణ్యలబ్ధయా ।
తారారూపాణి యానీహ దృశ్యంతే ద్యుతిమంతివై ॥33॥

1: నన్నయ — భార — అరణ్య 1-349.
2: ,, ,, ,, 1-352,353

'అనిమిషనాథుఁడు తనయునిఁ గౌగిలించికొని....నిజాంకతలస్థుఁ జేసి నిజాస నార్థమున నుంచెను. సురరాజుతో నేకాసనమున్న యర్జునుని దేవగంధర్వసిద్ధ విద్యాధరు లతిప్రీతి నర్చించిరి.' *

ఇది యంతయు దేవసభలో జరిగినది.

ఏకాసనోపవిష్టౌ తౌ శోభయాం చక్రతుః సభామ్ ।

వ్యా. భా. వన 43-27

దేవసభ పేరు సుధర్మ.

తరువాత పురందరనందనుఁడు రాజప్రాసాదమునకుఁ బోయినాఁడు.

ప్రవేశయామాసురథో పురందరనివేశనమ్ ॥
ఏవం సంపూజితో జిష్ణు రువాస భవనే పితుః ।

వ్యా. భా. వన. 44-2,3

అది యొకమణిమయమందిరము. అందే సంగీతశాల యున్నది. అర్జునుఁ డందు గాంధర్వవిద్య నభ్యసించెను.

పాకశాసనుపనుపునఁ బార్థుఁ డొక్క-
మణిమయం బైన మహనీయ మందిరమున
నెలమి గంధర్వసంగీతహృద్యగోష్ఠి
నుండెఁ జెవులకు నుత్సవం బొప్పుచుండ.

— నన్నయ-అరణ్య - 1-357

ఇట్లుండఁగా నొకనాఁడు చంద్రోదయానంతరము ఊర్వశి 'యర్జున సంగమ కాంక్షఁజేసి పురందరనందనుమందిరమున కరుదెంచినది'

ఆ మందిర మతినిర్మలమును నత్యంతమనోహరము నైనది.

ఉపతిష్ఠత తద్ వేశ్మ నిర్మలం సుమనోహరమ్ ॥

— వ్యా. భా. వన. 46-17

సర్వకామఫలప్రదమయిన యా దేవేంద్రభవనము నందు తాను సర్వసుఖముల ననుభవించి నట్లు అర్జునుఁడే చెప్పినాడు.

* నన్నయ. భార. అరణ్య. 1-354-356

సుఖం శక్రస్య భవనే సర్వకామ సమన్వితః ॥

—వ్యా. భా - వన- 168-59

మందాకినీ తీరమున మణిమయ వేదికలున్నవి.

నన్నయ. అరణ్య - 1-363

నాకలోకము నుండి తిరిగివచ్చిన యర్జునుఁ డగ్రజునితో నమరావతి యందలి విశేషముల నిట్లు తెలిపినాడు.

తతః శక్రస్యభవన మపశ్యమమరావతీమ్॥
దివ్యైః కామఫలై ర్వృక్షై రత్నైశ్చ సమలంకృతామ్।
న తత్ర సూర్యస్తపతి న శీతోష్ణే న చ క్లమః॥
న బాధతే తత్ర రాజ స్తత్రాస్తి న జరా నృప।
న తత్ర శోకో దైన్యం వా దౌర్బల్యం చోపలక్ష్యతే॥
దివౌకసాం మహారాజ న గ్లాని రరిమర్దన।
న క్రోధలోభౌ తత్రాస్తాం సురాదీనాం విశాంపతే॥
నిత్యతుష్టాశ్చ తే రాజన్ ప్రాణినః సురవేశ్మని।
నిత్యపుష్పఫలా స్తత్ర పాదపా హరితచ్ఛదాః ॥
పుష్కరిణ్యశ్చ వివిధాః పద్మ సౌగంధికాయుతాః।
శీత స్తత్ర వహ వాయుః సుగంధీ జీవనః శుచిః ॥50
సర్వరత్నవిచిత్రా చ భూమిః పుష్పవిభూషితా।
మృగద్విజాశ్చ బహవో రుచిరా మధురస్వరాః ॥
విమాన గామినశ్చాత్ర దృశ్యన్తే బహవోఽంబరే। ........
.... .... .... ....
ప్రవిశ్య తాం పురీం దివ్యాం దేవగంధర్వపూజితామ్.

—వ్యా. భా. వన. అ 168— శ్లో 45—54

అమరావతి కల్పవృక్షములతోడను రత్నములతోడ నలంకరింపఁబడియున్నది. అందు సూర్యాతప ముండదు. చలి గాని వేడి గాని యెక్కువగా లేక సమ శీతోష్ణముగా నుండును, ఏవిధమైన శ్రమ యుండదు.

దేవలోకవాసులకు జరాబాధ లేదు, శోకము లేదు, దైన్యము లేదు, గ్లాని లేదు, క్రోధ లోభములు లేవు. వైర్యము గాని దౌర్బల్యము గాని కానరాదు. సుర లోకము నందలి ప్రాణులు నిశ్చింతస్వాంతులై యుందురు.

అమరావతి యం దనేకవిధములయిన పుష్కరిణులు పద్మసౌగంధికయుతములై యున్నవి. అందెప్పుడు సువాసన గల చల్లని గాలి వీచుచుండును. సుగంధము పుష్టి వర్ధనము; కావున నచటి జీవనము పరిశుద్ధమైనది. అచటి భూమి బహురత్నసమంచిత మగుటచే విచిత్రముగానున్నది. దానిపై పుష్పములు చల్లఁబడియున్నవి.

ఆకసమునందు విమానములపై సంచరించు దేవత లనేకు లచ్చట గన్పింతురు.

దేవగంధర్వ సేవితమై దివ్యమై నట్టి యమరావతీ పురమును తాను (అర్జునుడు) ప్రవేశించి, కొంతకాల మచటనుండి వచ్చినాఁడు.

'విశ్వకర్మ నిర్మితంబై త్రైలోక్యరాజ్యలక్ష్మీశోభితంబైన మహేంద్రభవనంబు విద్రుమసోపానంబులును, మరకతమణిమయప్రదేశంబులును పద్మరాగపీఠ కనకకవాట గేహళి విటంకవాతాయనంబులును ........ వివిధవిచిత్రవిమానంబులును రమణీయ రత్నప్రాసాదవిశేషంబులును' గలిగి యున్నట్లు భాగవతమునందు వర్ణింపఁబడినది.

— ఆంధ్రభాగవతము. స్కంధ. 7. ప. 98.

మూలము నందిట్లున్నది.

మహేంద్రభవనం సాక్షాన్నిర్మితం విశ్వకర్మణా ।
త్రైలోక్యలక్ష్మ్యాయతన మధ్యువాసాఖిలర్ధిమత్ ॥
యత్ర విద్రుమసోపానా మహామారకతాభువః ।
యత్ర స్ఫాటికకుడ్యాని వైడూర్యస్తంభపంక్తయః ॥
యత్ర చిత్రవితానాని పద్మరాగాసనాని చ ।
పయఃఫేననిభాః శయ్యా ముక్తాదామపరిచ్ఛదాః ॥

— వ్యాస. భాగ. స్కంధ 7. అ4 - శ్లో 8–10.

ఇది హిరణ్యకశిపుఁడు మహేంద్రభవనమును ప్రవేశించి నప్పటి వర్ణనము. ఇట మహేంద్రభవన మనఁగా మహేంద్రునివాసస్థాన మయిన యమరావతి,

భాగవతమహాపురాణము నందే మఱియొకచోట నమరావతీపురవర్ణనము గలదు. అది బలిచక్రవర్తి యింద్రునిపై దండెత్తి భృగుదత్తమయిన రథము నెక్కి యింద్రపురిని ప్రవేశించినప్పటి వర్ణనము.

యయా వింద్రపురీం స్వృద్ధాం కంపయన్నివ రోదసీ ॥ 11 ....

.... .... .... ....

ఆకాశగంగయా దేవ్యా వృతాం పరిఖభూతయా ।
ప్రాకారేణాగ్నివర్ణేన సాట్టాలేనోన్నతేన చ ॥ 14

రుక్మపట్టకపాటైశ్చ ద్వారైః స్ఫాటికగోపురైః ।
జుష్టాం విభక్తప్రపథాం విశ్వకర్మ వినిర్మితామ్ ॥ 15

సభాచత్వరరథ్యాఢ్యాం విమానైర్ న్యర్బుదైర్యుతామ్ ।
శృంగాటకై ర్మణిమయైర్ వజ్రవిద్రుమవేదిభిః ॥ 16 ...

.... .... .... ....

తాం దేవధానీం స వరూథినీపతి ర్బహిః సమంతాద్
రురుధే పృతన్యయా ॥ 23

వ్యాస. భాగ. స్కంధ. 8 అ 15. శ్లో 14–23.

సర్వసంపత్సమృద్ధి గల యింద్రపురి యాకాశము నందు కంపించుచున్నట్లున్నది.

అది ఆకాశగంగయే పరిఖగా, అగ్నివర్ణప్రాకారములతో ఎత్తైన కోట బురుజులతో, స్ఫటికమణిమయములైన పురద్వారములతో బంగారుతొడుగులు వేయబడిన ద్వారకవాటములతో, చక్కగా విభజింపఁబడిన రాజమార్గములతో విశ్వకర్మ చేత నిర్మింపఁబడినది.

అమరావతి యనేకసప్తభూమిగృహములతో – ఏడంతస్తులమేడలతో – మణిమయాలంకృతములయిన శృంగాటకములతో, సభాభవనములతో, చత్వరములతో నొప్పారుచున్నది.

భాగవతమునందలి యమరావతి వర్ణనము శిల్పకళామహితమై మనోహరముగా నున్నది.

అమరావతి యందలి గోపురాట్టాలకసౌధకుట్టిమవేదికాభిత్తిపద్మాకరాదిసమస్త నిర్మాణములు కనకమయము లని శ్రీనాథుఁడు తన కాశీఖండములో వర్ణించినాడు.

" .... .... .... ఇది నముచిమర్దనుని వీడు
కనకగోపుర కనకాట్ట కనకసౌధ
కనకకుట్టిమ వేదికా కనకభిత్తి
కనకరాజీవ సరసీ ప్రకాశితంబు. "

— శ్రీనాథుఁడు : కాశీఖండము. 3. 196

కాని, దీనికిమూల మగు స్కాందపురాణాంతర్గత కాశీఖండము (సంస్కృతము) నందు అమరావతీపురవర్ణన మిట్లున్నది.

శివశర్మన్ మహాభాగ సుతీర్థఫలితద్రుమ ।
లోకోఽత్ర రమతే విప్ర సహస్రాక్షపురీత్వియం ॥ 2

తపోబలేన మహతా నిర్మితా విశ్వకర్మణా
దివాపికౌముదీయస్యాః సౌధశ్రేణీశ్రియం శ్రయేత్ ॥ 3

.... .... ....

హర్మ్యేషు నీలమణిభి ర్నిర్మితేష్వత్ర నిర్భయమ్ ।
స్వనీలిమానమాధ్యాయ తమోహాః స్వపి తిష్ఠతి ॥ 5

— స్కంద. కాశీఖం. అధ్యా. 10. 2–5

అమరావతీపురమును దేవశిల్పి యగు విశ్వకర్మ తనతపోబలముతో నిర్మించినాఁడు. అందలి సౌధములు మిక్కిలి తెల్లని వగుటచేత పగలే వెన్నెలరేయి వలె నుండును. అచటి హర్మ్యములు నల్లరాళ్ళతో (నీలమణిభిః) కట్టఁబడినవి కావున నిర్భయముగా నుండును.

అమరావతిని నిర్మించుటకు మహాతపస్సంపన్నుఁడయిన విశ్వకర్మకు నూఱేండ్లు పట్టినది. విబుధేశ్వరుఁడు విశ్వకర్మను బిలిచి యమరావతీపురమును నిర్మింపు మని పురస్కారపూర్వకముగా ప్రార్థింపఁగా విశ్వకర్మ (త్వష్ట) నానారత్నములతో మనోహరమయిన మహాపురమును నిరుపమానముగా నిర్మించినాఁడు. దానిని జూచి సంతుష్టాంతరంగుఁడయిన యింద్రుఁడు పురనిర్మాత యగు విశ్వకర్మను రావించి ప్రియవాక్యములతో రత్నాదు లొసఁగి పూజించి పంపినాఁడు.

యోజయామాస సత్కారం నిర్మాతు మమరావతీం ।
పూర్ణ మబ్దశతం త్వష్టా నిర్మమే రుచిరాం పురీం ॥
నానారత్న విచిత్రాఢ్యా మతిరత్నేంద్రనిర్మితామ్ ।
మనోహరాం నిరుపమాం దృష్ట్వా తుష్టస్తయా హరిః ॥
విశ్వకర్మాణ మానీయ ప్రియముక్త్వా శతక్రతుః ।
దత్వా రత్నాని సంపూజ్య తం ప్రస్థాపితవాన్ గృహం ॥

— బ్రహ్మవైవర్త పురాణము. *

-)o(-

# అలకాపురి

పాండవులు శ్వేతనగేంద్రమును, మాల్యవంతమును చూచుచు నరిగి తద్విపినంబునందు విహరించుచుండ నొక్కనాఁడు శ్వేతకి యను పుణ్యనదివలన మారుతానీతంబులై సువర్ణమయంబు లయి తమ ముందటం బడిన పంచవర్ణసుగంధి కుసుమంబులం జూచి ద్రుపదరాజపుత్త్రి భీమసేనునితో

'ఇక్కుసుమంబులు నాకుఁ దెచ్చి యిచ్చి మనఃప్రియంబు చేయుమనిన భీముండు తత్క్షణంబు చని బహుతాళసమున్నతం బయిన గిరిశృంగం బెక్కి యందు వివిధరత్నరశ్మిరమ్యవేశ్మపరివృతంబయిన వైశ్రవణునివాసంబు గని శంఖధ్వానంబు సేసినాఁడు.'

[నన్నయ. భార-అరణ్య. 4. 5-9]

వైశ్రవణావాసము బంగారముతోను స్ఫటికమణులతోను గట్టబడిన రాజభవనములతో నలంకృతమై యున్న దనియు, నంతట సౌవర్ణప్రాకారములతో రత్నకాంతులతో నిండి యున్నదనియు, శైలముల కంటె నున్నతము లయిన

* చూడు:— నిరంజనశాస్త్రి : విశ్వకర్మబ్రాహ్మణవంశాగమము. పు. 128-29
(బ్రహ్మవైవర్త పురాణే - కృష్ణజన్మఖండే - రాధా మాధవ సంవాదే
అ. 47, శ్లో 37—39)

గోపురాట్టాలకములతోను, నిర్యూహములతో ధ్వజాదులతో శోభిల్లుచున్న దనియు మూలము నందు వర్ణింపఁబడినది.

తతో వైశ్రవణావాసం దదర్శ భరతర్షభః ।
కాంచనైః స్ఫాటికైశ్చైవ వేశ్మభిః సమలంకృతమ్* ॥ 37

ప్రాకారేణ పరిక్షిప్తం సౌవర్ణేన సమంతతః ।
సర్వరత్నద్యుతిమతా సర్వోద్యానవతా శుభా ॥ 38

శైలాదభ్యుచ్ఛ్రియవతా చయాట్టాలకశోభినా ।
ద్వారతోరణనిర్యూహధ్వజసంవాహశోభినా ॥ 39**

విలాసినీభిరత్యర్థం నృత్యంతీభి సమంతతః ।
వాయునా ధూయమానాభిః పతాకాభిరలంకృతమ్॥ 40

ధనుష్కోటి మవష్టభ్య వక్రభావేన బాహునా ।
పశ్యమానః స ఖేదేన ద్రవిణాధిపతేఃపురమ్ ॥ 41

-వా.భా వన. అ. 160. 37-41

వైశ్రవణావాస మనఁగా అలకాపురి. దానికి వసుధార, వసుస్థలి, ప్రభ అని నామాంతరములు గలవు.

అలకాపతి యైన కుబేరుఁడు ధనాధ్యక్షుఁడుగదా ! అలకాపురి యందలి భవనములు కాంచనమయములు, స్ఫటికమణి నిర్మితములు నగుటలో నాశ్చర్య మేమున్నది ?

అవి కాంచనమయములనఁగా బంగరురంగుపూఁత పూయఁబడినవనియు స్ఫటికమణి నిర్మితము లనఁగా పలుఁగురాలతో కట్టబడిన వనియుఁ జెప్పవచ్చును.

*. పోల్చు: 1) వ్యా. భా. సభా. 10–2
'దివ్యా హేమమయై ర్దివ్యైః ప్రాసాదై రుపశోభితా ।.'
2) కాళిదాసు: మేఘసందేశము - 2.5
"యస్యాం యక్షాః సితమణిమయా న్యేత్య హర్మ్యస్థలాని".

** చయః ప్రాకారస్య మూలబంధః అట్టాలకః ఉపరిగృహమ్ తోరణమ్ బహిర్ద్వారం నిర్యూహో నాగదంతాభ్యాం గృహాన్నిర్గతం దారు ॥ -నీలకంఠ

అలకాపురి నూఱు యోజనముల పొడవు, నేఁబది యోజనముల వెడల్పు గలిగి దీర్ఘచతురస్రాకారముగ నున్నదనియు, (100 × 50 యోజనములు) అది సువర్ణమణిచిత్రితములు, విశాలములు నైన భవనమాలికలతో నలంకరింపఁబడి యున్న దనియు వాయుపురాణము నందు వర్ణింపఁబడినది.

యోజనానాం శతాయామే పంచాశచ్ఛ తథాయతమ్ ।
సువర్ణమణిచిత్రాభి రనేకాభి రలంకృతమ్ ।
మహాభవనమాలాభి ర్భూషితం నైకవిస్తరమ్ ॥*
ధనాధ్యక్షస్య దేవస్య కుబేరస్య మహాత్మనః ।
నగరం తదనాధృష్య మృద్ధియుక్తం మహాయుతం ॥

- వాయు. అ. 4- శ్లో. 2-4.

కుబేరావాసము నూఱు ద్వారములతోను, భవనములతోను, మహాపథములతోను నలరారుచున్నట్లు తైత్తిరీయారణ్యకము నందు వర్ణింపబడినది.[1]

ఇట్టి యలకాపురి విశ్వకర్మచేత నిర్మింపఁబడిన దని వాల్మీకి రామాయణము వలనఁ దెలియుచున్నది.

తత్ర పాండుర మేఘాభం జాంబూనదపరిష్కృతమ్ ।
కుబేరభవనం రమ్యం నిర్మితం విశ్వకర్మణా ॥ **

-వా.రా. కిష్కింధ. కాం 43-21

* పోల్చు : బ్రహ్మాండపురాణము. 2-3-41. శ్లో 18,19
"వవర్ష తత్ర నగరీం మహతీ మలకాభిధామ్ ॥
నానామణి గణాకీర్ణభవనై రుపశోభితామ్ ।"

1. Cf : V.M. Apte : Social and Religious Life in Grihya Sutras P. 137
"The Taittiriya Aranyaka refers to the city of Kubera as a city of 100 gates, of castles and big streets."

** పోల్చు : అధ్యాత్మరామాయణము, ఉ. కాం. స2–36.
"అలకాం నగరీం తత్ర నిర్మమే విశ్వకర్మణా ॥ "

-)o(-

# ద్వారకాపురి

శ్రీకృష్ణుఁ డర్జునుని తీర్థాభిగమన నిమిత్తంబును, సుభద్ర యందు బద్ధాను రాగుం డగుటయు నుపలక్షించి ద్వారకాపురంబునకుఁ దోడ్కొని యరిగి,

భ్రాజితశాతకుంభగృహపంక్తులఁ బుష్పితవల్లివేల్లితో
ర్వీజవనాకృతిన్ విమలవిద్రుమవజ్రవిచిత్రవేదికా
రాజిఁ గరంబు రమ్యమగు రైవతకాచలకందరంబునన్
రాజకులైకసుందరుఁ బురందరనందను నుంచె లీలతోన్

-నన్నయ -భార- ఆది. 8-170, 171.

ద్వారకాపురి గిరిదుర్గసమాశ్రితము. రైవతకాద్రి పొంత నున్నది. అందు కాంచన మయగృహములు, రత్నవేదికలు, పుష్పవల్లికలు రమ్యముగా నున్నవి.

మూలమునం దీప్రాసాదములు రత్నచిత్రితము లని యున్నది.

ప్రాసాదై రత్నచిత్రైశ్చ గిరేస్తస్య సమంతతః ॥

-వ్యా-భా- ఆది. 218-3

కృష్ణానుమతితో జిష్ణుఁడు సుభద్రను దోడుకొని పోవునప్పుడు పురరక్షకు లడ్డగించిరి. అర్జునుఁడు వారితో పోరి, పురవీథులను, గోపురములను, హర్మ్యములను, రత్నవేదికలను శరపరంపరతో నింపినాఁడు.

హరితనయుండు పార్థుఁడు రయంబున నందఱ నాహవక్రియా
విరతులఁ జేసి యప్పురము వీథుల వేదుల రమ్యహర్మ్యగో
పురములఁ దద్గిరీంద్రమణిధామముల ధారితటాకపంకజా
కర నవనందనావళులఁ గాండమయంబులు చేసె నేసునన్.

- నన్నయ భార -ఆది. 8-201

ఈ వర్ణనము వలన ద్వారకలో రమ్యహర్మ్యములు, గోపురములు, తటాకములు, పద్మాకరములు, సుందరోద్యానవనములు, వేదికలు నున్నట్లు తెలియుచున్నది.

వ్యాసభారతమునందు సభాపర్వమున ద్వారకాపురవర్ణనాత్మకమైన యధ్యాయ మొకటి ప్రక్షిప్తముగా నున్నది.* దాని వలన ద్వారకాపురవిశేషము లనేకము తెలియు చున్నవి.

భీష్మ ఉవాచ

తాం పురీం ద్వారకాం దృష్ట్వా విభుర్నారాయణో హరిః ।
హృష్టః సర్వార్థసంపన్నాం ప్రవేష్టు ముపచక్రమే ॥ 1
సోఽపశ్యద్ వృక్షషండాంశ్చ రమ్యానారామజాన్ బహూన్,
సమంతతో ద్వారవత్యాం నానాపుష్పఫలాన్వితాన్ ॥ 2

అర్కచంద్రప్రతీకాశై ర్మేరుకూటనిభైర్ గృహైః ।
ద్వారకా రచితా రమ్యైః సుకృతా విశ్వకర్మణా ॥ 3
పద్మషండాకులాభిశ్చ హంససేవితవారిభిః ।
గంగాసింధుప్రకాశాభిః పరిఖాభిరలంకృతా ॥ 4

ప్రాకారేణార్కవర్ణేన పాండురేణ విరాజితా ।
వియన్మూర్ధ్ని నివిష్టేన ద్యౌరివాభ్రపరిచ్ఛదా ॥ 5

.... .... .... ....

మహాపురీం ద్వారవతీం పంచాశద్భిర్ ముఖై ర్యుతామ్ ।
ప్రవిష్టో ద్వారకాం రమ్యాం భాసయంతీం సమంతతః ॥ 16

అప్రమేయాం మహోత్సేధాం మహాగాధపరిప్లవామ్ ।
ప్రాసాదవరసంపన్నాం శ్వేతప్రాసాదశాలినీమ్ ॥ 17

తీక్ష్ణయంత్రశతఘ్నీభిర్యంత్రజాలైః సమన్వితామ్ ।
ఆయసైశ్చ మహాచక్రై ర్దదర్శ ద్వారకాం పురీమ్ ॥ 18

*చూడు : వ్యా.భా. సభా. 38-39 అధ్యాయముల మధ్య ప్రక్షిప్తముగానున్న 19 అధ్యాయములలో 14వ అధ్యాయము ద్వారకాపురవర్ణనము.
గోరఖ్‌పూర్ ప్రతి. పుట 850 — వావిళ్ల ప్రతి పుటలు. 580-51
'సభాపర్వాంతర్గతార్ఘాభిహరణపర్వణ్యధికశ్లోకాః ।'

పోల్చు : హరివంశము. ఈ శ్లోకములించుమించుగా కొలదిమార్పులతో నున్నవి.

అష్టౌ రథసహస్రాణి ప్రాకారే కింకిణీకినః ।
సముచ్ఛ్రితపతాకాని యథా దేవపురే తథా ॥ 19

అష్టయోజనవిస్తీర్ణా మచలాం ద్వాదశాయతామ్ ।
ద్విగుణోపనివేశాం చ దదర్శ ద్వారకాం పురీమ్ ॥ 20

అష్టమార్గాం మహాకక్ష్యాం మహాషోడశచత్వరామ్
ఏవం మార్గపరిక్షిప్తాం సాక్షా దుశనసాకృతామ్ ॥ 21

వ్యూహానా మంతరా మార్గాః సప్త చైవ మహాపథాః ।
తత్ర సా విహితా సాక్షా న్నగరీ విశ్వకర్మణా ॥ 22

ద్వారకానగరము పండ్రెండు యోజనముల పొడవు, ఎనిమిది యోజనముల వెడల్పు గలిగి దీర్ఘచతురస్రాకారముగ నున్నది.

అష్టయోజన విస్తీర్ణా మచలాం ద్వాదశాయతామ్ ॥ *

"ఎనిమిది యోజనముల వఱుపును పండ్రెండు యోజనముల నిడుపును నైన యమ్మహానగరి" యని హరివంశము. 1

శిల్పు లత్యంత ప్రాచీనకాలము నుండియు నగరనిర్మాణమునకు దీర్ఘచతురస్రాకారము గల భూమి నెంచుకొనుచున్నారు.

సాధారణముగా వాస్తువు (గృహపురాదినిర్మాణయోగ్యవగుభూమి) యొక్క పొడవు దాని వెడల్పుకంటె కొన్ని రెట్లెక్కువగా నుండును. కొన్ని సందర్భములలో వెడల్పున కంటె పొడవు నాలుగు రెట్లధికముగా నుండుటయును గలదు.

క్రీ. పూ. 10 వ శతాబ్దమునకు ముందే శ్రీకృష్ణుని చేత పునర్నిర్మింపఁబడిన ద్వారకాపురము నందీ ప్రాచీన సంప్రదాయమే పాటింపఁబడినట్లున్నది. అది 12 యోజనముల పొడవు 8 యోజనముల వెడల్పు గలిగి యున్నది. దాని పొడవు వెడల్పున కంటె ఒకటిన్నర రెట్లున్నది. అయోధ్యానగరము 12 యోజనముల పొడవు 3 యోజనముల వెడల్పు గలిగియున్నది. కనుక దాని పొడవు వెడల్పున కంటె నాలుగు రెట్లెక్కువ.[2]

---

1. ఎఱ్ఱన : హరివంశము, ఉ. భా. ఆ. 4-225.

2. Cf: Govinda Krishna Pillai - The way of the Silpis- P 183
" The oblong lay-out in which the length was four

శ్రీకృష్ణుఁడు తనకు ప్రబలశత్రువు లయిన యవనమాగధుల వారికి తట్టుకొన లేక, యరివరులకు విడియఁ బోరాడఁగా దాని విషమభూమి నొక్క దుర్గంబు సేసి బంధుల పురజనుల నందునుపవలయు నని వితర్కించి, సముద్రు నడిగి సముద్ర మధ్యంబునఁ బండ్రెండు యోజనంబులు నిడుపు నంతియ వెడల్పుం గల దుర్గ ప్రదేశంబు సంపాదించి తన్మధ్యంబునం గృష్ణుండు సర్వాశ్చర్యకరంబుగ నొక్క నగరంబు నిర్మింపు మని విశ్వకర్మం బంపిన,

వరుణపురము కంటె వాసవుపురి కంటె
ధనదువీటి కంటె దండధరుని
నగరి కంటె బ్రహ్మనగరంబు కంటెఁ బ్ర
స్ఫుటము గాఁగ నొక్క పురముఁ జేసె.

- పోతన- భాగ. దశమస్కంధము - పూ. భా. 1594, 1595.

అదియే ద్వారకాపురి. అది ఆకాశము నంటు ప్రాకారములతో పాతాళము నంటు పరిఖలతో నొప్పుచున్నది. కోటకొమ్మల పై తారకలు కొమరారు చుండును. [1]

ద్వారక యందలి కట్టడము లన్నియు కనకమణిమయములే.

సాధుద్వారకవాటకుడ్యవలభీస్తంభాగ్రశాగేహళీ
వీథీవేదిగవాక్షచత్వరసభావేశ్మప్రఘాణప్రపా
సౌధాట్టాలకసాలహర్మ్య విశిఖాసోపాన సంస్థానముల్
శ్రీధర్మస్థితి నొప్పుఁ గాంచనమణిస్నిగ్ధంబులై యప్పురిన్. [2]

times the breadth or a definite multiple of breadth was a special feature of silpi layout. The continuance of this practice is seen in the lay out of Dwaraka, as re-constructed by Krishna probably before the tenth century B.C. The length of Dwaraka was one and a half time the breadth being 12 yojanas in length and 8 yojanas in breadth; while the length and breadth of Ayodhya was 12 yojanas and 3 yojanas respectively."

1. పోతన - శ్రీమదాంధ్రమహాభాగవతము. దశమస్కంధము పూ. భా. 1597, 1598.

2. ... ... ... అదే ... ... ... 1599.

ద్వారకాపురము నందలి కట్టడము లన్నియు వాస్తుశాస్త్రానుసారముగానిర్మింపఁబడినవనియు నందు విశ్వకర్మ యొక్క వాస్తువిజ్ఞానమును శిల్పచాతుర్యము ను జక్కఁగ జూడఁదగియున్న దనియు మూలము నందు వర్ణింపఁబడినది.

ఇతి సంమన్త్ర్య భగవాన్ దుర్గం ద్వాదశయోజనమ్ । *
అంతఃసముద్రే నగరం కృత్వాద్భుత మచీకరత్ ॥

దృశ్యతే యత్ర హి త్వాష్ట్రం విజ్ఞానం శిల్పనైపుణమ్ ।
రథ్యాచత్వరవీథీభి ర్యథా వాస్తువినిర్మితమ్ ॥

ద్వారకానగర నిర్మాణక్రమమును, రచనాప్రణాళికయు, స్థపతుల పద్ధతుల హరివంశము నందు విశదముగనున్నవి.

శ్రీకృష్ణుఁడు నూతనపురనిర్మాణార్థము పుణ్యాహవచనపూర్వకముగా స్థల నిర్ణయముచేసి, శిల్పాచార్యుల రావించి, తాను నిర్మింపఁదలచిన పుర మెట్లుండ వలయునో తెలిపెను.

"ఏ నిప్పురంబునకు ద్వారవతి యను నామం బొనర్చితి నిప్పురికిం దగ నాలుగు వాకిళ్లను సోమవహ్నివరుణేంద్ర దైవతంబులు నతివిస్తీర్ణంబులు రాజమార్గ సమ్ముఖంబులు గావలయు బ్రహ్మవిష్ణుశంకరప్రముఖదేవతాగారంబులుం జైత్యంబులుం బ్రపలు రమ్యంబులుగా రచియింప వలయునని పలికె శిల్పాచార్యులం గర్మకరులను రావించి యివ్విధంబు నిఖిలంబునాజ్ఞాపించిన,

అనుపమసర్వసాధనసమగ్రతతో శుభవేళ వాస్తుపూ
జన బలి హోమతంత్రములు సవిధిఁ జేయఁగ సూత్రహస్తులై
మునికొని కోవిదస్థపతిముఖ్యులు శిల్పము లుద్యమింప న
ప్పని తన వేగిరంపుఁ బ్రియభావనకుం దగియుండకుండినన్."

—చూడుము: హరివంశము. ఉ.భా. అ2-152-154.

* Cf : J. H Dave = Immortal India Vol I P 55
" The original Dwaraka of Krishna's time is described as being twelve yojanas in circumference in the middle of the sea (perhaps an island) with numerous parks, high palaces, golden domes big gopuras spacious terraces etc. '

మూలము నందును శుభముహూర్తమున శాస్త్రప్రకారము వాస్తుపురుషుని, వాస్తుపదస్థితదేవతలను పూజించిన యనంతరము శిల్పాచార్యులు ద్వారకాపురనిర్మాణ కార్యక్రమము నారంభించి నట్లు చెప్పఁబడినది.

యథా నివేశం సంహృష్టా శ్చక్రు ర్వాసుపరిగ్రహాన్ ॥
సూత్రహస్తా స్తతో మానం చక్రు ర్యాదవసత్తమాః ।
పుణ్యేఽహని మహారాజ ద్విజాదీనాభిపూజ్య చ ॥
వాస్తుదైవతకర్మాణి విధినా కారయంతి చ ।

—వ్యాస. హరివంశము. అ 86 శ్లో 11–19.

దీనిని బట్టి మహాభారతము కాలము నాటి ప్రజలు పురగృహనిర్మాణములకు ముందు భూపరీక్షచేసి స్థలనిర్ణయముచేయుట, పుణ్యాహవచనపూర్వకముగా స్థలశుద్ధి చేయుట, శాస్త్రప్రకారము వాస్తుపూజ చేసి వాస్తూపశమనము చేయుట, తరువాత శిల్పులు సూత్రపాతము చేసి పనిప్రారంభించుట — ఈ పనులకన్నింటికి శుభ ముహూర్తములు పెట్టుకొనుట —— అను శిల్పసంప్రదాయములు పాటించుచున్నట్లు తెలియుచున్నది.

మానవమాత్రులయిన శిల్పాచార్యుల వలన త్వరగ పని పూర్తి యగు నటుల లే దని కృష్ణుఁ డప్పుడు దివ్యశిల్పి యైన విశ్వకర్మను దలఁచెను.

ఏకాగ్రచిత్తుఁడై హరి
యాకమలోద్భవతనూజు నద్భుతవిజ్ఞా
నాకల్పు విశ్వకర్ముఁ ద్రి
లోకీనుతు సుజనభజనలోలుఁ దలంచెన్.

ఎఱ్ఱన. హరివంశము. ఉ.భా.-2-156

సురశ్రేష్ఠుఁడును మహాశిల్పాచార్యుఁడును నైన విశ్వకర్మ యాక్షణంబ పంకజాక్షు గాలి కరుగుదెంచెను.

మూలము నందును ఇట్లేయున్నది.

శిల్పిముఖ్యోస్తి దేవనాం ప్రజాపతిసుతః ప్రభుః ।
విశ్వకర్మా స్వమత్యా వై పురీం సంస్థాపయిష్యతి ॥

.... .... .... ....

తస్మిన్నేవ తతః కాలే శిల్పాచార్యో మహామతిః ।
విశ్వకర్మా సురశ్రేష్ఠః కృష్ణస్య ప్రముఖే స్థితః ॥

-హరివంశము. అ. 86. శ్లో 20-22

అద్భుతశిల్పకళాభిజ్ఞుఁ డయిన యీ విశ్వకర్మ బ్రహ్మదేవుని కుమారుఁడు. ప్రభాసవసుపుత్రుఁడును, శిల్పప్రజాపతియు నైన విశ్వకర్మ కంటె భిన్నుఁడు.

పురందరుఁడు పంపఁగా వచ్చిన, "బృందారకవర్ధకి గోవర్ధనధరు చేత ననుజ్ఞాతుం డై యప్పుడ నిజవిద్యాప్రభావంబున

కనకంపుపెనుగోట వినువీథిఁ గడవంగ
మణిగోపురములు సమగ్రములుగ

బంధురప్రాసాదపంక్తులు నుత్తుంగ
హర్మ్యరేఖలు మనోహరత నలర

రాజమార్గం బభిరామంబుగాఁ బణ్య
పదము లుజ్జ్వలశిల్పభంగి నమర

నమరసద్మములుఁ జైత్యంబులు సభలును
బ్రపలు నపూర్వంపురచన మెఱయఁ

దొరఁగొట్టాలకంబులు తోరములుగఁ
గూపదీర్ఘికాసరసులు కొమరు మిగులఁ
గృతకపర్వతోద్యానంబు లతులములుగఁ
బరగు పురము నిర్మించె నచ్చెరువు గాఁగ.

ఇట్లు విశ్వకర్మ చేత నుత్పాదితయై ద్వారావతి యన మున్న యన్నారాయణు చేత నాహారితయై రమ్యాకార యగు నమ్మహాపురి నభినవానేకవిచిత్రరచనాచతురం బగు రాజమందిరంబునయ్యాదవేంద్రుఁ డధిష్ఠింప .... .... ....నుల్లసిల్లె."

హరివంశము. ఉ.భా. ఆ.2. 165-167.

# హస్తిపురము

భారతకథకు ముఖ్యకేంద్ర మయిన హస్తిపురము బహుపురాతనమైనది.

“భరతునకుం గైకేయి యైన సునందకు భూమన్యుండు పుట్టె, వానికి దాశార్హ పుత్త్రియైన విజయకు సుహోత్రుండు పుట్టె, వానికి నిక్ష్వాకుకన్యయైన సువర్ణకు హస్తి పుట్టె; నతనిచేసిం గౌరవ్యరాజధాని యైన నగరంబు హస్తిపురంబు నాఁ బరఁగె.”- నని నన్నయ మూలానుసరణముగనే వ్రాసినాఁడు.[1]

హస్తి దానిని క్రీ.పూ. 4840 సంవత్సరములో రాజధానిగాఁ జేసినాఁ డని డా॥ డి.యస్. త్రివేది నిర్ణయించినాఁడు.[2]

కౌరవుల రాజధాని ఆసందీవుర మనియు, ఏనుఁగు లెక్కువగా నుండుటచే నది హస్తినాపురముగా ప్రసిద్ధికెక్కిన దనియు, కావుననే యీ పురము నాగసాహ్వయ మనియుఁ గజసాహ్వయ మనియుఁ బిలువఁబడుచున్న దనియు దీనిని ప్రథమపరిక్షిత్తు ప్రతిష్ఠించి యుండవచ్చుననియు డా॥ పి.యల్. భార్గవ అభిప్రాయపడినాఁడు.[3]

ఢిల్లీకి ఈశాన్యముగ సుమారు 53 మైళ్ళ దూరమున హస్తినాపుర మున్న దనియు, పురాతనహస్తినాపురము గంగానది వరదలలో కొట్టుకొనిపోయి యుండు ననియు డౌసన్ వ్రాసినాఁడు.[4]

హస్తినాపుర శిథిలము లీ ప్రాంతములో కన్పించుచున్నవి.

హస్తినాపురము నేలిన రాజులలో భారతవంశకరుం డయిన విచిత్రవీర్యుఁడు కాశీరాజ దుహిత లయిన యంబికాంబాలికల నిరువురను వివాహమై భోగరసలాలసుఁడై నిజరాజ్యభారచింతాలసుఁ డయ్యెను.

“ఇట్లు సకలవ్యాపారరహితుండై కాశీరాజదుహితల నయ్యిరువుర నతి ప్రణయంబునం దగిలి,

1. నన్నయ- భార. ఆది. 4.111 [వ్యా.భా. ఆది. 95-33,34.]
2. Dr. D.S. Trivedi : Indian Chronology. P. 9.
3. Dr. P.L. Bhargava : India in the Vedic Age. P. 231.
4. Dowson : A Classical Dictionary.

అమలసుధారమ్యహర్మ్యతలంబుల
నవకుసుమామోదనందనములఁ
గృతకాద్రికందరక్రీడాగృహాంగణ
వివిధరత్నోపలవేదికలను
గలహంసకలనాదకమనీయకమలినీ
దీర్ఘికాసైకతతీరములను
రమియించుచును గామరాగాధికాసక్తిఁ
జేసి శోషించి విచిత్రవీర్యుఁ
డమరపురికిఁ జనిన నతనికిఁ బరలోక
విధుల శాస్త్రదృష్టి వెలయఁ జేసె
నాపగాతనూజుఁ డఖిలబాంధవులయు
బ్రాహ్మణులయుఁ దోడ భానునిభుఁడు."

-నన్నయ- భార- ఆది. 4. 216,17.

విచిత్రవీర్యుని రాజధాని హస్తిపురమే. కావున హస్తిపురములో రమ్య హర్మ్యములు, ఉద్యానవనములు, కృతకాద్రులు, వాని యందు క్రీడాగృహములు రత్నోపలవేదికలు, దీర్ఘికలు నున్న వని తెలియుచున్నది.

విచిత్రవీర్యు ననంతరము వాని భార్యలకు దేవరన్యాయంబున వేదవ్యాసుని వలనఁ గలిగిన ధృతరాష్ట్రపాండురాజులు పెరిగి పెద్ద యగువఱకు రాజ్యమును గాంగేయుఁడే పరిపాలించెను.

అమరాపగాసూను ననుశాసనంబునఁ
గౌరవరాజ్యంబు కడు వెలింగెఁ
గురుభూము లుత్తరకురువుల కంటెను
నధికలక్ష్మీయుక్తి నతిశయిల్లె
ధర్మాభిసంరక్షితం బైన భూప్రజ
కెంతయు నభివృద్ధి యొసఁగుచుండె
వలసినయప్పుడు వానలు గురియుట
సస్యసమృద్ధి ప్రశస్తమయ్యెఁ

జాకి సేఁపెఁ బుష్పఫలభరితంబులై
తపవనంబు లొప్పె ధర్మకర్మ
నిరతిఁ జేసి కుపము నెమ్మితో నన్యోన్య
హితముఁ జేయుచుండి రెల్ల జనులు.

-నన్నయ- భార- ఆది. 5.3

రాజ్యము ధనధాన్యములతో సమృద్ధమై యుండవలయు నన్న నగరములలో శిల్పులు, వణిజులు నెక్కువగ నుండవలయును. శిల్పుల వల్ల వస్తూత్పత్తియు, వణిజుల వల్ల వ్యాపారము నభివృద్ధియై దేశము సుసంపన్న మగును.

కురుజాంగలము నందలి నగరములు శిల్పులచేతను వణిజుల చేతను నిండి యున్నట్లు వ్యాసభారతము వలనఁ దెలియుచున్నది.

వణిగ్భి శ్చాన్వకీర్యంత నగరాణ్యథ శిల్పిభిః ।

-వ్యా.భా. ఆది.- 109.4.

నన్నయ యీ విషయము చెప్పలేదు.

కురుజాంగలము నందలి జనపదములు వాపీకూపములతోను, ఆరామముల తోను, సభాశాలల [సభా] తోను, బ్రాహ్మణావసథముల తోను రమ్యముగానున్నవి. రాజ్యమంతయు శతాధికములయిన యజ్ఞశాలలతోను, యూపములతోను రమణీయముగ నున్నది.

తస్మిన్ జనపదే రమ్యే కురుభి ర్బహులీకృతే ॥
కూపారామసభావాప్యో బ్రాహ్మణావసథాం స్తథా ।
బభూవుః సర్వర్ద్ధియుతా స్తస్మిన్ రాష్ట్రే సదోత్సవాః॥
భీష్మేణ ధర్మతో రాజన్ సర్వతః పరిరక్షితే ।
బభూవ రమణీయశ్చ చైత్యయూపశతాంకితః ॥

-వ్యా.భా. ఆది.- 109-11, 12, 13.

ఇట చైత్యము లనఁగా యజ్ఞశాలలు.

నన్నయ వాపీకూపసభాచైత్యయూపాది శిల్ప ప్రధానాంశముల నన్నింటిని వర్ణింపక బ్రాహ్మణావసథములను మాత్రము వర్ణించినాఁడు.

అమలాచారపవిత్రభూసురవరేణ్యాగార పుణ్యప్రదే
శములం దధ్యయనారవంబు విధివత్స్వాహా స్వధా స్వస్తి శ
బ్దములున్ మంగళతూర్యఘోషములు నుద్యత్కేతు కాహ్వాన
దములున్ రమ్యతరంబులయ్యె ధరణిన్ దద్రాజ్యసంవృద్ధితోన్.

-నన్నయ- భార. ఆది. ౯-౪.

కౌరవ రాజధానీనగరము మహేంద్రపురసన్నిభమై, మేఘముల వంటి ద్వార తోరణనిర్వ్యూహములతో శతాధికప్రాసాదములతో మహోదధి వలె నున్న దని వ్యాసభారతము నందు వర్ణింపఁబడినది.

తన్మహోదధివత్ పూర్ణం నగరం వై వ్యరోచత ।
ద్వారతోరణనిర్వ్యూహై ర్యుక్త మభ్రచయోపమైః ॥
ప్రాసాదశతసంబాధం మహేంద్రపుర సన్నిభమ్ ॥

-వ్యా.భా. ఆది- 109-5,9 *

కరినగరము, "గోపురవప్రప్రాకారసౌధాట్టాలకతోరణధ్వజద్వారకవాటకుడ్యవీథీ యుతమయి" నట్లు భాగవత దశమస్కంధము నందును వర్ణింపఁబడినది.[1]

నన్నయ యేలనో హస్తినాపురము నిట్లు వర్ణింపలేదు.

ఆశ్రమవాసపర్వమున ధృతరాష్ట్రుఁడు ధర్మరాజునకు రాజనీతి విశేషముల తెలుపుచు,

"పురరక్షణము దృఢంబుగ నరవర చేయంగవలయు"- ననిచెప్పినాడు.

[తిక్కన. భార- ఆశ్రమవాస. 1-57.]

ఆ సందర్భమున రాజధానీనగర లక్షణములు సూచింపఁబడినవి.

వ్యాసభారతము నం దిట్లున్నది.

పురం చ తే సుగుప్తం స్యాద్ దృఢప్రాకారతోరణమ్।
అట్టాట్టాలకసంబాధం షట్పదం సర్వతోదిశమ్ ॥

* "And the capital of Kurus, full as ocean, arc seeming with hundreds of palaces and mansions and possessing gates and arches dark as clouds, looked like second Amaravathi"
— P.C.Roy — Mbh. CIX.

1. ఆంధ్రభాగవతము-దశమస్కంధము. ఉ.భా. ౬౮౮.

తస్య ద్వారాణి సర్వాణి పర్యాప్తాని బృహంతి చ ।
సర్వతః సువిభక్తాని యన్త్రై రారక్షతాని చ ॥

వ్యా.భా. ఆశ్రమవాస. అ 8-16,17

రాజధానీనగరము దృఢమైనప్రాకారములతోడను, పురద్వారముల తోడను, యుద్ధవీరులుండుట కనువైన కోటబురుజుల తోడను, రక్షింపబడుచుండవలయును. ముఖ్యపట్టణ మన్ని దిక్కుల నాఱు పేటలుగ (six squares) నుండ వలయును. పురద్వారము లన్నియు పెద్దవిగ నుండవలయును. పురమంతయు చక్కగ విభజింపఁబడి రక్షకభటుల చేత రక్షింపఁబడుచుండవలయును.

ధృతరాష్ట్రుఁడు హస్తినాపురమును దృష్టి యం దుంచుకొనియే యిట్లు సూచించి యుండవలయును.

పురములలో హస్తినాపురము శ్రేష్ఠమైనది.

"…. …. పురాణాం గజసాహ్వయమ్ ।"

-వ్యా.భా. ఆది. 109-24

హస్తినాపురమునందలి తదితరవిశేషము లాయా ప్రకరణములందు చెప్పఁబడినవి.

-)o(-

## గిరివ్రజము

కృష్ణభీమపార్థులు కృతకస్నాతకులయి చని …. …. మగధదేశంబు సొచ్చి గోరథం బను పర్వతం బెక్కి,

ఉపతరహర్మ్యమాలికల నొప్పు గిరివ్రజ మన్ పురంబుఁ గాం
చిరి నవసౌరభప్రసవచిత్రవనావళి గల్గు దాని నె
వ్వరికి దురాసదంబు లగు వజ్రమయోన్నతవప్రచారుగో
పురముల దాని నయ్యలకఁ బోలెడు దాని మహార్ధసంపదన్.

-నన్నయ. భార. సభా. 1-172,173,

అచ్యుతుఁడు దాని యపూర్వరామణీయకసమృద్ధి కచ్చెరువడి, భీమార్జునుల కీట్లు చెప్పినాఁడు

"గోరథమును ఋషభము వై
హారము ఋషిగిరియుఁ జైత్యకాద్రియు ననఁగా
ఘోరగిరు లేను దీనికి
గూరథటులు వోలెఁ గావి చుట్టును నుండున్.

దానన చేసి యిప్పురంబు గిరివ్రజంబు నాఁబరఁగె".

—నన్నయ. భార. సభా. 1-174-76

మూలమునందు 'గోరథ' స్థానమున 'వరాహ' మనియున్నది

నిరామయః సువేశాఢ్యో నివేశో మాగధః శుభః ॥
వైహారో విపులః శైలో వరాహో వృషభస్తథా ।
తథైవర్షి గిరిస్తాత శుభా శ్చైత్యక పంచమాః ॥
ఏతే పంచ మహాశృంగాః పర్వతాః శీతలద్రుమాః ।
రక్షన్తీవాఽభిసంహత్య సంహతాంగా గిరివ్రజమ్ ॥ *

—వ్యా.భా. సభా. 21. 1-3

గిరివ్రజము చక్కని గృహసంపద గలిగి యారోగ్యప్రదమైనదని చెప్పఁబడినది. అనఁగా నచటి గృహము లారోగ్యసూత్రములు పాటించి కట్టఁబడినవన్నమాట.

గిరివ్రజదుర్గ ప్రాకారమే సుమారు 30 మైళ్ళ పరిణాహము (చుట్టుకొలత) గలది. దానికి ముప్పదిరెండు ముఖ్యద్వారములు, అరువది చిన్నద్వారములు గలవు. అది పదునాఱడుగులు మందము గల కోటగోడలలో బురుజులతో రక్షింపఁబడు చుండెడిది దని తెలియుచున్నది.[1]

* పర్వతదుర్గస్థత్వా ద్గిరివ్రజ ఇతి (Giribajja) గిరిబజ్జ నామాంతరం. పాలిగ్రంథ కారాః 'రాజగహ' ఇతి నామ వదంతి. పురాతనశిల్పశాస్త్రశిలాభిత్తిషు ప్రకాశంతే ప్రకృతే (Bihar) ఇతివ్యపదిశ్యంతే. తేషాం పశ్చిమసీమా శోణనదీ. (Rajagiri) రాజగిరి ఙ్మఖ్యపట్టణ మస్య.
(చూడు:— ములుకుట్ల నరసింహావధాని = శ్రీరామాయణసారోద్ధారః ।
—అరణ్యకాండః ॥ పు. 221.

1. Cf:- G. K Pillai : The Way of the Silpis. P 184.
" The fortified part alone of Girivraja, the old citadel of the

గిరివ్రజములో రాజమందిరమునకు తోరణద్వార మున్నది.[1] దానిని చేరుటకు మూడు కక్ష్యలు దాటవలయును.

జరాసంధు నివేశనము చేరుటకు కృష్ణభీమార్జునులు మూడు కక్ష్యలు దాటి పోయిరి.

తే త్వతీత్య జనాకీర్ణా స్తిస్రః కక్ష్యా నరర్షభాః ।
అహంకారేణ రాజాన ముపతస్థు ర్మహాబలాః ॥

-వ్యా.భా. సభా. 19-26

రాజమార్గము లున్నవి.[2] చదుకము (చతుష్పథము) లున్నవి.[3] రాజాంతః పుర మున్నది.[4]

మాలకారగృహములు, గంధికగృహములు ప్రత్యేకముగ నున్నవి.[5]

గిరివ్రజములో నొక శివాలయ మున్నది.

జరాసంధుడు రాజులను చెఱబెట్టి, దినమున కొక్కొకని వధించి భైరవ పూజ చేయువాడు.[6]

ప్రోక్షితానాం ప్రమృష్టానాం రాజ్ఞాం పశుపతేర్గృహే ।
పశునా మివ కా ప్రీతి ర్జీవితే భరతర్షభ ॥

-వ్యా.భా. సభా- 15-17

నాగాలయము లున్నవి. అర్బుద, శక్రవాపి, శత్రుతాపని, స్వస్తిక, మణి యను నాగుల పేరి యాలయము లున్నట్లు వ్యాసభారతము వలనఁ దెలియుచున్నది.

Magadha kingdom, had an encircling wall about 30 miles in perimeter, by 32 large and 64 small gates protected by stone towers. The walls were made of rough hewn stone 16 feet thick."

1. నన్నయ - సభా — 1-147
2. అదే 1-179
3. అదే 1-147
4. అదే 1-150
5. అదే 1-178
6. అదే 1-119

అభ్యుదః శక్రవాపీ చ పన్నగౌ శత్రుతాపనౌ
స్వస్తికస్యాలయశ్చాఽత్ర మణినాగస్యోత్తమః ॥

వ్యా.భా. -సభా 21-9

మగధరాజధాని యైన గిరివ్రజమును (రాజగృహమును) పూర్వకాలమున వసురాజు నిర్మించినాఁడు. అందుచేత దానికి 'వసుమతి' యను నామాంతరము గలదు.

చక్రే పురవరం రాజా వసునామా గిరివ్రజమ్ ॥
ఏషా వసుమతీ నామ వసో స్తస్యమహాత్మనః ।
ఏతే శైలవరాః పంచ ప్రకాశంతీ సమంతతః ॥

-వా.రా. బాల 32-7,8.

-)o(-

## సౌభకనగరము

శిశుపాలుఁడు శ్రీకృష్ణుని చేత నిహతుఁ డగుట విని వాని తమ్ముఁడు సాల్వుం డనువాఁడు, "కామగమనం బయిన తన సౌంభకం బను నగరంబుతో సన్నద్ధుం డయి ద్వారవతీ నగరంబు నవరోధించినాఁడు.'

-నన్నయ- భార. ఆరణ్య. 1-150.

మూలము నం దిట్లున్నది :

ఉపాయాద్ భరతశ్రేష్ఠ శాల్వో ద్వారవతీం పురీమ్ ।
అరుంధత్తాం సుదుష్టాత్మా సర్వతః పాండునందన ।
శాల్వో వైహాయసం చాపి తత్పురం వ్యూహ్యా ధిష్ఠితః ॥
తత్రస్థోథ మహీపాలో యోధయామాస తాం పురీమ్ ।
అభిసారేణ సర్వేణ తత్ర యుద్ధ మవర్తత ॥ *

-వ్యా.భా. వన. 15-3,4.

* అరుంధతే సేనయా వైహాయసం ఖేచరం వ్యూహ్యా స్వారక్షావరోపమర్ద్యాగ్యా రచనా విశేషేణ స్థాపయిత్వా ధిష్ఠితః సమ్యక్ స్థితః ॥క॥ అభితః పరిత ఉపరితిశ్చాయుధానాం

శాల్వుని పురము ఆకాశగమనము గలది. అది కోరిన చోటికి పోగలదు (కామగమమ్) దాని పేరు సౌభము.

శాల్వస్య నగరం సౌభం .... .... ॥

-వ్యా.భా. వన. 14-2.

ఆగతః కామగం సౌభ మారుహ్యైవ నృశంసవత్ ॥

-వ్యా.భా. వన. 14.6.

కామగేన ససౌభేన శాల్వః పునరుపాగమత్ ॥

-వ్యా.భా. వన. 16-27.

సౌభం కామగమం .... ....

-వ్యా.భా. వన- 22.9.

సౌభ మనఁగా కాంచనాదిధాతువులతో చక్కగా ప్రకాశించునదని యొకచోటను[1] సౌభ మన నాకాశమునందు సంచరించు పుర మనిమఱియొకచోటను[2] నీలకంఠుఁడు వివరించినాఁడు.

సౌభపురి మయనిర్మిత మనియు, నది లోహమయ మనియు భాగవత మహా పురాణము నందు వర్ణింపఁబడినది.

తథేతి గిరిశాదిష్టో మయః పరపురంజయః ।
పురం నిర్మాయ శాల్వస్యప్రాదాత్ సౌభ మయస్మయమ్ ॥

-వ్యాస. భాగ. స్కంధ 10- అ76-7.

మయ నిర్మితములయిన త్రిపురములలో దివి నుండునది కాంచనమయము కావున ఖేచర మయిన సౌభపురియు కాంచనమయమై యుండవచ్చును.

మహాశిల్పాచార్యుఁడయిన మయుఁడు నిర్మించిన పురములన్నిటి వలె సౌభ పురియు చిత్రవిచిత్ర లక్షణములు గలదే.

సభం నిస్సాణ మధిసార స్తేన సర్వేణ అచ్ఛిద్రేణ సర్వాభ్యో దిగ్భ్యో యుగప దవిరలా యుధసమూహాగమేనే త్యర్థః ॥4॥

—నీలకంఠ. చిత్రశాలాప్రతి- పు. 31.

1. వ్యా.భా. వన 14.6. 'సౌభం సుష్ఠు భాంతి తే సుభాః కాంచనాదయోధాతవ స్తజ్జమ్ ॥'
2. వ్యా.భా. వన. 16.27. ' సౌభేన ఖేచరేణ పురేణ' -

సౌభపురి కామగము వైహాసము నగుటయేకాక అది కోరినపుడు అదృశ్యము కాగలదు, కోరిన రూపము ధరింపఁగలదు.

"సాల్వసౌభకంబున వసుదేవుం గానక దాని మాయగానెఱింగి పదంపడి మాయావి యయిన సాల్వుంజూచి వానిపయి నలిగి ధే నేసిన నయ్యసురయు సౌంభకంబు నదృశ్యం బగుటయు

అసురుల యాక్రోశధ్వను
లెసఁగెం బదిదిశల నంత నేనును దద్రా
క్షసుల గతాసులఁ జేసితిఁ
బ్రసభంబున శబ్దభేది బాణప్రతతిన్

అంత సాల్వుండును దన సౌభకంబుఁ బ్రాగ్జ్యోతిషంబుఁ జేసి తానును దానవుం డయి పర్వతవర్షంబు నా పయిం గురిసి" నాఁడని కృష్ణుఁడు చెప్పినాఁడు.

-నన్నయ. భార- అరణ్య. 1-192-193.

మూలము నం దిట్లే యున్నది.

తతో నాదృశ్యత తదా సౌభం కురుకులోద్వహ ।
అంతర్హితం మాయయాభూత్ తతోఽహం విస్మితోఽభవమ్ ॥

-వ్యా.భా. వన. 22-3.

తతః ప్రాగ్జ్యోతిషం[1] గత్వా పునరేవ వ్యదృశ్యత ।
సౌభం కామగమం వీర మోహయన్ మమ చక్షుషీ ॥

-వ్యా.భా. వన. 22-9.

అదృశ్యకరణ మింద్రజాలవిద్యయే. అట్లే సౌభకంబుఁ బ్రాగ్జ్యోతిషంబుఁ జేయుటయు కనుకట్టు విద్యయే. కాని శిల్పచమత్కారముచే నగరాలంకరణము నం దుపయోగించు పతాకాదులను మార్చి యిట్టి భ్రాంతి గలిగించవచ్చు నని తోఁచుచున్నది.

ఈ విధముగా మాయాయుద్ధము చేయుచున్న సాల్వునిఁ పయినను, సౌంభకము పయినను శ్రీకృష్ణుఁడు తన సుదర్శనచక్రమును ప్రయోగించినాఁడు.

1. " ప్రాగ్జ్యోతిషం పూర్వసముద్ర తీరస్థం నగరవిశేషం యతః కామగమం అతః ప్రాగ్జ్యోతిషం గత్వా వ్యదృశ్యత." ॥9॥ -నీలకంఠ

"తడయక ఘోరదర్శన సుదర్శన పావకుచే దహింపఁగాఁ
బడి పరమేశ్వరోగ్రశరపావక దగ్ధ పురత్రయాభమై
యెడరిధరిత్రి మీఁదఁ బడియెన్ జెడి సౌంభక; మంత సాల్వుఁడుం
బడిసె మదీయచక్రపటుపాతనయంబున రెండు వ్రయ్యలై"

-నన్నయ. భార. అరణ్య. 1.198.

ఇట మయనిర్మిత మైన సౌభపురిని మయనిర్మిత పురత్రయముతోఁ బోల్చుట గమనింపఁదగినది.

మేరుశిఖరాకారముగ నున్న సౌభకము గోపురాట్టాలకములతో దగ్ధమయి నట్లు మూలము నందు వర్ణింపఁబడినది.

మహేశ్వరశరోద్ధూతం పపాత త్రిపురం యథా ॥35

.... .... .... ....

త న్మేరుశిఖరాకారం విధ్వస్తాట్టాలగోపురమ్ ।
దహ్యమాన మభిప్రేక్ష్య । .... .... ॥40

-వ్యా.భా. వన. 22. 25-40.

కృష్ణుఁడు సౌభపురిని దగ్ధ మొనరించుట మొహంజొదారో వంటి మహా నగరమును నాశన మొనరించుటయే కావచ్చు నని ప్రబోధచంద్రగుప్త అభిప్రాయ పడినాఁడు.1

1. Cf :- Prabodh Chandra Gupta - Ancient Indian Chronology. P.24. "In the Mahabharata, we get many references to show that Rakshasas, Asuras, and the Aryan Hindus had their kingdoms side by side. In Vana Parva or Book III ch. 13-22, give us a discription of the destruction of Saubhapuri by Krishna This may mean the destruction of a city like Mohenjodaro."

-)o(-

# అయోధ్యానగరము

శాపవిముక్తుం డైన కల్మాషపాదుఁడు, "వసిష్ఠుం దోడ్కొని యయోధ్యాపురంబున కరిగి సకలప్రజానురాగకరణుం డగు యమ్మౌని వరు నతిభక్తిం బూజించుచుండె"

—నన్నయ. భార. ఆది. 7-190.

మూలము నం దిట్లున్నది.

తతః ప్రతియమౌ కాలే వసిష్ఠః సహ తేన వై ।
ఖ్యాతాం పురీ మిమాం లోకే ష్వయోధ్యాం మనుజేశ్వర

.... .... ....

సురుచిరాయ మనుష్యేంద్రో నగరీం పుణ్యలక్షణామ్।
వివేశ సహిత స్తేన వసిష్ఠేన మహర్షిణా ॥ ....

స తాం పూరయామాస లక్ష్మ్యా లక్ష్మీవతాం వరః ।
అయోధ్యాం వ్యోమి శీతాంశుః శరత్కాల ఇవోదిత ॥

సంసిక్తమృష్టపంథానం పతాకధ్వజశోభితమ్ ।
మనః ప్రహ్లాదయామాస తస్య తత్పురముత్తమమ్ ॥

తుష్టపుష్టజనాకీర్ణా సా పురీ కురునందన ।
అశోభత తదా తేన శక్రేణేవామరావతీ ॥

వ్యా.భా. ఆది. 177. 36-42. *

అయోధ్యానగరము జగత్ప్రసిద్ధి గాంచినది. పుణ్యలక్షణములు గల యా పురము చూచువారి కాహ్లాదము గలిగించుచు శక్రపురి యగు నమరావతి వలె శోభిల్లు చుండును.

అయోధ్యాపురనాయకుఁ డయిన హరిశ్చంద్రుఁడు రాజసూయ మహాయజ్ఞ కరణంబునం జేసి దేవేంద్రసాలోక్యంబు వడసినాఁడు.[1]

* పోల్చు : వాల్మీకి రామాయణము — బాలకాండ. సర్గ, 5.

1. నన్నయ. భార. సభా. 1. 84-87

వాల్మీకిరామాయణము నందలి యయోధ్యాపుర వర్ణన మతివిపులమై యనేక విశేషాంశములు వెల్లడించుచున్నది.

అయోధ్యా నామ నగరీ తత్రాసీ ల్లోకవిశ్రుతా ।
మనునా మానవేంద్రేణ యా పురీ నిర్మితా స్వయమ్ ॥
ఆతయా దశ చ ద్వే చ యోజనాని మహాపురీ ।
శ్రీమతీ త్రీణి విస్తీర్ణా సువిభక్తమహాపథాః ॥
రాజమార్గేణ మహతా సువిభక్తేన శోభితా ।
ముక్తపుష్పావకీర్ణేన జలసిక్తేన నిత్యశః ॥
తాం తు రాజా దశరథో మహారాష్ట్రవివర్ధనః ।
పురీ మావాసయామాస దివి దేవపతిర్యథా ॥
కపాటతోరణవతీం సువిభక్తాంతరాపణామ్ ।
సర్వయంత్రాయుధవతీ ముషితాం సర్వశిల్పిభిః ॥
సూతమాగధసంబాధాం శ్రీమతీ మతులప్రభామ్ ॥
ఉచ్చాట్టాలధ్వజవతీం శతఘ్నిశతసంకులామ్ ॥
వధూనాటకసంఘైశ్చ సంయుక్తాం సర్వతఃపురీమ్ ।
ఉద్యానామ్రవనోపేతాం మహతీం సాలమేఖలామ్ ॥
దుర్గగంభీరపరిఘాం దుర్గా మన్యైర్దురాసదామ్ ।
వాజివారణసంపూర్ణాం గోభిరుష్ట్రైః ఖరైస్తథా ॥
సామంతరాజసంఘైశ్చ బలికర్మభిరావృతమ్ ।
నానాదేశనివాసైశ్చ వణిగ్భిరుపశోభితామ్ ।
ప్రాసాదై రత్నవికృతైః పర్వతై రివ శోభితామ్ ।
కూటాగారైశ్చ సంపూర్ణా మింద్రస్యేవామరావతీమ్ ॥
చిత్రా మష్టాపదాకారాం వరనారీగణాయుతామ్ ॥
సర్వరత్నసమాకీర్ణాం విమానగృహశోభితామ్ ॥
గృహగాఢా మవిచ్ఛిద్రాం సమభూమౌ నివేశితామ్ ॥
.... .... ....
విమాన మివ సిద్ధానాం తపసాధిగతం దివి ।
సునివేశితవేశ్మాంతాం నరోత్తమసమావృతామ్ ॥

— వా.రా. బాల. సర్గ 5. శ్లో6-19.

ఈ వర్ణనము వలనఁ దెలియఁదగు నంశములు.

1) అయోధ్యానగరము మానవేంద్రుఁ డయిన మనువుచే నిర్మింపఁబడినది. అది క్రీ.పూ. 3100 సం॥ ప్రాంతమున నిర్మింపఁబడి యుండు నని పండితులూహించు చున్నారు.[1]

2) దాని పొడవు పండ్రెండు యోజనములు, వెడల్పు మూఁడు యోజనములు. అనఁగా నది దీర్ఘచతురస్రాకారము. అది అరువదినాలుగు గడులు గల నెత్తపుపలక వలె నున్న దనిచెప్పఁబడినది. నగరనిర్మాణమునకు చతుష్షష్ఠిపద వాస్తువు శ్రేష్ఠమైనది. సాధారణముగ నిది చతురస్రాకారముగ నుండును. దీర్ఘచతురస్రాకారము గల నెత్తపుపలక యెట్లుండునో యూహింప వలసి యున్నది.

3) తోరణద్వారములున్నవి. పరిఘాప్రాకారములున్నవి.

4) రాజమార్గములు విశాలములై చక్కఁగా విభజింపఁబడి యున్నవి. వానిని ప్రతిదినము నీటితో తడిపి వాని పయి పూలు చల్లుచుండిరి. మార్గాంతరము లందు అంగళ్ళు పెట్టుకొనుటకు వీలుగా నున్నది.

5) ఎత్తైన కోటబురుజు లున్నవి. వానిపై శతఘ్ను లమర్పఁబడినవి. అనేకవిధములయిన యాయుధములు, యంత్రము లున్నవి.

6) నానావిధశిల్పములు చేయు శిల్పు లున్నారు.

7) రత్నవికృతము లయిన ప్రాసాదములు, కూటాగారములు విమానములు (ఏడంతస్తుల మేడలు), సాధారణగృహములు ఉన్నవి, ఉద్యానవనము లున్నవి.

8) గృహము లన్నియు చక్కని వరుసలుగా దేవలోకము నందలి సిద్ధుల విమానముల వలె నున్నవి.

దీనిని బట్టి భారతీయశిల్పాచార్యు లతిప్రాచీనకాలము నందేయిట్టి మనోహర నగరరచనాప్రణాళిక లవలంబించుచున్నట్లు తెలియవచ్చును.

1. Cf ; J.H. Dave : Immortal India Vol I P-77.
"Manu (about B.C 3100) was the first traditional king of India and he founded Ayodhya."

-)o(-

# మిథిలానగరము

ఏకపాదుని కొడుకగు నష్టావక్రుఁడును, ఉద్దాలకుని తనయుఁడగు శ్వేతకేతుఁడును జనకరాజు యజ్ఞమునకుఁ జనిరి.[1]

జనకమహారాజు మిథిలానగరమున కధిపతి. జనకునిచే పాలింపఁబడు మిథిలానగర "మనుపమశోభాసనాథమైన" దని ఎఱ్ఱన వర్ణించినాఁడు.[2]

ఆ శోభ యెట్టిదో వ్యాసభారతమును చూచినఁగాని తెలియదు. వ్యాసమహర్షి మిథిలానగరశోభను మిక్కిలి మనోహరముగా వర్ణించినాఁడు.

తతో జగామ మిథిలాం జనకేన సురక్షితామ్ ।
ధర్మసేతుసమాకీర్ణాం యజ్ఞోత్సవవతీం శుభామ్ ॥
గోపురాట్టాలకవతీం హర్మ్యప్రాకారశోభితామ్ । *
ప్రవిశ్య నగరీం రమ్యాం విమానై[3] ర్బహుభిర్యుతామ్ ॥
పణ్యైశ్చ బహుభిర్యుక్తాం సువిభక్తమహాపథామ్ ।
అశ్వై రథై స్తథా నాగై ర్యోధైశ్చ బహుభిర్యుతామ్ ।
హృష్టపుష్టజనాకీర్ణాం నిత్యోత్సవసమాకులామ్ ॥

-వ్యా.భా. వన. 207, 6-8.

మిథిలానగరము గోపురాట్టాలకములతో హర్మ్యప్రాసాదప్రాకారములతో శోభిల్లుచున్నది. అది యనేక విమానములతో (ఏడంతస్తులమేడలతో) రమ్యముగా నున్నది. అందలి రాజమార్గములు చక్కఁగా విభజింపఁబడియున్నవి. అనేక పణ్యస్థానములున్నవి. అది యనేకాశ్వరథనాగయోధగణములతో నిండియున్నది. ఆ మిథిలానగరము నందలి జనులు నిత్యసంతుష్టులై నిత్యోత్సవములు చేసికొనుచుందురు.

---

1. నన్నయ- భార. అరణ్య. 3-246
2. ఎఱ్ఱన. భార. అరణ్య - 5-27

* పోల్చు :- వ్యా.భా. వన. 173-3, హిరణ్యపురవర్ణనము.

"These two examples show that Gopura denotes gate-houses of palaces and cities and that they need not necessarily belong to temples alone." —P.K. Acharya.

3. విమానైః సప్తభూమిగృహైః ॥ -నీలకంఠ.

కౌశికుం డను మహాద్విజుఁడు ధర్మవ్యాధ దర్శనలాలసుఁ డై కదలి యనేక గ్రామంబు లతిక్రమించి చని యనుపమానశోభాసనాథం బయిన మిథిలానగరంబు సొచ్చి రాజమార్గంబు దఱిసి .... .... యక్కిరాతుం గని .... తొలంగి యుండఁగా[1] వాఁ డా ధరణీశ్వరునకు మ్రొక్కి మద్గృహంబునకు రమ్మని తోడికొని పోయినాఁడు. కౌశికుఁడు తదీయభవనంబున కరిగి వానిచేఁ బూజితుండయి యిష్టకథాప్రసంగంబుల నున్నాఁడు.[2]

ధర్మవ్యాధుఁడు తా నుత్తమవిజ్ఞానోన్నతి వడయుటకు మూల మైన యొక ధర్మమును ప్రత్యక్షముగా నెఱిఁగింతు "నభ్యంతర మందిరమునకు రమ్మని యతనిం దోడ్కొని చని, మనోహరం బైచతుశ్శాలం బైవివిధసౌరభసంవాసితం బైనహర్మ్యంబు నందు మహితాసనాసీను లైన వారిం దన జననీజనకుల నభిమతాహార పరితోషితులఁ బరమాంబరాభరణగంధమాల్యాలంకృతమూర్తు లనతనికిం జూపినాఁడు.[3]

ఈ వర్ణనము వలన మిథిలానగరము నందు సామాన్యజనులు సైతము మనోహర మయిన హర్మ్యములలో చతుశ్శాలాభవనములలో నివసించు చుండి రనియు, నివాసగృహములకు శయనాసనాదులు గల యభ్యంతరమందిరములు, గంధసంవాసితము లయిన పూజామందిరములు వేఱు వేఱుగా నుండెడివనియు తెలియుచున్నది.

1. ఎఱ్ఱన. భార. అరణ్య- 5.27

2. ఎఱ్ఱన. భార. అరణ్య- 5. 29,30 (వ్యా.భా.-వన. 207. 17,18)

" అగ్రతశ్చ ద్విజం కృత్వా స జగామ గృహం ప్రతి ।
ప్రవిశ్య చ గృహం రమ్య మాసనేనాభిపూజితః ॥

3. ఎఱ్ఱన. భార. అరణ్య- 5. 113,114. (వ్యా.భా. వన. 214-5,6)

ఇత్యుక్తః స ప్రవిశ్యాథ దదర్శ పరమార్చితమ్ ।
సౌధం హృద్యం చతుశ్శాల మతీవ చ మనోరమమ్ ॥

దేవతాగృహసంకాశం దైవతైశ్చ సుపూజితమ్ ।
శయనాసనసంబాధం గంధైశ్చ పరమైర్యుతమ్ ॥

-)o(-

# లంకాపురి

కురువిభు రాజసూయమునకున్ ధన మిచ్చిరి రాజులెల్ల రా
దరమునఁ బ్రీతి సేయునది తానును దప్పక యంచు లంక క
ెచ్చెరువుగఁ బుచ్చె దూతలఁ బ్రసిద్ధిగ నంత విభీషణుండు చె
చ్చెర సహదేవు శాసనము చేకొని సేసెఁ గరంబు నెమ్మితోన్.

—నన్నయ. సభా. 1-263.

సహదేవునిచే దూతగాఁ బంపఁబడిన ఘటోత్కచుఁడు లంకాపురమెట్లున్నదో వ్యాసభారతము నందు వర్ణింపఁబడినది.

గత్వా పారం సముద్రస్య దక్షిణం స ఘటోత్కచః ।
దదర్శ లంకాం రాజేంద్ర నాకపృష్ఠోపమాం శుభామ్ ॥

ప్రాకారేణావృతాం రమ్యాం శుభద్వారైశ్చ శోభితామ్ ।
ప్రాసాదై ర్బహుసాహస్రైః శ్వేతరక్తైశ్చ సంకులామ్ ॥
తాపనీయగవాక్షేణ ముక్తాజాలాంతరేణ చ ।
హైమరాజతజాలేన దాంతజాలైశ్చ శోభితామ్ ॥
హర్మ్యగోపురసంబాధాం రుక్మతోరణసంకులామ్ ।
దివ్యదుందుభినిర్హ్రాదా ముద్యానవనశోభితామ్ ॥
పుష్పగంధైశ్చ సంకీర్ణాం రమణీయమహాపథామ్ ।
నానారత్నైశ్చ సంపూర్ణా మింద్రస్యేవామరావతీమ్ ॥

— — వ్యా.భా. సభా. అ 31. *

* చూడు : శ్రీమన్మహాభారతమ్. గోరఖ్‌పూరుప్రతి. పుట. 328
సభా అ. 31 శ్లో 73-74 మధ్య.
దాక్షిణాత్యప్రతిలోను ఈ శ్లోకములు కించిద్భేదముతో అధికపాఠముగానున్నవి.
చూడు : వావిళ్ళప్రతి పు 542
పోల్చు : వాల్మీకి రామాయణము. సుందరకాండ. అ3,
" యుద్ధకాండ . అ24

రావణుఁడు, సీతను బట్టికొని గగనంబున కెగసి .... .... లంకాపురంబునకుం జని యం దశోకవన మధ్యంబున నా సుమధ్య నునిచి తదీయ రక్షణార్థంబు రాక్షసీ నివహంబు నియోగించె."

—ఎఱ్ఱన. భార. అరణ్య. 6-351

రావణుఁడు సీతాసమేతముగా వప్రప్రాకారములతో దుర్గమముగా బహు ద్వారములతో మనోహరముగా విశ్వకర్మ చేత నిర్మింపఁబడిన లంకాపురములోనికి ప్రవేశించినట్లు వ్యాసభారతము నందు వర్ణింపఁబడినది.

దదర్శాథ పురీం రమ్యాం బహుద్వారాం మనోరమామ్ ॥
ప్రాకారవప్రసంబాధాం నిర్మితాం విశ్వకర్మణా ।
ప్రవివేశపురీం లంకాం స సీతో రాక్షసేశ్వరః ॥ *

—వ్యా భా. వన. 279.11,12

రావణోఽపి పురీం గత్వా లంకాం కామబలాత్కృతః ।
సీతాం నివేశయామాస భవనే నందనోపమే ॥
అశోకవనికాభ్యాశే తాపసాశ్రమ సన్నిభే ।

—వ్యా.భా. వన. 280-41,42

లంకాపురి లవణాబ్ధి మధ్యమమందు త్రికూట పర్వతముపై నున్నది.

" ఆ లవణాబ్ధి మధ్యమున యందుఁ ద్రికూటనగంబు మీఁద ను
త్తాల విశాలహేమమణిధామ సముజ్జ్వలమైన లంక యన్
ప్రోలొగిఁ గంటి నెంతయు నపూర్వము తద్విభవంబు .... ...."

—అని మారుతాత్మజుఁడు శ్రీరామునికిఁ జెప్పినాఁడు.

—ఎఱ్ఱన. భార. అరణ్య -7.26

హనుమంతుఁడు చూచిన లంకాపురి వాల్మీకిరామాయణము నం దిట్లు వర్ణింపఁబడినది.

* ప్రాకారః పరిధిభిత్తిః వప్ర స్తద్బాహ్యం వేణుమయం దుర్గం ।
తాభ్యాం సంబాధాం దుర్గమాం ॥ — నీలకంఠ- చిత్రశాలా ప్రతి. పు. 440
'వప్రః స్థానే పుమా నస్త్రీ వేణుక్షేత్రే చ పేటకే' — ఇతిమేదినీ.

సమాసాద్య చ లక్ష్మీవాన్ ల్లంకాం రావణపాలితామ్ ।
పరిఖాభిః స పద్మాభిః సోత్పలాభిరలంకృతామ్ ॥
సీతాపహరణాత్ తేన రావణేన సురక్షితామ్ ।
సమంతాద్ విచరద్భిశ్చ రాక్షసై రుగ్రధన్విభిః ॥
కాంచనేనావృతాం రమ్యాం ప్రాకారేణ మహాపురీమ్ ।
గృహైశ్చ గిరిసంకాశైః శారదాంబుదసన్నిభైః ॥
పాండురాభిః ప్రతోలీభిరుచ్చాభి రభిసంవృతామ్ ।
అట్టాలకశతాకీర్ణాం పతాకధ్వజశోభితామ్ ॥
తోరణైః కాంచనై ర్దివ్యై ర్లతాపంక్తి విరాజితైః ।
దదర్శ హనుమాంల్లంకాం దేవో దేవపురీ మివ ॥
గిరిమూర్ధ్నిస్థితాం లంకాం పాండురై ర్భవనైః శుభైః ।
దదర్శ స కపిః శ్రీమాన్ పురీ మాకాశగా మివ ॥
పాలితాం రాక్షసేంద్రేణ నిర్మితాం విశ్వకర్మణా ।
ప్లవమానమివాకాశే దదర్శ హనుమాన్ కపి ॥
వప్రప్రాకారజఘనాం విపులాంబువనాంబరామ్ ।
శతఘ్నీశూలకేశాంతా మట్టాలకావతంసకామ్ ॥
మనసేవకృతాం లంకాం నిర్మితాం విశ్వకర్మణా ।

— వా.రా. సుందర. అ2 శ్లో 14-22

**రావణపాలిత** మైన లంక పద్మోత్పలాలంకృతము లయిన పరిఖలతో సువర్ణ ప్రాకారములతో, శరన్మేఘముల వలె తెల్లగా నెత్తుగానున్న గృహములతో, మేడలతో రాజమార్గములతో, కనకమయము లయిన తోరణద్వారములతో శోభిల్లుచు నమరపురి వలె నున్న లంకాపురిని హనుమంతుఁడు చూచినాఁడు.

విశ్వకర్మ చే నిర్మింపఁబడిన లంకాపురి యాకసము నందు తేలియాడు చున్నట్లు గన్పించుచున్నది. విశ్వకర్మ తన సంకల్పబలముతోనిర్మించిన లంకాపురపురంధ్రి వప్ర ప్రాకారములు జఘనముగా, వనవారాశులు వస్త్రముగా శతఘ్నిశూలములు కేశాంతములుగా అట్టాలకములే కర్ణభూషణములుగా గలిగి మనోహరముగా నున్నది.

లంకాపురిలో సప్తభూమిగృహములు, అష్టభూమిగృహములు కూడ నున్నవి. అవి స్ఫటికమణుల తోను, సువర్ణము తోను, వైడూర్యమణిచిత్రముల తోను ముక్తా

జాలముల తోను నలంకరింపఁబడి యున్నవి.

సప్తభౌమాష్టభౌమశ్చ స దదర్శ మహాపురీమ్ ।
తలైః స్ఫటికసంకీర్ణైః కార్తస్వర విభూషితైః ॥
వైడూర్యమణిచిత్రైః ముక్తాజాలవిభూషితైః ॥

—వా.రా. సుందర. 2. 52,53

లంకాపురి ఇరువది యోజనములు పొడవు, పది యోజనముల వెడల్పు గలిగి దీర్ఘచతురస్రాకారముగనున్నది.

దశయోజన విస్తీర్ణా వింశద్యోజన మాయతా ॥

—వా.రా. యుద్ధ. సర్గ 40-20

లంకాపురి పొడవు నూఱు యోజనము లనియు, వెడల్పు ముప్పది యోజనము లనియు మఱియొకచోట వర్ణింపఁబడినది. దానికి విశ్వకర్మయే సాక్షి. లంకాపురము శక్రు నాజ్ఞచే నాచేత నిర్మింపఁబడిన దని విశ్వకర్మయే రాక్షసులతోఁ జెప్పినాఁడు.

విశ్వకర్మా తత స్తేషాం రాక్షసానాం మహాభుజః ।
నివాసం కథయామాస శక్రస్యేవామరావతీమ్ । ....
త్రింశద్యోజనవిస్తీర్ణా శతయోజనమాయతా ॥ *
స్వర్ణప్రాకారసంవీతా హేమతోరణసంయుతా ॥
మయా లంకేతి నగరీ శక్రాజ్ఞప్తేన నిర్మితా ॥

వా.రా. ఉ.కాం. సర్గ 5.శ్లో 23-26

ఈ కొలతలు లంకాపురి మొత్తము వైశాల్యమును తెలుపుననియు, మొదట చెప్పిన కొలతలు లంకాపురిలో రావణుఁడు నివసించు ప్రాంతము – రాజధాని – కొలత లనియు సమన్వయము చేసి చెప్పికొనవచ్చును.

లంకలో కుంభకర్ణుని నివాసస్థానము పొడవు వెడల్పులు గూడ 2:1 నిష్పత్తిలో నున్నవి. దాని పొడవు రెండుయోజనములు, వెడల్పు ఒకయోజనము ; అనఁగా నది దీర్ఘచతురస్రాకృతి గలిగి యున్నది.

* పోల్చు : వాయుపురాణము.
"శత యోజనవిస్తీర్ణా త్రింశద్యోజన మాయతా."

పురముగాని, నివాసగృహము గాని, వెడల్పు కంటె రెండింతలో మూఁడింతలో పొడవు గలిగి దీర్ఘచతురస్రాకృతిలో నుండుట శిల్పశాస్త్ర సమ్మతముగ నున్నది.

లంకాపురిని విశ్వకర్మ తన సంకల్పబలముతో నిర్మించినాఁ డని వాల్మీకి రామాయణము నందు పలుతావుల వర్ణింపఁబడినది.

మనసేవ కృతాం లంకాం నిర్మితాం విశ్వకర్మణా। *

—వా.రా. సుందర. 2-22

మనసేవ కృతాం లంకాం నగాగ్రే విశ్వకర్మణా।
విమానై ర్బహుభిర్లంకా సంకీర్ణా రచితా పురా ॥ **

—వా.రా. యుద్ధ 24 - 9, 10

త్రికూటశిఖరే రమ్యే నిర్మితాం విశ్వకర్మణా ॥

—వా.రా. యుద్ధ. 40-2

మహాభారతము నందును లంకాపురి విశ్వకర్మ నిర్మిత మనియే చెప్పఁబడినది. (చూడు ; వ్యా.భా. వన. 279–12)

కాని డా॥ వి. రాఘవన్ లంకాపురి మయనిర్మిత[1] మని వ్రాయుటకు దగిన యాధారము గాన వచ్చుటలేదు.

లంకిణి 'యంత్రాగారస్తని' యైనంత మాత్రమున లంకాపురి మయనిర్మిత మని చెప్పవచ్చునా ?

విశ్వకర్మ నిర్మితమైన లంకాపురి యందు రావణుఁడు తన మామయైన మయవిశ్వకర్మ చేత కొన్ని మార్పులు చేయించి యుండవచ్చు నని కొందఱు పండితు లూహించుచున్నారు.

* " the city constructed by Viswakarma, the architect of gods'

** " Behold on the summit of a mountain, the elevated city of Lanka evolved as though with his mind by Viswakarma (the architect of gods.). "

— Valmiki Ramayana — Eng. Tr. Gorakhpoor Edition

1. Cf : Dr. V. Raghavan : Yantras or Mechanical Contrivances in Ancient India- P.4
" Lanka, as a city built by Maya, is naturally more full of Yantras. The city, personified as a Lady, is called Yantra garastani etc. "

# వారణావతము

దుర్యోధనుఁడు వలను గల మంత్రివరులను బిలిచి పాండవులకుఁ బ్రియముగ వారణావతమును బొగడుఁ డని పంచిన వారును,

"వారణావతంబు ననవరతసురభికుసుమఫలభారనమ్రశాఖా విశాలతరువన రేఖాలంకృతం బనియును, వనజలకేళికందుక మృగయాదివివిధ విహారహారి ప్రదేశాభి శోభితం బనియును, నవసుధాధౌతసౌధసుధాకరనికరప్రభాపటలప్రధ్వంసితాసితపక్షదోషం బనియును నిరస్తదోషానుషంగమంగళమహారత్నరాజివిరాజిత విపుల వీథీవిహసితాలకా విలాసం బనియును మనోరమానేకసుఖానుభోగభాగి మహాభాగజన సమృద్ధం బనియును (పుణ్యనదీప్రవాహాశోభితం బనియును) వర్ణించి యప్పురంబు నంద పాండునందనుల జాతకౌతూహల చిత్తులం జేసిరి.'

— నన్నయ- ఆది. 6-133

మూలము నందీ వారణావతపుర వర్ణన మింత విపులముగా లేదు. అది రమ్యమైన దనియు, రమణీయతమమైనదియుఁ జెప్పఁబడినది.

'కథయాం చక్రిరే రమ్యం నగరం వారణావతమ్ ॥ 2
రమణీయతమం లోకే నగరం వారణావతమ్ ॥ 7

—వ్యా.భా. ఆది. 143-2,7

వారణావతము గంగాతీరమున నున్నది. అది పశుపతి నివాసస్థానము.

" విదితంబుగఁ బుణ్యామర
నదిసమీపమున వారణావతనగరం
బది సర్వసుఖాస్పద మని
వదలక వర్ణింతు రెల్లవారును దానిన్

మీరును గుంతియు సహావరి
వారమహామాత్యభృత్య వర్గుల రైనా
నారాజ్యలీలతోఁ జని
స్వారమతిం జేయుఁ డందు సతతోత్సవముల్

పశుపతినివాసం బయిన యప్పుణ్య స్థానంబునం బాండుహితంబుగా నగణ్యగో హిరణ్యాదిమహాదానంబుల బ్రాహ్మణతర్పణంబు సేసి యందుఁ గొండొకకాలం బుండి వచ్చునది" యని ధృతరాష్ట్రుఁడు పాండవుల నచటకుఁ బంపినాఁడు.

— నన్నయ. భార. ఆది. షష్ఠ. 135-37

పాండవులు వారణావతము చేరినంతనే పురజనులు వారికి స్వాగతము పలికినారు.

వారణావతము నందు 'ఉత్తుంగహర్మ్యము' లున్నవి.[1] చతుశ్శాలా భవనము లున్నవి.

వారణావతము నందు రాజోద్యోగుల నివాసస్థానములు, చాతుర్వర్ణ్యనివాస స్థానములు వేర్వేఱు పేటలుగ నున్నవి.

పాండవులు ముందు బ్రాహ్మణావసథములను తరువాత తక్కిన వారి గృహము లను దర్శించినారు.

ప్రవిశ్య పురీం వీరా స్తూర్ణం జగ్ము రథో గృహాన్ ।
బ్రాహ్మణానాం మహీపాల రతానాం స్వేషు కర్మసు ॥
నగరాధికృతానాం చ గృహాణి రథినాం తదా ।
ఉపతస్థు ర్నరశ్రేష్ఠా వైశ్యశూద్ర గృహాణి చ ॥

— వ్యా.భా. ఆది. 146 - 6,7

వారణావతము నందు సర్వాలంకారసుందరం బైన రాజమందిర మున్నది.[2] పాండవు లందు కొన్ని దినము లున్నారు.

పురోచనశిల్పాచార్యుఁడు సకలజననయనాభిరామంబుగా నిర్మించిన చతుశ్శాల యున్నది.[3] అది వెండికొండవలె నున్నది. దాని పేరు "శివ" గుహ్యకులు కైలాసము ప్రవేశించినట్లు పాండవు లా చతుశ్శాలను ప్రవేశించినారు.[4] వారం దాఱు నెల లున్నారు. తరువాత దానికి నిప్పంటించి పాఱిపోయినారు.

1. నన్నయ. భార. ఆది. 6-149
2. ,, -6-150
3. ,, -6-150 ఇది లాక్షాగృహము. దీని నిర్మాణ విశేషములు వేఱొక ప్రకరణము నందు వివరింపఁబడినవి.
4. వ్యా.భా. ఆది. 146-12

వారణావతము హస్తినాపురమునకు 500 మైళ్ళ దూరమున నున్న దనియు నదియే నేటి "అలహాబాదు" – అనియు చరిత్రకారులు భావించుచున్నారు.*

–)o(–

# నాగలోకము : భోగవతి

ఇంద్రప్రస్థ మురగపురముతోఁ బోల్పఁబడినది. ఆ యురగపుర మేది ? అది యెట్లుండును ?

ఉదంకుఁడు నిజగురుపత్నీనియోగంబున పౌష్య మహాదేవి మణికుండలములు గొనివచ్చుచుండఁగా మాయాదక్షుఁడైన తక్షకుఁడు తన తోడన వచ్చి యక్కుండలములు గొని భూవివరమున నహిలోకమునకు పాఱిపోయెను.

ఉదంకుఁడు వాని తోడన తగిలి యవ్వివరంబున నురగలోకమున కరిగి నాగపతుల నెల్ల స్తుతియించియు, నొకానొక దివ్యపురుషు ననుగ్రహంబువలన నశ్వకర్ణ రంధ్రాధ్మానంబు సేసి, 'తదశ్వాఖిలస్రోతోమార్గవినిర్గతోగ్రదహనార్చుల" చేత వారిని భయపెట్టియు, మణికుండలములు మరల సంపాదించినాఁడు.

నన్నయ. భార. ఆది. 1-98–118

ఉరగలోకమున కేగిన యుదంకుఁడు దానిని చూడకుండునా ? నన్నయ నాగలోకమును వర్ణింపలేదు.

మూలము నం దిట్లున్నది.

"త ముత్తంకోఽనువివేశ తేనైవ బిలేన ప్రవిశ్య చ తం నాగలోక మపర్యంత మనేకవిధప్రాసాదహర్మ్యవలభీనిర్యూహశత సంకుల ముచ్చావచ క్రీడాశ్చర్య స్థానావకీర్ణ మపశ్యత్." [1]

— వ్యాభా. ఆది: 3- 33

తత్ర తే పురుషవ్యాఘ్రా వివశుః సపరిచ్ఛదాః ।
పురోచనస్య వచనాత్ కైలాస మివ గుహ్యకాః ॥

* Cf :- J. T. Wheeler : India of the Vedie Age. P 100-101

1. ప్రాసాదాః దేవనృదేవ గృహాణి । హర్మ్యాణి ధనికానాం గృహాణి । →

ఇట ప్రాసాదములు, హర్మ్యములు వేఱువేఱుగా పేర్కొనఁబడినవి. ప్రాసాదము లనఁగా దేవమందిరములు, రాజమందిరములు హర్మ్యము లనఁగా ధనికుల గృహములు, నిర్యూహము లనఁగా పర్ణశాలలు వలభు లనఁగా చంద్రశాలలు.

ఉదంకుని కథ యశ్వమేధ పర్వము నందును గలదు.

భృగూద్వహుం డయిన యుదంకుఁడు భుజంగలోకము, 'చొచ్చి యనేకప్రకార ప్రాకారపరిరక్షితంబును, బహురత్నదీప్తిజాలదేదీప్యమానంబును నైన యమ్మహనీయ లోకం' బాలోకించి నట్లు తిక్కన వ్రాసినాఁడు.

— తిక్కన -అశ్వమేధ -3 -109

వ్యాసభారతము నం దిట్లున్నది :

స తేన మార్గేణ తదా నాగలోకం వివేశ హ ।
దదర్శ నాగలోకం చ యోజనాని సహస్రశః ॥

ప్రకారనిచయై ర్దివ్యై ర్మణిముక్తా స్వలంకృతైః ।
ఉపపన్నం మహాభాగ శాతకుంభమయై స్తథా ॥

వాపీః స్ఫటికసోపానా నదీశ్చ విమలోదకాః ।
దదర్శ వృక్షాంశ్చ బహూన్ నానాద్విజగణాయుతాన్ ॥

తస్య లోకస్య చ ద్వారం స దదర్శ భృగూద్వహః ।
పంచయోజన విస్తార మాయతం శతయోజనమ్ ॥

— వ్యా.భా. ఆశ్వమేధిక- అ 58. 37-39

వలభ్యో మధ్యోచ్ఛ్రితా ఉభయతో నమత్పృష్ఠా గృహవిశేషాః ॥
నిర్యూహాః పట్టశాలాః ॥118॥ — నీలకంఠ - చిత్రశాలాప్రతి. పు. 49

"He beheld the region of serpents, infinite in extent, filled with hundreds of palaces and elegant mansions with turrets and domes and gateways, abounding with wonderful places for various games and entertainments."

P. C. Roy - Mbh - Sec. 3 P 36

ఈ వర్ణనముల వలన నాగలోకము నందు దేవప్రాసాదములు, రాజ మందిరములు, రమ్యహర్మ్యములు, చంద్రశాలలు, పట్టశాలలు, క్రీడాగృహములు గల వనియు, వెయ్యామడ చుట్టుకొలత గల యా నాగలోకము కనకముక్తామణిమయము లయిన యనేకప్రాకారములతో రక్షింపఁబడుచు రత్నకాంతు లీనుచుండు ననియు, నందలి బావులు స్ఫటికసోపానములు గలిగి స్వచ్ఛమైన జలములు గలిగియుండు ననియు, దాని ముఖద్వారము నూఱుయోజనముల పొడవు, ఐదు యోజనముల వెడల్పు (100 × 5) గలిగి యుండు ననియు తెలియుచున్నది.

అర్జునుఁడు నాగలోకమున కరిగి ఉలూచి (ఉలూపి) యను నాగకన్యతో నొక రాత్రి గడపి వచ్చినాఁడు.

ఒకనాడు గంగానది "విధిపూర్వకంబునం గృతాభిషేకుం డయి దేవర్షి పితృ తర్పణంబులు సేసి, వేల్వంగ సమకట్టి వెలువడ నున్న నయ్యింద్ర నందను ........

నలినాక్షి యం దొక్క నాగకన్యక కామపరవశయై వానిఁ బట్టి తిగిచి
కొని నాగపురమున కొనరంగఁ జని రమ్యహర్మ్యము నందు నెయ్యముననునిచి
యే నులూచిని నా మనోరథంబు సలుపు" మని ప్రార్థించినది.[1]

" అర్జునుండు దాని మనోరథంబు సలిపి యా రాత్రి నాగభవనంబున వసి యించి .... .... నాగలోకంబు వెలువడి యాదిత్యోదయంబయిన తోడన గంగాద్వారం బునకు వచ్చినాఁడు.[2]

నాగపుర మనఁగా భోగవతి. రావణుఁడు భోగవతీపురము నందలి నాగులను వశపఱచుకొని నట్లు వాల్మీకి రామాయణము నందు వర్ణింపఁబడినది.

స తు భోగవతీం గత్వా పురీం వాసుకిపాలితామ్ ।
కృత్వా నాగాన్ వశే హృష్టో యయౌ మణిమయీంపురీమ్ ॥
— వా.రా. ఉ. కాం. సర్గ. 23. 5,6

నాగలోక మధ్యభాగమునకు పాతాళమని పేరు.[3]

1. నన్నయ. భార. ఆది. 8. 127-130
2. ,, 8-134
3. చూడు : వ్యా. భా. ఉద్యోగ 97-1

" ఏతస్తు నాగలోకస్య నాభిస్థానే స్థితం పురమ్ ।
పాతాళ ఇతి విఖ్యాతం దైత్య దానవ సేవితమ్ ॥ "

పాతాళ మనఁగా నేటి అమెరికా యని శ్రీ చమన్‌లాల్‌భిక్షు నిరూపించి యున్నారు.* అగుగాక !

అది నేటి అమెరికా యైనచో భారతదేశము నందలి గంగాతీరము నుండి యర్జునుఁ డొక్క దినములో నచటికి కెట్లు పోయిరాఁ గలిగెనో యోజింప వలయును.

## పాతాళలోకము

భూలోకము, భువర్లోకము, సువర్లోకము, మహర్లోకము, జనలోకము, తపో లోకము, సత్యలోకము లేక బ్రహ్మలోకము నను నేడు ఊర్ధ్వ లోకములు.

భూమండలమున కధోభాగమున గల అతల, వితల, సుతల, రసాతల, తలాతల, మహాతల, పాతాళము లను సప్తలోకములకు సమష్టిగా పాతాళములనియు, బిలస్వర్గము లనియు పేరు.

ఉపరి స్వర్గముల కంటె బిలస్వర్గములు సుఖతరములు.

పాతాళలోకమునందలిపురములు మయ నిర్మితములు.

ఈ పాతాళలోకములో దైత్యదానవకాద్రవేయాది దేవయోనులు, "మణిగణ ఖచితంబు లగు నతిరమణీయగృహంబుల యందు నీశ్వరుని వలనం జేటు లేని కాయంబులు గలిగి వివిధమాయావిశేష వినిర్మిత నూతనకేళీసదన విహరణ మండప విచిత్రోద్యానాదుల యందుఁ గేళీవినోదంబులు సలుపుచు జరియింతురు."

అట్టి పాతాళంబు లందును మయకల్పి
తములగు పుటభేదనముల యందు
బహురత్న నిర్మితప్రాకార భవన గో
పుర సభా చైత్య చత్వర విశేష
ములయందు నాసురాదుల మిథునములచే
శుకపికశారికానికర సంకు
లముల శోభిల్లు కృత్రిమభూములను గల
గృహములచే నలంకృతము లగుచుఁ

* Cf :- Chaman Lal · Hindu in America. P 13.
"A Hindu Prince Arjuna married Alupi, the daughter of an American ruler. America was then known as Patala."

కుసుమచయసుగంధికిసలయ స్తబక సం
తతుల చేత ఫలివితతుల చేత
నతులరుచిరనవలతాంగనాలింగిత
విటపములను గలుగు విభవములను.

దైత్యదానవకాద్రవేయాదిదేవయోనులు .... .... కృతనికేతనులై హరి చక్రభయంబు దక్క నన్యంబగు మృత్యుభయంబు నొందక యుందురు."

—ఆంధ్ర-భాగ - స్కం 5-2-105, 106, 107*

-)o(-

## మణిమయాపురము

"జలధికుక్షిలో నుండి ధీరులు నివాత
కవచు లన మూఁడు కోట్ల దానవులు బలిమిఁ
త్రిదశులకు బాధ సేయుచుండుదురుఁ వారు
నిహతు లగుదురు నీ చేత మహిత కీర్తి."

— అని ప్రోత్సహించి నివాతకవచవధార్థం బరుగు మని త్రిదశేశ్వరుఁ డర్జును నియోగించినాఁడు.[1]

"మాతలి సహితంబైన రథం బెక్కి యతిత్వరితగతి నరిగి

ఫేనవదూర్మిచయంబుల
నానావిధమీనకూర్మనక్రంబుల శై
లానుకృతి నొప్పుచున్న మ
హానీరధిఁ గంటి నేను నమ్మాతలియున్

* చూడు :- వ్యాస. భాగ. స్కంధ 2-24-9

"యేష మహారాజ మయేన మాయావినా వినిర్మితాః పురో నానామణిప్రవర ప్రవేకవిరచిత విచిత్రభవన ప్రాకార గోపుర సభా చైత్య చత్వరాయతనాదిభిర్ నాగాసురమిథున పారావతశుకసారికాకీర్ణకృత్రిమభూమిభిర్ వివరేశ్వర గృహోత్తమైః సమలంకృతాశ్చకా సతి ॥"

1. నన్నయ- భార- ఆరణ్య. 4-55.56 ( = వ్యా.భా. వన. 168-71,72)

సముద్ర కుక్షి మాశ్రిత్య దుర్గే ప్రతివసంత్యుత ॥

ఆ సముద్రోదరంబున విశాలాట్టాలకప్రతోళికాలంకృతం బయిన పురంబుఁ గని" నట్లు విజయుఁడు ధర్మజునికి చెప్పినాఁడు.

—నన్నయ. భార. అరణ్య. 4. 59.60

సముద్రగర్భము నందంతటను రత్నపూర్ణము లయిన నావలు వేలకొలఁది నభసము నందలి విమానముల వలె సంచరించుచుండె ననియు నా సముద్రము నందు రత్నరాశులు తేలియాడుచుండె ననియు మూలము నందు వర్ణింపఁబడినది.

అపస్య మంబుధిం భీమ మపాంపతి మథావ్యయమ్ ॥

.... ....

నావః సహస్రశ స్తత్ర రత్నపూర్ణాః సమంతతః ।

నభసీవ విమానాని విచరంత్యో విరేజిరే ॥

.... ....

తథా సహస్రశ స్తత్ర రత్నసంఘా ప్లవంత్యుత ।

అపస్యం దానవాకీర్ణం తద్ దైత్యపుర మంతికాత్ ॥

తత్రైవ మాతలిస్తూర్ణం నిపత్య పృథివీతలే ॥ *

—వ్యా.భా. వన. -169. శ్లో1.7

నివాతకవచుల నివాసస్థానము పాతాళము. జలదుర్గమైన యా పురము పేరు "మణిమయి" యని వాల్మీకిరామాయణము వలనఁ దెలియుచున్నది.

రావణుఁడు భోగవతీపురము నందలి నాగులను వశపఱచుకొని నివాతకవచుల నివాసస్థాన మైన మణిమయీపురమున కేగి నట్లు వర్ణింపఁబడినది.

స తు భోగవతీం గత్వా పురీం వాసుకిపాలితామ్ ।

కృత్వా నాగాన్ వశే హృష్టో యయౌ మణిమయీంపురీమ్ ॥

నివాతకవచా స్తత్ర దైత్యా లబ్ధవరావసన్ ॥

—వా.రా. ఉ.కాం. సర్గ. 23. 5,6

అర్జును రథఘోష లా పురము నందు ప్రతిధ్వనింపఁగా దానవులు భయపడి పుర ద్వారములను బంధించి పురరక్షణకుఁ గడంగిరి.

* నిపత్య గత్వా పృథివీతలే పాతాళే ॥

—నీలకంఠ చిత్రశాలాప్రతి. పు. 266

త్రాసయన్ రథఘోషేణ తత్పురం సముపాద్రవత్ ।
రథఘోషం తు తం శ్రుత్వా స్తనయిత్నో రివాంబరే ।
తతో సంభ్రాంతమనసః శరచాపధరాః స్థితాః ।
తథాఽసిశూలపరశుగదాముసలపాణయః ।
తతో ద్వారాణి పిదధు ర్దానవా స్త్రస్త చేతసః ।
సంవిధాయ పురే రక్షాం న స్మ కశ్చన దృశ్యతే ॥

— వ్యా.భా. వన. -169. శ్లో 8-11

అర్జునుఁ డా పురద్వారంబున శంఖధ్వానంబు చేసెను. దాని విని యలిగి యద్దానవులు నానావిధాయుధసన్నద్ధులై యుద్ధమునకు తలపడిరి. అసురులకు నర్జునునకు ఘోరయుద్ధము జరిగినది. ఆ యుద్ధము నందు పెక్కుమంది దానవులు మరణించిరి. అంత నయ్యసురులు మాయాయుద్ధంబు సేయ సమకట్టి, వివిధమాయలు ప్రదర్శించిరి. అర్జునుఁ డంతట మోహనాస్త్రమును ప్రయోగించెను. అసురులు మరల మాయలు ప్రదర్శించిరి.

మోహినీం సర్వభూతానాం హితాయ త్రిదివౌకసామ్ ॥
పీడ్యమానాసు మాయాసు తాసు తాస్వసురోత్తమాః ।
పున ర్బహువిధా మాయాః ప్రకుర్వన్నమితౌజసః ॥
పునః ప్రకాశ మభవ త్తమసా గ్రస్యతే పునః ।
భవత్యదర్శనో లోకః పునరప్సు నిమజ్జతి ॥

— వ్యా.భా. వన. 171. 25-27

ఆ దైత్యపురి యం దంతలో వెలుఁగు కన్పించును. అంతలో చీకట్లు గ్రమ్ముచుండెను. అది యంతలో నదృశ్య మగు చుండెను. అంతలో నీటిలో మునిగి పోవుచుండెను.

చివర కర్జునుఁడు సూర్యబాణ మేసి నివాతకవచులను నిహతులను గావించెను.[1]

" అట నసురకాంతల యాక్రందనధ్వను లాకసం బద్రువ నొక్కటఁ బురంబున కెగసెను.[2]

1. నన్నయ. భార. ఆరణ్య. 4-72
2. ,, 4-74

అర్జునుఁ డా దైత్యపురమును ప్రవేశించెను. తద్రథఘోషలు విని, రథాశ్వములను చూచి భయపడి యసురకాంతలు తమ తమ గృహముల లోనికి పోయిరి. వారి గృహములు మణికాంచనమయములని మూలము నందున్నది.

తతో మాతలినా సార్ధమహం తత్ పుర మభ్యయామ్ ।
త్రాసయన్ రథఘోషేణ నివాతకవచ స్త్రియః ॥ .... ....
విత్రస్తా దైత్యనార్య స్తాః స్వాని వేశ్మా న్యథా విశన్ ॥
బహురత్నవిచిత్రాణి శాతకుంభమయాని చ ॥
త దద్భుతాకార మహం దృష్ట్వా నగర ముత్తమమ్ ।
విశిష్టం దేవనగరా దపృచ్ఛం మాతలిం తతః ॥

—వ్యా.భా. వన. 172. 23-26

అద్దానవపురంబుఁ బురందరుపురంబున కంటె సుందరం బైన దానిం జూచి

"నిరుపమరత్ననిరంత
వరగృహముల నొప్పి సుఖనివాసంబగు ని
ప్పురి నుండ నొల్ల కొండక
పురి నుండఁగ నేల వలసెఁ బురుహూతునకున్."

— అని యర్జునుఁడు మాతలి ప్రశ్నింపఁగా* మాతలి యిట్లనియె.

" అసురుల వలన భయం బైన యపుడు వే
ల్పులకు సేమంబుగా బలవిరోధి
యీ ప్రోలు జలధిలో నిమ్ముగ నిర్మించె
దనుజులు పదపడి వనజగర్భు
వలనఁ దపోవీర్యవంతు లై యిందుండ
నమరుల చేతఁ గయ్యమున నజితు
లై యుండఁ బడిసిన నమరేంద్రుఁ డెఱిఁగి త
ద్విజయార్థముగఁ బంచె విజయ నిన్ను"

—నన్నయ. భార. ఆరణ్య. 4-76,77

ఈ నగరము నింద్రుఁడు నిర్మించినాఁ డని చెప్పుట వలన నది సురశిల్పియైన విశ్వకర్మ చేత నిర్మింపఁబడి న ట్లూహింపవచ్చును.

* నన్నయ. భార. ఆరణ్య. 4-74,75

# హిరణ్యపురము

అర్జునుఁడు నివాతకవచులను చంపి క్రమ్మఱి వచ్చునపుడు, తనముందట నొక్క తపోవనంబును "నతి విచిత్రంబైన పురంబును" గని యిది యెవ్వరిపురం బని మాతలి నడిగెను.

—నన్నయ, భార, ఆరణ్య, 4-78

ఆ పురము నందలి వింతలను విశేషములను నన్నయ వర్ణింపలేదు.

మూలము నం దిట్లు వర్ణింపఁబడినది.

పురం కామచరం దివ్యం పావకార్కసమప్రభమ్ ॥ 1

రత్నద్రుమై శ్చిత్రైః సుస్వరైశ్చ పతత్రిభిః ।
పౌలోమైః కాలకంజైశ్చ నిత్యహృష్టై రధిష్ఠితమ్ । 2

గోపురాట్టాలకోపేతం చతుర్ద్వారం దురాసదమ్ ।
సర్వరత్నమయం దివ్య మద్భుతోపమదర్శనమ్ ॥ 3
ద్రుమైః పుష్పఫలోపేతైః సర్వరత్నమయై ర్వృతమ్ । .... 4
.... ....

త దహం ప్రేక్ష్య దైత్యానాం పుర మద్భుతదర్శనమ్ ॥ 6

—వ్యా. భా. వన. అ 173. 1-6

సూర్యాగ్నులతో సమానమైన కాంతి గలిగి, కోరినచోటికి పోఁజాలు నా పురము దివ్యమైనది. అందలి వృక్షములు రత్నఖచితములై చిత్రముగా నున్నవి. ఆ పురము గోపురములతో నట్టాలకములతో నాలుగు ముఖ్య ద్వారములతో దుర్భేద్యముగ నున్నది. పుర మంతయు రత్నమయమైయున్నది. ఆ దైత్యపురము చూచుటకు పరమాద్భుతముగా నున్నది.

అది హిరణ్యపురము. దానికొక చరిత్ర గలదు.

"వినవె పులోమయుఁ గాలక
యును ననఁగా నిరువు రసురయువతులు గమలా
సను నారాధించిరి తప
మున దివ్యసహస్రవర్షములు కడు నిష్ఠన్.

కనకమయ మైన యీ ప్రో
లును దమసుతు లాహవంబులో నమరులచే
త నవధ్యులుగాఁ దగ న
వ్వనజజుచేఁ బడసి రసురవనితలు కరుణన్.

ఇది హిరణ్యపురం బిందుఁ బౌలోమకాలకేయు లనునసురు లఱువది వేలుందురు. వా రమరుల చేత నవధ్యులు ...." —అని మాతలి యర్జునకుఁ జెప్పను.

— నన్నయ. భార. ఆరణ్య. అ4. 79-81

మూలము నం దీ హిరణ్యపురవృత్తాంత మిట్లు వర్ణింపబడినది.

పురం సురమణీయం చ ఖచరం సుమహాప్రభమ్ ॥ 9
సర్వరత్నైః సముదితం దుర్ధర్ష మమరైరపి ।
మహర్షి – యక్ష – గాంధర్వ – పన్నగాసురరాక్షసైః ॥ 10
సర్వకామగుణోపేతం వీతశోక మనామయమ్ ।
బ్రహ్మణా భరతశ్రేష్ఠ కాలకేయకృతే కృతమ్ ॥ 11
త దేతత్ ఖపురం[1] దివ్యం చరత్యమరవర్జితమ్ ।
పౌలోమాధ్యుషితం వీర కాలకంజైశ్చ దానవైః ॥ 12
హిరణ్యపుర మిత్యేవం ఖ్యాయతే నగరం మహత్ । 13

—వ్యా.భా. వన. 173. 9-13

మహాకాంతులతో నాకసము నందు సంచరించు నా పుర మత్యంత మనోహర మైనది. సర్వరత్నసముదితమైన యప్పురము దేవతలకు సైతము జయింప శక్యము

1. ఖపురం ఖచరత్వాత్ ॥ నీలకంఠ ॥

ఖపుర మనఁగా దైత్యపురభేద మని సూర్యరాయాంధ్రనిఘంటువు.

గానిది. అందు రోగభీతిలేదు. కావున నది యారోగ్యప్రదమును, శోకరహితమును నైనది. అది సకలవస్తుసంపన్న మైనది. కావున నా పురము నందు కామితార్థము లన్నియు సిద్ధించును.

అమరవర్జితమై యాకసము నందు చరించు హిరణ్యపురము మహానగరముగా ప్రసిద్ధి కెక్కినది.

"అట్లని వారి పయిం బోదము రథంబు పఱపు మని యర్జునుఁడు మాతలిని కోరఁగా,

"అతఁడును సప్తమారుతరయంబున దివ్యరథంబుఁ దత్సురా
హితపురి భూరివప్రము పయిం బఱపెన్ సురవైరు లంత ను
ద్ధతులయి ప్రోలు వెల్వడి రథంబుల షష్టిసహస్రకంబుతో
శతమఖు బుద్ధిఁ జేసి కడు నైపక తాకిరి నన్ను నల్కతో.

ఏనును వారల యఱువదివేల రథంబులకు గతినిరోధంబుగా వితతవృక్షశిలా ప్రభవంబు లయిన దివ్యబాణంబుల నేసిన నసురులు మాయాయుద్ధనిబద్ధబుద్ధులై తమ పురంబుతోడన దివంబున కెగసి మదీయ మార్గణార్గళనిరుద్ధమార్గులై నేలం బడి" రని యర్జునుఁడు ధర్మరాజుతో చెప్పినాఁడు.

—నన్నయ. భార. -అరణ్య. 4. 83,84

మూలము నందీ పురభ్రమణ మత్యంతాశ్చర్యకరముగ నున్నది.

తత్పురం ఖచరం దివ్యం కామగం సూర్యసప్రభమ్ ।
దైతేయై ర్వరదానేన ధార్యతే స్మ యథా సుఖమ్ ॥
అంతర్భూమౌ నిపతతి పునరూర్ధ్వం ప్రతిష్ఠతే ।
పున స్తిర్యక్ ప్రయాత్యాశు పునరప్సు నిమజ్జతి ॥
అమరావతి సంకాశం తత్పురం కామగమం మహత్ ।

— వ్యా.భా. -వన. అ173. 9-13

సూర్యునితో సమానమైన కాంతి గలిగి దివ్యమును, కామగమమును ఖచరము ను నైన యా పుర మంతలో నాకసము నుండి క్రిందఁబడి యంతర్భూమి నడగును.

మరల పై కెగురును. మరల నడ్డముగా తిరుగును. మరల నీటిలో మునిఁగి పోవును. అది యమరావతి సదృశమని చెప్పఁబడినది. కాని యమరావతీపురమున కీ లక్షణములు లేవు.

ఇతరపురముల వలెనె హిరణ్యపురము నందును, పెద్దకోట, కోటబురుజులు, గోపురములు, నాలుగుముఖ్యద్వారములు గలవు.

పుర మంతయు రత్నమయమై యుండుట, కామగమనము, ఆకాశసంచారము, చిత్రవిచిత్రగతులు గలిగి యుండుట యీ పురము నందలి విశేషములు.

ఇట్టి యద్భుత మయిన మహాపురమును మయవిశ్వకర్మ పాతాళతలము నాశ్రయించి, యత్యధిక ప్రయత్నముతో తన సంకల్పబలముచేత నిర్మించినాఁడని మహాభారతోద్యోగపర్వమునందుఁ జెప్పబడినది.

హిరణ్యపుర మిత్యేవ ఖ్యాతం పురవరం మహత్ ।
దైత్యానాం దానవానాం చ మాయాశతవిచారిణామ్ ॥
అనల్పేన ప్రయత్నేన నిర్మితం విశ్వకర్మణా ।
మయేన మనసా సృష్టం పాతాళతలమాశ్రితమ్ ॥

— వ్యా. భా. ఉద్యోగ. అ. 99. శ్లో 1,2

హిరణ్యపురమును విశ్వకర్మయు మయుఁడును కలిసి నిర్మించిరని చతుర్వేదీ ద్వారకాప్రసాద్ శర్మ (హిందీమహాభారతకర్త) చేసిన యనువాదము సరిగా నున్నట్లు తోపదు.

మహాకవియు, మాయామయుఁడును చిత్రవిచిత్రశిల్పకల్పనాచణుఁడు నగు మయునకు మఱొక విశ్వకర్మ సాయమేల ?

మయుఁడు దానవవిశ్వకర్మ గనుక హిరణ్యపురము మయవిశ్వకర్మ చేత నిర్మింపఁబడిన దనుటయే సమంజసము.

... ० ....

# త్రిపురములు

పురత్రయ విసృష్ట్యర్థం వవ్రు ర్మహాసురమ్ ।
విశ్వకర్మాణ మజరం దైత్యదానవపూజితమ్ ॥

— వ్యా.భా. కర్ణ. 24-16

తారకాసురుని తనయులయిన విద్యున్మాలి, తారకాక్షుఁడు, కమలాక్షుఁడు నను వారు వారిజాసను నుద్దేశించి ఘోరతప మొనర్చిరి. బ్రహ్మ వారికి ప్రత్యక్షము కాఁగా, "మాకు ముప్వురకు మూఁడు పురంబు లెల్ల సుఖంబులుంగలిగి, కామగమనంబులై, దేవదానవయక్షోరగాది జాతులకుం జెఱుపరాక విలసిల్లు నట్లుగా నొసంగు, మేము భవత్ప్రసాదంబు సొంపున నిర్భయులమై పెంపొంది సంచరించెద" మని ప్రార్థించిరి.

కమలగర్భుఁ డందుల కంగీకరించెను గాని యొక కట్టడి చేసెను. దాని కా దనుజేంద్రు లంగీకరించి, "యప్పురంబు లెప్పు డొక్కెడం గూడె, నప్పుడు బలియుం డగు వాఁడు సెఱుపఁదలఁచినం జెడునది గా నొడంబడితిమి. త్రిపురంబులు సంగతంబులు గాకున్న నసాధ్యంబులై వెలయ వలయు" నని పల్కిరి. బ్రహ్మ దేవుఁడు వారు కోరిన వరమిచ్చెను.

వరము వడసిన యా దైత్యవరులు దమకుఁ
బురము లొనరింప దానవపూజ్యు మయుని
వేడికొనుటయు, నాతఁడు విపులతపము
కలిమి నొప్పారు పురవరమ్ములు ఘటించె

— తిక్కన. భార. కర్ణ -అ. 1.261.262

"అవియుం బ్రాకారగోపురప్రాసాదప్రముఖవివిధావయవంబులు పసిండియు వెండియు నినుమును నై నాల్గుదిక్కులు నూఱేసి యోజనంబులుగలిగియుండు, నందుఁ బసిండిం జేసినయది దివంబునను, వెండి నొనరించిన యది యంతరిక్షంబునను, నినుమునం గావించిన యది భూమిని సంచరింపను; వరుసన వానికిం దారకాక్షుండును

గమలాక్షుండును విద్యున్మాలియు రాజులయి, దివ్యంబు లగు నంబరంబులను, నాభరణంబులను మాల్యానులేపంబులను మఱియు ననేకవిధంబుల నుజ్జ్వలులై నెగడుదురు."

—తిక్కన. భార. కర్ణ. అ 1.263

ఈ వర్ణనము మూలానుసరణముగనే యున్నది.

తతో మయ స్స్వతపసా చక్రే ధీమాన్ పురాణి చ ।
త్రీణి కాంచన మేకం వై రౌప్యం కార్ష్ణాయసం తథా ॥ 17
కాంచనం దివి తత్రాసీ దంతరిక్షే చ రాజసమ్ ।
ఆయసం చాభవద్ భౌమం చక్రస్థం పృథివీపతే ॥ 18
ఏకైకం యోజనశతం విస్తారాయామత స్సమమ్ ।
గృహాట్టాలకసంయుక్తం బహుప్రాకారతోరణమ్ ॥ 19
గృహప్రవరసంబాధం స సంబాధమహాపథమ్ ।
ప్రాసాదై ర్వివిధైశ్చాపి ద్వారైశ్చై వోపశోభితమ్ ॥ 20
పురేషు చాభవన్ రాజన్ రాజానో వై పృథక్పృథక్ ।
కాంచనం తారకాక్షస్య చిత్ర మాసీ న్మహాత్మనః ॥ 21
రాజతం కమలాక్షస్య విద్యు న్మాలిన ఆయసమ్ ।
త్రయస్తే దైత్యరాజాన స్త్రీన్ లోకా నస్త్రతేజసా॥ 22

— వ్యా. భా. కర్ణ. 34. 17-22*

త్రిపురములు ప్రాకారతోరణములతోను ఉపరితలమున గదులు గల మేడలతోను గృహరాజములతోను మహాపథములతోను వివిధప్రాసాదములతోను ద్వారములతోను శోభిల్లుచున్నవి.

ఒక్కొక్కపురము పొడవు–వెడల్పులు నూఱేసి యోజనములు. అనఁగా నవి చతురస్రాకృతి గలిగి యున్నవి.

* పోల్చు :- వ్యా.భా. ద్రోణ. 203. 62,63,64

ఇఁక వీని యందలి విశేష మేమనఁగా నివి లోహమయములు. బంగారము తోను, వెండి తోను, ఇనుము తోను నిర్మింపఁబడినవి. కామగమనంబులు. ఈ మూఁడును నొక్క చోటఁ జేరినఁ గాని వీనికి భంగము వాటిల్లదు.[1] అంత వఱకు నివి దుర్భేద్యములు.

ఇట్టి మహిమాన్వితము లయిన త్రిపురములను మహాశిల్పి యైన మయుఁడు తన తపశ్శక్తి చేత నిర్మించినాఁడు.

త్రిపుర వృత్తాంతము పద్మాదిమహాపురాణములందును గలదు. [2]

మహాభారతాది గ్రంథము లందు వర్ణింపఁబడిన త్రిపురములకు మూలము కృష్ణయజుర్వేద తైత్తిరీయ సంహిత.

"తేషా మసురాణాం తిస్రః పుర ఆస న్నయస్మ య్యవ
మాఽథ రజతాఽథ హరిణీ తా దేవా జేతుంనా శక్నువమ్ ॥
.... .... .... ...."

—కృ. య. 6-2-3 *

[అసురులకు మూఁడు దుర్గము లున్నవి. అన్నిటి కంటె క్రిందిది అయోమయము, దాని పైది రజతమయము, దాని పైది హిరణ్మయము. దేవతలు వారిని జయింప లేక పోయిరి.]

1. తిక్కన. భార. కర్ణ. 1-263 (= వ్యా.భా. కర్ణ- 4-13,14)
" ఏకీభావం గమిష్యంతి పురాణ్యేతాని చానఘ ॥
సమాగతాని చైతాని యో హన్యాద్భగవంస్తదా ।
ఏకేషుణాదేవవరః సనో మృత్యు ర్భవిష్యతి ॥

2. చూడు : 1) పద్మపురాణము-సృష్టిఖండము అ. 15
2) మత్స్యపురాణము అ. 128

* చూడు : 1) కృష్ణయజుర్వేద తైత్తిరీయ సంహిత. 6-2-3
2) A. B. Keith : T. S. 6-2-3 P 504
"The Asuras had three citedals, the lowest was of iron, then there was one of silver, then one of gold. The gods could not conquer them".

అగ్నిచేత నసురులు పరాభూతులై పృథ్వ్యంతరిక్షద్యులోకములందు లోహ రజతకాంచనమయము లయిన దుర్గములను నిర్మించికొని యున్నట్లును వారిని దేవతలు జయింప లేక పోవుచున్నట్లును భాష్యకారులు వివరించినారు.

ఈ విధముగా త్రిపురములతో స్వర్గాంతరిక్ష భూలోకముల నాక్రమించి "యసుర త్రయం బప్రతిహతవిభూతియై వర్తించు, నమ్మువ్వురు దన్నునా శ్రయించుటం జేసి వారల యోగక్షేమంబు లరసికొని యెవ్వరికి నెయ్యది యిష్టం బయ్యది యెల్లం దన మాయాబలంబున మయుం డొదవించు చుండు; నవ్విధంబునఁ బరమ సౌఖ్యంబు లనుభవించు చుండ బహుకోటి సంవత్సరంబులు సనియె".

— తిక్కన —భార. కర్ణ. 1-263

ఇట మాయాబల మనఁగా శిల్పవిద్యాబలము; మంత్రశక్తి. మయుఁడు మాయా వియే కాదు. యోగశక్తి సంపన్నుడును. ఆ శక్తి వల్లనే యసురత్రయము కోరిన కోరికలు తీర్చుచుండెను.

మహదైశ్వర్య మిచ్ఛంత స్త్రిపురం దుర్గమాశ్రితాః ।
సర్వేషాం చ పునస్తేషాం సర్వయోగవహో మయః॥
త మాశ్రిత్య హి తే సర్వే వర్తయంతేఽకుతోభయాః ।
యో హి య న్మనసా కామం దధ్యౌ త్రిపురసంశ్రయః ॥
తస్మై కామం మయ స్తం తం విదధే మాయయా తదా ।

— వ్యా. భా. కర్ణ. అ. 34-25-27

అట్లు బహుకోటి సంవత్సరంబులు గడచినవి. తరువాత మహాశక్తిసంపన్నుఁ డయిన మయుఁడు నయితము వానిని రక్షింప లేకపోయెను. విధి విలాస మనుల్లంఘ నీయము గదా !

సమయ మాసన్నమైనది. దేవతల ప్రార్థనను మన్నించి రుద్రుఁడు,

"కోపసందీప్తుఁడై పాపంబు సజ్యంబు
 గావించి మౌర్వీమార్గణముఁ గూర్చి
పాశుపతాస్త్రసంబద్ధంబుగాఁ జేసి
 పురములు మూఁటిని బుద్ధి నిలుప,
నవి యొక్కచోటికి నప్పుడ కూడిన,
 మునులును సురలును ముదముఁ బొంది
గెలు గెలు మంచు నగ్గింప, నయ్యుగ్రుండు
 పెగ వాపి యేసిన దితిజయుతము

గాఁ బురత్రయంబు కాలి నీఱై, పశ్చి
మాబ్ధిఁ బొరఁగ, నమ్మహాగ్ని లోక
ములు దహింపఁ జొచ్చెఁ; బురహరుఁ డది మాన్చె
సంతసిల్లె సకల జంతువులును."

తిక్కన. భార. కర్ణ. 1-293

"పరమేశ్వరోగ్రశరపావకదగ్ధపురత్రయాభమై" సౌభపురి దగ్ధ మయినట్లు మహాభారతము నందు వర్ణింపబడినది.

పరమేశ్వరశరోద్ధూతం పపాత త్రిపురం యథా ॥
తస్మి న్నిపతితే సౌభే చక్రమాగాత్ కరం మమ ।

— వ్యా. భా. వన. అ 22-35,26

వాల్మీకిరామాయణము నందు లంకాదహనము త్రిపురదహనముతోఁ బోల్పఁబడినది.

లంకాపురం ప్రదగ్ధం తద్ రుద్రేణ త్రిపురం యథా ।

— వా. రా. సుందర. 14-30

కావున మయనిర్మితము లయిన త్రిపురములు సౌభపురి కంటె, లంకాపురి కంటెను ముందే నిర్మింపఁబడిన వనియు, కృష్ణయజుర్వేదము నం దుల్లేఖింపఁబడుట చేత నవి యతిప్రాచీనము లనియు చెప్పవచ్చును.

... o....

# పురదుర్గములు

పురః కృణుధ్వ మాయసీ రధృష్టా ॥

— ఋగ్వేద 10-101-3 *

[ఓ విశ్వేదేవులార ! శత్రుదుర్భేద్యము లగు లోహమయపురములను నిర్మింపుడు.] [1]

పుర మనఁగా పట్టణవిశేషము. (పెద్ద పెద్ద గృహములు; జుట్టునగడ్తయుఁ గలిగి, యొక క్రోశమునకుఁ దక్కువ కాని వైశాల్యము గలది.) బహు గ్రామముల వ్యవహారమునకు స్థానమై పెక్కులుహట్టాదులు గలిగియున్న ప్రధానగ్రామము.

— [సూర్యారాయాంధ్ర నిఘంటువు]

పుర మనఁగా దుర్గమను నర్థము కూడఁ గలదు. [2]

దుర్గ మనఁగా దుర్గమస్థానము, కోట–దుర్గమ మగు పురము.

దుష్ప్రాపం తు పురం దుర్గం యంత్ర శైలజలాదిభిః ।
వారకాదీని యంత్రాణి పరిఖయా బహిర్భువి ॥

— ఇతి వైజయంతీ

పురములు సాధారణముగా దుర్గసమాశ్రితములై యుండును. కావున నివి పురదుర్గము లనియు దుర్గపురము లనియు చెప్పఁబడుచున్నవి.

* చూడు : ఋగ్వేద భాషాభాష్యము — పం. బిహారిలాల్ శాస్త్రి

"అప్ లోగ్ శత్రు సే అజయ్, లోహనిర్మిత శస్త్రాది సే సుసజ్జిత పురియాఁ నగరియాఁ బనావో॥"

Cf :- Ralph. T.H. Griffith : The Hymns of the Rgveda.
"Make iron forts, secure from all assailants."
[–iron forts = the safeguards obtained by sacrifycing]
— Griffith

1. విశ్వేదేవుల శిల్పకర్మములను గూర్చిన వివరము ఈ గ్రంథము నందే "శిల్పాచార్యులు-శిల్పవిద్యా ప్రకాశకులు" — అను నవమోన్మేషము నందుఁ గలవు.
[చూడు: శ్రీమదాంధ్ర మహాభారత శిల్పకళాదర్శనము-ద్వితీయ భాగము]

2. V. S. Apte = Students' Sanscrit-English Dictionary.
"A castle, fortress, strong-hold."

# దుర్గశిల్పము

నానావిధాని యంత్రాణి నానాయుధవిధాయకమ్ ।
జలాశయాని రచనాస్యు ర్దుర్గరచనా స్తథా ॥
తాదృక్కర్తుం పురా వేత్సి యాదృ న్నాన్యోఽభియాస్యతి ।
కళాజ్ఞానం హి సద్వంద్వ మవయాస్యసి మద్వరాత్ ॥

— స్కాంద పురాణము[1]

["శత్రువులు ప్రవేశించుటకు వీలుగాకుండు నట్లు వివిధాయుధములు, యంత్రములు నమర్చి దుర్గములు నిర్మించు శక్తియు శిల్పకళారహస్యములు తెలిసికొను జ్ఞానమును నా వరము వలననీకుఁ గలుగు," నని విశ్వేశ్వరుఁడు విశ్వకర్మ ననుగ్రహించినాఁడు.]

దుర్గశిల్పమునకు మూలము విశ్వకర్మయే.

ఈ విశ్వకర్మ త్వష్టృప్రజాపతిపుత్రుఁడు. సకలశిల్పకర్మములందు నిపుణుఁడై యపరసృష్టికర్తగా ప్రసిద్ధి గాంచినాఁడు.

విశ్వకర్మాఽభవత్పూర్వం బ్రహ్మణ స్త్వపరాతనుః ।
త్వష్టృప్రజాపతేః పుత్రో నిపుణః సర్వకర్మసు ॥

— స్కాంద పురాణము[2]

వివిధరక్షణోపాయముల కనుకూలముగా నానావిధయంత్రాయుధసమన్వితముగా దుర్గములను నిర్మించుట యొకముఖ్య మయిన శిల్పకళ.[3]

1. స్కాందపురాణ- కాశీఖండ- ద్వితీయ భాగ- అ 86 శ్లో. 78, 79
2. ... అదే ... అ 86 శ్లో. 3
3. Cf: Dr. A B L. Awasthi : Studies in Skanda Purana Part I P. 258.

"The construction of good ports secured with many types of contrivances and weapons was an important art" — (Sk. IV-ii-86-78,79)

కావున శిల్పులు భూపాలరక్షణార్థము దుర్గములను వాస్తుశాస్త్రానుసారముగా నిర్మింపవలయును.

దుర్గాణాం స్థాపనం ప్రాయో భూపానా మాత్మరక్షకమ్ ।
తస్మాచ్ఛిల్పిగణైః కార్యం స తత్ర నగరాదికమ్ ॥

— విశ్వకర్మ వాస్తుశాస్త్రము అ 10-1

స్వపర బలాబలములను తెలిసికొనుచు రాజు శ్రద్ధవహింప వలసిన యష్ట కర్మలలో దుర్గకర్మ మొకటి.

కృషి ర్వణిక్పథో దుర్గః సేతు కుంజరబంధనమ్ ।
ఖన్యాకర కరాదానం శూన్యానాం చ నివేశనమ్ ॥

— కామందక-5-77*

[కృషి, వాణిజ్యము, దుర్గనిర్మాణము, సేతుబంధనము ఏనుఁగులను కూర్చుట, గనులను త్రవ్వుట, పన్నులను తీసికొనుట, నూతన గ్రామములు నిర్మించుట —అను నెనిమిది]

మహాభారతము నందు షడ్విధదుర్గములు పేర్కొనఁబడినవి.

షడ్విధం దుర్గ మాస్థాయ పురాణ్యథ నివేశయత్ ।
సర్వసంపత్ప్రధానం యద్బాహుళ్యం చాపి సంభవేత్ ॥
ధన్వదుర్గం మహీదుర్గం గిరిదుర్గం తథైవచ
మనుష్యదుర్గం మృద్దుర్గం చ తానిషట్ ॥

— వా.భా. శాంతి- 86-4,5

మనుస్మృతియు నాలు దుర్గములను పేర్కొనుచున్నది.

ధన్వదుర్గం మహీదుర్గ మబ్దుర్గం వార్క్ష మేవ వా ।
నృదుర్గం గిరిదుర్గం వా సమాశ్రిత్య వసే త్పురమ్ ॥ **

— మను. 7-70

* చూడు : వ్యా.భా.సభా. 5-12, దేవబోధకృతజ్ఞానదీపికాటీక.

** చూడు : మనుస్మృతి—కల్లూకభట్టకృత వ్యాఖ్య - వావిళ్ల ప్రతి-పు 314 —→

1. ధన్వదుర్గము : ధన్వ మనఁగా నిర్జలప్రదేశము. ఐదుయోజనముల దూరము నీరులేనిది. మరుదుర్గము.

2. మహీదుర్గము : వెడల్పునకు రెండింతలు పొడవును, పండ్రెండు బారల యెత్తును గలిగి యుద్ధమునకై పైనఁ దిరుగ దగినంత వైశాల్యము గలిగి, రాలతో గాని యిటుకలతోగాని కట్టఁబడిన ప్రాకారముచే చుట్టబడిన భూదుర్గము.

3. జలదుర్గము : చుట్టును లోతు నీటితో గూడిన జలదుర్గము.

4. వృక్షదుర్గము : [వార్షము] వెలుపట చుట్టును యోజనదూరము చెట్లతోఁ జుట్టఁబడియున్న వృక్షదుర్గము.

5. మనుష్యదుర్గము : చతురంగబలముతో గూడిన సేనల చేత కాపాడఁబడినది.

6. గిరిదుర్గము : నలు వైపుల కొండలచేఁ జుట్టఁబడి, లోపలికిపోవుటకు వీలు గాక, సన్నని యిరుకుదారితోఁ గూడి, లోపలనే నదులు, సెలయేళ్ళు గలిగి బహుధనధాన్యసమృద్ధితో నొప్పిన గిరి దుర్గము.

దుర్గము లన్నింటిలోను గిరిదుర్గము శ్రేష్ఠమైనది.

1. ధన్వదుర్గం : మరువేష్టితం చతుర్దిశం పంచయోజన మనుదకం.

2. మహీదుర్గం : పాషాణేన ఇష్టకేన వా విస్తారాద్ద్విగుణోచ్ఛ్రాయేణ ద్వాదశ హస్తా ద్యుచ్ఛ్రితేన యుద్ధార్థ ముపరి పరిభ్రమణయోగ్యేన సావరణ గవాక్షాది యుక్తేన ప్రాకారేణ వేష్టితం.

3. జలదుర్గం : అగాధోదకేన సర్వతః పరివృతం.

4. వార్క్ష దుర్గం : బహిః సర్వతో యోజనమాత్రం వ్యాప్య తిష్ఠన్ మహావృక్ష కంటకి గుల్మలతా నద్యాచితం.

5. నృదుర్గం : చతుర్దిగవస్థాయి హస్త్యశ్వరథయుక్త బహుపాదాత రక్షితం.

6. గిరిదుర్గం : సర్వతః పృష్ఠ మతిదురారోహం సంకోచైకమార్గోపేతం అంతరన్తః ప్రస్రవణాద్యుదకయుక్తం బహుసస్యోత్పాదక క్షేత్ర వృక్షాన్వితం. ఏతేషు దుర్గేషు మధ్యాదన్యతమం దుర్గ మాశ్రిత్య పురం నివేశయేత్।

రాజధానీనగరములు దుర్గసంపన్నములై యుండవలయును.

"పురము భంగి యెట్లైన మేలు చెప్పంగ వలయు," నని యడిగిన పాండవాగ్రజునకు భీష్ముఁ డిట్లు చెప్పినాఁడు.

పరపు లోఁతును గల పరిఘతోఁ, బొడవును
ఘనమును నగు కోట గలిగి, తగిన
వాకిళ్ళు బలుపుఁ గావలి నొప్ప రమ్య గృ
హవ్రాతములు గొమరారు వీధు
లందంబు లగు మేటియంగళ్ళ నెల్ల వ
స్తువులును శోభిల్ల సుజన బహుళ
మై ధాన్యములును ఘృతాదిరసద్రవ్య
ములును నానాయంత్రములును బహు వి
ధాయుధములు బిరుదు లగు యోధులును బండి
తులు విలాసినులును దూతముఖ్య
పరిజనములు నెఱయఁ బరిమోత్సవంబులు
మెఱయఁ బురము చెలువు మిగుల వలయు.

— తిక్కన భార. శాంతి. 2-383

మూలము నం దిట్లున్నది.

య త్పురం దుర్గసంపన్నం ధాన్యాయుధసమన్వితం ।
దృఢప్రాకారపరిఘం హస్త్యశ్వరథసంకులమ్ ॥ 6

విద్వాంస శ్శిల్పినో యత్ర నిచయాశ్చ సుచింతితాః । *
ధార్మికశ్చ జనో యత్ర దాక్ష్య ముత్తమ మాస్థితః ॥ 7

* చూడు : హిందీ మహాభారత - అనువాదక్ - చతుర్వేదీద్వారకాప్రసాద్‌శర్మ
"శిల్పకళావిశారద్ పురుషోం తథా ధర్మాత్మా కార్యకుశల పురుషోం కో రాజధానీ మే బసావే॥"

ఊర్జస్వినరనాగాశ్వం చత్వరాపణశోభితమ్ ।
ప్రసిద్ధవ్యవహారం చ ప్రశాంత మకుతోభయమ్॥ 8
సుప్రభం సానునాదం[1] చ సుప్రశస్తనివేశనమ్ ।
శూరాఢ్యజనసంపన్నం బ్రహ్మఘోషానునాదితమ్॥ 9
సమాజోత్సవసంపన్నం సదా పూజితదైవతమ్ ।
వశ్యామాత్యబలో రాజా తత్పురం స్వయమావిశేత్ ॥ 10

— వ్యా. భా. శాంతి. అ 86, శ్లో॥ 6-10

ఇది మహీదుర్గవిషయము.

పురగోపురపరిఖాప్రాకారప్రాసాదాదు లున్నచోట వాస్తువిద్యావిశారదు లయిన స్థపతులు, రథసంకుల మున్న చోట రథకారులు, నానావిధయంత్రాయుధము లున్నచోట కర్మారులు మున్నగు శిల్పు లుందురు. వీ రెల్లరు నాయాకర్మము లందు నేర్పరు లయిన శిల్పకళావిదులు. కావుననే వ్యాసమహర్షి, "విద్వాంస శ్శిల్పినో యత్ర" .... యని దుర్గము లందు శిల్పపండితుల యునికిని జెప్పినాఁడు.

తిక్కన యీ శ్లోకము నందలి శిల్పపండితులలో శిల్పుల మాట యెత్తక పండితుల ప్రక్క విలాసినులను జేర్చినాఁడు. ఈ పండితులు శిల్పవిద్యాపారంగతులా ? వేదపండితులా ? అగుచో శిల్పు లేమయి నట్లు ?

దుర్గము లందు యోధులకు శిల్పులకు నివాసగృహము లేర్పఱుప వలయు ననియు, వివిధాయుధములు, యంత్రములు చేయుటకు శిల్పులకు కావలసిన సాధన సామగ్రిని సమకూర్పవలయు ననియు మత్స్యపురాణము నందుఁ జెప్పబడినది.

దద్యా దావసథ స్థానం సర్వేషా మనుపూర్వతః ।
యోధానాం శిల్పినాం చైవ సర్వేషా మవిశేషతః ॥
.... .... ....
సంగ్రహశ్చాత్ర సర్వేషా మాయుధానాం చ శస్యతే ।
సర్వేషాం శిల్పిభాండానాం సంచయ స్తత్ర చేష్యతే ॥

— మత్స్యపురాణ-అ 215 శ్లో. 24-84

1. సానువాదం గీతవాదిత్రధ్వనిమత్॥—అని టీకాకారుఁడు (వావిళ్ల ప్రతి)

వాస్తు(శిల్ప) శాస్త్రము లందు బహువిధము లయిన దుర్గములు, వాని లక్షణ ములు పేర్కొనఁబడినవి.

విశ్వకర్మ దశవిధ దుర్గములు—తల్లక్షణములు చెప్పఁగా మానసారముని యష్ట విధదుర్గములు పేర్కొనినాఁడు.

దుర్గము లన్నింటికి పరిఘాప్రాకారములు, ప్రవేశనిర్గమనద్వారము లుండ వలయును. ఇటుకలు మొదలగు వానితోఁ గట్టఁబడు కోటగోడలు పండ్రెండు హస్తముల యెత్తుండవలయును. భిత్తిమూల మూఁడు హస్తములుండవలయును. గోడ పయి భాగము సైనికులు తిరుగుటకుఁ దగినంత వెడ ల్పుండవలయును.

సర్వేషా మపి దుర్గాణాం వప్రైః పరిఘాభిర్వృతమ్ ।
ప్రవేశనిర్గమస్థానే ద్వారై రపి సమన్వితమ్ ॥
ఇష్టకాదికృతం వప్రం హస్తద్వాదశకోచ్ఛ్రితమ్ ।
త దర్ధం భిత్తిమూలే తు సంచారై స్సహ విస్తృతమ్ ॥

— మానసారము - నగరవిధానము. 10-53,54.

కోట వెలుపలి నుండి లోపలికి ప్రవేశించు జనులను, శత్రువులను కనిపెట్టుట కయి ధనుర్ధరులు దుర్గబాహ్యప్రదేశము నంతయు పరికించుచుఁ గూర్చుండుటకు వీలుగా స్థపతులు కోటగోడలను వెడల్పుగా గట్టిగాఁ గట్టవలయును.

అట్లే దుర్గపురముల నన్నింటిని స్థపతి వాస్తు (శిల్ప) శాస్త్రానుసారముగా నిర్మింపవలయు నని విశ్వకర్మ నిర్దేశించుచున్నాడు.

ప్రాకారస్థ ధనుర్ధారీ సర్వత్ర అవలోకనే ।
తథా భిత్తి ప్రకర్తవ్యా సుదృఢా విస్తరా శుభా ॥
ఏవం మయా వినిర్దిష్టాన్ కోటాన్ కరోతు బుద్ధిమాన్
కోటస్థాన్ బాహ్యభాగస్థాన్ యః సర్వావలోకనే ।
తాదృక్ పురాణి సర్వాణి కారయేత్ స్థపతిః క్రమాత్ ॥

— విశ్వకర్మప్రకాశిక. అ 11 - 27,28.

మహాభారతము నందుఁ జెప్పఁబడిన దుర్గలక్షణము లిట్లేయున్నవి.

ప్రగండీః కారయేత్ సమ్యగాకాశజననీ తథా ।
అపూరయేచ్చ పరిఘాం స్థాణునక్రఝషాకులామ్ ॥
— వ్యా. భా. శాంతి. 69, 43 *

ప్రగండి యనఁగా కోట వెలుపలి గోడ. The outer wall of a city.
The outer wall of a rampart.

కోట గోడ పయి దుర్గరక్షకులు కూర్చుండు స్థలమని కొందఱందురు.

కోట లోపల నుండి వెలుపలికి చూచుటకు, అవసరమైనప్పు డాగ్నేయాస్త్ర గుళికలు వెలుపలికి పంపుటకు వీలుగా నా గోడకు చిన్నచిన్నకన్నము లుండవలయును. [ఆకాశజననీ]. A loophole, a easement, an embrasure.

బహిఃప్రాకారము నానుకొని పరిఘ యుండును. ఆ యగడ్తను శూలముల తోను, మొసళ్ల తోను, చేపల తోను నింపవలయును. అందుఁ బడిన శత్రువుల నా శూలములు చీల్చి వేయును. జలచరములు వారిని భక్షించును.

* చూడు : మహాభారతము- వావిళ్ళ ప్రతి.
"సంచారో యత్ర లోకానాం దూరాదేవావబుధ్యతే ।
ప్రగండీ సా చ విజ్ఞేయా బహిఃప్రాకార సంజ్ఞితా ॥
ప్రణిధి స్తత్ర యత్నేన కర్తవ్యో భూతి మిచ్ఛతా ।
సైవ సాకాశరక్షితి ప్రోచ్యతే శాస్త్రకోవిదైః ॥"- ఇతి
తా చతుర్దిక్షుః కారయే దిత్యర్థః ।
ప్రగండీః దుర్గప్రాకారభిత్తౌ శూరాణాం ఉపవేశన స్థలాని ॥
ఆకాశజననీః తత్రైవ ఏకపక్షాయాం భిత్తౌ తత్రత్యానాం
రక్షణభూతాయాం బాహ్యార్థదర్శనార్థాని క్షుద్రఛిద్రాణి
యద్ద్వారా అగ్నేయాస్త్రగుళికాః ప్రక్షిప్యంతే ॥
స్థాణవః స శూలాః నక్రాః ఝషాశ్చ తై స్సమాకులాం ।
యస్యాః పతితః స్థాణుభి ర్విదార్యతే నక్రైర్వా భక్ష్యతే ॥

ఆకాశరక్షి = దుర్గము వెలుపలి యావరణపు గోడ మీఁద నుండి కాపలికాయు భటుఁడు.

ఆకాశజనని = ప్రగండి. దుర్గము నడుమ నున్న జనులు వెలుపలి వస్తువులు చూచుటకు వీలుగా గండ్లు ఏర్పఱచిన గోడ.

ప్రణిధి = వేగు చూచుట, వేగులవాఁడు. — (సూ.ని)

ప్రమాదసమయములలో తప్పించుకొని పోవుటకు వీలుగా సూక్ష్మమైన రహస్య ద్వారము లుండవలయును. గోపురద్వారముల వద్ద శతఘ్న్యాదియంత్రములను స్థాపింపవలయును.

సంకటద్వారకాణిస్యు రుచ్ఛ్వాసార్థే పురస్య చ ।
తేషాం చ ద్వారవద్గుప్తిః కార్యా సర్వాత్మనా భవేత్ ॥ 44.*

ద్వారేషు చ గురూణ్యేవ యంత్రాణి స్థాపయే త్సదా ।
ఆరోపయే చ్ఛతఘ్నీశ్చ స్వాధీనాని చ కారయేత్ ॥ 45. **

— వ్యా.భా.శాంతి. అ 69-44,45

తిక్కన యీ దుర్గకర్మవిధానము నంతయుఁ జెప్పక తక్కిన రక్షణోపాయముల నిట్లు చెప్పినాఁడు.

"కోట యేమఱ కెప్డుఁ బాటించి గడ్డియు
 ధాణంబుఁ గొల్చును గట్టియలును
నేయు నూనియయును నాయుధమ్ముల నౌష
 ధములు నాఖీలయంత్రములుఁ గూప
ములు లోనుగా నందు వలయు వాని సమగ్ర
 ములుగ సంపాదించి భూరి ధైర్య
శౌర్యాదిగుణముల నడిసన్న యాప్త యో
 ధులఁబె ల్లమర్చుట యలఘునీతి.'

— తిక్కన. శాంతి. 2-284

* సంకటద్వారకాణి సూక్ష్మద్వారాణి, తేషాం చ ద్వారవత్ గుప్తిః కార్యా ।
తేషాం చాచారవద్గుప్తి రితి పాఠే ఆచారవద్భిః శిష్టైః గుప్తిః కార్యా॥

— నీలకంఠ

** పోల్చు : మత్స్యపురాణ-దుర్గ నిర్మాణక్రమః ॥ అ 215 శ్లో. 8, 9
దుర్గం చ పరిఘోపేతం వప్రాట్టాలకసంయుతమ్ ।
శతఘ్నీయంత్రముఖ్యైశ్చ శతశశ్చ సమావృతమ్ ।
గోపురం సకవాటం చ తత్ర స్యాత్ సుమనోహరమ్ ॥

# దుర్గరక్షణము - శిల్పులు

బహుధనధాన్యసంగ్రహము బాణశరాసనయోధవీర సం
గ్రహము నిరంతరాంతరుదకంబులు ఘాసరసేంధనౌఘ సం
గ్రహము ననేకయంత్రములు గల్గి యసాధ్యములై ద్విష ద్భయా
వహ లగుచుండ నొప్పునె భవత్పరిరక్ష్యములైన దుర్గముల్?

—అని నారదమునీంద్రుఁడు ధర్మరాజును ప్రశ్నించినాఁడు.

— నన్నయ భార. సభా. 1.53

వ్యాసభారతము నం దిట్లున్నది.

కశ్చిద్ దుర్గాణి సర్వాణి ధనధాన్యాయుధోదకైః ।
యన్త్రైశ్చ పరిపూర్ణాని తథా శిల్పిధనుర్ధరైః ॥

— వ్యా. భా. సభా. 5-38*

[నీ దుర్గములు ధనధాన్యోదకములతోను, ఆయుధములతోను, యంత్రముల తోను, తద్యంత్రనిర్మాణప్రయోగకుశలు లయిన శిల్పులతోను, బాణప్రయోగ ప్రవీణులయిన ధనుర్ధరుల తోను నిండియున్నదా ?]

మూలశ్లోకార్థము నంతయు ననువదించిన నన్నయ, దుర్గరక్షణము నందు ప్రముఖపాత్ర వహించు శిల్పుల నేల వదలినాఁడో :

* చూడు : 1) శ్రీపాద దామోదర సాతవలేకర్ సంపాదితము.

—మ.భా.సభా. పుట 21

'... యంత్ర, దక, శిల్పిగణ్ ఔర్ ధనుర్ధారియోఁ సే భరే హుయే హైఁ?"

2) చతుర్వేదీ ద్వారకాప్రసాద్‌శర్మ : హిందీ మహాభారతము. సభా. పు 11

"... తథా జల యంత్ర శిల్పవిద్యా ఔర్ అస్త్రవిద్యా మే చతుర్ సైనికోం సే పూర్ణ రహతే హై యా వహీ?"

3) "Are thy forts always filled with treasure food, weapons, water, engines and instruments as also with engineers and bowmen?" — P. C. Roy -Mbh- Sabha.

వాల్మీకిరామాయణము నం దీ శ్లోక మిట్లే యున్నది.*
మనుస్మృతియు దుర్గము లందు శిల్పు లుండవలయు ననియే చెప్పుచున్నది.

తత్ స్యా దాయుధసంపన్నం ధనధాన్యేనవాహనైః ।
బ్రాహ్మణై శ్శిల్పిభి ర్యంత్రై ర్యవసేనోదకేన చ ॥

— మనుస్మృతి - 7-75

[ఆ దుర్గము యుద్ధసాధనములు, ధనము, ధాన్యము, వాహనములు, బ్రాహ్మణులు, శిల్పులు, యంత్రములు, కసవు వీనితోఁ గూడి జలసమృద్ధి గలిగి యుండవలయును.][1]

వాహనము లనఁగా బరువులు మోయు జంతువులే కాక, ఎక్కఁదగినరథ గజతురగాదులును.

ఇట, "బ్రాహ్మణైః" అను తృతీయాంతపదము "శిల్పిభిః" అను పదమునకు విశేషణముగా నున్న దనియు, నీ శ్లోకము నం దు నానావిధశస్త్రాస్త్రములను

* చూడు : వా. రా. అయోధ్య 10-53
దీనికి, "యంత్రైః శిల్పిభిః ధనుర్ధరైశ్చ పరిపూర్ణాని కచ్చిత్" – అని గోవిందరాజీయ వ్యాఖ్య.
"Are all your fortifications fully supplied with wealth and provisions, arms and water, mechanical contrivances and equipped with artisans and bowmen ?"

— Eng. Tr. Gorakhpur, ed.

1. చూడు : మనుస్మృతి- కుల్లూకభట్ట వ్యాఖ్య. వావిళ్లప్రతి. పు. 315
"తత్ దుర్గం ఖడ్గాద్యాయుధ సువర్ణాది ధనధాన్య కరితురగ వాహన బ్రాహ్మణ తక్ష్యాది శిల్పియంత్రాఢ్యం ఘాసోదక సమృద్ధం కుర్యాత్."

Cf: Manusrmiti : The Sacred Books of the East. P 228.

"Let that fort be well supplied with weapons, money, grain and beasts of burden, with Brahmanas, with artisans, with engines with fodder and water";

'యంత్రైః' with engines i.e with catapults and so froth,
క్షేప్యాదిభిః made of iron and so forth,

యంత్రములను నిర్మించు శిల్పకారబ్రాహ్మణులవిషయమే చెప్పఁబడిన దనియు శ్రీ స్వామీ రామేశ్వరానంద జీ ఆచార్య "శిల్పిబ్రాహ్మణ" అను తన గ్రంథములో వివరించినారు.*

రాజ్యాంగసప్తకములో దుర్గము హస్తసదృశమైనది—

స్వామ్యమాత్యసుహృత్కోశరాష్ట్రదుర్గబలాని చ ।
సప్తాంగ ముచ్యతే రాజ్యం తత్ర మూర్ధా నృపః ॥
దృగమాత్య సుహృచ్ఛ్రోత్రం ముఖం కోశో బలం మనః ।
హస్తపాదౌ దుర్గరాష్ట్రౌ రాజ్యాంగాని స్మృతాని హి ॥

— శుక్రనీతి- 1-61,62. **

దుర్గరక్షణము కొఱకు రాజు దక్షుఁడైన దుర్గాధ్యక్షుని నియమింపవలెను.

అష్టాదశతీర్థులలో (మంత్రులలో) దుర్గపాలకుఁ డొకఁడు.[1] సప్తప్రకృతులలో నాతని కొక స్థాన మున్నది.[2] పంచపురుషులలో నాతఁడొక ప్రధానాధికారి.[3]

దుర్గాధ్యక్షుఁడు రాజునకు మేలు గూర్చు వాఁడై, ధీమంతుఁడును వాస్తుశాస్త్ర విశారదుఁడు నగు స్థపతియై యుండవలయును.

దుర్గాధ్యక్షో హితో ధీమాన్ స్థపతి ర్వాస్తువేదవిత్ ॥

— అగ్నిపురాణ— అ 220. 7

---

* చూడు : శిల్పి బ్రాహ్మణ. పు. 15 (హిందీ)
లేఖక్ : శ్రీ స్వామీరామేశ్వరానంద జీ ఆచార్య
సంస్కృతవిద్యాలయ, ఘరైడా-కర్నాల్ జిల్లా.

** పోల్చు : (1) వ్యా. భా. శాంతి. 69-64,65
(2) అగ్నిపురాణము-239-1

1. చూడు : వ్యా. భా. సభా. 5-27 జ్ఞానదీపికా దేవబోధ టీక పు. 5
Cf : Dr. Radha Kumud Mookerji : Hindu Civilisation Part I - P 144

2. : అదే 5-13 ,,
"దుర్గాధ్యక్షో ధనాధ్యక్షో ధర్మాధ్యక్షశ్చ భూపతిః ।
దూతః పురోధా దైవజ్ఞః సప్తప్రకృతయః స్మృతాః ॥

3. అదే 5-70
"కోశదుర్గజనపదదండామాత్యేషు పత్యేకం పంచపురుషాః ।"

మత్స్యపురాణము గూడ దుర్గాధ్యక్షుఁడు సమస్తకార్యములందునుత్సాహము గలవాఁడు, హస్తలాఘవము గలవాఁడు, శ్రమకోర్చువాఁడు, ముందుచూపు గలవాఁడు, శూరుఁడు నై వాస్తువిద్యావిధానముల నెఱిఁగిన స్థపతియై యుండవలయు నని చెప్పుచున్నది.

ఈ విధముగా దుర్గ-పుర-రక్షణము నందు స్థపతులు, శిల్పులు ప్రధానపాత్ర వహించుచున్నారు.

కావున స్మృతిపురాణేతిహాసము లన్నియు పురదుర్గము లందు వివిధశిల్పు లుండవలసిన యవసరమును గుర్తించి తత్ప్రాధాన్యము నుగ్గడించుచున్నవి.

....o....

# ద్వారవతీదుర్గము

" ఏమును వాని తోడి [జరాసంధు తోడి] వైరంబు బలవంతం బైన నమ్మథుర నుండ నొల్లక కుశస్థలంబునకు వచ్చి రైవతకపర్వతంబున ఘనంబుగా దుర్గంబు నిర్మించికొని భవదనుగ్రహంబున సుఖం బున్నవారము"- అని కృష్ణుఁడు ధర్మరాజుతో చెప్పెను.

—నన్నయ. భార. సభా. 1. 118.

కుశస్థలి మథురానగరమునకు పశ్చిమదిగ్భాగమున నున్నది. దానికి సమీపాన రైవతకాద్రి యున్నది. కృష్ణాదు లచ్చట నున్న పురాతనదుర్గమును చక్కఁజేసికొనిరి. అది దేవతలకు నైతముజయింపరానిది.

తథైవ దుర్గసంస్కారం దైవై రపి దురాసదమ్ ॥

—వ్యా భా. సభా. 14-52.

రైవతకాద్రి మూఁడు యోజనముల పొడవు గలది. యోజనమున కిరువది యొకటి చొప్పున సైన్యస్థావరములు నెలకొల్పబడినవి. యోజనయోజనమునకు యోజనమునకు

మధ్య నూజేసి ద్వారములున్నవి. యుద్ధవీరు లా ద్వారముల చెంత బారులుతీరి తోరణ ద్వారముల వలె దానిని రక్షించుచుండిరి.

త్రియోజనాయతం సప్త త్రిస్కంధం యోజనాదధి ।
యోజనాంతే శతద్వారం వీరవిక్రమతోరణమ్ ॥

— వ్యా.భా. సభా. 14–56*

ఈ విధముగా రక్షణోపాయములు కల్పించుకొని, జరాసంధునకు భయపడిన యాదవులు మథురానగరమును వీడి ద్వారవతీపురమును జేరి సుఖముగా నుండిరి.

మథురాం సంపరిత్యజ్య గతా ద్వారవతీం పురీమ్ ॥

— వ్యా.భా. సభా. 14-68

ధర్మజు రాజసూయమున శిశుపాలుని జంపిన కృష్ణుని రణము నందు సంహరింతు నని వాని తమ్ముఁడైన సాల్వుఁడు చతురంగమహాబలంబుతో ద్వారవతీ పురముపై దండెత్తి వచ్చినాఁడు. కాని,

"తృణజలధాన్యసమిత్సమృద్ధంబయి,
శతఘ్నీప్రముఖానేకయంత్రంబుల,
నలంఘ్యపరిఘాప్రాకారంబులను,
నపారబలరక్షితఘనకవాటచతుర్గోపురంబులను,
లబ్ధప్రభూతవేతనప్రహృష్టపుష్టధృష్టవీరసుభటసంకులంబును,

* పాఠాంతరము : "త్రియోజనాయతం సప్త త్రిస్కంధం యోజనాదధి ।
యోజనాంతే శతద్వారం విక్రమక్రమతోరణమ్ ॥"

(చూడు : సాతవ లేఖర్ సంపాదితము. మ.భా .సభా. 14-54)

Cf:- P. C. Roy- Mahabharata. Sabha Parva. Sec. XIV. P 43
"We have been obliged to repair to the mountains of Gomanta; those mountains are three yojanas in length; within each yojanas have been established one and twenty posts of armed men. And at intervals of each yojanas are hundred gates whose arches consist of the valor of the heroes engaged in guarding them."

సమరిమితగజతురంగశతాంగంబులను,
ప్రదీప్తాలాతశాతశర చక్ర తోమర పరశు పాశాంకుశకూటంబులను,
వీరయోధారూఢవిశాలాట్టాలకంబులను,

నొప్పి పరుల కసాధ్యం బైన ద్వారవతి భేదింప” నేరఁడయ్యెను.

—నన్నయ. భార. అరణ్య. 1-153

ఈ వర్ణన మించు మించు మూలానుసరణమే.

పురీ సమంతాద్ విహితా సపతాకా సతోరణా ।
సచక్రా సహుడా చైవ సయంత్రఖనకా స్తథా ॥ 5 ॥*

సోపశల్యప్రతోలీకా సాట్టాట్టాలక గోపురా ।
స చక్రగ్రహణీ చైవ సోల్కాలాతావపోథికా ॥ 6 ॥**

* పతాకా ధ్వజాంచలాః; తోరణాని బహిర్ద్వారాణి;
చక్రాణి యోధగణాః; హుడా స్తదాశ్రయస్థానాని భాషాయాం 'బురుజ' సంజ్ఞాని, అన్యే తు విఘ్నమాత్రోత్సర్జనశృంగాణి హుడాఇత్యాహుః ఉదాహరంతి చ అన్యే కల్ప్యంతే హుడశృంగాణి రథస్యోపరి సురిభిః విఘ్నమాత్రస్పర్శహుద్ధ్యర్థం కరాదిస్పర్శ ఉద్యత ఇతి యంత్రాణి అగ్న్యౌషధబలేన దృషత్పిండోత్క్షేపణాని మహాంతి 'కమాన' సంజ్ఞాన క్షుద్రాణి సీసగుళికోత్క్షేపణాని 'బందూఖ' సంజాని ఖనకాః సురంగద్వారా గుప్తమార్గకర్తారః ॥టీ॥

** ఉపశల్యా లోహముఖాః కీలా స్తద్యుక్తాః ప్రతోల్యో రథ్యామార్గా యస్యాం సా ।
అట్టాలకాః ఉపరిగృహాః గోపురాణి పురద్వారాణి ।
సాట్టాని అట్టేన అన్నేన సహితాని అట్టాలకాదీని యస్యాం సా ।
సాట్టేతి విశేషణం ఉపశల్యస్య గ్రామాంతస్య రథ్యాయాశ్చావృత్యా సంబధ్యతే ॥
చక్రగ్రహణీ సైన్యనిగ్రాహికా 'మోర్చా' ఇతి మ్లేచ్ఛప్రసిద్ధా సోల్కాలాతావపోథికా సోల్కా మలాతం జ్వాలాసహితముల్మకం యస్యాం సా సోల్కాలాతా అవబద్ధాః పోథికాః యంత్రబద్ధాః కాష్ఠపాషాణాదయో రిపూణా ముపరి పాతనాయ యస్యా మితి ప్రాంచః ఉల్కేవోల్కా ప్రాణహరత్వాద్ యాంత్రోత్క్షిప్తోగోలః అలాతం సకాష్ఠ దండం లోహమయ మాగ్నేయం ప్రహరణం 'బాణ' ఇతి భాషాయాం ప్రసిద్ధం తయో రప్రత్యాఖ్యే యగర్యో రపి పోథికాః పాతయిత్ర్యః యంత్రమయ్యః శక్తయః కర్ణాయేంద్రదత్తశక్తిసదృశా స్తద్యుక్తాః సోల్కాలాతావపోథికాః ॥టీ॥

సోష్ట్రికా భరతశ్రేష్ఠ స భేరీపణవానకా ।
స తోమరాంకుశా రాజన్ సశతఘ్నికలాంగలా ॥ 7

సభుశుండ్యశ్మగుడకా సాయుధా సపరశ్వధా ।
లోహచర్మవతీ చాపి సాగ్నిః సగుడశృంగికా ॥ 8

శాస్త్రదృష్టేన విధినా సుయుక్తా భరతర్షభ ।
రథైరనేకై ర్వివిధై ర్గదసాంబవోద్ధవాదిభిః ॥ 9

పురుషైః కురుశార్దూల సమర్థైః ప్రతివారణే ।
అతిఖ్యాతకులై ర్వీరైర్ దృష్టవీర్యైశ్చ సంయుగే ॥ 10

మధ్యమేన చ గుల్మేన రక్షిభిః సా సురక్షితా ।
ఉత్క్షిప్త గుల్మైశ్చ తథా హయైశ్చ సపతాకభిః ॥ 11

ఉష్ట్రికా మృచ్చర్మమయాని భాండాని । సర్షికేతి పాఠే ఋష్టయః ఆయుధవిశేషాః ॥7॥
అశ్మగుడికాః వర్తులీకృతాః పాషాణాః । లోహమయాని చర్మాణి కమఠపృష్ఠాకారాణి । ప్రహారవారకాణి। సాగ్నిః అగ్నేయౌషధసహితా గుడా గోళకాః శృంగికాః స్తదుత్క్షేపకయంత్రాణిః శత్రూణా ముపరి పాతనాయ తప్తో గుడో ద్రవీభూతో యత్ర శిఖరే స్థాపత్యే తత్సహితే త్యన్యే ॥8॥
మధ్యమో గుల్మః యత్ర స్థితేన యోధసంఘేన చతుర్దిగవస్థితా రిపవో ద్రష్టుం బాణాదినా ప్రహర్తుం చ శక్యంతే తాదృశ ముచ్చస్థానం । ఉత్క్షిప్తగుల్మైః పరకీయ గుల్మోచ్చాటనకరైః ॥ 11 ॥
అప్రమత్తా ఇతి భేదః ॥ 13 ॥ — నీలకంఠ
ఉష్ట్రికా : ఒంటె వలె నుండు ఒకరకము కుండ (సూ.ని)

f. an earthern vessel shaped like a camel. L. (M.W.S E D)

అశ్మగుడము : ఱాతిలో జేసిన అస్త్రవిశేషము. (సూ.ని)
గుడశృంగికా. f. an apparatus for throwing balls from a wall. (M.W.S E D-P 356)
గుల్మము : 1. తొమ్మిది రథములును, తొమ్మిది యేనుగులును, ఇరువదేడు గుఱ్ఱములును, నలువదేవురు కాల్బంటును గల సేన. —→

178 శ్రీ మదాంధ్ర మహాభారత

అఘోషితం చ నగరే నపాతవ్యా సురేతివై ।
ప్రమాదం పరిరక్షద్భి రుగ్రసేనోద్ధవాదిభిః ॥ 12
ప్రమత్తేష్వభిఘాతం హి కుర్యాచ్ఛావో నరాధిపః ।
ఇతి కృత్వాఽప్రమత్తాస్తే సర్వే వృష్ణ్యంధకాః స్థితాః ॥ 13
ఆనర్తాశ్చ తథా సర్వే నటా నర్తకగాయనాః ।
బహిర్నివాసితాః క్షిప్రం రక్షద్భి ర్విత్తసంచయమ్ ॥ 14
సంక్రమాభేదితాః సర్వే నావశ్చ ప్రతిషేధితాః ।
పరిఘాశ్చాపి కౌరవ్య కీలైః సునిచితాః కృతాః ॥ 15
ఉదపానాః కురుశ్రేష్ఠ తథైవాప్యంబరీషకాః ।
సమంతా త్క్రోశమాత్రం చ కారితా విషమా చ భూః ॥ 16
ప్రకృత్యా విషమం దుర్గం ప్రకృత్యా చ సురక్షితమ్ ।
ప్రకృత్యా చాయుధోపేతం విశేషేణ తదానఘ ॥ 17
సురక్షితం సుగుప్తం చ సర్వాయుధసమన్వితమ్ ।
తత్పురం భరతశ్రేష్ఠ యథేంద్రభవనం తథా ॥ 18
నచాముద్రోఽభినిర్యాతి న చాముద్రః ప్రవేశ్యతే ।
వృష్ణ్యంధకపురే రాజన్ స్తదా సౌభసమాగమే ॥ 19
అనురథ్యాసు సర్వాసు చత్వరేషు చ కౌరవ ।
బలం బభూవ రాజేంద్ర ప్రభూతగజవాజినమ్ ॥ 20
దత్తవేతన భక్తం చ దత్తాయుధపరిచ్ఛదమ్ ।
కృతోపధానం చ తదా బలమాసీ న్మహాభుజ ॥ 21
న కుప్యవేతనవతీ కశ్చిన్న చాతిక్రాంతవేతనీ ।
నానుగ్రహభృతః కశ్చి న్నచాదృష్టపరాక్రమః ॥ 22
ఏవం సువిహితా రాజన్ ద్వారకా భూరిదక్షిణా ।
ఆహుకేన సుగుప్తా చ రాజ్ఞా రాజీవలోచన ॥ 23

-వ్యా.భా. వన. అ 15. శ్లో ౬-23

2. సైన్యరక్షణము (మే.ని)
3. గ్రామరక్షకభట స్థానము, పల్లె యందలి ఠాణా (సూ.ని)

సంక్రమాః నదీసేతవః ।



వ్యాసభారతము నందలి వర్ణనము విపులముగ నుండుట వలన పురరక్షణో పాయములు మఱికొన్ని తెలియుచున్నవి.

పరిఖాప్రాకారములు, గోపురాట్టాలకములు, తోరణాద్యలంకారములు సొంపు మీఱుచున్నవి.

కోటబురుజులపై (అట్టాలకములపై సైనికులు కావలా యున్నారు.

పురద్వారముల చెంత లోపలికి ప్రవేశించు శత్రువులపై రాళ్ళు, సీసపుగుళ్ళు విసురుటకు 'బందూఖ్' మున్నగు యంత్రము లమర్పఁబడినవి.

యుద్ధశాస్త్రము ననుసరించి రథగజతురగపదాతాది చతురంగబలము సమీకరింపఁ బడినది. సర్వాధములు సమకూర్పఁబడినవి.

అవసరమైనపుడు శత్రువు నెదిరించుటకు పురమధ్యమున సైనికస్థావరము (గుల్మము) లేర్పరుపఁబడినవి. పతుష్పథము లందు, రథ్యోపరథ్యల యందు గజాశ్వ దళము లుంపఁబడినవి. ఊరిపొలిమేరల వఱకు గల మార్గము లందు సైనికులు తిరుగుచుండిరి.

అగడ్తలపై నదులపై గల వంతెనలు పడఁగొట్టి రాకపోక లరికట్టఁబడినవి. నదులలో నౌకల రాకపోకలు నిషేధింపఁబడినవి. పరిఖలలో శూలములు దింపఁబడినవి.

ప్రకృతి సిద్ధముగా ద్వారకాపురదుర్గము విషమమైయున్నను, రాకపోకలు సుగ మము గాకుండునట్లు చుట్టు నొక క్రోశము దూరము మిట్టపల్లములుగా (విషమము) చేయఁబడినది.

ద్వారకాపుర మీ విధముగా నింద్రపురి వలె రక్షింపఁబడుచున్నది.

కీలైః శూలైః సునిచితాః వ్యాప్తాః ॥15॥
ఉదపానాః కూపాః 'అంబరీషో భవేద్ భ్రాష్ట్ర' ఇతి విశ్వః
గుప్తాగ్ని రిత్యన్యే విషమా లోకకంటకాద్యాకీర్ణా ॥16॥
అనురథ్యాసు ప్రతిరథ్యమ్ ॥20॥
కుప్యం స్వర్ణరూప్యేతరద్ధనమ్ తామ్రాది గ్రహో రణోద్యమ స్తమను అక్షీకృత్య భృతోఽనుగ్రహత స్తత్కాలస్వీకృతో న కశ్చిత్ కిం తు చిరసంభృతా ఏవ కృపాఖ్యాతో న కిం తు పౌర్వభూత ఏవేతి వా ॥22॥
భూరిదక్షిణా బహవో దాక్షిణ్యయుక్తా యస్యాం ఆహుకేన ఉగ్రసేనేన ॥22॥

— నీలకంఠ, చిత్రశాలాప్రతి-పు. 22

# లంకాపురదుర్గము

సీతాదేవి రావణపాలిత మైన లంకాపురి యందున్న దని సంపాతివలనఁ దెలిసికొని హనుమంతుఁడు లంకకుఁ బోయి, యశోకవనంబు నందున్న యా లలితాంగిని జూచి, యభిజ్ఞానార్థంబుగా నామె యిచ్చిన శిరోభూషణంబును గొని వచ్చి .... యమ్మహామణి రాజచూడామణికి సమర్పించినాఁడు.[1]

"నేను లంకాపురదాహంబు సేసి యిట దేవర కింతయు విన్నవింప వచ్చితి'[2] నని చెప్పిన హనుమంతుని జూచి శ్రీరాముఁడు లంకాపుర దుర్గసంఖ్య, సేనాబలపరిమాణము, ద్వారదుర్గక్రియ, గుప్తికర్మ [రక్షణవిధానము] మున్నగు పురరహస్యములు — తాను జూచి వచ్చిన వానిని — తెలుపు మని యడిగినాఁడు.[3]

లంకాపురదుర్గనిర్మాణరక్షణాదివిశేషములను వాల్మీకిరామాయణము నుండియే తెలిసికొనవలయును.

హనుమంతుఁ డిట్లు చెప్పినాఁడు.

శ్రూయతాం సర్వమాఖ్యాస్యే దుర్గకర్మవిధానతః ।
గుప్తాపురీ యథా లంకా రక్షితా చ యథా బలైః ॥
రాక్షసాశ్చ యథా స్నిగ్ధా రావణస్య చ తేజసా ।
పరాం సమృద్ధిం లంకాయాః సాగరస్య చ భీమతామ్ ॥
విభాగం చ బలౌఘస్య నిర్దేశం వాహన స్య చ ।

—వా.రా. యుద్ధ కాండ. సర్గ 3. శ్లో 7-9.

1. ఎఱ్ఱన. భార. అరణ్య. ఆ 6—291-92
2. ... అదే ... ఆ 6—32
3. వా. రా. యుద్ధ. సర్గ. 3 శ్లో॥ 3-5

"కతి దుర్గాణి దుర్గాయా లంకాయా స్తద్ బ్రవీష్వ మే
జ్ఞాతు మిచ్ఛామి తత్సర్వం దర్శనా దివ వానరః ।
బలస్య పరిమాణం చ ద్వారదుర్గక్రియా మపి
గుప్తికర్మ చ లంకాయా రక్షసాం సదనాని చ ॥
యథా సుఖం యథావచ్చ లంకాయా మసి దృష్టవాన్ ।
సర్వమాచక్ష్వ తత్త్వేన సర్వథా కుశలో హ్యసి ॥

లంకాపురము నం దనుసరింపఁబడు దుర్గరచనావిధాన మెట్టిదో తద్రక్షణోపాయము లెట్టివో సేనబలవిభాగాదు లెట్టివో – ఇత్యాది విషయము లన్నియు వివరించెద నని హనుమంతుఁ డిట్లు చెప్పుచున్నాఁడు.

హృష్టప్రముదితా లంకా మత్తద్విపసమాకులా ।
మహతీ రథసంపూర్ణా రక్షోగణనిషేవితా ॥
దృఢబద్ధకపాటాని మహాపరిఘవంతి చ ।
చత్వారి విపులాన్యస్యా ద్వారాణి సుమహాంతి చ ॥
తత్రేషూపలయంత్రాణి బలవంతి మహాంతి చ ।
ఆగతం ప్రతి సైన్యం తై స్తత్ర ప్రతివార్యతే ॥
ద్వారేషు సంస్కృతా భీమాః కాలాయసమయాః శితాః ।
శతశో రచితా వీరైః శతఘ్న్యో రక్షసాం గణైః ॥
సౌవర్ణస్తు మహాం స్తస్యాః ప్రాకారో దుష్ప్రధర్షణః ।
మణివిద్రుమ వైడూర్యముక్తా విరచితాంతరః ॥
సర్వతశ్చ మహాభీమాః శీతతోయా మహాశుభాః ।
అగాధా గ్రాహవత్యశ్చ పరిఖా మీనసేవితాః ॥
ద్వారేషు తాసాం చత్వారః సంక్రమాః పరమాయతాః ।
యంత్రై రుపేతా బహుభి ర్మహద్భి ర్గృహపంక్తిభిః ॥
త్రాయంతే సంక్రమా స్తత్ర పరసైన్యగతే సతి ।
యంత్రై స్తై రవకీర్యంతే పరిఖాసు సమంతతః ॥
ఏక స్త్వకంప్యో బలవాన్ సంక్రమః సుమహాదృఢః ।
కాంచనై ర్బహుభిః స్తంభై ర్వేదికాభిశ్చ శోభితః ॥
స్వయం ప్రకృతి మాపన్నో యుయుత్సూ రామ రావణః ।
ఉత్థితశ్చాప్రమత్తశ్చ బలానా మనుదర్శనే ॥

— వా. రా. యుద్ధ సర్గ. ౩-శ్లో 10-19

మత్తమాతంగములతో రథములతో రక్షోగణములతో లంకాపురి పొంపిరి వోవుచున్నది.

లంకాపురికి మహార్గళయుక్తములై దృఢమైన కపాటములు గల నాలుగు ముఖ్యద్వారము లున్నవి. అందు శత్రుసైన్యప్రవేశము నరికట్టుటకై యుపలయంత్రము లమర్పఁబడినవి. అసురశిల్పులచే నినుముతో నిర్మింపఁబడిన వాడియైన శతఘ్న్యాది యంత్రములు వందలకొలఁదియా ద్వారముల చెంత నున్నవి.

సువర్ణమయము, ముక్తావైడూర్యమణిప్రవాళాదిరత్నఖచితము నైన లంకాపుర ప్రాకారము దుష్ప్రధర్షణమైనది. (అనఁగా తాక శక్యము గానిది). దాని చుట్టు నగాధము లైన పరిఖ లున్నవి.

పరిఖలపై నాలుగు ద్వారముల ముందు యంత్రోపేతములైన పెద్ద పెద్ద వంతెనలు నాలుగున్నవి. పురద్వారములను కాపలాగాయు రక్షకభటు లుండుటకు ప్రాకారముల నానుకొని గృహములున్నవి.

శత్రుసేన యా వంతెనలను సమీపించినంతనే యంత్రములు పనిచేయును. పరసేనలను పరిఖలలో పడఁద్రోసి వంతెనలను కాపాడును.

ఉత్తరద్వారము వద్ద నున్న వంతెన మిక్కిలి దృఢమైనది. అనేక సువర్ణ స్తంభములతోను వేదికలతోను శోభిల్లుచుండును. రావణుఁ డచ్చట నిలిచి స్వయముగా తన సైన్యమును పర్యవేక్షించుచుండెను.

లంకాపురికి నలుప్రక్కల ద్వారములు గలవు. అం దుత్తర దిక్కున నున్న గోపురము ప్రధానద్వారము. రావణ మరణరహస్య మా గోపురము నం దున్నది. కావుననే విపత్సమయము లందు రావణుఁడే స్వయముగా దానిని కాపాడుకొను చుండును.

లంకాపురగోపురము నం దున్న పంచవక్త్రదారుఫలకము నొక్కబాణముతో నైదుఖండములుగా ఛేదించినచో రాముఁడు నిన్ను చంపఁగలఁ డని విభీషణుఁడు రావణునికిఁ దెలిపి నట్లు పద్మపురాణము నందు వర్ణింపఁబడినది.

గోపురస్థం తథా దారు పంచవక్త్ర మథేషుణా ।
చిచ్ఛేద పంచధా తేన రామ త్వాం మారయిష్యతి ॥

— పద్మ. పాతాళఖండ-అ 112-282

పంచవక్త్ర మనఁగా విశాలమైన ముఖముగలది. సింహము.
శిల్పశాస్త్రమునందు సింహాదులతో చేయు చిత్రరచనము.

ద్వారబంధమునకు పై నుండు అడ్డుఁగమ్మిపై శిల్పులు తోరణాఖ్య చిత్రరచన చేయుదురు. పత్రతోరణము, మకరతోరణము, చిత్రతోరణము నని తోరణములు మూడు విధములు.[1]

ఇందు మధ్యభాగము నందంతరాళమును, దాని కిరుప్రక్కల సింహముఖములు గల మకరములను రెంటిని చెక్కి నానాఫలాన్వితముగను వివిధాలంకారయుక్తముగను వృత్తాకారమునను రచింపఁబడునది మకరతోరణము. దీనికే వక్త్రతోరణ మని నామాంతరము.

పంచవక్త్రసమాయుక్తం పార్శ్వయో ర్మకరతోరణమ్।*
మధ్యే పూరీమ సంయుక్తం నానాఫలలతాన్వితమ్ ।
నానాలంకారసంయుక్తం వృత్తం మకరతోరణమ్ ॥

— కాశ్యపశిల్పము, పటల 12-8,9

పంచవక్త్రమునే కీర్తిముఖ మనియు నందురు.
కీర్తి యనఁగా ప్రాసాదము.

కీర్తి ర్యశసి విస్తారే ప్రాసాదే కర్దమే ఽపి చ ॥

— హేమచంద్ర

1. కాశ్యపశిల్పము పటల. 12. శ్లో. 6
(ఆనందాశ్రమ సంస్కృత గ్రంథావళి. సంఖ్య. 95)

* 1) Cf: V. S. Agravala : Studies in Indian Art. PP-235-238.
"On the gate-way known as Makara Torana, there should be a Purima (space filling spiral or festoon) motif in the centre and on its two sides two makara faces combined with the grotesque form of pancha-vaktra or Kirtimukha."

2. చూడు : స్వర్ణ సుబ్రహ్మణ్యకవి - భారతీయమహాశిల్పము. పు- 161
(మకరతోరణమును గురించిన మరికొన్ని వివరము లున్నవి)

Kirti = Prasada (favour) or Prasada (a palace) L.
— Monier Williams, S.E.D. P-235

కీర్తిముఖ మనఁగా ప్రాసాధముఖము. ఇది శిల్పసంప్రదాయము.

లంకాపురి చొరశక్యము గానిది. దేవతలకును దుర్గమమైనది శత్రువులకు భయావహముగా నుండును. అది జల పర్వత వన కృతకాది చతుర్విధదుర్గసంపన్నమై యున్నది.

లంకా పునర్నిరాలంబా దేవదుర్గా భయా వహా
నాదేయం పార్వతం వాన్యం కృత్రిమం చ చతుర్విధమ్ ॥

స్థితా పారే సముద్రస్య దూరపారస్య రాఘవ ।
నౌ పథశ్చాపి నాస్త్యత్ర నిరుద్దేశశ్చ సర్వతః ॥

శైలాగ్రే రచితా దుర్గా సా పూర్దేవపురోపమా ।
వాజివారణసంపూర్ణా లంకా పరమదుర్జయా ॥

పరిఖాశ్చ శతఘ్న్యశ్చ యంత్రాణి వివిధాని చ ।
శోభయంతి పురీం లంకాం రావణస్య దురాత్మనః ॥

— వా. రా. యుద్ధ. స, 3 శ్లో. 20-23

లంకాపురమున కన్ని ప్రక్కల జలప్రవాహ మున్నది. సముద్ర తీరమునకు చాల దూరముగా నుండుటచే నావలు సైతము పోవుటకు వీలు లేకున్నది. శైలాగ్రమున నిర్మింపఁబడుట చేత లంకాపురి యమరపురివలె దుర్గమమైయున్నది. దాని చుట్టు వృక్షసంపద యుండుటచే నది వార్క్ష దుర్గము. పరిఖాప్రాకారములతో వివిధ యంత్రములతో నొప్పుచుండుట చేత కృత్రిమ దుర్గము.

ఈ విధముగా లంకాపురి చతుర్విధదుర్గ సమాశ్రితమై శత్రు దుర్భేద్యముగ శోభిల్లుచున్నది.

రావణుఁడు రామునితో సమరమునకు మోహరించియున్నప్పటి లంకాపురదుర్గ వర్ణన మిట్లున్నది.

బద్ధ శిలా యంత్ర బహుళమై, యుత్తాలి
తాట్టాలకాఖీలమై, యుదగ్ర
కేతు పతాకా ప్రకీర్ణమై, తోమర
ముద్గరాలాతక ముసల శూల
శర శతఘ్ని ముఖ సాధనోపేతమై,
యుగ్ర విగ్రహ ధీర యోధవీర
సంకులంబై, హయ స్యందన వేదండ
చండమై, సముదిత సప్త సాల
మై, యలంఘ్యపరిఖమై, తృణకాష్ఠ జ
లాదివస్తుభరిత మైన, లంక
కధిక, రక్షఁ, జేసి, యప్రమాదంబున
నుండె, రిపు జిగీష నుదితబలుఁడు.

—ఎఱ్ఱన, భార. ఆరణ్య. 7_57

వ్యాసభారతము నం దీ వర్ణన మిట్లున్నది.

రావణం సంవిధం చక్రే లంకాయాం శాస్త్రనిర్మితామ్ ॥
ప్రకృత్యైవ దురాధర్షా దృఢ ప్రాకారతోరణా ॥
అగాధతోయాః పరిఖా మీననక్రసమాకులాః ॥ *
బభూవుః సప్త దుర్ధర్షాః ఖాదిరైః శంకుభిశ్చితా ।
కపాటయంత్రదుర్ధర్షా[1] బభూవుః సహుడోపచ
సాశీవిషఘటాయోధాః ససర్జరసపాంసవః ॥ 4 ॥

* పోల్చు : వ్యా. భా. శాంతి. 69 - 42.
" ఆపూరయేచ్చ పరిఖాం స్థాణునక్రఝషాకులామ్.

1. పోల్చు :- వా. రా. యుద్ధ - సర్గ, 39 - 26 →

ముసలాలాతనారాచతోమరాసి పరశ్వధైః ।
అన్వితాశ్చ శతఘ్నీభిః సమధూచ్ఛిష్టముద్గరాః ॥ 5 ॥
పురద్వారేషు సర్వేషు గుల్మాః స్థావరజంగమాః ।
బభూవుః పత్తిబహులాః ప్రభూతగజవాజినః ॥ 6 ॥

వ్యా.భా వన. అ 284. 1-6. *

వ్యాసభారతము వలనఁ దెలియవచ్చు విశేషము లివి :-

1) లంకాపురి వాస్తుశాస్త్రసమ్మతముగా నిర్మింపఁబడినది.

2) లంకాపురి శంకుస్థాపనమునకు శుభప్రదమైన చంద్రకాయ్యతోఁ గావింపఁబడిన శంకువు లుపయోగింపఁబడినవి.

3) పురద్వారములకు యుద్ధోపయోగములగు యంత్రము లుపయోగింపఁబడినవి. ఈ యంత్రముల సాయముతో శత్రువులపై రాళ్లు గాని, సీసగుళికలు గాని రువ్వవచ్చును.

4) పురద్వారముల చెంత కోటబురుజులపై రహస్యముగా (ఇతరులకుఁ గనరాకుండ) నిలిచి దుర్గరక్షణము సేయుటకు, కోటచుట్టుఁ దిరుగుచు కాపలా కాయుటకు సైనికులు నియమింపఁబడిరి.

"పురీం మహాయంత్రకవాటముఖ్యాం
దదర్శ రామో మహతా బలేన."

"endowed with gates fitted with huge
engines of war." —Eng. Tr. V.R. Gorakhpur. ed.

* కపాటయంత్రైశ్చ గోలాద్యుత్క్షేపణసాధనైః దుర్ధర్షాః పరిఘాః । సహూడాః సోపలాశ్చ హూడం మూత్రాద్యుత్సర్జనార్థం శృంగమ్ । ఉపలాః క్షేప్యా గోలకాః ॥4॥

సమధూచ్ఛిష్ట ముద్గరాః మధూచ్ఛిష్టం క్షౌద్రం మధు । మద్యాదివ్యావృత్త్యర్థ ముచ్ఛిష్టపదమ్ ॥5॥

గుల్మా గుప్తోపవేశనస్థానాని బురుజాఖ్యా మహాస్తంభాః । స్థావరగుల్మాః । జంగమాః సేనాద్యా అలంగ ఇత్యభిహితాః ॥6॥

— నీలకంఠ - చిత్రశాలాప్రతి— పు. 449

అలంగము = కోటచుట్టును వేసిన మట్టి దిమ్మ, వప్రము (సూ.ని)

తక్కిన విషయములు యథాతథముగా నాంధ్రభారతము నందు వర్ణింపఁ బడినవి.

రావణుఁడు యుద్ధసన్నద్ధుఁడై చేసిన కట్టుదిట్టము లన్నింటిని కపివీరులు ఛిన్న తాటము చేసిరి.

కోటఁ బన్నిన ఘోరదానవకోటిఁ జుక్కనఁ దోలి య
క్కోట నల్లడలన్ మహోగ్రతఁ గూలఁ ద్రోచి సమున్నమ
త్కూటతోరణ యంత్రకేతన గోపురాట్టకసంహతుల్
వీఁటతాటము సేసి రక్కపివీరు లొక్కట మాత్రలోన్.

మఱియుఁ బ్రాకారంబు పై నున్న గదా పరిఘ కుంత ప్రముఖంబులు గైకొని లంకామధ్యంబున వ్రైవఁ దొడంగిరి.

— ఎఱ్ఱన. భార. అరణ్య. 7.66,67

మూలము నం దిట్లున్నది.

బిభిదు స్తే మణి స్తంభాన్ కర్ణాట్టశిఖరాణి చ । *
భగ్నోన్మథితశృంగాణి యంత్రాణి చ విచిక్షిపుః ॥
పరిగృహ్య శతఘ్నీశ్చ సచక్రాః సహుడోపలాః ।
చిక్షిపు ర్భుజవేగేన లంకామధ్యే మహాస్వనాః ।

— వ్యా.భా. వన. 284-30,31

* యా త్వై ర్దుర్గరక్షణార్థం సామగ్రీకృతా సైవ తేషాం నగర నాశనాయాభూదిత్యాహ బిభిదు స్తే ఇత్యాదినా। కర్ణ స్తిర్యగ్యానం తేన ప్రకారేణ య త్పాషాణాదివిస్తరేణ క్రియతే తత్తద్ గృహవిశేషం కర్ణాట్ట మితి వదంతి తద్ధి దిక్కోణస్యచతురస్రో పరి విదిక్కోణం చతురస్రం తదుపరి దిక్కోణం తదుపరి పునర్విదిక్కోణ మిత్యేవం క్రమేణోత్తరోత్తర కల్ప ప్రమాణై శ్చతురస్రైః సమాప్యత ఇతి ప్రసిద్ధమ్ ॥

— నీలకంఠ. చిత్రశాలావ్రళి-పు. 448

లంకలో ప్రవేశించిన వానర సైన్య మచటి మణి స్తంభములను, కర్ణాట్టశిఖర ములను, సౌధశృంగములను, పురద్వారాదులం దమర్పఁబడిన యంత్రములను భగ్నముచేసిరి.

ఇట మణి స్తంభము అనఁగా కోటబురుజులు.

కర్ణాట్ట మనునది పాషాణనిర్మిత మయిన గృహవిశేషము. అది రాళ్ళను చతురస్రాకారముగా పేర్చి, దానిపై విదిక్కుల ననుసరించిన చతురస్రమును, మరల దానిపై దిక్కుల ననుసరించిన చతురస్రమును, మరల దాని పై విదిక్కుల ననుసరించిన చతురస్రమును ఈ విధముగా నొకదాని పై నొకటి పేర్చి వీలయినంత యెత్తుగా కట్టు కట్టడ మని నీలకంఠుఁడు వివరించినాఁడు.

అంతట రావణచోదితు లైన దానవులు నానాకోటిసహస్రసంఖ్య లరిగి యెక్కడెక్కడ యని తలపడి కపిసముదయంబులం దోలి యెప్పటి యట్ల ప్రాకారంబు గైకొని నిల్చి రప్పుడు

మునుమర్కటబలములచే
ననయంబును గపిలవర్ణమైనది మగుడన్
దనుజబలసంవృతం బై
ఘనపటలచ్ఛాయఁ గోట కర మొప్పారెన్.

కపిసేన యెల్లఁ గోటకుఁ గవిసినం బ్రాకారరక్షకు లైన రాక్షసవీరులు వారల జేరనీక శిలాశూలపరశుతోమరాలాత ప్రముఖంబులు ప్రయోగించిరి.

— ఎఱ్ఱన. భార. -అరణ్య. 7. 67-70.

ఇది యంతయు రామరావణయుద్ధమునకు నాంది. తరువాత కపిసేనలకు దానవ వీరులకు ఘోరయుద్ధము జరిగినది. దనుజులు చెల్లాచెదరై పాఱిపోఁజొచ్చిరి.

ఆకులపడి నలుదెసలం
గాకులక్రియఁ జెదరి కడు వెగడువడి రక్షో
నీకములు లంక యెనిమిది
వాకిళ్లం దూఱెఁ బౌరవర్గము తలఁకన్.

— ఎఱ్ఱన. భార. అరణ్య- 7. 107

ఈ వర్ణనము వలన లంకాపురమున తొమ్మిది వాకిళ్ళని తెలియుచున్నది. తుదకు లంకేశ్వరుఁడే స్వయముగా శ్రీరామునితో యుద్ధమునకుతలపడినాఁడు. శ్రీరాముఁడు బ్రహ్మాస్త్రమును ప్రయోగించి రావణుని సంహరించినాఁడు.

కమనీయకనకపుంఖప్రభాభాసియుఁ
దీక్ష్ణముఖంబును దివిజయక్ష
మునిసిద్ధసాధ్యసమ్మోదావహంబునై
విలసిల్లు బాణ ముర్వీవరుండు
గైకొని బ్రహ్మాస్త్రకలితమంత్రాభియు
క్తంబుగా నొనరించి కార్ముకమున
సంధించి జగములు జయపెట్టఁ జెచ్చెరఁ
దివిచి యేయుటయును దీవ్రభంగిఁ

గడఁగి యా శరంబు గల్పాంతదహనంబు
పోలెఁ బంక్తికంఠుఁ బొదివి నీఱు
గా నొనర్చె సూత ఘనరథ రథ్యా న
మన్వితముగ నొక్కమాత్ర లోన

— ఎఱ్ఱన. భార. అరణ్య. 7.151

రావణసంహారమునకు ముందు రాముఁ డాతని మరణరహస్యమును తెలిసికొని లంకాపురగోపురము నందలి పంచవక్త్రదారుఫలకమును ఛేదించినట్లు పద్మపురాణము వలనఁదెలియుచున్నది. *

* Cf:- V.S. Agravala : Studies in Indian Art. P. 235.

చూడు :- పద్మపురాణ. పాతాళఖండ. అ 112.

" యదేత ల్లంకాద్వారే దృశ్యతే దారు పంచవక్త్రం ఖక్రేణోక్త మేతేవ భిన్నేవ రావణో హన్యతే అథ చదారుచ్ఛేదన సమనంతరం పాతాళే గంతవ్య మితి భార్గవ భాషితం శాసనం లిఖితం తస్మా త్త్వ మిదం దార్వేకప్రయత్నే నైకబాణ నిపాతేన పంచధా భింది తత స్తవ శక్తిం జ్ఞాత్వా యుద్ధమతిదృఢం కుర్మహే ॥ 208. →

'లంకాపుర గోపురమున — తోరణద్వారమున — పంచవక్త్ర దారుఫలక మున్నది. దాని నొక్క బాణముతో పంచఖండములుగా ఛేదించినచో రావణుఁడు మరణించు ననియు నతఁడు పాతాళలోకమున కరుగు ననియు అసురగురువగు శుక్రాచార్యుఁడు జోస్యము చెప్పినాఁడు. అది యా పంచవక్త్ర దారుఫలకము పయి శాసనరూపమున లిఖింపఁబడి యున్నది.'

రామున కీ రహస్యమును తన శిబిరము నందు చిక్కువడిన రావణచారులు — అతికాయ మహాకాయు లను వారు — తెలిపిరి.

భార్గవవాగ్విభూతి నెఱిగిన రాముఁడు లంకాపురగోపురము పయి గల పంచ వక్త్ర దారుఫలకము నొక్క బాణముతో పంచఖండములుగా ఛేదించినాఁడు.

రావణవధానంతరము బ్రహ్మహత్యాపాతకపరిహారార్థము రామేశ్వరము నందు రామలింగప్రతిష్ఠఁ గావించి ప్రాయశ్చిత్తము జేసికొనినాఁ డని రామేశ్వరతీర్థ మహాత్మ్యము తెలుపుచున్నది.*

అథ భార్గవవచో విజ్ఞాయ రామః పూర్వకోట్యాం స్పర్శమానే ఽస్త్రేణ సజ్యాం కృత్వా ధనుషి బాణం సంయోజ్య రక్షోభ్యాం హనుమతా శ్రావయ న్నేవ బాణం ముమోచ ॥ 209

బాణం ధనుష శ్చలితం తౌ రాక్షసౌ బాణమార్గే నిరీక్షమాణౌ దారు బాణేన పంచధా ఛిన్నం నిరీక్ష్య రామం వ్యజ్ఞాపయ తామవయోః శిశవో రక్షణీయ స్త్వయేతి ॥ 210 ॥

* Cf :- J.H. DAVE : Immortal India. Vol. I. PP 8—1!.

—)o(—

# దుర్గపురవసతి

నగరవాస్తువు ననుసరించి రాజాంతఃపురము, భాండాగారాయుధాగారకోష్ఠాగారాదిబహువిధాగారములు, యజ్ఞశాలలు, కర్మశాలలు, హస్త్యశ్వరథశాలలు, ప్రధాన శిల్పులగృహములు, రథకారలోహకారమణికారాది తదితర శిల్పులనివాసస్థానములు, ఆచార్యపురోహితామాత్యాది రాజపరివారము వివిధవృత్తులవారు నివసింపఁదగిన స్థానములు— ఏ దిక్కునం దేవి యుండవలయునో కౌటిల్యుని 'అర్థశాస్త్రము' నందు నిర్దేశింపఁబడినది.

" వాస్తుహృదయాదుత్తరే నవభాగే యథోక్తవిధాన మంతఃపురం ప్రాఙ్ముఖ ముదఙ్ముఖం వాకారయేత్ ।

తస్య పూర్వోత్తర భాగ మాచార్యపురోహితేజ్యాతోయస్థానం మంత్రిణశ్చావసేయుః ।

పూర్వదక్షిణభాగం మహానసం హస్తిశాలా కోష్ఠాగారం చ ।

తతః పరం గంధమాల్యధాన్యరసపణ్యాః ప్రధానకారవః క్షత్రియాంశ్చ పూర్వాందిశ మధివసేయుః ।

దక్షిణపూర్వభాగం భాండాగార మక్షపటలం కర్మనిషద్యాశ్చ ।

దక్షిణపశ్చిమం భాగం కృష్యగృహ మాయుధాగారం చ ।

తతః పరం నగరధాన్యవ్యావహారిక కార్మాంతిక బలాధ్యక్షాః పక్వాన్నసురమాంసపణ్యాః, రూపాజీవా స్తాలాపచరా వైశ్యాశ్చ దక్షిణాందిశ మధివసేయుః ।

పశ్చిమదక్షిణం భాగం ఖరోష్ట్రగుప్తిస్థానం కర్మగృహం చ ।

పశ్చిమోత్తరం భాగం యానరథశాలాః ।

తతఃపర మూర్ణాసూత్రవేణుచర్మవర్మశస్త్రావరణ కారవః శూద్రాశ్చ పశ్చిమాందిశ మధివసేయుః ।

ఉత్తరపశ్చిమం భాగం పణ్య భైషజ్యగృహమ్ ।
ఉత్తరపూర్వభాగం కోశో గజాశ్వం చ ।
తతఃపరం నగరరాజదేవతా లోహమణికారవో బ్రాహ్మణాశ్చోత్తరాందిశ మధివసేయుః ।
వాస్తుచ్ఛిద్రానులా సేషు శ్రేణీప్రవహణికనికాయా అవసేయుః ॥"

— కౌటిల్య - అర్థశాస్త్ర. అధికరణ - 2-అ4 *

స్పష్టత కోసము వివిధాంశములు పట్టికలోఁ జూపఁబడినవి.

* చూడు :- 1) కౌటిల్య అర్థశాస్త్ర - శ్రీభారతీయ యోగీ - హిందీ అనువాద సహితము. పు.244-5.

2) ఆర్. శ్యామశాస్త్రి: అర్థశాస్త్ర -ఆంగ్లానువాదము. పు. 54

# దుర్గ - పుర వసతి

## (కౌటిల్యుని అర్థశాస్త్రము ప్రకారము)

| దిశ | ఆవాసము |
| --- | --- |
| 1. పూర్వ | గంధమాల్య ధాన్య రసాది వ్యాపారుల గృహములు; ప్రధానకారుక(శిల్పి) గృహములు, క్షత్రియగృహములు |
| 2. పూర్వోత్తర | ఆచార్య, పురోహితభవనములు, యజ్ఞశాల, మంత్రుల నివాస స్థానములు, జలగృహము |
| ఉత్తరపూర్వ | కోశాగారము, గోశాల, అశ్వశాల |
| 3. ఉత్తర | నగరదేవతామందిరము<br>లోహకార, మణికార, బ్రాహ్మణాదుల గృహములు |
| 4. పశ్చిమోత్తర | యానశాల, రథశాల |
| ఉత్తర-పశ్చిమ | అంగళ్ళు [పణ్య], వైద్యశాల [భైషజ్యగృహమ్] |
| 5. పశ్చిమ | ఊర్ణసూత్ర వేణు చర్మ వర్మ శస్త్రావరణకారులగు శిల్పుల గృహములు, శూద్రగృహములు |
| 6. దక్షిణ-పశ్చిమ | కృష్యగృహము — ఆయుధాగారము |
| పశ్చిమ-దక్షిణ | ఖరోష్ట్రగుప్తిస్థానము, కర్మగృహము |
| 7. దక్షిణ | నగరాధ్యక్ష, ధాన్యాధ్యక్షవ్యావహారికాధ్యక్ష, కార్మాంతిక బలాధ్యక్షుల గృహములు; పక్వాన్నసురామాంస వ్యాపారుల గృహములు,రూపాజీవలు, గాయకులు, వైశ్యులు మొదలగువారి గృహములు |
| 8. పూర్వదక్షిణ | మహానసము, గజశాల, కోష్ఠాగారము |
| దక్షిణ-పూర్వ | భాండాగారము, అక్షపటలము, వివిధకర్మశాలలు (కర్మనిషద్యాశ్చ) |

ఇందు ప్రధానశిల్పుల గృహములు క్షత్రియగృహముల ప్రక్కను, లోహకార మణికారకుల గృహములు దేవాలయ బ్రాహ్మణావసథముల ప్రక్కను ఉండుట గమనింపదగినది.

అగ్ని పురాణోక్త నగర విధానమిందుకు కొంచెము భిన్నముగా నున్నది. ఏయే దిక్కునం దెవరెవరుండఁదగునో యీ క్రింది పట్టికలో చూడనగును.

## అగ్నిపురాణోక్త నగరాదివాస్తువిధానము. [అ 106]

| దిక్కులు | వివిధ జాతుల నివాసస్థానములు 1 | 2 | 3 |
|---|---|---|---|
| 1. ఆగ్నేయ | స్వర్ణకారులు | వివిధబలములు | |
| 2. దక్షిణ | నర్తకులు, గణికలు | వేశ్యానిరీక్షకులు | వైశ్యులు |
| 3. నైఋతి | నట, చక్రిక, కైవర్తకులు | కాండారధనుర్ధరులు | |
| 4. పశ్చిమ | రథకారులు<br>ఆయుధకారులు (కర్మారులు) | మహామాత్యులు<br>కోశపాలుర<br>కారుక(శిల్పి)జనులు | శూద్రులు |
| 5. వాయవ్య | శౌండికులు, కర్మకరులు<br>కర్మాధికారులు | — | — |
| 6. ఉత్తర | యతులు<br>సిద్ధులు | దండనాథులు<br>భద్రనాగరకులు | బ్రాహ్మణులు |
| 7. ఈశాన్య | ఫలాదివిక్రేతలు<br>వణిక్జనులు | — | — |
| 8. ప్రాక్దిశ | వీథి | బలాధ్యక్షులు | క్షత్రియులు |

పురదుర్గనిర్మాణయోగ్యమగు భూమిని ఏకాశీతి (81) పదములుగా గాని, చతుష్షష్టి (64) పదములుగా గాని విభజించి, యా పదములందు పంచచత్వారింశ (45) దేవతామయముగా వాస్తుపురుషవికల్పనము చేసి రాజభవనాది సకలనిర్మాణములను తత్తదనుకూలదేవతాపదములందు నిర్మింపవలయు నని వాస్తు (శిల్ప) శాస్త్రములు నిర్దేశించుచున్నవి.

వాస్తుశాస్త్రపద్ధతి ననుసరించి మిత్రపదమున రాజమందిరము భల్లాటపదమున గోపురద్వారము. వాయుసుగ్రీవగంధర్వాదిపదములందు అంతఃపురము, భృంగపదము నందు కుమారీసదనము. గంధర్వపదమునందు సంగీతశాల, రుద్రపదమున భాండాగారము, శోషపదమునం దాయుధశాల, మహీధరపదము నం దశ్వశాల, పైవస్తుత పదము నందు రథగజశాలలు, రాజసౌధమున కభిముఖముగా సభాభవనము నిర్మింపవలయును.[1]

1. చూడు :- సమరాంగణసూత్రధార: ౹ అ. ౧౮.

# ఏకాశీతిపద వాస్తు మండలచక్రము *

ఈశాన్య — పూర్వదిశ — ఆగ్నేయ

ఉత్తరదిశ (ఎడమ వైపు) — దక్షిణదిశ (కుడి వైపు)

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
| అగ్ని | పర్జన్య | జయంత | ఇంద్ర | సూర్య | సత్య | భృశ | ఆకాశ | వాయు |
| 32 | 42 | 3 | 4 | 5 | 6 | 7 | 43 | 10 |
| దితి | ఆప | జయంత | ఇంద్ర | సూర్య | సత్య | భృశ | సావిత్ర | పూష |
| 31 | 31 | 41 | 34 | 34 | 34 | 35 | 11 | 11 |
| అదితి | అదితి | ఆపవత్స | అర్యమ | అర్యమ | అర్యమ | సవిత | వితథ | వితథ |
| 30 | 30 | 40 | 33 | 33 | 33 | 36 | 12 | 12 |
| సర్ప | సర్ప | పృథ్వీధర | బ్రహ్మ | బ్రహ్మ | బ్రహ్మ | వివస్వాన్ | గృహక్షత | గృహక్షత |
| 29 | 29 | 40 | 33 | 33 | 36 | 33 | 13 | 13 |
| సోమ | సోమ | పృథ్వీధర | బ్రహ్మ | బ్రహ్మ | బ్రహ్మ | వివస్వాన్ | యమ | యమ |
| 28 | 28 | 40 | 33 | 33 | 33 | 36 | 14 | 14 |
| భల్లాట | భల్లాట | పృథ్వీధర | బ్రహ్మ | బ్రహ్మ | బ్రహ్మ | వివస్వాన్ | గంధర్వ | గంధర్వ |
| 27 | 27 | 39 | 38 | 38 | 38 | 37 | 15 | 15 |
| ముఖ్య | ముఖ్య | రాజయక్ష్మ | మిత్ర | మిత్ర | మిత్ర | ఇంద్ర | భృంగరాజ | భృంగరాజ |
| 26 | 45 | 23 | 22 | 21 | 20 | 19 | 44 | 16 |
| నాగ | రుద్ర | శోష | అసుర | వరుణ | పుష్పదంత | సుగ్రీవ | జయ | మృగ |
| 25 | 24 | 23 | 22 | 21 | 20 | 19 | 18 | 17 |
| రోగ | యక్ష్మ | శోష | అసుర | వరుణ | పుష్పదంత | సుగ్రీవ | దౌవారిక | పితృగణ |

వాయవ్య — పశ్చిమదిశ — నైఋతి

* చూడు :— 1) మత్స్యపురాణము అధ్యాయము 251.
2) వాస్తురత్నాకరః పు 82

# గృహశిల్పము

బ్రాహ్మణస్థపతిభ్యాం చ నిర్మితం య న్నివేశనమ్ ।
తదా వసేత్ సదా ప్రాజ్ఞో భవార్థీ మనుజేశ్వర ॥

— వ్యా.భా. అనుశాసనిక. 104. 119.

సంపూర్ణాయురారోగ్యములను కోరు బుద్ధిమంతుఁ డెల్లప్పుడు బ్రాహ్మణ స్థపతుల చేత నిర్మింపఁబడిన గృహములందు నివసింపవలయు నని మహాభారతము శాసించుచున్నది.

బ్రాహ్మణుఁ డనఁగా అథర్వవేదవిహితము లయిన శాంతిక పౌష్టికక్రియలు నిర్వర్తింపఁగల యాథర్వణబ్రాహ్మణుఁడు, పురోహితుఁడు.

స్థపతి యనఁగా అథర్వవేదోపవేద మయిన స్థాపత్యవేదవిదుఁ డగు శిల్పి బ్రాహ్మణుఁడు.

ఈ యిద్దఱిలో నొకఁడు నూతనగృహారంభప్రవేశసమయము లందు వేద మంత్రములు పఠించుచు వాస్తోష్పతిసూక్తాదులతో వాస్తూపశమనాది శాంతికవిధులను నిర్వర్తించువాఁడు. మఱి యొకఁడు గృహనిర్మాణక్రియాకలాపములను నెఱపు వాస్తువిద్యావేత్త.

గృహసౌభాగ్య మంతయు నీ యిరువుర శక్తియుక్తుల పయి నాధారపడి యుండును. కావున గృహనిర్మాణకార్యము నం దీ బ్రాహ్మణశిల్పుల ప్రాముఖ్య ముగ్గడింపఁబడినది.

ఈ శ్లోకార్థము అథర్వణవేదోక్తశాలాసూక్తము నందలి యొక మంత్రమును దలపింపఁజేయుచున్నది.

బ్రహ్మణా శాలాం నిమితాం కవిభిర్నిమితాం మితామ్ ।
ఇంద్రాగ్నీ రక్షతాం శాలా మమృతౌ సోమ్యం సదః ॥

— అథర్వ. 9. 3. 19

వేదవిదులయిన శిల్పిబ్రాహ్మణులచే నిర్మింపఁబడిన యీ శాలను ఇంద్రాగ్నులు (వాయువు నగ్నియు) రక్షింతురు గాక! ఈ శాల సర్వదా సుఖదాయకమై యందు నివసించువారలకు ఆయురారోగ్యైశ్వర్యము లొసఁగుఁగాక ! *

## గృహనిర్మాణ విధులు

మానజ్ఞశ్చ క్రియావేదీ తక్షకో లోకబాంధవః ।
గృహాదీన్ స్థాపయే ద్దోషహీనా న్మంగళసిద్ధయే ॥

— విశ్వకర్మ వాస్తుశాస్త్రము. అ 41

**లోకబాంధవుఁ** డయిన తక్షకుఁ డే విధమయిన నిర్మాణమునకెట్టికొలత లుపయోగింపవలయునో తెలిసినవాఁడై, వివిధశిల్పక్రియలు తెలిసినవాఁడై గృహస్థులకు సకలశుభములు గలుగుట కొఱకు గృహాదులను దోషరహితముగా నిర్మింపవలయును.

గృహనిర్మాణము చేయు శిల్పి పాటింప వలసిన ద్వాదశవిధులు కామికాగమము నందుఁ జెప్పఁబడినవి.

| | | |
|---|---|---|
| 1. కాలపరీక్ష | 2. దేశ–స్థల నిర్ణయము. | 3. భూపరీక్ష |
| 4. బలి | 5. భూస్వీకారము | 6. కర్షణము |
| 7. శంకుస్థాపనము | 8. పదనిర్ణయము | 9. సూత్రవిన్యాసము |
| 10. దేవతాబలి | 11. గృహవీథ్యాదిభేదము | 12. గర్భవిన్యాసము. |

గ్రామాదీనాం తు విన్యాసో నివేశాదిశ్చ కథ్యతే ।
ఆదౌ కాలపరీక్షా స్యాత్ ద్వితీయో దేశనిర్ణయః ॥
తృతీయో భూపరీక్షాస్యాత్ ప్రవేశార్థబలి స్తతః ।
స్వీకారం పంచమో భూమేః షష్ఠః కర్షణ ముచ్యతే ॥
శంకుస్థాపనం పశ్చా దష్టమః పదనిర్ణయః ।
నవమః సూత్రవిన్యాసో దశమో దేవతాబలిః ॥

* చూడు :- దయానంద సరస్వతి = సంస్కారవిధిః పు. 191.

గృహవీథ్యాది భేదస్స్యా దేకాదశ ఉదాహృతః ।
ద్వాదశో గర్భవిన్యాస స్తతో దేవనివేశనమ్ ॥

— కామికాగమము — ౩౨పటలము. *

సాహిత్యము నందు గృహ (భవన) హర్మ్యప్రాసాదాదులు సమానార్థకము లయినను,[1] వాస్తుశాస్త్రానుసారము భవనముకంటె హర్మ్యము, హర్మ్యము కంటె ప్రాసాదము పెద్దది.

పరిఖాప్రాకారములు గలిగి చతురస్రాకారమున నిర్మింపబడిన ఏకతలసౌధము భవనము. అది ద్వాదశరాజదండప్రమాణమునకు తక్కువ గాకుండును.

హర్మ్యము భవనము కంటె పెద్దది. మూడు, నాలుగు, ఐదు అంతస్తులు గల మేడ. మౌళి భాగము నందు, భిత్తిప్రాంతము నందు విమానకలశాదులు రచింపబడియుండును.

* Cf :- 1. " The Indian Silpa Sastras or Manual Arts' by M·A. Ananthalwar in ' Vedic Magazine'- —August 1924– P 363

" How should a Silpin proceed in building a house ?

1. The investigation of a suitable time for building the house. 2. The fixing of suitable sites 3. The examination of soils 4. The performance of sacrificial rites 5. Places for different rooms in buildings 6. The levelling up of the sites. 7. The placing of Sanku 8. The foundations 9. Laying out works. 10 Sacrifice to Gods 11. Varandahs and open spaces in building 12. Foundation-stone laying ceremony.

2) Prof. Phanindra Nath Bose = Principles of Indian Silpa Sastra with the text of Mayamata. P. 66.

1. గృహము, గేహము, ఉదవసితము, వేశ్మము, సద్మము, నికేతనము, నిశాంతము, ఆవస్త్యము. సదనము, భవనము, అగారము, మందిరము గృహా, నికాయ్యము, నిలయము, ఆలయము, వాసము, కుటము, శాల, సభ; మందిరము, కుటము, దిక్ష్యము, →

ఐదు కంటె నెక్కువ అంతస్తులు గలది ప్రాసాదము. దీని ప్రమాణము (పొడవు-వెడల్పులు) 12 రాజదండముల నుండి 100 రాజదండముల వఱకు నుండ వచ్చును. *

విమాన మన ఏడంతస్తుల మేడ. (సప్తభూమిగృహము).

కామికాగమము నందు దీని లక్షణమిట్లు చెప్పఁబడినది.

తిలకక్షుద్రనాసీయుక్త తోరణైశ్చ సమన్వితమ్ ।
బ్రహ్మద్వారపతాకాద్యై రంగాద్యైర్యుక్తం విమానకమ్ ॥

— కామికాగమము. 91-93.

ఓకము, నివసనము, స్థానము, ఆవసథము, వాస్తు, సంస్త్యాయము, ఉటజము, ధామము, నివేశము, శరణము, క్షయము— అను నవి గృహపర్యాయపదములు.

హర్మ్యము = ధనికులగృహము ; ప్రాసాదము = దేవగృహము, రాజగృహము.
సౌధము; రాజసదనము = రాజగృహము.

— అమరకోశము. కాం 2-22-27

*. చూడు :— విశ్వకర్మవాస్తుశాస్త్రము- అ. 14 వ్యాఖ్యానము

0₀0

# రాజవేశ్మములు : దివ్యహర్మ్యములు

తస్య మధ్యే సుపర్యాప్తం కారయే ద్గృహ మాత్మనః ।
గుప్తం సర్వర్తుకం శుభ్రం జలవృక్షసమన్వితమ్ ॥

— మనుస్మృతి, అ 7. 76

"దుర్గమధ్యమున వేర్వేరుగా స్త్రీ గృహము, దేవతాగృహము, ఆయుధ గృహము, వంటశాల, మొదలగు వానికిఁ జాలినంత విశాలముగాఁ గట్టఁబడినదై, చుట్టును అగడ్త ప్రాకారములు గలదై నానా ఋతువులందుఁ బుష్పించు, ఫలించు పుష్ప ఫలములు గలదై, చక్కని సున్నపుఁ బూఁతచేఁ బరిశుభ్రమై, నడబావులు మొదలగు నీటివసతి గలిగి చెట్లు చుట్టును గలదై యుండు నట్లు రాజగృహమును నిర్మింప వలయును" అని వ్యాఖ్యాతలు వివరించినారు.[1]

1. చూడు :- మనుస్మృతిః కుల్లూకభట్ట వ్యాఖ్య
సరస్వతి వేంకట సుబ్బరామశాస్త్రి విరచితాంధ్రతాత్పర్యము.
— వావిళ్ళ వారి ప్రతి.

" తస్య దుర్గస్య మధ్యే పర్యాప్తం పృథక్ పృథక్ స్త్రీగృహదేవాగారాయుధా గారాగ్నిశాలాదియుక్తం పరిఖాప్రాకారాద్యైర్గుప్తం సర్వర్తుఫలపుష్పాదియోగేన సర్వర్తుకం సుధాధవళితంవాప్యాది జలయుక్తం వృక్షాన్విత మాత్మనో గృహం కారయేత్."
— కుల్లూకభట్టు.

2. Cf :- I. E. J. Rapson = The Cambridge History of India - vol-I. Ancient India. PP 220-21

" He (the king) shall build a town (pur) and a dwelling (vesma) each with a door facing south. The dwelling (Buhler 'palace') is within the pur and to the east of the dwelling shall be a hall called the ' invitation' (guest) house. South of the pur shall be an assembly house (sabha) having doors on the south and north sides so that it shall be in plain view within and without..."

2. Radha Kumud Mookerjee = Hindu Civilization Part-I P 138.

రాజు పురము నందు దక్షిణ ముఖద్వారముతో రాజవేశ్మమును తన నివేశనము నకు తూర్పుదిక్కు నం దావసథము, పురమునకు దక్షిణ దిగ్భాగమున దక్షిణోత్తర ద్వారములతో సభాభవనము (ద్యూతార్థము) నిర్మించుకొనవలయు నని ఆపస్తంబ ధర్మసూత్రములందు (2-10-25) జెప్పఁబడినది. ఈ మూడుస్థానములందు నగ్ను లుండవలయును. నిత్యము నగ్నిపూజలు జరుగుచుండవలయు ననియు నాపస్తంబుఁడు చెప్పినాడు.

"వేశ్మావసథః సభేతి త్రిస్థానాన్యధిసంధాయ ఆహ సర్వేష్వేవ అజస్రా అగ్నయః స్యు రగ్నిపూజా చ నిత్యా యథా గృహమేధ ఇతి" — ఆపస్తంబ

వాస్తుశాస్త్రము లందు పంచవిధరాజగృహములు చెప్పఁబడినవి.

అష్టోత్తరశతంహస్తం విస్తారా న్నృపమందిరమ్ ।
కార్యం ప్రమాణ మన్యాని తథాష్టాష్టాని తాని తు ।
విస్తారం పాదసంయుక్తం దైర్ఘ్యం తేషాం ప్రకల్పయేత్ ।
ఏవం పంచనృపః కుర్యాత్ గృహాణాం చ పృథక్ పృథక్ ॥

— వరాహమిహిర-బృహత్సంహిత *

108 హస్తముల విస్తారము, 135 హస్తముల పొడవు గల రాజగృహము శ్రేష్ఠమయినది. తక్కిన వాని కొలతల లీ క్రింది పట్టికలోఁ జూడనగును.

| రాజగృహములు | వెడల్పు హస్త - అం | పొడవు హస్త - అం |
|---|---|---|
| 1 వ గృహము | 108=00 | 135=00 |
| 2 వ గృహము | 100=00 | 125=00 |
| 3 వ గృహము | 92=00 | 115=00 |
| 4 వ గృహము | 84=00 | 105=00 |
| 5 వ గృహము | 76=00 | 95=00 |

* చూడు :- యోగపక్తి స్వామిగుప్త = గుప్తవాస్తు- పు 145
2) వాస్తురత్నాకరః అ 11, శ్లో 1,2.
పోల్చు :- 1) మత్స్యపురాణము 2) కాశ్యపసంహిత.

రాజవేశ్మము పొడవు-వెడల్పులు 108 హస్తము లుండుట శ్రేష్ఠ మనియు. 90 హస్తములుండుట మధ్యమ మనియు, 70 హస్తము లుండుట యధమ మనియు సమరాంగణసూత్రధారుఁడు తెలిపినాఁడు.

అష్టోత్తరశతం జ్యేష్టం మధ్యం స్యా న్నవతిం కరాన్ ।
జఘన్యం స ప్తతికరాన్ రాజవేశ్మ ప్రశస్యతే ॥

— సమరాంగణసూత్రధారః ॥ అ. 30-1.

రాజభవనములు మనోహరముగా నుండవలయును,

ప్రాకారపరిఖాగు ప్తం చారుకాంతి సమంతతః ।
త మంగభ్రమనిర్యూహ సుదృఢాట్టాలకాన్వితమ్ ॥
ఏకాశీత్యా పదైర్భ క్తం విధేయం నృపమందిరమ్ ॥

సమరాంగణసూత్రధారః ॥ అ 15. 8,9 *

రాజభవనములకు రక్షణార్థము దృఢప్రాకారపరిఖాదులేకాక, శోభార్థము అంగభ్రమ–నిర్యూహాది శిల్పకళాలంకృతులును ముఖ్యములే.

## రాజమందిరములు

మహాభారతకాలమున రాజులు ప్రాకారపరిఖాన్వితములయిన పురదుర్గముల మధ్యభాగము నందు ప్రత్యేకముగా నిర్మింపఁబడిన రాజప్రాసాదము లందు నివసించు చుండిరి. వారిని దర్శింపఁ గోరు వారు సింహద్వారమును దాఁటి, కక్ష్యాంతరములు గడచి, కొలువు కూటమును జేరవలయును.

* Cf:- D.N. Sukla : Silpa Sastra - Royal Palace and Royal Arts.
P. 2

"Though situated in the interior of the town, the Raja-Nivesa must have a surrounding moat and a rampart to ward off the insecurity of the palaces. This fortification also consisted of so many architectural designs as Angabhrama, Niryuha and strong towers and turrets, the crowning part of the parapets-the surrounding walls and they are also laid to make the structure beautiful."

హస్తినాపురమునకు రాయబారిగా వచ్చిన కృష్ణుఁడు, ధృతరాష్ట్రుని జూచుటకు,

"మణితోరణసుందరం బగు రాజమందిర ద్వారంబు ప్రవేశించి కక్ష్యాంతరంబులు గడచి యేనుంగుమొగసాలఁ[1] జొచ్చి, యరదంబు డిగ్గి యల్లన నడచునప్పుడంతకు మున్న యరిగి భీష్మద్రోణప్రముఖులగు వారలు ధృతరాష్ట్రునిం బొదువ నతఁడు ప్రత్యుత్థానంబు సేసి విదురసంజయసహితంబుగా నెదుర్కొనినాఁడు."

తిక్కన- భార- ఉద్యోగ. 3. 176.

రాజగృహము (సుధాధవళితము కావున) తెల్లగా నున్న దనియు, దాని చుట్టు ననేకప్రాసాదము లున్న వనియు దానిని జేరుటకు కృష్ణుఁడు మూఁడు కక్ష్యలు దాఁటినాఁ డనియు మూలము నందు వర్ణింపఁబడినది.

స గృహం ధృతరాష్ట్రస్య ప్రావిశచ్ఛత్రుకర్షణః ।
పాండురం పుండరీకాక్షః ప్రాసాదై రుపశోభితమ్ ॥
త్రిస్రః కక్షా వ్యతిక్రమ్య కేశవో రాజవేశ్మనః ।
వైచిత్రవీర్యం రాజాన మభ్యగచ్ఛ దరిందమః ॥

— వ్యా.భా. ఉద్యోగ. 88-11,12

దుర్యోధనుమందిరము చేరుటకుఁ గూడ మూఁడు కక్ష్యలు గడచి పోవలయును.

కృష్ణుఁడు కక్ష్యాంతరములు గడచి 'కైలాసశిఖరాకారంబగుసౌధంబున .... పేరోలగంబున సింహాసనాసీనుఁడై' యున్న సుయోధనుని జూడఁ బోయినట్లు తిక్కన వర్ణించినాఁడు.[2]

మూలమునం దిట్లున్నది.

దుర్యోధనగృహం శౌరి రభ్యగచ్ఛ దరిందమః ॥

1. పాఠాంతరము :— అనుంగు మొగసాల =
రాజమందిర ప్రధానద్వారమునకుఁజేరి యుండుశాల.
ఏనుంగు మొగసాల = యామకుంజరము లుండెడు ముఖశాల,
మొదటి మొగశాల (సూ.ని)

2. తిక్కన- భార- ఉద్యోగ- 3-209.

లక్ష్మ్యా పరమయాయుక్తం పురందరగృహోపమమ్ ।
విచిత్రై రాసనై ర్యుక్తం ప్రవివేశ జనార్దనః ॥
తస్య కక్ష్యా వ్యతిక్రమ్య తిస్రో ద్వాస్థై రవారితః ।
తతోఽభ్రఘనసంకాశం గిరికూట మివోచ్ఛ్రితమ్ ।
శ్రియా జ్వలంతం ప్రాసాద మారురోహ మహాయశాః ॥
తత్ర రాజ సహస్రైశ్చ కురుభి శ్చాభిసంవృతమ్ ।
ధార్తరాష్ట్రం మహాబాహూ దదర్శాసీన మాసనే ॥

— వ్యా.భా. ఉద్యోగ. 90. 1-4

దుర్యోధనుని గృహము సర్వాలంకారశోభితమై విచిత్రమైన యాసనములతో దేవేంద్రభవనము వలె నున్నది. కృష్ణుఁడు మూఁడు కక్ష్యలు దాఁటి యా భవనమును ప్రవేశించినాఁడు. అది గిరిశిఖరము వలె నున్నతముగా, నాకసము నందలి మేఘము వలె తెల్లగా, వెలుఁగొందుచున్నది. కృష్ణుఁ డా మేడ పై కెక్కి యందు కొలువు దీఱిన దుర్యోధనుని జూచినాఁడు.

ఇంద్రప్రస్థము నందలి ధర్మజుని రాజగృహము కుబేరభవనము వలె నున్నది.

పాండవులను సుహృద్ద్యూతమున కాహ్వానించుట కరిగిన విదురు డా రాజ భవనము నందు ధర్మజుని కలసికొనినాఁడు.

స రాజగృహ మాసాద్య కుబేరభవనోపమమ్ ।
అభ్యాగచ్ఛత ధర్మాత్మా ధర్మపుత్రం యుధిష్ఠిరమ్ ॥

— వ్యా.భా. సభా. 58-3

ద్వాపరయుగము నందలి యుధిష్ఠిరాది చక్రవర్తుల నివాసగృహములు 98 హస్తముల వెడల్పు, 122½ హస్తముల పొడవు గలిగియుండెడి వని వాస్తుశాస్త్రముల వలనఁ దెలియుచున్నది.[1]

1. చూడు:- వాస్తురత్నాకరః ॥ అ 11. శ్లో 10.
"యే ద్వాపరే భూమిభుజో బభూవు ।
స్తేషాం గృహం హస్తశతం ద్విహీనమ్ ॥
— [విస్తారములో నాల్గవవంతు దానికి కలిపిన దైర్ఘ్యము వచ్చును.
పొడవు $= 98 + \frac{98}{4} = 98 + 24\frac{1}{2} = 122\frac{1}{2}$ హస్తములు]—

# అంతఃపురములు

రాజభవనములలో రాణులకు రాజమాతలకు రాజపుత్రికలకు ప్రత్యేక గృహము లుండెడివి. వానికే యంతఃపురము లని పేరు.

పౌష్యమహాదేవి మణికుండలముల కొఱకు 'కుదంకుఁ డంతఃపురమునకుఁ' జనినాఁడు.[1]

యయాతి మహారాజు దేవయానిని, శర్మిష్ఠను గన్యకాసహస్రంబుదోడ్కొని 'నిజపురమునకుం జని యంతఃపురరమ్యహర్మ్యతలంబున దేవయాని నునిచి, తదను మతంబున నశోకవనికాసమీపంబున నొక్క గృహంబునందుఁ గన్యకాసహస్రంబుతో శర్మిష్ఠ' నునిచినాఁడు.[2]

వేయిమందికి నివాసయోగ్యమయిన యా గృహ మెంత విశాలమయినదో యం దెన్ని కక్ష్యలున్నవో తెలియదు.

చేదిపురమున 'జనసంకులం బైన రాజమార్గంబు దఱి యవచ్చుచున్న .... దమయంతిని ప్రాసాదగత యైన రాజమాత దవ్వులం గనినది.'

—నన్నయ. భార. ఆరణ్య. 2–115,116

సా తైః పరివృతాగచ్ఛేత్ సమీపం రాజవేశ్మని ।
తాం ప్రాసాదగతాపశ్యద్ రాజమాతా జనైర్వృతామ్ ॥

— వ్యా.భా. వన. 65-51

1. నన్నయ. భార. ఆది. 1-95 (వ్యా.భా. ఆది. 3-5)

'తం ప్రత్యువాచ పౌష్యః ప్రవిశ్యాంతఃపురం క్షత్రియాయాచ్యతా మితి'

2. నన్నయ. భార. ఆది. 3-169 (వ్యా.భా. ఆది. 82-1,2)

'యయాతిః స్వపురం ప్రాప్య మహేంద్రపురసన్నిభమ్ ।
ప్రవిశ్యాంతఃపురం తత్ర దేవయానీం న్యవేశయత్ ॥
దేవయాన్యాశ్చానుమతే సుతాం తాం వృషపర్వణః ।
అశోకవనికాభ్యాశే గృహం కృత్వా న్యవేశయత్ ।
వృతాం దాసీ సహస్రేణ శర్మిష్ఠాం వార్షపర్వణీమ్ ॥'

'సుదేవుం డను బ్రాహ్మణుండు చేదిపతి యైన సుబాహుపురంబునకుం జని పుణ్యాహవచనంబు సేయింపఁబోవు బ్రాహ్మణులతో రాజగృహంబుసొచ్చి యంతః పురంబున సునందాసహితయై యున్న దాని .... నిమ్మగా నిరీక్షించి దయమంతి యని యెఱింగినాఁడు.'

— నన్నయ. భార. అరణ్య. 2-142

తత శ్చేదిపురీం రమ్యాం సుదేవో నామ వై ద్విజ ।
విచిన్వానోథ వైదర్భీ మపశ్యద్ రాజవేశ్మని ॥

— వ్యా.భా. వన. 68-7

విరాటనగర రాజవీథిని నడచుచు సైరంధ్రివేషధారిణి యైన 'పాంచాలరాజ నందన రాజమందిరంబు చక్కటికి నరుగు నవసరంబున,

ముద మొదవ రమ్యహర్మ్యము
తుది నిలువునఁ బ్రణయసఖుల తోడ విహారా
స్పద మగు నెలవున మెలఁగెడు
సుదేష్ణ తజ్జాలకములఁ జూచెం బ్రీతిన్

— తిక్కన. భార. విరాట- 1-301

# కన్యాగృహములు

ద్వారకానగరములో సుభద్రకు ప్రత్యేకగృహమున్నది.

వనజనేత్ర కన్యాపురంబునకుఁ జనియె
నరిగెఁ దన లతాగృహంబున కరునుండు.

— నన్నయ. భార. ఆది. 1-189

విదర్భానగరము (కుండిన) నందు రాజపుత్రి యైన దమయంతికి రాజాంతః పురము నందు ప్రత్యేకనివేశనము గలదు.

" ఆయుధీయసురక్షితం బయిన రాజగృహం బెట్లు సొర నగు నని శంకింప వలవదు దమయంతీనివేశనంబు ప్రవేశించు నపుడు నిన్నెవ్వరు వారింప నోడుదు

రనిన శక్రువచనంబుల నశంకితుం డయి నలుం డప్పుడ విదర్భాపురంబునకుం బోయి యొక్కరుండ దమయంతీగృహంబు సొచ్చి" నట్లు వర్ణింపఁబడినది.

నన్నయ. భార. ఆరణ్య- 2-38 *

అది యొక పెద్దమేడ. పుణ్యశ్లోకుఁ డయిన నలుని చూడవలయు నను వేడుకతో దయమంతి యా మేడ పయికెక్కినది.

'ఆరురోహ మహద్వేశ్మ పుణ్యశ్లోకదిదృక్షయా.'

— వ్యా.భా. వన. 56-25

## విడిదిగృహములు

రాచనగళ్ళలో తమదర్శనార్థము వచ్చు బంధుమిత్రులుండుటకు ప్రత్యేకముగా విడిదిగృహము లుండెడివి.

ఉలూపి యను నాగకన్యక యర్జునుని నాగపురమునకుఁ గొనిపోయి 'రమ్యహర్మ్యము నందు నెయ్యమున నునిచె.'

— నన్నయ. ఆది. 8-128

ద్యూతార్థము హస్తినాపురమునకు వచ్చిన పాండవు లుండుట కొసఁగఁబడిన విడిదిగృహములు రత్నమయములు.

వివశు స్తేఽభ్యనుజ్ఞాతా రత్నవంతి గృహాణి చ ॥

— వ్యా.భా. సభా. 58-32

* చూడు :— వ్యా. భా వనపర్వము,

"సురక్షితాని వేశ్మాని ప్రవేష్టుం కథ ముత్సహే॥" — 55-10

"సురక్షితాని హి మే వేశ్మ రాజా చైవోగ్రశాసనః ॥" — 55-21

"భవద్భి రహ మాదిష్టో దమయంత్యా నివేశనమ్ ।
ప్రవిష్టః సుమహాకక్షం దండిభిః స్థవిరైర్వృతమ్ ॥

— వన. 56.25

(మహాకక్షం మహాస్థం రాజద్వారప్రవేశనమ్.- నీలకంఠ.)

విదర్భాపురధీశుఁడు దమయంతీద్వితీయస్వయంవరమున కరుదెంచిన ఋతుపర్ణుని 'పూజించి యొక రమ్యహర్మ్యమున విడియించినాఁడు.'

నన్నయ. భార. అరణ్య. ౩-౧౬౫

రాజప్రేష్యై రనుగతో దిష్టం వేశ్మ సమావిశత్ ॥

వ్యా.భా. వన. ౭౬-౨౦

## అభ్యంతరమందిరములు

రాజభవనములయం దభ్యంతరమందిరములు శయనాగారములు వేఱుగా నుండెడివి.

హస్తినాపురమునకు రాయబారమున కరిగిన కృష్ణుఁడు విదురగృహంబున విందారగించినంత, "రాత్రి యగుటయుం దగిన యభ్యంతరమందిరంబున హంసతూలికాతల్పంబున భుజంగతల్పు నునిచి యతనికడ నుచితాసనంబున నుండి విదురుఁ డిట్లనియె'' .... ....

—తిక్కన. భార. ఉద్యోగ. ౩.౨౬౨

సంభాషణానంతరము విదురుఁడు, నిజశయనస్థానంబునకుఁ జనిన ననంతరంబ.

అతనివచనరచనమాత్మలోఁ దలపోసి
యిట్టివాఁడు గలఁడె యెందు ననుచుఁ
బాలకడలి కడలి పాటిమై యొప్పు న
ప్పాన్పు నందు శౌరి పవ్వళించె. "

—తిక్కన. భార. ఉద్యోగ. ౩-౨౪౮,౨౪౯

०₀०

# భాండాగారములు : ఆయుధాగారములు

భాండాగారాయుధాగారం ప్రయత్నేనాభివర్ధయేత్ ॥
నిచయాన్ వర్ధయేత్ సర్వాం స్తథా మంత్రాలయాయుధాన్॥

— వ్యా.భా. శాంతి. 86-12

రా జగువాఁడు భాండాగారములు సర్వాయుధసంపన్నము లయిన యాయుధా గారములను ప్రయత్నపూర్వకముగ రక్షింపవలయును.

## భాండాగారములు

ఇంద్రప్రస్థము నందు ధర్మజుని భాండాగారములు సకలసంపత్సమృద్ధములై యున్నట్లు వర్ణింపఁబడినది.

" .... .... అపరిమిత పరార్థ్యరత్నరజితసువర్ణపరిపూర్ణంబయి మహామేరు శైలంబు సన్నిహితం బైన యట్లు, యక్షేశ్వరు నక్షయనిధులు ప్రత్యక్షం బైన యట్లు భాండాగారంబు సమృద్ధం బైనయది .... .... కావున రాజసూయాధ్వరం బెడ సేయక చేయు" మని యాప్తమంత్రులు యుధిష్ఠిరుని ప్రోత్సహించిరి.

నన్నయ. భార. సభా. 1. 273

ధర్మరాజు రాజసూయంబు సేయ నుపక్రమింపఁగా తన్నిర్వహణార్థము శిల్పివరులు,

' హరిప్రస్థంబు చుట్టు నపారభూరిబహువిధాగారములు' నిర్మించిరి.

— నన్నయ. భార. సభా. 1. 282,283

శిల్పులు నిర్మించిన బహువిధాగారములలో భాండాగారములును గలవు.

ధనసంరక్షణార్థము నిర్మింపఁబడు భాండాగారములను స్థపతివర్యుఁడు శాస్త్ర సమ్మతముగా నిర్మింపవలయును.

ధనసంరక్షణీశాలా భాండాగార మితీరితా ।
తాం శాలాం స్థపతిశ్రేష్ఠః స్థాపయే ల్లక్షణాన్వితమ్ ॥

— విశ్వకర్మవాస్తుశాస్త్రము. అ 18-12,13

ధర్మజుఁడు, "హిరణ్మయ జతరత్న దక్షిణాదానవిషయంబు లందు కృపాచార్యుని, .... .... నానా దేశాగతులయిన రాజులు దెచ్చి యిచ్చిన యుపాయనంబులు గైకొన దుర్యోధనుని .... .... నియోగించినాడు.[1]

"నన్ను రత్నపరిగ్రహణంబు నందుఁ
బాండవుండు నియోగించెఁ బార్థివేంద్ర
సర్వరత్నాకరైకప్రశస్తరత్న
పుంజముల కాస్పదము ధర్మపుత్రుగృహము."

— అని దుర్యోధనుఁడు జనకునితోఁ జెప్పికొనినాఁడు.[2]

తరువాత మాయాదురోదరమున ధర్మజు నోడించి యాతనిసమస్తైశ్వర్యములు వడసి సంతసించినాడు.

"యుధిష్ఠిరుండు బద్ధమత్సరుం డయి పెఱిఁగి [యొండొంట] యొడ్డుచు నిష్క సహస్రభరితానేకాయుతకుండమండితంబు లయిన భాండాగారంబులును, వజ్రవైడూర్య మరకత మౌక్తిక నీల ప్రవాళ పద్మరాగాది వివిధశుద్ధవిపులరత్నపరిపూర్ణంబు లైన రత్నభాండాగారంబులుం బ్రత్యేకంబ పంచద్రోణకాంచనసంచితంబు లయిన చతుశ్శత నిధులును .... .... నొక్కొక్క యొడ్డునన యొడ్డి" యోటువడినాఁడు.[3]

## ఆయుధాగారములు

'ఆయుధాగార ధనాధ్యక్షముల యందు .... ....
.... .... పరమవిశ్వాసుల దక్షులఁ బంచితయ్య ?'

— అని నారదుఁడు ధర్మరాజును ప్రశ్నించినాఁడు.

—నన్నయ. భార. సభా. 1. 47 *

1. నన్నయ. భార. సభా. 1-286
2. ,, 2.108
3. ,, 2-177

* చూడు :- వ్యా.భా. సభా. 5-37

"కచ్చిత్ కోశశ్చ కోష్ఠం చ వాహనం ద్వార మాయుధమ్।
ఆయశ్చ కృతకల్యాణై స్తవ భక్తై రనుష్ఠితః॥"

నిత్యము నాయుధములను దర్శించుచుండుట వలన రాజులకు దైవానుగ్రహమును, నాయురారోగ్యాభివృద్ధులును గలుగును. కావున భూపతి యాయుధాగారమును నిజప్రాసాదమధ్యము నందుఁ గాని, న్యాయశాలాసమీపమునఁ గాని నిర్మించుకొనవలయు నని శిల్పశాస్త్రములు చెప్పుచున్నవి.[1]

ఇంద్రప్రస్థము నం దాయుధాగార మంతఃపురము నందే యున్నది.

ద్రౌపదీసహితుఁడై ధర్మరా జాయుధాగారము నందున్నఁ గార్ముకంబు
బుచ్చికొనఁగఁ దనకుఁ బోలమి యెఱిఁగియు
విప్రునా ర్తరవము వినఁగ నోప
కర్జునుండు నిజశరాసనగ్రహణార్థ
మాయుధాలయమున కరిగె నపుడు.

—నన్నయ. భార, ఆది 8-118

వారణావతమున పాండవు లుండుటకు పురోచనశిల్పాచార్యుఁడు నిర్మించిన చతుశ్శాలకు సమీపముననే శస్త్రాగార మున్నది.

| | |
|---|---|
| ఆయుధాగారము | [నన్నయ. ఆది, 6-160; 8-118] |
| ఆయుధశాల | [నన్నయ. ఆది. 6-140] |
| ఆయుధాలయము | [ ,, ,, 8-118] |
| శస్త్రాగారము | [ ,, ,, 6-151] |
| శస్త్రవేశ్మము | [ ,, ,, 6-168] |

.... అను నవి పర్యాయపదములు.

రాజనివేశనము నం దాయుధాగార మొకభాగము,

1. చూడు :- విశ్వకర్మవాస్తుశాస్త్రము. అ. 20.

—)o(—

# హస్త్యశ్వరథశాలలు

కశ్చిత్ సూత్రాణి సర్వాణి గృహ్ణాసి భరతర్షభ ।
హస్తిసూత్రాణ్యశ్వసూత్రాణి రథసూత్రాణి వా విభో॥

—వ్యా. భా. సభా. 5-121

హస్తిసూత్రములను, అశ్వసూత్రములను, రథసూత్రములను పాటించి వానిని పరీక్షించుచుంటివా యని నారదుఁడు ధర్మరాజు నడిగినాఁడు.

హస్తిసూత్రము లనఁగా గజముల శుభాశుభలక్షణములు, గజశాలానిర్మాణ పద్ధతులు తెలుపు శాస్త్రము. అశ్వసూత్రములనఁగా తురంగముల శుభాశుభలక్షణములు, అశ్వశాలానిర్మాణ పద్ధతులు తెలుపుశాస్త్రము. రథసూత్రము లనఁగా వివిధ రథముల లక్షణములు తన్నిర్మాణోపయుక్తములగు మానాదులు తెలుపుశాస్త్రము.

రథశాలలు, హస్తిశాలలు వైవస్వతభాగమునను, వాజిశాల లంతఃపురమునకు దక్షిణదిగ్భాగమునను నిర్మింపవలె నని శిల్పశాస్త్రములు చెప్పుచున్నవి.

కార్యా వైవస్వతే శాలా రథానాం దంతినాం తథా।
భవంతికుర్యాత్ స్థపతి స్తథా వాజినివేశనమ్।
అంతఃపురప్రదేశస్య కార్యం దక్షిణతశ్చ తత్॥

—సమరాంగణసూత్రధారః ।
అ. 15.23; అ 33-17,18

రాజులు, రాజపుత్రులు ప్రాతఃకాలమున పంచమంగళాది - భద్రగజములను, పంచభద్రాదిహయములను చూచుచుండుటవలన వారికి జయము గలుగును. అట్లే రాజ్యవిస్తరణహేతువులయిన రథచక్రధ్వనులు వినుట శ్రేయస్కరము.

పాండుపుత్రులు బాల్యముననుండియు వివిధమంగళవాద్యములతో మత్తవారణ ఘీంకారములతో హయహేషలతో రథచక్ర ధ్వనులతో నిదుర మేల్కాంచుచుండువారు.

శంఖదుందుభినిర్ఘోషై ర్మృదంగై ర్వేణునిస్వనైః।
పాండవాః సమబోధ్యంత బాల్యాత్ప్రభృతి కేశవః॥
యే స్మ వారణశబ్దేన హయానాం ప్రేషితేన చ
రథనేమినినాదైశ్చ వ్యబోధ్యంత తదా గృహే....॥
ప్రాసాదాగ్రేష్వబోధ్యంత రాంకవాజినశాయినః॥

—వ్యా.భా. ఉద్యోగ. 89-11,13,14

అంతఃపురకాంతలును నిత్యము రథచక్రధ్వనులు వినుచుందురు. ఋతుపర్ణుడు బాహుక (నల) చోదితంబైన రథం బెక్కి కుండిననగరము ప్రవేశించినంతనే,

'దమయంతి యా రథధ్వని విని యిది నలు
రథఘోష యని యనురాగ మొంది

నలు నిషధేశుఁ బుణ్యశ్లోకు లోకోప
కారకుఁ జూడంగఁ గాంతు నేఁడు'

— అనిసంతసించినది. [నన్నయ. భార. ఆరణ్య- 2-183]

రథధ్వానములు రథనిర్మాణ కళాకౌశలమును బట్టియు, రథచోదకుని నైపుణ్యమును బట్టియు, రథగమనవేగమును బట్టియు ననేకవిధములుగా నుండును.

ఘన ధ్వనివోలె గంభీరములయిన యీ రథధ్వానము లామెకు సుపరిచితములే.

ఆ రథ ఘోషవిని రాజప్రాసాదము పయినున్న నెమళ్ళు, గజశాలల యందలి గజములు, హయశాలల యందలి గుఱ్ఱములు అది మేఘగర్జన మనుకొని యుత్సుకతతో పయికిఁ జూచినవి.

నాదయన్ రథఘోషేణ సర్వాః స విదిశో దిశః।
దమయంతీ తు శుశ్రావ రథఘోషం నలస్య తమ్॥

ప్రాసాదస్థాశ్చ శిఖినః శాలాస్థాశ్చైవ వారణాః।
హయాశ్చ శుశ్రువుస్తస్య రథఘోషం మహీపతేః॥

తచ్ఛ్రుత్వా రథనిర్ఘోషం వారణాః శిఖిన స్తథా।
ప్రణేదురున్ముఖా రాజన్ మేఘనాద ఇవోత్సుకాః॥

— వ్యా.భా. వన. 73. 2-7

నలుని చూడవలె నను కుతూహలముతో దమయంతి మేడపై కెక్కినది.

ఆరురోహ మహద్వేశ్మ పుణ్యశ్లోక దిదృక్షయా॥

వ్యా.భా. వన. 73-16.

ఈ వర్ణనములనుబట్టి గజశాలలు, హయశాలలు, రథశాలలు రాజాంతఃపురములకు సమీపముననుండెడివని తెలియుచున్నది.

మహాభారతకాలమున రాజనివేశనములు మూఁడు కక్ష్యలుగా నుండెడివి. తోరణద్వారములు గలది ప్రథమకక్ష్య. అంతఃపురము తృతీయకక్ష్య. హస్త్యశ్వ రథశాల లుండునది మధ్యమకక్ష్య.

## ఏనుంగుమొగసాల

హస్తినాపురమునకు వచ్చిన కృష్ణుఁడు, "మణితోరణసుందరంబగు రాజమందిరద్వారంబు ప్రవేశించి, కక్ష్యాంతరములు గడచి యేనుంగు మొగసాలఁ[1] జొచ్చి యరదంబు దిగినాఁడు."

— తిక్కన. భార. ఉద్యోగ. 3.176. *

త్రిస్రః కక్ష్యా వ్యతిక్రమ్య కేశవో రాజవేశ్మనః।
వైచిత్రవీర్యం రాజాన మభ్యగచ్ఛ దరిందమః॥

— వ్యా.భా. ఉద్యోగ. 88-12 **

1. పాఠాంతరము = అనుంగుమొగసాల, (సూ.ని)
అనుంగుమొగసాల = రాజమందిరప్రధానద్వారమునకుఁజేరియుండు శాల (సూ.ని.)
ఏనుంగుమొగసాల = యామకుంజరము లుండెడు ముఖశాల, మొదటి మొగశాల. (సూ.ని.)

* పోల్చు : తిక్కన. భార. శాంతి. 1–360
"అతండేనుంగుమొగసాల నరదంబు డిగ్గి ..."

** పోల్చు : వ్యా.భా. శాంతి. 326–31→

## అశ్వశాల

తతః పరీక్షా మశ్వానాం చక్రే రాజన్ స బాహుకః।
అశ్వశాలా ముపాగమ్య భాంగాసురి నృపాజ్ఞయా॥

—వ్యా.భా. వన. 71-11

దామగ్రంథి గా మాఱువేసమున నున్న నకులుని జూచి విరాటరాజు,

"…. …. అశ్వములన్ బరికించి యున్కి యిం
పేనిఁ దురంగశాలలకు నెల్లను ముఖ్యుఁడవై ….''

యుండు మని యాదేశించినాఁడు.

[తిక్కన. విరాట. 1-272]

## రథశాల

మేడ పై కెక్కిన దమయంతి రథారూఢుఁడై మధ్యమకక్ష్య ప్రవేశించు ఋతుపర్ణుని జూచినది.

తతో మధ్యమ కక్షాయాం దదర్శ రథమాస్థితమ్
ఋతుపర్ణం మహీపాలం …. …. ॥

—వ్యా.భా.వన. 73_17

ఋతుపర్ణుని కుండిననగరంబునకుఁ గొనివచ్చిన 'బాహుకుండును రథశాల రథాశ్వంబుల బంధించి రథసమీపంబున విశ్రమించి యుండె.'

—నన్నయ. భార. అరణ్య. 2-186

బాహుకో రథమాదాయ రథశాలా ముపాగమత్॥

—వ్యా.భా. వన. 72-31

అగ్నిశాలల వలె రథశాలలును పవిత్రమైనవే. అగ్నిహోత్రాయతనములం దగ్ని వెలుఁగకుండుటయు, రథశాలలు దగ్ధమగుటయు, రథధ్వజములు ధ్వంస మగుటయు నశుభసూచకములు.

"ప్రావేశయం తతః కక్ష్యాం తృతీయాంత్ రాజవేశ్మని."

పాండవులు పరిత్యక్తవిభవులయి నిజాయుధంబులు ధరించి వెలువడు నపుడు కలిగిన యుపద్రవములలో దుర్యోధనుని రథశాలలకు నిప్పంటుకొనుట యొకటి.

అగ్నిహోత్రాణి సాయాహ్నే న చాహూయన్త సర్వశః।
.... .... .... .... .... .... .... ....
తథైవ రథశాలాసు ప్రాదురాసీ ద్ధుతాశనః।
ధ్వజాశ్చ వ్యవశీర్యంత భరతానా మభూతయే॥

—వ్యా.భా. సభా. 81. 22-24

నన్నయ గాని తిక్కనగాని రథశాలాప్రాధాన్యమును తెలుపలేదు.

—) ०ం० (—

# గోపురములు : ద్వారతోరణములు

దేవాలయానాం భూనేతృభవనానాం పురా మపి
గ్రామాణా మపి దుర్గాణాం శాలానా మపి సద్మనామ్ ।
ముఖద్వారేషు కర్తవ్యం గోపురం శిల్పిభిః క్రమాత్ ॥

— విశ్వకర్మ వాస్తుశాస్త్రము. అ 28.1,2

పురదుర్గములకు, గ్రామములకు, దేవాలయములకు, రాజభవనములకు, శాలాగృహములకు, గృహములకు, ముఖద్వారములందు శిల్పులు గోపురములు నిర్మింపవలయును.

గోపుర మనఁగా తోరణాద్యనేకశిల్పకళాలంకృతమయిన ద్వారము. దీనిని భల్లాటపదము నం దుంపవలయును.

తోరణ శబ్దమునకు నిఘంటువు లిచ్చిన యర్థము లివి :—
**తో**రణ(ము) :- 1. బహిర్ద్వారము, వెలుపలి గుమ్మము.

2. మంగళార్థముగా గుమ్మములకుఁ గట్టెడు మామిడాకుఁ లోనగు వాని దండ; రాజమార్గాదులం దలంకారార్థము కట్టు పత్ర పుష్పాదుల దండ.

[సూర్యరాయాంధ్ర నిఘంటువు]

తోరణః, తోరణమ్॥ 1. An arched doorway, a portal
2. An outer door or gate-way;
3. Any temporary and ornamental arch.

— V.S. Apte = The Students Sanscrit - English Dictionary

శిల్పశాస్త్రము నందు తోరణ మనఁగా గోడల చివర శోభార్థము శిలాదారు సుధాదులతో శిల్పుల చేతఁ జేయఁబడు చిత్రరచనము.

ఇది దైవతోరణము, రాజతోరణము, మానుషతోరణము నని త్రివిధము.

తోరణం త్రివిధం కార్యం శిలాదారుసుధాదిభిః।
దైవం భౌపం మానుషం చ తక్షణాది ప్రమాణతః॥

—విశ్వకర్మవాస్తు శాస్త్రము. అ. 26-1

ఈ తోరణములపై చూతపత్రరూపమునఁ గాని, మయూరశుకహంసాది పక్షి రూపమునఁ గాని, లతాకుసుమాది రూపమునఁ గాని, నయనానందకరమైన రేఖా రూప మునఁ గాని, శిల్పకల్పనములు చేయవచ్చును. ఇట్టి మనోహరాకృతులను శిల్పులు టంకముల (ఉలుల) తోను తదితరశిల్పసాధనములతోను ద్వారాదులపై చెక్కుదురు, సుధాదిద్రవ్యములపై చిత్రింతురు.[1]

హస్తినాపురము నందలి ప్రాసాదద్వారములు తోరణములతో నలంకరింపఁ బడియున్నవి.

ద్వారతోరణనిర్వ్యూహై ర్యుక్తమభ్రచయోపమమ్।
ప్రాసాదశతసంబాధం మహేంద్రపురసన్నిభమ్॥

— వ్యా.భా.ఆది. 109.6

1. చూడు :- విశ్వకర్మవాస్తుశాస్త్రమ్. అనంతకృష్ణభట్టారక వ్యాఖ్యానము.

అలకాపురియు ద్వారతోరణములతో నలరారుచున్నది.

ద్వారతోరణ నిర్వ్యూహధ్వజసంబాధశోభితా॥

—వ్యా.భా.వన. 160-37

ద్వారకానగరము ద్వారతోరణమండితమే.

పురీ సమంతాద్ విహితా స పతాకా స తోరణా॥

—వ్యా.భా.వన. 15.5

హస్తినాపురమునకు విచ్చేసిన కృష్ణుఁడు,

'మణితోరణసుందరంబగు రాజమందిర ద్వారంబు' ప్రవేశించినాఁడు.

—తిక్కన. భార. ఉద్యోగ. 3-176

గిరివ్రజమునందును రాజగృహమునకు ద్వారతోరణములు గలవు.

జరాసంధుని భార్యల కిరువురకు నుదయించిన మనుజశకలములను దాసులు. 'రాజగృహద్వారతోరణ సమీపంబునఁ' జదుకంబు నొద్ద నొక్కచోట వైచి పోయిరి.

—నన్నయ. భార. సభా. 1-14

భీమసేనుఁడు జరాసంధుఁ జంపి వాని వధియించుట జగద్విదితంబుగాఁ దదీయ గృహద్వారతోరణ సమీపంబునం దత్కళేబరంబు వైచెను.

—నన్నయ. భార. సభా. 1-214

ప్రాసాదద్వారములేకాక రంగమంటపద్వారములును తోరణములతో నలంకరింపఁబడుచుండెడివి.

ద్రౌపదీస్వయంవరరంగము, 'విశాలద్వారతోరణముల'తో నలంకరింపఁబడినది

—నన్నయ. భార. ఆది. 7-187 *

* వ్యా భా. ఆది. 185.17

ప్రాకారపరిఖోపేతో ద్వారతోరణమండితః।

వితానేన విచిత్రేణ సర్వతః సమలంకృతః।

# రాజమార్గములు

విశాలాన్ రాజమార్గాంశ్చ కారయీత నరాధిప ।
ప్రపాశ్చ విపణాంశ్చైవ యథోద్దేశం సమాదిశేత్ ॥

వ్యా.భా. శాంతి. 69. 53.

రాజధానీనగరము లందు విశాలము లయిన రాజమార్గములను నిర్మింపవలయు నని భీష్ముఁడు ధర్మరాజునకుఁ దెలిపినాఁడు.

రాజమార్గ మనఁగా పురగోపురము నుండి రాజమందిరము వఱకు పోవు మార్గము. తక్కిన వీథులు దాని ననుసరించియుండును.

నగరవాస్తు వనేకవిధములుగా నుండును గనుక శిల్పులు రాజమార్గములను తత్తన్నగరరచనాప్రణాళికల కనుగుణముగా నిర్మింపవలయును.[1]

పురవీథులు తూర్పునుండి పడమరకు, ఉత్తరము నుండి దక్షిణమునకు పోవు చున్నట్లు నిర్మింపవలయు ననియు, వాని విస్తారము మూఁడు నుండి పండ్రెండు దండముల వఱకు నుండవచ్చు ననియు వాస్తుశాస్త్రములు సూచించుచున్నవి.[2] దండ మనఁగా 4 హస్తములు. కావున వీథుల వెడల్పు 12 నుండి 48 హస్తముల వఱకు నుండవచ్చును.

ఈ శిల్ప సంప్రదాయ మత్యంతప్రాచీనమయినది. సింధులోయలో బయల్పడిన మొహంజొదారో-హరప్పా నగరముల యందలి వీథులు విశాలములై తూర్పు-పడమరలుగా ఉత్తర-దక్షిణములుగా పోవుచు నగరము ననేకభాగములుగా (పేటలుగా గృహసముదాయములుగా) విభజించుచున్న వనియు నీ విధమయిన నగరరచనా ప్రణాళికయు వీథ్యుపవీథీనిర్మాణపద్ధతియు తత్కాలీననాగరకతాప్రపంచమునం దద్వితీయ మనియు పురాతత్త్వవిదులు భావించుచున్నారు.[3]

---

1. చూడు :- వ్యాస: భాగ. దశమ 51-51. ద్వారకాపురవర్ణనము.
   రథ్యాపథప్రవీథీభి ర్యథా వాస్తువినిర్మితమ్ ॥
2. చూడు :- మానసారవాస్తుశాస్త్రము. గ్రామ-నగర లక్షణములు.
   Cf :- G.K. Pillai = The Way of the Silpis. P. 196.
3. Cf :- Arun Bhattacharya : History of Ancient India P. 59
   V.S Agarwala writes of streets :- →

మహాభారతము నందు వర్ణింపఁబడిన పురము లన్నియు విశాలమైన వీథులతో చక్కఁగా విభజింపఁబడియున్నవి.

ఇంద్రప్రస్థము నందలి వీథులు విశాలములై చక్కఁగా విభజింపఁబడియుండుట చే నచట ప్రమాదభీతి లే దని వ్యాసభారతమునందు వర్ణింపఁబడినది.

సువిభ క్తమహారథ్యం దేవతాబాధవర్జితమ్ ॥

— వ్యా.భా. ఆది 207. 35.

రథ్య యనఁగా రథములు పోవు మార్గము; రాజమార్గము. (పెద్దమార్గము.)

హస్తినాపురము నందలి రాజమార్గములు సువిశాలములై నగరముల వంటి పెద్దపెద్ద రథములు పోవుటకు వీలుగా నున్నవి.

కౌరవపాండవులు 'ఉదకక్రీడనము' నకు నగరాకారము గల రథము లెక్కి పోయిరి.

తే రథై ర్నగాకారై ర్దేశజైశ్చ గజోత్తమైః ।
నిర్యయు ర్నగరాచ్ఛూరాః కౌరవాః పాండవైః సహ ॥

వ్యా.భా. ఆది 128-37,38

మఱియొకచోట, కృష్ణుఁడు, 'ప్రియంబునఁగట్టాయుతంబైన తేరెక్కి భేరీశంఖ చామరప్రముఖభద్రచిహ్నంబులతో వెడలి గరుడధ్వజంబు గ్రాలఁ గృతవర్మసాత్యకు లొక్కరథంబునను దుర్యోధనాది చతుష్టయం బొక్క రథంబునను బార్శ్వంబులరాఁ బౌరులకుఁ గన్నుల పండు వగుచు రాజమందిరద్వారము సేరె' నట్లు వర్ణింపఁబడినది.

— తిక్కన. ఉద్యోగ. 3-247

దీనిని బట్టి హస్తినాపురవీథులు ఒకే పర్యాయము మూఁడురథములు ఒకదాని ప్రక్క నొకటి పోవుటకు వీలయినంత వెడల్పు గలిగి యున్నవని తెలియుచున్నది.

"The town was divided by broad streets" into a grid system of which the regularity is amazing and found nowhere else in the ancient world. For example, at Ur where the streets were widening like village lanes. The streets of Indus Valley cut at right angles running East-West and North-South dividing the city into blocks"

హస్తినాపురము నందలి రాజమార్గములు రత్నసమాచితములు.

కృష్ణసంమాననార్థం చ నగరం సమలంకృతమ్ ।
బభూవ రాజమార్గశ్చ బహురత్నసమాచితః ॥

— వ్యా.భా. ఉద్యోగ. 88.6.

రాజమార్గమున కిరుప్రక్కల రమ్యహర్మ్యము లుండెడివి.

కృష్ణుఁడు వృకస్థలము నుండి హస్తినపురంబు సొచ్చి "రాజమార్గంబున నరుగునవసరంబున మౌక్తికమిళితంబులు బహుగంధమిళితంబులు నగు నక్షత్ర ప్రకరంబులును బుష్పనికరంబులునుం జల్లుచు సంతసిల్లుచు మ్రొక్కుచుఁ జొక్కుచు నిరుకెలంకుల రమ్యహర్మ్యంబులపై నిలిచి పొలిచిరి."

— తిక్కన. ఉద్యోగ. 3-174.

మిథిలానగరము రాజమార్గములతో చక్కగా విభజింపఁబడినది. దాని కిరు ప్రక్కల పెక్కు పణ్యస్థానము లున్నవి.

పణ్యైశ్చ బహుభిర్యుక్తాం సువిభక్త మహాపథామ్ ॥

— వ్యా.భా.వన. 207 8

ప్రాచీనకాలమున నగరములకు సాధారణముగా నాలుగు పురద్వారము లుండెడివి. ఆ గోపురముల ననుసరించియే పురవీథు లుండును. ఈ మార్గములు కలియు చోట్ల చతుష్పథము లేర్పడి పురమును చక్కగా విభజించును. చతుష్పథమునకు చత్వరము, శృంగాటకము అనునవి పర్యాయములు.

ద్వారకానగరము ఎనిమిది మార్గములు, పదునారు చత్వరములు గలిగి యున్నట్లు వర్ణింపఁబడినది.

అష్టమార్గాం మహాకక్ష్యాం మహాషోడశచత్వరామ్ ॥

— వ్యా.భా. సభా.

రాజమార్గములందు దుమ్ము లేవకుండ నీరుచల్లుచుండిరి.

జలావసిక్తో విరజాః పంథాస్తస్యేతి చాన్వశాత్ ॥

— వ్యా.భా. ఉద్యోగ. 86-18

సంపృష్టసంసిక్తరజః ప్రతిపేదే మహాపథమ్ ॥

— వ్యా.భా. ఉద్యోగ. 93-20

ఈ వర్ణనములను బట్టి మహాభారతకాలమునందు రాజధానీనగరములు విశాల మయిన రాజమార్గములతో రథ్యోపరథ్యలతో చతుష్పథములతో రమ్యహర్మ్యములతో విపణివీథులతో నొప్పుచుండెడి వని తెలియుచున్నది.

## సభాభవనములు

సభ్య సభాం మే పాహి యే చ సభ్యాః సభాసదాః ।

— అథర్వ. 19-55-6

ఓ అగ్నీ! సభయందు ప్రతిష్ఠితుడ వయిన నీవు మమ్ము రక్షింపుము. సభా సదులీ సభకు రక్షకు లగుదురు గాక !

భారతీయస్థాపత్యము నందు సభాభవన నిర్మాణమత్యంతప్రాచీన మయినది. అది ప్రధానముగా స్తంభములతో నిర్మింపఁబడు శాలాభవనము. సభావాస్తువైశిష్ట్యమును తెలుపునది స్తంభ బాహుల్యమే.[1]

ఋగ్వేదము నందు సహస్ర స్తంభసభాభవనము పేర్కొనఁబడినది.

రాజానావనభిద్రుహా ధ్రువే
సదస్యుత్తమే సహస్రస్థూణ ఆసాతే ॥

— ఋగ్వేద. 2.41-5

1. Cf: D. N. Sukla : Silpa Sastra – Hindu Achievements in Aeronautics and Fine Arts. ch. II. P 15
"Sabha as a building is an ancient instution. There are many references in owe Sacred lore (A. V. XIX 55-6; Tait Sam II. 4; 8; 6. ; Thai Bra. 1.1. 10 3. Chanda Upanishad VIII. 14) Their special features in the vedic times were their pillars and fire alfars.
It is a pillared hall architecture ... ... ... ..."

విశ్వకర్మవాస్తుశాస్త్రము నందు మూఁడు విధము లయినసభాభవనములు పేర్కొనఁబడినవి.

108 గ్రామముల కార్యస్థానము సాధారణసభ, ఇందుగ్రామదేవతావిగ్రహము సభావేదిక నలంకరించును,

108 పురముల కార్యశాల ముఖ్యసభ ఇందు వేదికపై ప్రభువిగ్రహ ముండును'

రాజధానీ నగరము నందుండునది ప్రధానసభ, ఇందు రాజే స్వయముగా సింహాసనము నధిష్ఠించును. ఈ సభాభవనము నందు మంత్రులు సామంతులు తక్కంగల రాజపరివారము నాసీను లగుటకు తగిన యాసనము లుండవలయును. భవనమున కిరు ప్రక్కల శాలోపశాల లుండవలయును.

శిల్పాచార్యు లీ సభాభవనమును ఉన్నతమైన పీఠము పయి పెక్కు స్తంభములతో విమానరచనోపేతముగా నిర్మించి వివిధదేవతాచిత్రములతో నలంకరింప వలయు ననియు, ముందు తోరణాలంకృత మయినపూర్వభవనమును నిర్మింప వలయు ననియు విశ్వకర్మ నిర్దేశించినాఁడు.

సభాభవనమునకు స్తంభములు 48 గాని, 32 గాని, 24 గాని యుండవచ్చును.

మహాధిష్ఠానసంయుక్తాం త్రిశ్యంతోపానవేదికామ్ ।
దేవతాసనసమోపేత స్తంభకూటవిరాజితామ్ ॥
విమానరచనోపేతాం కుర్యాచ్ఛిల్పవిశారదః ।
.... .... .... .... ....
పూర్వభద్రసమాయుక్తం ముఖతోరణమండితమ్ ।
.... .... ....
కారయేచ్ఛిల్పశాస్త్రజ్ఞః .... .... .... .... ॥

— విశ్వకర్మవాస్తుశాస్త్రము.† అ 16,17.

† Cf :- Viswakarma Vastu Sastra. ed. K. Vasudeva Sastri
"The basement shall be as grand as possible and the step's leading dais about 32 in number. The dais and→

వైదికయుగము నందు సభాభవనములు రాజాస్థానమంటపములుగా, న్యాయ శాలలుగా, జూదగృహములుగా, నానావిధకార్యకలాపముల పట్టులుగా నుండెడివి. *

మహాభారతము నందు ఇంద్ర యమ వరుణ కుబేర బ్రహ్మాది దేవసభల వర్ణనము. హస్తినాపురము నందలి ధృతరాష్ట్రసభాభవననిర్మాణాది వర్ణనములు గలవు.

వీని నన్నింటిని పరిశీలించినచో మహాభారతకాలమునాటి సభావాస్తుకళా వైశిష్ట్యము తెలియగలదు.

---

the hall shall have ornamented pillars so arranged as to enhanee the grandeur and solemnity of the Court of Justice. The building shall have a Canopy and the arrangements of pillars may be in one of the forms consisting 48, 32, or 24 as detailed in the text. — --- ---- The frontage of the Court house must have an orna mented arcn (a Torana)"

* Cf:- D. N. Sukla : Silpa Sastra = Hindu Achievements in Aeronautics and Fine Arts.

" Dr. P. K. Acharya writes :-

There must have been suitable structural arrange ments for the transaction of Judicial, Commercial and Political business and for the reception of courthy, well—born wealthy persons and kings and for the performance of gambling, merriment, social intercourse, debates and contests."

)o(

# ఇంద్రసభ

శతమఖునభ శుభరత్నాం
చితకాంచనరచిత మతివిచిత్రము లోక
త్రితయాఖిల లక్ష్మీ సం
శ్రిత మలవియె దానిఁ బొగడ శేషున కయినన్.

అదియును నూఱుయోజనంబుల వెడల్పును, నూటయేఁబదియోజనంబుల పొడవును, నైదు యోజనంబుల తనర్పును, గలిగి వైహాయసం బయి కామ గమనం బయి వ్యపేతశీతాతపంబయి సకలకాలకుసుమఫలభరితపాదపవనసం కీర్ణ సరోవరవిరాజితంబయి తపఃప్రభావంబున నమరేంద్రునేత నిర్మితంబయి కడుం బొప్పుచుండు.

—నన్నయ. భార. సభా. 1.62,63.

ఇంద్రసభ రత్నకాంచితరచితమై యతివిచిత్రముగ నుండును.దానిపేరు పుష్కరమాలిని.

ఏషా సభా మయా రాజన్ దృష్ట్వా పుష్కరమాలినీ ॥

— వ్యా.భా. సభా. 7.26.

సభాభవనము పొడవు 150 యోజనములు, వెడల్పు 100 యోజనములు ఎత్తు, 5 యోజనములు. అది దీర్ఘచతురస్రాకృతి గలిగియున్నది. ఆకాశమునందుండును. కాని కామగమనము గలది. యజమానుఁడు కోరినచోటికి పోఁగలదు.

విస్తీర్ణాయోజనశతంశతమధ్యర్ధమాయతా ।
వైహాయసీకామగమాపంచయోజనముచ్ఛ్రితా ॥

— వ్యా.భా. సభా. 7.2.

ఇంద్రసభ 'వ్యపేతశీతాతపంబయి' యుండు నని నన్నయ వ్రాసినాఁడు. మూలము నందు సభాభవనము జరాశోకక్లమాదులు లేని దనియు, వేశ్మములు, ఆసనములుగల దనియు, శుభప్రద మయిన దనియు, మనోహర మయిన దనియు వర్ణింపఁ బడినది.

జరాశోకక్లమాపేతా నిరాతంకా శివా శుభా ।
వేశ్మాసనవతీ రమ్యా దివ్యపాదపశోభితా ॥

వ్యా.భా. సభా. 7.3.

అది 'తపః ప్రభావంబున నమరేంద్రు చేత నిర్మితంబయి కరం బొప్పుచుండు' నని నన్నయ వ్రాసినాఁడు.

మూలము నం దిట్లున్నది.

శక్రస్య తు సభా దివ్యా భాస్వరా కర్మభిర్జితా ।
స్వయం శక్రేణ కౌరవ్య నిర్మితార్కసమప్రభా ॥

— వ్యా.భా. సభా. 7.1.

సూర్యసమప్రభలతో కాంతిమంత మయిన దివ్యసభను తన పుణ్యకర్మలఫల ముగా మహేంద్రుఁడే స్వయముగా నిర్మించికొని నాఁ డని వర్ణింపఁ బడినది.

నూఱుయజ్ఞములు చేసిన వానికి దేవేంద్రపదవి లభించును. ఆ పుణ్యకర్మల ఫలముగా నింద్రసభయు లభ్యమగును. మఱి 'స్వయంశక్రేణనిర్మితా' అను మాట కర్థమేమి ?

ఇంద్రుఁడు శిల్పియే కాని శిల్పాచార్యులయిన త్వష్టయు, విశ్వకర్మయు తన్నుఁ గొలుచుచుండగా నీ సభాభవనమును తాను స్వయముగా నిర్మించికొను నవసరములేదు. కనుక 'పుష్కరమాలిని' యను నీ సభాభవనము తన పర్యవేక్షణములో విశ్వకర్మాదుల చేత నిర్మింపఁబడినదని చెప్పుకొనవలయును.

ఇట కొందఱు విద్వాంసులు,

'శక్రస్య తు సభా దివ్యా భాస్వరా కర్మనిర్మితా ।'

— అను పాఠాంతరమును గ్రహించి 'కర్మన్' అనఁగా 'సుకర్మన్' యని యర్థము చెప్పినారు.[1] సుకర్మ యనఁగా విశ్వకర్మ.[2] కావున నీ సభ విశ్వకర్మ నిర్మిత మని చెప్పవచ్చును.

1. Cf :- C. Ramachari = Thakshan and Similar Artisans in Astadhyayi. P. 111.
2. Sukarman = N. of Viswakarman, (The architect of the gods) L. —Monier Williams, S, E, D P 1220.

అట్టి పుష్కరమాలినీ సభ యందు శతముఖుఁడు శచీసమేతుఁడయి కొలు వుండును.

అతులవిభూతితో మణిమయాభరణద్యుతు లొప్పఁగా శత
క్రతుఁడు శచీసమేతుఁడయి కాంచనచారువిమానమాలికా
గతదివిజోత్తముల్ గొలువఁగాఁ గొలువుండు వరాప్సరోంగనా
యతవిలసత్కటాక్షకుసుమార్చితసుందరవక్త్రచంద్రుఁడై

—నన్నయ. భార. సభా. 1.64

మూలమునం దిట్లున్నది.

తస్యాం దేవేశ్వరః పార్థ సభాయాం పరమాసనే ।
ఆస్తే శచ్యా మహేంద్రాణ్యా శ్రియా లక్ష్మ్యా చ భారత ।
బిభ్ర ద్వపురనిర్దేశ్యం కిరీటీ లోహితాంగదః ।
విరజోఽంబరశ్చిత్రమాల్యో హ్రీ కీర్తి ద్యుతిభిః సహ ॥
తస్యా ముపాసతే నిత్యం మహాత్మానం శతక్రతుమ్ ।
మరుతః సర్వతో రాజన్ సర్వే.చ గృహమేధినః ।
సిద్ధా దేవర్షయ శ్చైవ సాధ్యా దేవగణా స్తథా ॥

— వ్యా.భా. సభా. 7. 5-6

ఇంద్రసభ యందుండు పుణ్యాత్ములలో శిల్పాచార్యులయిన త్వష్టయు విశ్వకర్మ యు గలరు.

.... .... త్వష్టా చ విశ్వకర్మా చ తుంబురుః ।
అయోనిజాః యోనిజాశ్చ వాయుభక్షా హుతాశినః ॥
ఈశానం సర్వలోకస్య వజ్రిణం సముపాసతే ॥

— వ్యా.భా. సభా. 7. 12,13

నన్నయ శిల్పాచార్యుల విషయము చెప్పలేదు.

"మఱియు శుక్రబృహస్పతులు, నగ్నీషోములు, నాశ్వినులును విశ్వేదేవతలును ధాతయు విధాతయు హరిశ్చంద్రుం డను రాజర్షియు సురేంద్రుసభ నుండుదురు."

—నన్నయ. భార. సభా. 1–67

పూర్వము దేవేంద్రునకు విశ్వకర్మనిర్మిత మయిన సుధర్మ యను సభ యుండెడిది. ఇంద్రుఁడు దానిని కృష్ణున కొసఁగినాఁడు.

" .... .... అద్రిఘాతికి నా విశ్వకర్మ చేత
నధికతపమున నిర్మితమై సుధర్మ
యనఁగఁ బరఁగిన సభ నిర్జరాధినాథు
ననుమతంబున నస్మదీయాజ్ఞఁ జేసి
యనఘ కొనివచ్చి యిమ్ము నెయ్యమున నాకు"

——అనివాయుదేవుని ప్రార్థించి కృష్ణుఁడు దానిని ద్వారకాపురికిఁ దెప్పించికొని నట్లు ఉత్తరహరివంశమువలనఁ దెలియుచున్నది.

ఎఱ్ఱన- హరివంశము, ఉ.భా. అ 2-181

పద్మపురాణమునందుకూడ నిట్లే వర్ణింపఁబడియున్నది.

మథురాం త్యజ్య నగరీం ప్రవిష్టో ద్వారకాం పురీమ్ ।
ఇంద్రేణప్రేషితో వాయుః సభాం తత్ర దివౌకసామ్ ॥
కృష్ణాయ ప్రదదౌ ప్రీత్యాం నిర్మితాం విశ్వకర్మణా ।

—పద్మ. ఉత్తరఖండ. అ. 247

ఈ సుధర్మ యందు సువర్ణఖచితము లయిన సింహాసనము లున్నట్లు మహాభారతము నందే వర్ణింపఁబడినది.

అర్జునుఁడు సుభద్రను దోడుకొని పోయి నప్పుడు యాదవపుంగవు లా విషయము చర్చించుట కయి సుధర్మ యందుసమావిష్టు లయిరి.

తే సమాసాద్య సహితాః సుధర్మాభితః సభామ్। .... ....
తత్ర జాంబూనదాంగాని స్పర్ధ్యాస్తరణవంతి చ ॥
మణివిద్రుమచిత్రాణి జ్వలితాగ్ని ప్రభాణి చ।
భేజిరే పురుషవ్యాఘ్రా వృష్ణ్యంధకమహారథాః ॥
సింహాసనాని శతశో ధిష్ణ్యానీవ హుతాశనః ॥

—వ్యా.భా. ఆది. 220. 101-4

'సుధర్మ' ఒకయోజనము పొడవు–వెడల్పు గలిగి చతురస్రాకృతి గలిగి యుండును.

తస్మిన్ దేవపురప్రఖ్యే సా సభా వృష్ణ్యుపాశ్రయా ।
సుధర్మా ఇతి విఖ్యాతా యోజనాయతవిస్తృతా ॥

—వ్యా.భా. సభా– అ 24 - 23*

'సుధర్మ' విశ్వకర్మనిర్మితము. కావున పుష్కరమాలినియు విశ్వకర్మ నిర్మితమే కావచ్చును.

## యమసభాభవనము

ధర్ము సభ లోకధర్మా
ధర్మవివేకాస్పదంబు తైజసము లస
ద్భర్మమణితతుల దానిన్
నిర్మించెను విశ్వకర్మ నిపుణత మెఱయన్.

అది శతయోజనవిస్తారాయామరమణీయంబును. గామగామియును. సూర్య తేజోనిభశుభతేజంబును సర్వసుఖసంపాదనంబునయి చూడ నొప్పు చుండు.

—నన్నయ. భార. సభా. 1-68,69

ఈ వర్ణన మించుమించుగా మూలానుసరణమే. కాని విశ్వకర్మధర్మసభను బంగారముతోను మణులతోను నిర్మించినాఁ డని నన్నయ మూలాతిశాయిగా వర్ణించి నాఁడు.

వైవస్వతస్య యాం పార్థ విశ్వకర్మా చకార హ ।
తైజసీ సా సభా రాజన్ బభూవ శతయోజనా
విస్తారాయామసంపన్నా భూయసీ చాపి పాండవ
అర్కప్రకాశా భ్రాజిష్ణుః సర్వతః కామచారిణీ ॥

—వ్యా.భా. సభా. అ8 - 1,2,3
(సాతవలేకర్ సంశోధితప్రతి)

మూలము వలన మఱికొన్ని విశేషములు తెలియుచున్నవి.

1. విశ్వకర్మ దీర్ఘ కాలము తపస్సు చేసి యా తపశ్శక్తి చేత విశాలమును, మనోహరమును కామగమమును నైన యమసభాభవనమును నిర్మించినాఁడు.

అసంబాధా హి సా పార్థ రమ్యా కామగమా సభా ।
దీర్ఘకాలం తపస్తప్త్వా నిర్మితా విశ్వకర్మణా ॥
—వ్యా.భా. సభా. 8-31

2. సూర్యుని వలె ప్రకాశించుచుండు నీ సభాభవనముకామచారిణి యే కాక కామరూపిణియు.

అర్కప్రకాశా భ్రాజిష్ణుః సర్వతః కామరూపిణీ ॥ *

3. సభాభవనము పొడవు-వెడల్పులు నూఱు యోజనములు అంతకంటె కొంచెమెక్కువయే యుండవచ్చును. (భూయసీ) కాని విస్తారాయాములు సమానముగ నున్నవి కనుక అది చతురస్రాకారముగ నున్నది.

4. ఆ సభాభవనము ఎక్కువ చల్లఁదనముగాని, ఎక్కువవేడిమి గాని లేక సమశీతోష్ణస్థితి గలిగి మనస్సున కాహ్లాదము గలిగించు చుండును. (Air-Conditioned)

నైవాతిశీతా నాత్యుష్ణా మనసశ్చ ప్రహర్షిణీ ।

ఆ యమ సభలో దుఃఖము, వార్ధక్యము. ఆకలిదప్పులు, అప్రియము, దైన్యము, శ్రమ, ప్రాతికూల్యము – ఇత్యాది బాధలుండవు.

న శోకో న జరా తస్యాం క్షుత్పిపాసే న చాప్రియమ్ ।
న చ దైన్యం క్లమో వాఽపి ప్రతికూలం న చాప్యుత।

5. ఆ సభాభవనము నం దుండు వారి కోరికలు దివ్యములు గాని మానుషములు గాని అన్నియు తీరును. వలసిన భక్ష్యభోజ్యములు లభించును.

* చూడు :- వ్యా.భా. సభా. 8-3 (వావిళ్ళ ప్రతి. గోరఖ్‌పూరు ప్రతి)

శీతలజలము గాని, ఉష్ణోదకము గాని యేది కావలసిన వారి కది లభించును.
అచటి వృక్షములు నిత్యము కోరినఫలము లిచ్చుచుండును.

సర్వే కామాః స్థిత స్తస్యాం యే దివ్యా యే చ మానవాః ।
రసవచ్చ ప్రభూతం చ భక్ష్యభోజ్య మరిందమ ॥

పుణ్యగంధాః స్రజ స్తత్రనిత్యపుష్పఫలద్రుమాః ।
రసవంతి చ తోయాని శీతాన్యుష్ణాని చైవ హ ॥

కావుననే యది 'సర్వసుఖసంపాదనంబయి' యుండు ననినన్నయ చెప్పినాఁడు.

"అట్టి సభయందు .... .... మీ జనకుం డైన పాండుమహారాజును నాదిగా గల యనేకరాజఋషుల చేత ననవరతంబు సేవితుం డయి యమరాజు సమస్త జీవుల శుభాశుభకర్మంబు లారయుచుండు" నని నారదుఁడు ధర్మరాజుతో చెప్పినాఁడు.

—నన్నయ. భార. సభా. 1-69

# వరుణసభ

వరుణసభ సర్వలోకో
త్తర ముజ్జ్వల మణిమయము సితప్రభ మతిసుం
దర మందుండును వరుణుఁడు
వరుణానీసహితుఁ డై ధృవంబగు మహిమన్.

అది యమరాజసభ యంతియ విస్తారాయామరామణీయకంబును గామగా మిత్వంబును గలిగి విలసిల్లు ; జలస్తంభంబు సేసి జలంబులలో నుండి విశ్వకర్మ దాని రమణీయంబుగా రచియించె.

—నన్నయ. భార. సభా. 1-70,71

యమసభ. 'శతయోజనవిస్తారాయామరమణీయంబై చూడనొప్పుచుండు' నని చెప్పఁబడినది.[1] కావున వరుణసభయు నూఱుయోజనములు పొడవు—వెడల్పులు గలిగి చతురస్రాకారముగానుండును.

1. చూడు : నన్నయ, భార. సభా. 1-69.

వరుణుఁడు జలేశ్వరుఁడు కావున దివిజశిల్పి యగు విశ్వకర్మ జలస్తంభము చేసి, జలములలో నుండి యీ సభాభవనమును రచించి నట్లు వర్ణింపఁబడినది.

మూలము నందు మఱికొన్ని విశేషములు గలవు.

యుధిష్ఠిరః సభా దివ్యా వరుణస్య సితప్రభా ।
ప్రమాణేన యథా యామ్యా శుభ్రప్రాకారతోరణా ॥
అంతఃసలిల మాస్థాయ విహితా విశ్వకర్మణా ।
దివ్యరత్నమయై ర్వృక్షైః ఫలపుష్పప్రదై ర్యుతా ॥ *
.... .... ....
సా సభా సుఖసంస్పర్శా న శీతా న చ ఘర్మదా ।
వేశ్మాసనవతీ రమ్యా సితా వరుణపాలితా ॥

— వ్యా.భా. సభా. అ 9. శ్లో 1-౭

1, వరుణసభ దివ్యమైనది. తెల్లని కాంతిగలది. అమితమైన కాంతిగల దసి కొన్నిప్రతులలో గలదు.

(....సభా దివ్యా వరుణస్యామితప్రభా.)

2. అది తెల్లని ప్రాకారతోరణములు గలది.

3. వేశ్మములు—ఆసనములు గలిగి రమ్యముగ నున్నది.

('వేశ్మాసనవతీ రమ్యా.)

4. అది మణిమయము లయిన దివ్యవృక్షములతో నలంకరింపఁబడినది. అనఁగా వరుణసభాభవన కుడ్యములందు రత్నమయములైన వృక్షములు ఫలపుష్ప సమన్వితములు గా చెక్కఁబడిన వన్నమాట. అవి దివ్యము లనుటచే కల్ప వృక్షము లని భావింపవచ్చును.

---

* "It has been built by Viswakarman (the celestial artificer) within the waters. It is surrounded on all sides by many celestial trees made of gems and jewels"
— P. C. Roy. Mbh- Sabha – Section. 9.

5. ఆ సభాభవనము అంత చల్లగా గాని అంత వేడిగా గాని యుండక సమ శీతోష్ణస్థితి గలిగియుండును. (Air-Conditioned)

మహాభారతము ప్రకారము విశ్వకర్మ నిర్మితము లయిన యమసభయు, వరుణ సభయు నించుమించుగా నొకేవిధముగ నున్నవి. రెండును చతురస్రాకృతులే. జల మధ్యము నందు నిర్మింపఁబడుటయే వరుణసభానిర్మాణము నందలి విశేషము.

వరుణునకు మేరుసావర్ణిశృంగము పైని గూడ నొక దివ్యభవనమున్నట్లు వాల్మీకిరామాయణము వలనఁ దెలియుచున్నది. అదిసూర్యసన్నిభకాంతి గలది. దాని చుట్టు ననేకప్రాసాదము లున్నవి. అవియును దేవశిల్పి యగు విశ్వకర్మ నిర్మితమే.

శృంగే తస్య మహద్దివ్యం భవనం సూర్యసన్నిభమ్ ।
ప్రాసాదగణసంబాధం విహితం విశ్వకర్మణా ॥
శోభితం తరుభిశ్చిత్రై ర్నానాపక్షిసమాకులైః ।
నికేతం పాశహస్తస్య వరుణస్యమహాత్మనః ॥

—వా.రా. కిష్కింధ. 42. 44,45

వరుణసభాభవనము సహస్రయుక్తమైనట్లు ఋగ్వేదమునందు వర్ణింపఁబడినది.

బృహన్తం మానం వరుణ స్వధావః
సహస్రద్వారం జగమాగృహం తే ॥

—ఋగ్వేద. 7.88.5

# కుబేరుసభ

ధనదుసభ యింద్రసభతో
నెన యగుచు మహావిభూతి నెంతయు నొప్పం
దన దివ్యశక్తి నాతం
డొనరఁగ నిర్మించె దాని నుత్తమమణులన్

అదియును నూఱు యోజనంబుల నిడుపును డెబ్బది యోజనంబుల వెడల్పు నుం గలిగి సితప్రభం బయి గగనచరంబయి కనకమయ తరులతాలంకృతంబయి తటిల్లతావిచిత్రశరదంబుదంబు ననుకరించుచుండు.

—నన్నయ. భార. సభా. 1-74,75

మూలము నందు వైశ్రవణు సభా వర్ణన మిట్లున్నది.

సభా వైశ్రవణీ రాజన్ శత యోజన మాయతా ।
విస్తీర్ణా సప్తతి శ్చైవ యోజనాని సితప్రభా ॥
తపసా నిర్జితా రాజన్ స్వయం వైశ్రవణేన సా ।
శశిప్రభా ప్రావరణా కైలాసశిఖరోపమా ॥
గుహ్యకై రూహ్యమానా సా ఖే విషక్తేన శోభతే ॥
దివ్యా హేమమయై రుచ్చైః ప్రాసా దైరుపశోభితా
మహారత్నవతీ చిత్రా దివ్యగంధా మనోరమా ।
సితాభ్రశిఖరాకారా ప్లవమానేవ దృశ్యతే ॥
దివ్యా హేమమయై రంగై ర్విద్యుద్భి రివ చిత్రితా ।

—వ్యా.భా. సభా. 10. 1-5

దీని వలన నన్నయ భారతము వలనఁ దెలియని కొన్ని విశేషములు తెలియుచున్నవి.

1) వైశ్రవణుసభ కైలాసశిఖరము వలె ఎత్తైనది.

2) అది గుహ్యకులచే మోయఁబడుచు. ఆకాశము నంటుకొనియున్నట్లు శోభిల్లుచున్నది.

3) దేవనిర్మితమైన యా సభ ఉన్నతములైన స్వర్ణప్రాసాదములతో (ప్రాకారములతో) నొప్పుచున్నది.

4) సభ యంతయు రత్నమయమై చితముగ నున్నది. సుగంధభరితమై మనోహరముగ నున్నది.

5) తెల్లని మబ్బుకొండ వలె గాలిలోఁ దేలియాడుచున్నది.

6) విద్యుత్కాంతులు వెదజల్లు బంగరురంగుపూఁతలతో శోభాయమానముగ నున్నది.

కుబేరుఁ డా సభాభవనము నం దానందముగ నుండుచు,

అందుఁ గుబేరుఁడు పరమా
నందంబున నుండు ధర్మనందన విలస
న్మందార పారిజాతక
నందన మందానిలాభినందితుఁ డగుచున్.

—నన్నయ. భార. సభా- 1_76

చక్కని తివాసీలు పఱవఁబడి యున్న యా సభాభవనము నందు వైశ్రవణుఁడు పాదపీఠికాసహితమయిన పరమాసనముపై గూర్చుండి యుండు ననియు మూలము నందు వర్ణింపఁబడినది.

దివాకర సిభే పుణ్యే దివ్యాస్తరణసంవృతే ।
దివ్యపాదోపధానే చ నిషణ్ణః పరమాసనే ॥

— వ్యా.భా. సభా. 10_8

కుబేరుని సభ పొడవు నూఱు యోజనములు, వెడల్పు డెబ్బది యోజనములు. అనఁగా నది దీర్ఘచతురస్రాకారముగా నున్నది.

ధనాధ్యక్షుని సభాభవనము కనకమండిత మనియు విశాల మయిన స్తంభములు తోరణములు గల దనియు 'విపుల' యను పేరుతో ప్రసిద్ధికెక్కిన దనియు వాయు పురాణము నందు వర్ణింపఁబడినది.

తస్య మధ్యే సభా రమ్యా నానాకనకమండితా ।
విపులా నామ విఖ్యాతా విపులస్తంభతోరణా ॥

ఈ సభాభవనమును వైశ్రవణుఁడే తన దివ్యశక్తితో నుత్తమమణులతో నిర్మించికొని నట్లు మహాభారతమునందు చెప్పఁబడినది. కాని వాల్మీకి రామాయణము నందు కుబేరభవనము కైలాసపర్వతముపై విశ్వకర్మ చే నిర్మింపఁబడినట్లు వర్ణింపఁ బడినది.

* Cf :- V. R. Eng. Tr. Gorakpur Ed. P 1035
" on the aforesaid mountain (Kailasa) stands the lovely place of Kubera (the god of riches and the deity presiding over the northern quarter), resembling a white cloud and embellished with gold, which was constructed by Viswakarma, the architect of gods .... ... "

తత్ర పాండురమేఘాభం జాంబూనదపరిష్కృతమ్ ।
కుబేరభవనం రమ్యం నిర్మితం విశ్వకర్మణా ॥

—వా.రా. కిష్కింధ. సర్గ. 43-21

# బ్రహ్మసభ

"ఏను దొల్లి మనుష్యలోకంబునం గొండొకకాలం బున్న నా కడకు సూర్యుండు వచ్చి పితామహుసభ వర్ణించిన తద్దర్శనకుతూహలుండనై యాదిత్యు తోడన యరిగి యక్కమలగర్భుసభం జూచితి.

దళితవిరోధి యిట్టి దని తెలం గెఱుఁగంగ బ్రహ్మకుం
గొలఁదియె తా నవాఙ్మనసగోచర మద్భుతరూప మీ వియ
త్తల మను కంబ మొక్కటియ తాల్పఁగ సుస్థిరమై నిజప్రభా
వలి వెలిఁగించు చుండు శశివారిజమిత్రులమండలంబులన్.''

—అని నారదుఁడు యుధిష్ఠిరునితోఁ జెప్పినాఁడు.

నన్నయ వ్రాసిన యీ పద్యమును బట్టి మూఁడు విషయములు తెలియు చున్నవి.

(1) బ్రహ్మసభ రూప మద్భుతముగ నున్నది. అది అవాఙ్మనసగోచరము. దాని స్వరూప మెఱుఁగుట కెవ్వరికిని సాధ్యము కాదు.

(2) వియత్తల మను స్తంభ మొక్కటియె దానిని మోయుచున్నది. అది సుస్థిరమైనది.

(3) అది తన కాంతితో సూర్యచంద్రమండలములను వెలిఁగించుచున్నది.

మూలము నం దిట్లు వర్ణింపబడినది.

(1) ఏవం రూపేతి సా శక్యా న నిర్దేష్టుం నరాధిప ।
క్షణేన హి బిభర్త్యన్య దనిర్దేశ్యం వపుస్తథా ॥
న వేద పరిమాణం వా సంస్థానం చాపి భారత ।
న చ రూపం మయా తాదృగ్ దృష్టపూర్వం కదాచన ॥

— వ్యా.భా. సభా. 11,11,12

బ్రహ్మసభ క్షణమున కొక రూపము ధరించుచుండును. కావున దాని రూప మిట్లున్న దని చెప్పుటకు శక్యము గాదు. దాని పరిమాణ మిట్టి దని గాని, దాని స్థితి యిట్టి దని గాని చెప్పఁజాలను. అట్టి రూపమును మున్నెన్నడును జూచియుండలేదు.

(2) ఆ సభ కాధారభూతము లయిన స్తంభములు లేవు. అది నిరాధారముగ నున్నది. అయ్యును అది పడిపోక (క్షరా) శాశ్వతముగ నిలిచియున్నది.

స్తంభైర్న చ ధృతా సా శాశ్వతీ న చ సా క్షరా ॥

—వ్యా.భా. సభా. 11–14

వ్యాస మహర్షి బ్రహ్మసభకు స్తంభములు లే వని చెప్పినాడు.[1] నన్నయ అది 'వియత్తల మను కంబ మొక్కటియె తాల్పఁగ సుస్థిర మై' యున్నదని చమత్కరించినాఁడు.

వ్యాసభారతము నందలి పై వాక్యమును దృష్టియం దుంచుకొని, మహాభారత కాలము నాటి శిల్పులు స్తంభములు లేకుండ ప్రాసాదనిర్మాణము చేయు కళాకౌశలము గలిగి యుండి రని సుఖమయభట్టాచార్య నిర్ణయించినాఁడు.[2]

(3) ఆ సభ స్వయంప్రభతో సూర్యచంద్రాగ్నులను మించియున్నది. స్వర్గసీమ యందుండి సూర్యుని గూడ వెలిఁగించునట్లు ప్రకాశించు చున్నది.

అతిచంద్రం చ సూర్యం చ శిఖినం చ స్వయంప్రభా ।
దీప్యతే నాకపృష్ఠా భాసయంతీవ భాస్కరమ్ ॥

— వ్యా.భా. సభా. 11-16

(4) బ్రహ్మదేవుని సభ నానావిధమణుల చేత రచింపఁబడినది. కావున నది యనేకవిధములుగా ప్రకాశించుచున్నది.

1. "It does not seem to be supported on columns.
—P. C. Roy. Mbh- sabha.

2. చూడు :- సుఖమయ భట్టాచార్య - మహాభారత కాలీన సమాజ్ - అనువాదికా : పుష్పా జైన్. పుట. 164-5
"స్తంభోంకే బినా భీ ప్రాసాదనిర్మాణ్ కే కౌశల్ సే ఉస్ కాల్ కే శిల్పీ అవగత్ థే" —

నానారూపైరివ కృతా మణిభి స్సా సుభాస్వరైః ॥ *

వ్యా.భా. సభా.11-14

(5) బ్రహ్మసభలో ప్రవేశించిన వారికి ఆకలి దప్పులుండవు. ఏవిధమయిన గ్లానియు నుండదు. శీతాతపబాధ లేక సమశీతోష్ణస్థితి గలిగి చాల సుఖముగా నుండును. (Air-Conditioned)

నక్షుత్పిపాసే న గ్లానిం ప్రాప్య తాం ప్రాప్నువన్త్యుత ।
సు సుఖా సా సభా రాజన్ న శీతా న చ ఘర్మదా ॥

—వ్యా.భా. సభా. 11-13

ఆ సభ యట్లు సుఖప్రద మైనది. కావుననే యది యెల్లపుడు వచ్చుచుఁ బోవు జనులతో నిండియుండును.

తథా తై రుపయాతైశ్చ ప్రతియాతైశ్చ భారత ।
ఆకులా సా సభా తాత భవతిస్మ సుఖప్రదా ॥

—వ్యా.భా. సభా. 11-59

(6) బ్రహ్మర్షి గణసేవిత మయిన యా సభ పరమశోభాసంపన్నమై తేజరిల్లు చున్నది. సర్వలోకములందు దుర్లభమయినది.

సర్వతేజోమయీ దివ్యా బ్రహ్మర్షిగణసేవితా ।
బ్రాహ్మ్యా శ్రియా దీప్యమానా శుశుభే విగతక్లమా ॥

సా సభా తాదృశీ దృష్టా సర్వలోకేషు దుర్లభా ।

వ్యా.భా. సభా. 11-60,61

బ్రహ్మసభ యందు కశ్యపాది శిల్పర్షులు, శిల్పప్రజాపతియైన విశ్వకర్మయు నున్నారు.

* "It seems to be made up of brilliant gems of many kinds".
—P.C. Roy. Mbh. sabha.

"ఆ సభ సహస్ర సూర్యమని నిర్మిత" మని హిందీ మహాభారతకర్త చతుర్వేదీ ద్వారకా ప్రసాద్‌శర్మ అనువదించినాఁడు.
(చూడు : హిందీ మహాభారత. సభా. అ. 11. పుట 28)

'విశ్వకర్త అయిన మన్వత్రి మరీచి భృగు భరద్వాజ దక్ష వసిష్ఠ వాలఖిల్య పులస్త్య పులహక్రతు కశ్యపగౌతమాంగిరః ప్రచేతసులును ........... వసురుద్రసిద్ధ సాధ్యులును...........నాశ్వినులును, విశ్వేదేవతలును విశ్వకర్మయు...........కొలువ సరస్వతీసమేతుండై పరమానందంబునం బరమేష్ఠి పద్మాసనంబున నుండు."

నన్నయ. భార. సభా. 1-81*

శిల్పాచార్యుఁడయిన విశ్వకర్మ సభయందున్నాఁడు కనుక బ్రహ్మసభను విశ్వకర్మయే నిర్మించి యుండవచ్చును.

సకలలోకములందు బ్రహ్మసభ దుర్లభ మైన దనియు, మనుష్యలోకము నందు నీ సభ సర్వశ్రేష్ఠమయిన దనియు సభాభవనముల నన్నింటిని సందర్శించి వచ్చిన నారదుఁడు ధర్మరాజుతోఁ జెప్పినాఁడు.

ఈ విధముగా నారదమహర్షిచే ప్రశంసింపఁ బడిన మయసభా విశేషముల నవలోకింతము.

# మయసభ

## అసుర శిల్పి యపూర్వ శిల్ప కళాసృష్టి.

"నేను దానవవిశ్వకర్మ ననేకశిల్పకలాకుశలుండ మీ కిష్టంబయిన దాని నిర్మించెదం బనుపుఁ" డని మయుఁడు ధర్మతనయునొద్ద వాసుదేవసహితుం డయి యున్న యర్జునున కతిప్రీతిం గృతాంజలియై పలికినాఁడు.

—నన్నయ. సభా. 1-2,3,4

మయుఁడు శిల్పిజనశ్రేష్ఠుఁడు. ఖాండవదహనసమయమునందు ధనంజయుఁడు తన ప్రాణము గాంచినవాఁడు.

* వ్యా.భా. సభా. అ11.

ఉపతిష్ఠంతి చాప్యేనం ప్రజానాం పతయః ప్రభుమ్ । ...
దక్షః ప్రచేతాః పులహో మరీచిః కశ్యపస్తథా ॥ 14
భృగురత్రిర్వసిష్ఠశ్చ గౌతమశ్చ తథాఽంగిరాః । ... 15
మరుతో విశ్వకర్మా చ వసవశ్చైవ భారత । 22.

తన ప్రాణము రక్షించిన యుపకారికిఁ బ్రియము సేయఁ దలఁచి మయవిశ్వకర్మ నానావిధశిల్పకళల యందుఁ దనకుఁ గల సామర్థ్యమును దెలిపి, యందు నీ కిచ్చవచ్చిన దానిని గోరికొనవచ్చు నని సూచించినాఁడు.

మూలము నం దిట్లున్నది.

**అహం హి విశ్వకర్మా వై దానవానాం మహాకవిః । ***
**సోఽహం వైత్వత్కృతే కర్తుం కించి దిచ్ఛామి పాండవ ॥ 6**

దానవానాం పురా పార్థ ప్రాసాదా హి మయకృతాః ।
రమ్యాణి సుఖగర్భాణి భోగాఢ్యాని సహస్రశః ॥
ఉద్యానాని చ రమ్యాణి సరాంసి వివిధాని చ ।
విచిత్రాణి చ శస్త్రాణి రథాః కామగమా స్తథా ॥
నగరాణి విశాలాని సాట్టప్రాకారతోరణైః ।
వాహనాని చ ముఖ్యాని విచిత్రాణి సహస్రశః ॥
బిలాని రమణీయాని సుఖయుక్తాని వై భృశమ్ ।
ఏతత్ కృతం మయా సర్వం తస్మా దిచ్ఛామి ఫాల్గున ॥ **

—వ్యా.భా. సభా. 1-6

విశ్వకర్మ యనఁగా సకలవిధశిల్పములు చేయువాఁ డనియు మహాకవి యనఁగా శిల్పపండితుఁ డనియు వ్యాఖ్యాతలు వివరించినారు.

మహాకవి యయిన మయుఁ డట్లు చెప్పఁగా విని, 'యర్జునుం డచ్యుతు మొగంబు చూచి యతని నెద్దియేని నొక్క యపూర్వం బయిన దాని నిర్మింప నియోగింపు మనిన, గృష్ణుండు పెద్దయుం బ్రొద్దు విచారించి మయున కిట్లనియె.

* చూడు :- దేవబోధ - జ్ఞానదీపికా. పు. 1.
విశ్వం సర్వం కర్మ శిల్పం యస్య = విశ్వకర్మా ;
మహాకవిః శిల్పపండితః ॥
విశ్వం కర్మ కృతి సాధ్యం యస్య స విశ్వకర్మా ;
మహాకవిః శిల్పపండితః ॥

** చూడు :- శ్రీమహాభారతమ్. గోరఖ్‌పూరు ప్రతి.
ఈ శ్లోకములు సభా- 1-6 తరువాత అధికపాఠముగా నున్నవి

కురుపతికిన్ యుధిష్ఠిరునకున్ సకలక్షితిపాలసేవ్య సు
స్థిరవిభవాభిరామున కతి ప్రమదంబుగ రత్నరాజ సుం
దరమగు దాని నొక్క సభ ధాత్రి కపూర్వముగా నొనర్చి చె
చ్చెరఁ గొని రమ్ము నీదయిన శిల్పకలాకుశలత్వ మేర్పడన్.

—నన్నయ. భార. సభా. 1.4,5

నిర్మాణ మపూర్వముగా నుండవలయు నని యర్జునుఁడు, కృష్ణుఁడును చెప్పిరి. అపూర్వ మనఁగా నేమి? ఆ నిర్మాణ మెట్లుండ వలయును?

మూలము నందు స్పష్టముగనే యున్నది.

[యది త్వం కర్తు కామోఽసి ప్రియం శిల్పవతాం వర]
ధర్మరాజస్య దైతేయ యాదృశీ మిహ మన్యసే ॥

యాం కృతాం నానుకుర్యుస్తే మానవాః ప్రేక్ష్యవిస్మితాః ।
మనుష్యలోకే కృత్స్నేస్మిం స్తాదృశీం కురు వై సభామ్ ॥

యత్రదివ్యానభిప్రాయాన్[1] పశ్యేమ విహితాం స్త్వయా ।
ఆసురాన్ మానుషాంశ్చైవ తాం సభాం కురు వై మమ ॥

—నన్నయ. భార. సభా. అ1. 9-11

అపూర్వ మనఁగా నితఃపూర్వము లే నట్టిది. అట్టి దానిని చూచి మానవులు విస్మితులు గావలయును. అందుండి దానిని పరిశీలించినను మానవమాత్రు లట్టి దాని ననుకరింపఁజాలి నట్లుండ వలయును. ఆ నిర్మాణ మనితరసాధ్యమై దివ్యాసుర మానుషశిల్పకల్పనానురూపముగా నుండవలయును. అట్టి యపూర్వ సభాభవనమును నిర్మింపు మని కృష్ణుఁడు మయునితోఁజెప్పెను.

1. అభిప్రాయాన్ మనోవృత్తయః శృంగార వీర రౌద్రాది ప్రభవాః ॥

—దేవబోధ-జ్ఞానదీపికా

"And O, Maya, build thou a mansion in which we may behold (a mixture of) calestial Asura, and human designs-"

—P. C. Roy. Mbh.

మయుఁ డందుల కంగీకరించెను.

ఇమ్మనుజేంద్రుఁ డింద్రదనుజేంద్రుల కంటె మహావిలాస సౌ
ఖ్యమ్ములఁ బెద్ద యిద్ధరణిఁ గావున నీతని పేర్మికిం దగన్
నెమ్మి నొనర్చెదన్ సభ మణిప్రభ నొప్పఁగ దేవతావిమా
నమ్ములు నిట్టివే యని జనమ్ములు దానిని చూచి మెచ్చఁగన్.

—నన్నయ. సభా. 1-7

మూలము నం దిట్లున్నది,

ప్రతిగృహ్య తు తద్వాక్యం సంప్రహృష్టో మయస్తదా।
విమానప్రతిమాం[1] చక్రే పాండవస్య శుభాం సభామ్ ॥

—వ్యా.భా. సభా. 1-12

'విమానప్రతిమాం' అనగా 'విమానప్రతిమ' యనుపేరు గల సభ యని గాని, 'విమానసదృశ' మయిన సభ యని గాని యర్థము చెప్పవచ్చు నని దేవబోధ వ్యాఖ్య. నన్నయ రెండవ యర్థమునే గ్రహించినట్లున్నది.

సభాభవనము విమానరచనోపేతముగా నుండ వలయునని విశ్వకర్మవాస్తుశాస్త్రము నందుఁ జెప్పఁబడినది.

విమానరచనోపేతాం కుర్యాచ్ఛిల్పవిశారదః ॥

—వి.వా.శా. అ. 16.

"తొల్లి వృషపర్వుం డను దానవేంద్రున కొక్క సభ నిర్మింప సమకట్టి రత్నమయంబు లయిన యుపకరణంబు లొడఁగూర్చి బిందుసరం బను కొలన సంగ్రహించిన వాఁడ నయ్యుపకరణంబుల దాని విచిత్రంబుగా రచియించి తెచ్చి ధర్మరాజున కిచ్చెద .... .... నని చెప్పి ధర్మరాజుచేత సత్కృతుండై సుముం డరిగె"

— నన్నయ - భార. సభా .1.8.

1. విమాన ప్రతిమేతి నామ. అథవా విమానసదృశీమ్ ॥

— దేవబోధ-జ్ఞానదీపికా టీక.

మూలమునం దిట్లున్నది.

ఉత్తరేణ తు కైలాసం మైనాకం పర్వతం ప్రతి ।
యియక్షమాణేషు పురా దానవేషు మయాకృతమ్ ॥
చిత్రం మణిమయం భాండం రమ్యం బిందుసరః ప్రతి ।
సభాయాం సత్యసంధస్య యదాసీత్ వృషపర్వణః ॥
ఆగమిష్యామి తద్ గృహ్య యది తిష్ఠతి భారత ।
తతః సభాం కరిష్యామి పాండవాయ యశస్వినీ ।
మనః ప్రహ్లాదినీం చిత్రాం సర్వరత్నం విభూషితామ్ ।

— వ్యా.భా. సభా. 3. 1–4 *

ఇట భాండ మనఁగా మూలధన మనియు, చిత్రమనఁగా రంగోపాదానద్రవ్య మనియు, మణిమయ మనఁగా కృత్రిమ మయూరాదుల చంద్రకాదులు (నెమలిపురి కన్నులు) మున్నగు వివిధాకృతుల చేయుట కుపయోగపడు మణులతో గూడిన దనియు టీకాకారుఁడు వివరించినాడు.

ఈ భాండము నందు స్ఫటిక మణులు కూడ నున్నవి.

స్ఫాటికం చ సభాద్రవ్యం యదాసీద్ వృషపర్వణః ।

వ్యా. భా. సభా. 3 - 18

మయుఁడును బూర్వోత్తరదిశాభిముఖుండై పోయి కైలాసంబు నుత్తరంబున మైనాకశైలంబునందు హిరణ్యశృంగంబున,

---

* చూడు :- శ్రీమహాభారతము - వావిళ్ల ప్రతి. పుట. 481

కృతమ్ = హింగుళాదివ నిర్మితం

భాండమివ భాండం మూలధనం; చిత్రం రంగోపాదాన ద్రవ్యం; మణిమయం మణిప్రచురం యేన కృత్రిమమయూరాదీనాం చంద్రకాదీని క్రియంతే.

చంద్రకము = నెమలిపురికన్ను; నీటియందు చమురు గల మదము మొదలగునవి పడినఁ దమవలన నేర్పడిన చంద్రాకారమగు మండలము; మత్స్యవిశేషము ; తెల్ల మిరియము (సూర్యరాయాంధ్రనిఘంటువు)

ఎందేని సర్వభూతేశుండు సృజియించె
సచరాచరములైన జగము లెల్లఁ
గంగఁ బ్రత్యక్షంబు గావింప నెందేనిఁ
గృతవాసుఁ డయ్యె భగీరథుండు
నలినసంభవ నర నారాయణస్థాణు
వాసవ ప్రభృతి గీర్వాణ ముఖ్యు
లెందేనిఁ గ్రతువు లనేకయుగంబులఁ
జేసిరి రత్నవిచిత్రవితత

చైత్యములు, మహావిశాల హిరణ్మయ
యూపతతుల నోవి నొప్పుచుండ
నట్టి బిందుసరము నందున్న వివిధవ
స్తూపకరణచయము లొనరఁ గొనియె.

నన్నయ-భార. సభా. 1-9.

పూర్వకాలమున హిరణ్యశృంగము నందు బృందారకముఖ్యులొనరించిన యజ్ఞము లం దుపయోగింపఁబడిన రత్నమయము లైన చైత్యములు, హిరణ్మయము లయిన యూపములు బిందుసరము నందున్నవి.

ఇట యూపములు మణిమయము లనియు, చైత్యములు హిరణ్మయము లనియు నవి యలంకారార్థము చేయఁబడినవే కాని కల్పసూత్రోక్తముగా శాస్త్రప్రకారము చేయఁబడినవి కా వనియు మూలము నందు చెప్పఁబడినది.

యత్ర యూపా మణిమయా శ్చిత్యాశ్చాపి హిరణ్మయాః।
శోభార్థం విహితా స్తత్ర న తు దృష్టాంతతః కృతాః ॥ *

చిత్యము లనఁగా చైత్యములు. ప్రకరణబలమును బట్టి యజ్ఞవేదికలు. అవి హిరణ్మయములు.

* చిత్యాః చయనాని;
దృష్టాంతతః న తు కల్పసూత్రోక్తాని ॥. — దేవబోధ.

అక్కడనే వాసుదేవుడు సహస్రవర్షములు సత్రయాగము చేసి, సువర్ణాలంకృతము లయిన యూపములు, నత్యంతకాంతిమంతము లయిన చైత్యములు వేల కొలది, లక్షల కొలది దానము చేసినాడు.

సువర్ణమాలినో యూపా శ్చైత్యాశ్చాప్యతిభాస్వరాః ।
దదౌ యత్ర సహస్రాణి ప్రముతాని చ కేశవః ॥

— వా.భా. సభా. 3_15

ఇట దారుమయము లయిన యూపములు సువర్ణమాలాలంకృత ములు; చైత్యములు (యజ్ఞవేదికలు,కుండములు) అగ్నిమయములే కాక హిరణ్మయములును కావున మిక్కిలిగా ప్రకాశించుచున్నవి.

ఇవి యన్నియు బిందుసరోవరము నందు నిక్షిప్తము లయి కింకరుల చేత రాక్షసుల చేత రక్షింపబడుచున్నవి.

మయమహాసురుడీ సమస్తవస్తుజాలమును సంపాదించి సభారచనమునకు గడగినాడు.

కింకరైః సహ రక్షోభిర్యదరక్షన్ మహద్ధనమ్ ।
తదగృహ్ణన్ మయ స్తత్ర గత్వా సర్వం మహాసురః ॥

— వ్యా.భా. సభా. 3-18

# సభాభవననిర్మాణారంభము

దేవ బ్రాహ్మణులకు నా
నావిధపూజనములఁ దర్పణము సేసి ధరి
త్రీవనిత కపూర్వశ్రీ
గావింపఁ దొడంగె మయుఁడు కడు రమ్యముగాన్.

— నన్నయ. సభా. 1-10

నూతనభవననిర్మాణప్రారంభాది శుభసమయము లందు వాస్తుశాంతి కొఱకు వాస్తుపురుషాంగదేవతను పూజించి శిల్పిబ్రాహ్మణులను సంతోషపెట్టు సంప్రదాయ మనాదిగా నున్నది. సంప్రదాయజ్ఞుఁడయిన నన్నయభట్టు, భూదేవి కపూర్వాలంకారము గా సభాభవననిర్మాణమునకుఁ గడఁగిన మయుఁడు ముందుగా 'దేవబ్రాహ్మణులకు' పూజాదులతో తర్పణము చేసినాఁ డని వ్రాసినాఁడు.

ఇట కొందఱు పండితులు దేవబ్రాహ్మణు లనఁగా దేవతావిగ్రహాదులు నిర్మించు శిల్పిబ్రాహ్మణులనియు, తర్పణమనఁగా పితృయజ్ఞ మనియు నర్థము చెప్పి "మయుఁడు ఖాండవవనములో నిర్దహింపఁబడిన తన బంధుగులకు తర్పణము చేసి యుండె" నని వ్రాసినారు.[1] కాని పితృతర్పణము చేయుట కిది సమయము కాదు గదా !

మూలము నం దిట్లున్నది.

> పుణ్యేఽహని మహాతేజాః కృతకౌతుకమంగళః ।
> తర్పయిత్వా ద్విజశ్రేష్ఠాన్ పాయసేన సహస్రశః ।
> ధనం బహువిధం దత్త్వా తేభ్య ఏవ చ వీర్యవాన్ ॥
> సర్వర్తుగుణసంపన్నాం దివ్యరూపాం మనోరమామ్ ।
> దశకిష్కుసహస్రాం తాం మాపయామాస సర్వతః ॥ *
>
> —వ్యా.భా. సభా. 1. 19-21

ఒకానొక శుభదినమున మహాతేజస్వి యయిన మయుఁడు విధిపూర్వకముగ స్వస్త్యయనాది శాంతికవిధులొనరించి, వేలకొలఁది ద్విజ శ్రేష్ఠులకు పాయసాన్నముతో తర్పణము చేసి, వారి కనేక విధము లయిన దక్షిణ లొసఁగి, సభాభవన నిర్మాణార్థము పదివేల కిష్కువులు చుట్టుకొలత గల మనోహరమైన భూమిని మాపనము చేసి నట్లు వర్ణింపఁబడినది.

ఈ వర్ణనము నందు 1) శుభదివసము 2) మంగళాచరణము 3) బ్రాహ్మణ తర్పణము 4) భూపరీక్ష 5) భూమాపనము-నను నైదు ముఖ్యాంశములు గలవు.

1. చూడు :- పూసపాటి నాగేశ్వరరావు : సాహిత్యజగత్తులలో విశ్వకర్మ. పు. 61.

* పోల్చు :- వ్యా.భా. సభా. 3-23
"దశకిష్కుసహస్రాణి సమంతాదాయతా భవేత్,"

1. శుభ దినము.

జ్యోతిషశాస్త్రానుసారము శుభవార, శుభనక్షత్ర, శుభయోగ శుభకరణాది యుక్తమయిన తిథి.

2. మంగళాచరణము.

మంగళాచరణ మనఁగా సమస్తకార్యారంభము లందు శుభఫలసిద్ధి కొఱకు చేయు దేవతాస్తుతి. ఇది శిల్పకర్మము కావున వాస్తుదేవతాపూజ.

3. బ్రాహ్మణతర్పణము

'తర్పయిత్వా ద్విజశ్రేష్ఠాన్ .... .... ....'

ద్విజు లనఁగా నుపనయనసంస్కారము గలవారు. కనుక నీ ద్విజశ్రేష్ఠులలో రథకారద్విజులు కూడ నుండి యుండ వచ్చును. శిల్పాచార్యుఁ డయిన మయుఁడు బ్రాహ్మణశ్రేష్ఠులకే కాక శిల్పిబ్రాహ్మణముఖ్యులకుఁ గూడ ధనము లొసఁగి తృప్తి పఱచినాఁ డనుట సమంజసముగ నుండును.

4. భూపరీక్ష

భూమి యెట్లుండ వలయును? మయమత మిట్లు చెప్పుచున్నది.

వర్ణగంధరసాకారదిక్ఛబ్దస్పర్శనై రపి।
పరీక్ష్యైవం యథా యోగ్యం గృహీతావధి నిశ్చితా॥

— మయమతము.

మయుఁడు నిర్మింపఁబోవు నది రాజసభాభవనము కనుక దానికి క్షత్రియోచిత మయిన భూమిని స్వీకరింపవలయును. క్షత్రియభూమి రాజ్యదాయకము.

'క్షత్రియా రాజ్యదా భవేత్.'

— వాస్తుసర్వస్వము.

క్షత్రియభూమి రక్తవర్ణము, రక్తగంధము, కషాయరసము, తుంగాకారము' ప్రాక్ప్లవము, కుశోపేతము, గంభీరధ్వని గలిగి యుండును.

ఈ లక్షణముల నన్నింటిని మించిన ముఖ్యలక్షణ మొకటి యున్నది.

సమస్త నిర్మాణములకు మనస్సున కాహ్లాదము గలిగించు సమభూమి ప్రశస్తమైనది.

'సురమ్యం సమభూదేశే రాజధానీం ప్రకల్పయేత్.'

—శుక్రనీతి. 1-124.

శుక్రాచార్యుడు రాజధాని విషయమై చెప్పిన లక్షణమే సర్వత్ర గ్రహింపం దగినది. మయుఁడు, మానసారమునియు శిల్పశాస్త్రప్రవర్తకమైన శుక్రాచార్యు ననుసరించినారు.

ఇది అసుర (ద్రావిడ) శిల్ప సంప్రదాయము. ఆర్యశిల్ప సంప్రదాయము (ఉత్తర భారతదేశ) పద్ధతియు నిట్లె యున్నది.

మనోరమా చ యా భూమిః పరిక్షేత్ర ప్రయత్నతః ॥

—వశిష్ఠ సంహిత.

మనోరమా సుతప్రదా .... .... ....

—విశ్వకర్మప్రకాశిక, 1-49

మయుఁ డెంచికొనిన భూమి సర్వర్తుగుణానుకూలమై శుభప్రదమయిన యాకృతి గలిగి మనోహరముగా నున్నది.

సర్వర్తుగుణసంపన్నాం దివ్యరూపాం మనోరమామ్ ॥

—వ్యా. భా. సభా. 1-21

## 5. భూమాపనము.

వస్త్వాకృతి రనింద్యా సాఽవాక్ ప్రత్యక్ సమున్నతా ॥
హయేభవేణు వీణాబ్ధి దుందుభిధ్వనిసంయుతా ॥

— మయమతము.

భూమ్యాకృతి యెట్లున్నను సరి శుభప్రదమయినది కావలయును.

చతురస్రము, ఆయతము, వృత్తము, భద్రాసనము మొదలగు నాకృతులు శుభకరములు.

మయుఁడు 'దశకిష్కుసహస్రప్రమాణవృత్తాయతంబుగా .... .... నపూర్వసభాభవనంబు .... నిర్మించి' నాఁడని నన్నయ వర్ణించినాఁడు.

[నన్నయ. భార. సభా. 1.14]

మూలము నం దిట్లున్నది.

దశకిష్కుసహస్రాం తాం మాపయామాస సర్వతః ॥

—వ్యా.భా. సభా- 1-14

దశకిష్కుసహస్రాణి సమంతాదాయతా భవేత్ ॥

— వ్యా.భా. సభా. 3-23

మయమతము ప్రకారము కిష్కు వనఁగా 24 మానాంగుళములు (18 బ్రిటిషు అంగుళములు) గల హస్తము.

సభాభవనము పదివేల హస్తముల పరిధిగా గలిగి సమకోణ చతురస్రాకారముగా నున్న దని పై వాక్యములకర్థము.[1]

మయమతము ననుసరించి భవననిర్మాణమునకు పరిధియే ప్రాతిపదిక. మయుఁ డీ పరిధిని (చుట్టుకొలతను) 'వ్యాసాయామసమూహ' మని నాఁడు. రెండు పొడవులు, రెండు వెడల్పులు కలిపిన చుట్టుకొలత యగును.

సభాస్థలాకృతి యాయతాకార మని మహాభారతమునందే మఱియొకచోట వర్ణింపఁబడినది.

---

కిష్కుః హస్తం ; సర్వతః చతుర్దిక్షు. — వావిళ్ళప్రతి.
కిష్కుః హస్తః ; సర్వతః ఆయామవిస్తారాభ్యాః — దేవబోధకృతజ్ఞానదీపికా టీక.

1 చూడు :- 1) మహాభారత — సభాపర్వ. పుట 4. (హిందీ అనువాదసహిత)
సం. డా॥ పం. శ్రీపాదదామోదర్ సాతవలేకర్.
"దస్ హజార్ హాథ్‌తక్ ఫైలీ హుఈ ఉస్ సభాకీ భూమికో చారోం ఓర్ సే మాపీ"
2) హిందీ మహాభారత -సభా -1- పు 2 చతుర్వేదీ ద్వారకాప్రసాద్ శర్మ.
"దస్ హజార్ హాథ్ సే భేర్ మే సభాభవన్ కేలియే భూమినాపీ."

ఆయతా విపులా రమ్యా విపాప్మా విగతక్లమా।

వ్యా. భా. 3.25

వి. యస్. అగర్‌వాలా సభాభవనము సమకోణచతురస్రాకృతి గలిగియున్న దనియు దాని చుట్టుకొలత 8750 గజము లనియు వ్రాసినాఁడు.[1] కిష్కువు లను గజముల లోని కే కొలమానము ప్రకారము మార్చినాఁడో తెలియుట లేదు.

మహాభారతాంగ్లానువాదకర్త పి. సి. రాయ్ సభాస్థలము ఐదువేల హస్తముల చతురస్రమని యనువదించినాఁడు.[2]

మొత్తము మీద సభాభవనము చతురస్రాకారముగ నున్న దనియే వ్యాస భారతము వలనఁ దెలియుచున్నది.

సమస్త వాస్తుశాస్త్ర గ్రంథము లందును చతురస్రాకృతి గల భూమి శ్రేష్ఠ మయిన దని చెప్పఁబడినది.

ఆయతే సిద్ధయః సర్వాః చతురస్రే ధనాగమః ॥

ద్రావిడశిల్ప సంప్రదాయ మిందులకు భిన్నమైనదికాదు.

ద్రావిడశిల్పసంప్రదాయప్రవర్తకులలో ప్రముఖుఁ డయిన మయుఁడును, చతురస్ర, ఆయతాశ్ర, వృత్త, వృత్తాయత, గోళాది పంచవిధాకృతులను చెప్పినాఁడు

1. Cf : V S. Agarwala - Studies in Indian Art: P 57
"The sabha was rectangular (Ayatakara) and spacious (vipula).-Its total perimeter is mentioned as 8750 yards."

2. Cf : P. C. Roy. — Mbh- Sabha. P 2.
"..... ..... measured out a piece of land 5000 cubits square that was delightful and that was exceedingly handsome to behold and that was favourable for construction of a building well-suited to the exigencies of every season."

కాని వృత్తాయతము శ్రేష్ఠతమ మయిన దని మెచ్చుటను చెప్పలేదు. *

మణి మయ నిర్మిత మయిన సభాభవనము, "దశకిష్కు సహస్ర ప్రమాణ వృత్తాయతం'' బని నన్నయ మూలభిన్నముగా వర్ణించుటకు కారణము తెలియ రాకున్నది.

## మణిమయి

మయుఁడు బిందుసరమునం దున్న వివిధరత్నోపకరణములను గొనివచ్చి సభాభవన మంతయు మణిమయముగా నొనరించెను.

విమలమణిమయములగు దూ
లములం గంబముల గోడలను వేదులఁ గు
ట్టిమములఁ జుట్టిన ప్రాకా
రములను గర మొప్పుచుండ రచియించె సభన్.

— నన్నయ. భార. సభా. 1-11

మూలము నం దిట్లు వర్ణింపఁబడినది :

తదాహృత్య తు తాం చక్రే సోఽసురోఽప్రతిమాం సభామ్।
విశ్రుతా త్రిషు లోకేషు దివ్యాం మణిమయీం శుభామ్ ॥

.........................................................

సభా తు సా మహారాజ శాతకుంభమయద్రుమా।
దశకిష్కుసహస్రాణి సమంతాదాయతా భవేత్ ॥ **
ఉత్తమద్రవ్యసంపన్నా మణి ప్రాకారతోరణా
బహుచిత్రా బహుధనా సుకృతా విశ్వకర్మణా।

* Cf : D. N. Sukla : Bharatiya Vastu Sastra —P 134
మయమతం. అ 10 (మయం)
పోల్చు : గరుడపురాణము. అ 47 శ్లో 19,20

** "And the palace that Maya built consisting of columns of gold, occupied', O monarch, an area of five thousand cubits''
— P. C. Roy, Mbh.

న దాశార్హీ సుధర్మాణో వా బ్రహ్మణో వాథ తాదృశీ।
సభా రూపేణ సంపన్నా యాం చక్రే మతిమాన్ మయః॥

—వ్యా. భా. సభా. అ.3.20-27

మయవిశ్వకర్మ చేత మణిమయముగా దివ్యముగా నిర్మింపఁబడిన యా సభా భవనము త్రిలోకఖ్యాతిఁ గాంచినది.

శ్రేష్ఠ మయిన వస్తుజాలముతో, స్వర్ణస్తంభములతో (శాతకుంభమయ ద్రుమాం) మణిమయములయిన ప్రాకార తోరణములతో నొప్పారు నా సభాసౌధాగ్రమునకు విశ్వకర్మ నిర్మిత మయిన సుధర్మయు, బ్రహ్మదేవుని సభయు సరి గావు. అది అప్రతిమానమయినది.

# మణిప్రభ

మయుఁడు "సభమణిప్రభ నొప్పఁగ" నిర్మింతు నని చెప్పినాఁడు.

చూడు :— నన్నయ. సభా. 1-7

ప్రభ యనఁగా దీప్తి; దీప్తి యనఁగా ప్రకాశము, వెలుఁగు. (సూ.ని.)

ప్రభా = Light, Splendour, radiance, effulgence

— (V.S. Apte, S.S.E.D.)

ప్రభా = Light, splendour, radiance, beautiful, appearance.

—Monier-Williams.

శిల్ప శాస్త్రము నందు 'ప్రభ" యనఁగా మెఱుఁగు (Polish)

మణిప్రభ యనఁగా రత్నాదులకు పెట్టిన మెఱుఁగు. ఈ మెఱుఁగు పెట్టుట మయసభాశిల్పము నం దొక విశేషము. ఇది పారశీకశిల్పసంప్రదాయ మని కొందఱు తలఁచుచున్నారు.

యథా వహ్నే ర్యథార్కస్య సోమస్య చ యథైవ సా।
భ్రాజమానా తథా దివ్యా బభార పరమం వపుః॥

ప్రతిఘ్నతీవ ప్రభయా ప్రభామర్కస్య భాస్వరామ్ ।
ప్రజజ్వౌ జ్వలమానేన దివ్యాదివ్యేన వర్చసా ॥

—వ్యా.భా. సభా. 3-20,21

సభాభవనము దివ్యసుందరమైన యాకృతితో వహ్నిసూర్యచంద్ర సదృశ కాంతులతో వెలుఁగుచున్నదనియు నది తన ప్రభ (మెఱుఁగు) తో[1] సూర్యప్రభ (కాంతి)నే యధఃకరించుచున్నదనియు దివ్యాదివ్యతేజస్సుతో ప్రజ్వలించుచున్న ట్లున్న దనియు వర్ణింపఁబడినవి.

దీనినే నన్నయ, "సహస్రకరప్రభాప్రకరవిస్తారవిభూతియును, వివిధరత్నవిభవాభిశోభితంబుగా నపూర్వ సభాభవనంబు" .... .... .... నిర్మించినాఁ డని వర్ణించినాఁడు. [సభా-1,14]

సభాభవనమునం దుపయోగింపఁబడిన మణు లన్నియు చక్కఁగా మెఱుఁగు పెట్టఁబడినవి. కావున నది బహువిధము లైనకాంతు లీను చున్న దనియు తెలియ వచ్చును.

1. Cf :- Dr. V.S. Agarwala : Studies in Indian Art. P 37

" It (the sabha of king Yudhistira) was built by Maya Asura That Sabha is described as Divya, Manimayi and Prabhaya Sampanna (Polished).

—o—

# మయుని శిల్పచమత్కారములు

మతిమంతుఁడయిన మయుఁడు సభాభవనము నందనేక శిల్పచమత్కారములు చేసినాఁడు

## నలినీరత్నము

సురుచిరహరినీలకిరణజాలంబులఁ
బద్మరాగారుణపద్మములను
రాజతరాజీవరాజహంసావళి
నిర్మలసౌవర్ణకూర్మములను
కమనీయ వైడూర్యకుముదంబులను వజ్ర
మీన మౌక్తిక నవఫేనములను
మరకతశైవలోత్కరముల విలసిల్లఁ
గొలనని సన్మణిస్థలము చూచి
పలుఁగురాల కుడ్యముల రుచుల్ గప్పిన
జలము లున్న యెడలు వెలయఁజూచి
యననుపస్థలంబు[1] లని జను లెఱుఁగక
యుండు నట్లుగా మయుండు సేసె.

నన్నయ-భార. సభా. 1-13.

---

1. "అననుపస్థల" మన నీరులేని ప్రదేశమని శబ్దరత్నాకరము దానియందు ఈ పద్యమే యుదాహరింపఁబడినది.

"అనప = Destitute of much water (as a puddle)

అనూప = watery, rich or abounding in water

—V.S. Apte, S.S.E D

అనప = an-apa. mf.n. Destitute of water

—Monier-Williams.

తద్వ్యతిరేకార్థమున "అననుప" శబ్దము ప్రయోగింపఁబడినది.

మణిమయ మయిన జలాశయమును జూచి జనులు దానిని కొలని యెఱుఁగకుండు నట్లుగను, పలుఁగురాల కుడ్యముల కాంతులతో తళతళలీను జలాశయమును చూచి జను లది జలము గల చోటని యెఱుఁగకుండు నట్లుగను, అనఁగా నది నిర్జలస్థల మని భ్రాంతిపడు నట్లుగను, మయుఁడు చిత్రరచనలు చేసినాఁడు.

మూలము నం దీ నళినీ వర్ణన మిట్లున్నది.

తస్యాం సభాయాం నలినీం చకారాప్రతిమాం మయః ।
వైడూర్యపత్రవితతాం మణినాలమయాంబుజామ్ ॥ 30

పద్మసౌగంధికవతీం నానాద్విజగణాయుతామ్ ।
పుష్పితైః పంకజై శ్చిత్రాం కూర్మై ర్మత్స్యైశ్చ కాంచనైః ॥ 31

చిత్రస్ఫాటిక సోపానాం నిష్పంకసలిలాం శుభామ్ ।
మందానిలసముద్ధూతాం ముక్తాబిందుభిరాచితామ్ ॥ 32
మహామణిశిలా పట్టబద్ధ పర్యంత వేదికామ్ ॥ *

—వ్యా. భా. సభా. 3. 30-32.

మహాశిల్పి యైన మయుఁ డా పద్మాకరమునందు వైడూర్యమణివికృతము లయిన పత్రములు, పద్మరాగమణిమయములయిన నాళములు గల కాంచనోత్ఫుల్ల సరోరుహములను చిత్రించినాఁడు. నానాజాతిజలపక్షులను, మత్స్యకూర్మములను కాంచనమయములుగా నొనరించినాఁడు. ఆ సరోవర సోపానములు స్ఫటికమణిమయములు. సరోవరతీరము నందలి వేదికలు ముక్తామణిఖచితములయిన మణిశిలాఫలకములతో నిర్మింపఁబడినవి. ఈ విధముగా నా కొలనంతయు మణిమయమై యొప్పారు చున్నది.

ఈ నలినీరత్నమునకు నన్నయ మెఱుఁగులు పెట్టినాఁడు.

రాజులు కొంద ఱీ మయనిర్మిత మణిఖచితనలినీరత్నమును చూచి కొలని తెలియక స్థలమను భ్రాంతితో నందులోఁబడిరి.

* Cf :- E W. Hopkins = The Great Epic of India ; P 392,
' plated stone is mentioned in ii-3-32,"

మణిరత్నచితాం తాం తు కేచిదభ్యేత్య పార్థివాః ।
దృష్ట్వాపి నాభ్యజానంత తే ఽజ్ఞానాత్ ప్రపతన్త్యుత ॥
— వ్యా.భా. సభా. 3-33 *

దుర్యోధన సార్వభౌముఁడు సైత మీ దురవస్థకు గురియైనాఁడు.

"మఱియు సకలజనమనోహరంబులైన నానావిధయంత్రజలంబులును, సనవరత కుసుమఫలభరితంబులైన తరువనంబులును వికచకమల కుముదాభిరామంబులైన జాలాశయంబులును వివిధ విచిత్రపతాకావిలంబితతోరణవిటంకప్రదేశంబులునుం గలిగి దశకిష్కుసహస్ర ప్రమాణవృత్తాయతంబును, సహస్రకరప్రభాప్రకరవిస్తార విభూతియును, వివిధరత్నవిభవాభిశోభితంబునుంగా నపూర్వసభాభవనంబు పదునాలుగు నెలలు నిర్మించి దాని నెనిమిదివేల రాక్షసకింకరుల మహాకాయుల మహాజవసత్త్వ సంపన్నుల నంతరిక్షచరులం బనిచి మోపించుకొని వచ్చి ధర్మరాజున కిచ్చి........ ధర్మరాజుచేత సత్కృతుండయి మయుం' డరిఁగెను.
—నన్నయ. భార. సభా. 1-14

ఈ వర్ణనమును పరిశీలించినచో ననేకశిల్పవిశేషములు తెలియగలవు.

మయుఁ డీ సభాభవనము నందు నానావిధయంత్రముల నమర్చినాఁ డని నన్నయ వ్రాసినాఁడు కాని వ్యాసభారతము నం దీ యంత్రప్రసక్తి గానరాదు. నన్నయకు లభించిన మహాభారత ప్రతి యం దీ యంత్రవర్ణనము లుండియుండవచ్చును.

సభాభవనము, 'వివిధ విచిత్ర పతాకా విలంబిత తోరణవిటంక ప్రదేశములు' కలిగి యున్నట్లు నన్నయ వర్ణించినాఁడు. [సభా. 1.14]

ఇట పతాకా తోరణ శబ్దములు శిల్పశాస్త్రవిషయిక సాంకేతిక పదములు.

---

* " And beholding that tank thus adorned all round with Jewels and Precious Stones many kings that came there mistook it for land and fell into it with eyes open". —P. C. Roy. Mbh - Sabha.

'పతాక' యనఁగా చిత్రవిశేషరచనాదిశైలి. ఇది శిల్ప సమయము.[1]

గ్రామములందుఁ గాని నగరము లందుఁ గాని భూపాలధనికాది సకలమానవ గృహములందును, దేవాలయములందును, సకలవిధద్వారముల యూర్ధ్వభాగములందుఁ గాని, యథోభాగములందుఁ గాని ద్వారబంధముల కడ్డుగా నుండు పట్టికల యందు పతాకాఖ్య చిత్రరచన చేయఁబడును.

ద్వారతిర్యక్పట్టికాసు స్తంభప్రస్తరమౌళిషు ।
తిర్యగ్దారుషు సోపానపట్టికాసు విశేషతః ॥
దేవస్థానేషు పర్యంకేష్వపి శాలాసు భూమిషు ।
గవాక్షేషు కవాటేషు వేదికాస్వాదనేషు చ ॥
పూతికాసూపపీఠేషు నానావక్త్రేషు మేళిషు ।
పతాకా వివిధా యోజ్యా కల్పవై స్తక్షజైరపి ॥

— విశ్వకర్మవాస్తుశాస్త్రమ్ అ. 42. 1-3

ముఖప్రతిముఖాది పతాకాఖ్య చిత్రక్రియల నెచ్చటెచ్చట నేయే సాధనములతో — శిల్పాయుధములతో — నే విధముగా చేయవలయునో ఆయా విషయములు వంశపారంపర్యముగా శిల్పాచార్యుల వలనఁ దెలిసికొనఁనగును.[2]

తోరణ మనఁగా గోడల చివర శోభార్థము శిలాదారుసుధాదులతో శిల్పుల చేతఁ జేయఁబడు చిత్రరచన.*

1. చూడు :- విశ్వకర్మవాస్తుశాస్త్రమ్. అ. 42. పు. 462.

"అత్ర తు శిల్పశాస్త్రే పతాకాశబ్దేన చిత్రవిశేష
రచనాశైలీ ఉపపాద్యత ఇతి సమయః । "
—అని వ్యాఖ్యాత అనంతకృష్ణభట్టారకుఁడు వివరించినాఁడు.
"పతాకా వైజయంతికా" యను నిఘంటుర్థ మిచట పొసఁగదు.

2. అదే ... ...

"శిల్పాచార్యపరంపరోపదేశాభిరేవ జ్ఞాతుం శక్యమ్' —అనంతకృష్ణభట్టారక.

* తోరణ ద్వారములను గురించి యీ ప్రకరణము నందే మఱియొక చోట వివరింపఁబడినది.

సభామందిరద్వారతోరణములు సింహములతోఁ గాని, కల్పవృక్షములతో గాని యలంకరింపఁబడ వలయు నని మానసారముని తెలిపినాఁడు.

పశ్చాత్ సింహైశ్చైవ కల్పవృక్షం చ తోరణమ్ ॥

—మానసార. 49-165*

విటంక మనఁగా పావురపుగూడు, కపోతపాలిక. (సూ.ని)

కొణిగ యందలి గువ్వగూడు. (శ.ర)

కావున 'వివిధవిచిత్రపతాకావిలంబితతోరణవిటంకప్రదేశములనఁగా తోరణ ద్వారముల పై భాగము నందలి తిర్యగ్దారుపట్టికల పై పతాకాఖ్యచిత్రరచన చేయఁబడి యున్న దనియు, ద్వారబంధముల కిరుప్రక్కల నుండు పట్టికల పై చూతపత్రాది చిత్రరచన చేయఁబడి యున్న దనియు నా పట్టిక లా తోరణపుఁగమ్ముల నుంచి వ్రేలాడు చున్న వనియు నూర్ధ్వతిర్యక్పట్టికలు కలియుతావుల విటంకప్రదేశము లున్న వనియు తెలియుచున్నది.

* సమరాంగణసూత్రధారము నందు మఱికొన్ని విశేషములు గలవు. (చూడు :– అ 18. పుట 91)

హర్మ్యద్వారే గృహద్వారే తథా హర్మ్యావలోకనే
ప్రాకారాంతరపృష్ఠేషు యా చ ప్రాసాదికా భవేత్
పార్శ్వయో రుభయోరేషాం ఫలకద్వయ ముచ్ఛ్రితమ్ ।
ఉపర్యుపరి సంక్షిప్త మర్ధచంద్రద్వయాకృతి.

—౦—

## మయమాయ

'దుర్యోధనుండు శకునియుం దానును సభావిభవంబుఁ జూచు వేడుక కొన్ని దినంబు లుండి యొక్కనాఁడు దాని యపూర్వ రమణీయతకు విస్మితుఁ డగుచు నయ్యయిప్రదేశంబులఁ గ్రుమ్మరువాఁడు.

వివృతంబైన ద్వారదేశంబు సంవృతంబుగా వగచి చొరనొల్లక,

సంవృతంబైన దాని వివృతంబుగా వగచి చొరంబోయి లలాటఘట్టితగృహద్వారుండయి,

సమప్రదేశం బున్నతంబుగా వగచి యెక్క సమకట్టి,

నీలాశ్మరశ్మిస్థగితం బైన విమలమణిస్థలంబు జలాశయంబుగావగచి పరిధానం బెగద్రోచికొని,

స్ఫటికమణిదీప్తిజాలపరివృతంబైన జలాశయంబు స్థలంబుగా వగచి కట్టిన పుట్టంబు దడియం జొచ్చి క్రమ్మఱిన

దానింజూచి పాంచాలికయుఁ బాండుకుమారులు నగిరి.'

నన్నయ- సభా. 2-86.

మయమాయామోహితుం డయిన దుర్యోధనుఁడు తన యనుభవములను నిజ జనకునితో నిట్లు చెప్పెను :—

'నిర్మలస్ఫటికశిలానిర్మితంబై శశిప్రకాశంబై వివిధరత్నప్రభాభాసురంబైన యా సభావిభవంబు చూచు వేడుక నందుఁ గ్రుమ్మరువాఁడ హరినీలబద్ధస్నిగ్ధమణిస్థలంబునందు జలబుద్ధిం జేసి పరిధానోత్కర్షణంబు సేసి, విమలశిలాతలబుద్ధి నుదకపూర్ణం బయిన వాపి సొచ్చి కట్టినపుట్టంబు దడియం ద్రెళ్ళిన నన్నుంజూచి వృకోదరుండు నగియె దాని నంతయు నెఱింగి ధర్మరాజచోదితు లయిన కింకరులు నాకుం బరిధానంబులు దెచ్చియిచ్చిరి. మఱియు వివృతద్వారంబుఁ గవాటఘటితం బని చొర నొల్లక కవాటఘటితంబు వివృతంబుగా వగచి చొరంబోయి తత్కవాటస్ఫటికశిలా

ఘట్టితలలాటుండ నైన నన్నుం జూచి యనేకసహస్రవిలాసినీపరివృత యయి యున్న ద్రౌపది నగియె నంత నకుల సహదేవులు పఱితెంచి యిదె వాకిలి యిట వచ్చునది యని నన్నుం దోడ్కొని పోయి రట్టి సభాప్రలంభంబు నాకు హృదయశల్యం బయి యున్నది.'

—నన్నయ. సభా. 2. 240

## మూయఁబడియున్న ద్వారము తెఱచి యున్నట్లగుపడుట.

దుర్యోధనుఁడు, 'సంవృతం బైన దాని వివృతంబుగా వగచి చొరంబోయి లలాటఘట్టితగృహద్వారుం డయి' నట్లును, [సభా 2—86] 'కవాటఘటితంబు వివృతం బుగా వగచి చొరంబోయి తత్కవాటస్ఫటికశిలాఘట్టితలలాటుం డయి' నట్లును [సభా. 2-140] నన్నయ వర్ణించినాఁడు.

మూలం బం దిట్లున్నది.

ద్వారం తు పిహితాకారం స్ఫాటికం ప్రేక్ష్య భూమిపః ।
ప్రవిశన్నాహతో మూర్ధ్ని వ్యాఘూర్ణిత ఇవ స్థితః ॥

—వ్యా.భా. సభా. 47-11

[మూయఁబడి యున్న స్ఫటికశిలామయద్వారమును జూచి తెఱచి యున్నట్లు భావించి, యందు ప్రవేశింపఁబోయి తలకొట్టుకొని దిమ్మదిరిగి నిలుచుండి పోయెను.]

అద్వారేణ వినిర్గచ్ఛన్ ద్వారసంస్థానరూపిణా ।
అభిహత్య శిలాం భూయో లలాటేనాస్మి విక్షతః ॥

—వ్యా. భా. సభా. 50-32

[ద్వారరూపమున నున్న కుడ్యభాగమును — కృత్రిమద్వారమును - చూచి అది నిజమైన ద్వార మనుకొని దాని నుండి బయలు వెడలఁ బోఁగా నా ఫాలాటము కొట్టుకొనినది.

## తెఱవఁబడియున్న ద్వారము మూయఁబడి నట్లగుపడుట.

దుర్యోధనుడు, 'వివృతం బైన ద్వారదేశంబు సంవృతంబుగా వగచి' చొర నొల్ల నట్లును, [సభా. 2.86.], 'వివృతద్వారంబుఁ గవాటఘటితం' బని చొర నొల్ల నట్లును, [సభా 2.140] నన్నయ వ్రాసినాఁడు.

ఈ కవాటము స్ఫటికమణిమయ మయి నట్లు మూలము వలనఁ దెలియు చున్నది.

తాదృశం చ పరం ద్వారం స్ఫాటికోరుకపాటకమ్ ।
విఘట్టయన్ కరాభ్యాం తు నిష్క్రమ్యాగ్రే పపాత హ ॥
ద్వారం తు వితతాకారం సమాపేదే పునశ్చ సః ।
సంవృతం చేతి మన్వానో ద్వారస్థానా దుపారమత్ ॥

— వ్యా.భా. సభా. 47. 12,13

## మణిస్థలము జలాశయముగాఁ గనిపించుట

దుర్యోధనుఁడు, "నీలాశ్మరశ్మిస్థగితం బైన విమలమణిస్థలంబు జలాశయంబుగా వగచి పరిధానం బెగఁద్రోచికొనినట్లును, (సభా. 2.86) హరినీలబద్ధస్నిగ్ధ స్థలంబు జలబుద్ధిం జేసి పరిధానం బెగఁద్రోచికొని........' నట్లును [సభా-2.140] నన్నయ వర్ణించినాఁడు.

ఈ వర్ణనము మూలభిన్నముగా నున్నది.

జలాశయముగా భ్రాంతి గొలుపు నీ మణిస్థలము (కృత్రిమ సరోవరము) బిందుసరము నుండి తెచ్చిన స్ఫటికమణులతో మయుని చేత నిర్మింపఁబడి నట్లు వ్యాసభారతము నందు వర్ణింపఁబడినది.

స్ఫాటికం స్థలమాసాద్య జలమిత్యభిశంకయా ।
స్వవస్త్రోత్కర్షణం రాజా కృతవాన్ బుద్ధిమోహితః ।

— వ్యా.భా. సభా- 47-4

కృతాం బిందుసరో రత్నైః ర్మయేన స్ఫాటికచ్ఛదామ్ ।
అపశ్యం నలినీపూర్ణా ముదకస్యేవ భారత ॥

వ్యా. భా. సభా. 50.25

## జలాశయము మణిస్థలముగాఁ గనిపించుట

దుర్యోధనుఁడు, "స్ఫటికదీప్తిజాలపరివృతంబైన జలాశయంబు స్థలంబుగా వగచి కట్టిన పుట్టంబు దడియం జొచ్చి క్రమ్మఱె'' ననియు (సభా. 2-86), 'విమల శిలాతలబుద్ధి నుదకపూర్ణం బయిన వాపి సొచ్చి కట్టిన పుట్టంబు దడియంద్రెళ్లె.' ననియు (సభా. 2-140) నన్నయ వ్రాసినాఁడు.

మూలము నం దీ వాపి – దిగుడుబావి – స్ఫటికము వలె స్వచ్ఛమయిన నీటి తోను, స్ఫటికమణిమయాంబుజములతోను నిండి యున్నట్లు వర్ణింపఁబడినది.

తతః స్ఫాటికతోయాం వై స్ఫాటికాంబుజామ్ ।
వాపీమత్వా స్థల మివ స వాసాః ప్రాపత జలే ॥

—వ్యా.భా. సభా. 47-6.

పునశ్చ తాదృశీమేవ వాపీం జలజశాలినీమ్ ।
మత్వా శిలా సమాం తోయే పతితోఽస్మి నరాధిప ॥

వ్యా.భా. సభా. 50-29.

దుర్యోధనుఁ డీ విధముగా మయకృతశిల్ప చమత్కృతులచేత వంచితుఁ డయ్యెను.

## వర్ణనావైచిత్ర్యము

మయుఁ డిట్టి 'యపూర్వసభాభవనంబుఁ బదునాలుగు నెలలు నిర్మించి దాని నెనిమిదివేల రాక్షసకింకరుల మహాకాయుల మహాజవసత్త్వసంపన్నుల నంతరిక్ష ఛరులం బనిచి మోపించికొని వచ్చి ధర్మరాజున కిచ్చి' నట్లు నన్నయ వర్ణించినాఁడు.

నన్నయ భార. సభా 1-14

సభాభవననిర్మాణ మెచట జరిగినది ? ఇంద్రప్రస్థపురము నందు కాదా ? మయుఁడు బిందుసరము నందు నిక్షిప్తమై యున్న రత్నోపకరణములను గొనివచ్చి వానితో సభాభవనము నింద్రప్రస్థము నందే నిర్మించినాఁడు గదా! మఱి దానిని రాక్షస కింకరులతో మోపించుకొని వచ్చుట యేమి ? ఈ కింకరు లెవరు ? ఈ వర్ణనము విచిత్రముగ నున్నది.

బిందుసరోవరము నందలి మణిమయభాండమును రక్షించుచున్న కింకరులు మహాశిల్పాచార్యుఁ డయిన మయుని శిష్యులు ననుయాయులు నగు శిల్పపారిశ్రామికులు కావచ్చును. వారే సభానిర్మాణమున కుపయోగపడు సామాగ్రి నంతయు నింద్రప్రస్థమునకు మోసికొని తెచ్చి యుండవచ్చును. ఆ యెనిమిదివేల శిల్పపారిశ్రామికులతో మయుఁ డా సభా భవనమును పదునాలుగునెలలు నిర్మించి యుండవచ్చును.

మయుని ఆజ్ఞచే కింకరులను రాక్షసులా సభాభవనమును రక్షించుచున్నట్లు, మోయుచున్నట్లు వ్యాసభారతము నందు వర్ణింపఁబడినది.

తాం స్మ తత్ర మయోనోక్తా రక్షంతి చ వహంతి చ ।
సభా మష్టౌసహస్రాణి కింకరా నామ రాక్షసాః ॥
అంతరిక్షచరా ఘోరా మహాకాయా మహాబలాః ।
రక్తాక్షాః పింగలాక్షశ్చ శుక్తికర్ణాః ప్రహారిణః ॥

—వ్యా.భా. సభా. 3-23.29

* "And eight thosand Rakshasas called Kinkaras, fierce, large-bodied and endued with great strength with red coppery eyes and arroury ears, well armed and capable of ranging through air, used to guard and support that palace"

—P.C. Roy. Mbh- Sabha.

పోల్చు : వ్యా భా సభా. 48-8. "తేనచైవ మయోనాప్తాః కింకరా నామరాక్షసాః
వహంతి తాం సభాం భీమాస్తత్ర కా పరిదేవనా

పోల్చు :- "గుహ్యకైరూహ్యమానా సా ఖే విషక్తేవ శోభతే ॥" -వ్యా.భా. 10-3

కుబేర సభ గుహ్యకులచేత మోయఁబడు చున్నట్లున్నది.

ఈ వర్ణనము ననుసరించి సభాభవనము యొక్క పీఠము—అధిష్ఠానము — రక్తాక్షులు, పింగళాక్షులు, శుక్తికర్ణులు, మహాకాయులు నగు కింకరు లను రాక్షసులు మోయుచున్నట్లు నిర్మింపఁబడిన దని బనారసు విశ్వవిద్యాలయ వాస్తుశిల్పశాఖాధ్యక్షుడు డా॥ వాసుదేవ శరణ్ అగ్రవాలా వివరించినాఁడు. * ఇది శిల్పదృష్టి.

మయకృత శిల్పచమత్కారములలో నిది యొకటి.

మయుఁ డిట్టి సభాభవనమును పదునాలుగు నెలలలో నిర్మించి ధర్మరాజునకు సమర్పించినాఁడు.

ఈదృశీం తాం సభాం కృత్వా మాసైః పరిచతుర్దశైః ।
నిష్ఠితాం ధర్మరాజాయ మయో రాజ్ఞో న్యవేదయత్ ॥

వ్యా. భా. సభా. ౩-౩౭

## సభా ప్రవేశము

ఈ విధముగా మనోహరమైన సభాభవనమును నిర్మించి యిచ్చి ధర్మరాజు చేత సత్కృతుండయి మయుండరిగిన,

వీరుఁడు ధర్మజుండు పదివేవురు విప్రుల కొప్పఁ బాయసా
హారము భక్తిఁ బెట్టి మఱి యందఱకుం జెటి వేయి వేయి వి
స్తారయశుండు ధేనువుల ధర్మవిధిన్ మణిముదికావ్యలం
కారదుకూలపుష్పఫలగంధయుతంబుగ నిచ్చి లీలతోన్.

అనుజసహితుం డయి దైవజ్ఞదత్తశుభముహూర్తంబున ధౌమ్యాది భూసురాశీర్వాదపుణ్యాహనాదంబు లెసంగ సభాప్రవేశంబు సేసె.

—నన్నయ. సభా. 1. 14. 15. 16.

---

* Cf :- Dr V. S. Agarwala = Studies in Indian Art. P 57
"The basement of the palace was supported on the heads of Atlantes dwarfs (Kinkaras) with picked ears (Sanku Karna) — — ...."

దీనిని బట్టి మహాభారతకాలమునందు సభాభవననిర్మాణము పూర్తియైనంతనే శిల్పివర్యుని సత్కరించుట, శుభముహూర్తమున పుణ్యాహవచనపురస్సరముగా నూతనభవనమును ప్రవేశించుట, బ్రాహ్మణులకు పాయసాన్నములిడుట, హిరణ్య గోవస్త్రదానములు చేయుట మొదలగు సంప్రదాయములు పాటింపఁబడు చుండెడి వని తెలియుచున్నది.

## మయసభా విశేషములు

1. దేవశిల్పి యయిన విశ్వకర్మచేత నిర్మింపఁబడిన యింద్రప్రస్థ పురమునందు అమరశిల్పి యయిన మయుఁడీ సభను నిర్మించుటయే యొక ముఖ్య విశేషము ఇది ఆర్య-ద్రావిడ శిల్ప సంప్రదాయమున కొక చక్కని యుదాహరణము.

2. సభాభవన నిర్మాణము నందు స్ఫటికమణు లెక్కువగా నుపయోగింపఁబడినవి. అవి చక్కగా మెఱుఁగుపెట్టబడినవి. సభ 'మణిప్రభ' నొప్పఁగ నిర్మింపఁ బడినది. ఇట్లు ప్రభా సంపన్నముగా నిర్మించుట పారశీక శిల్ప సంప్రదాయ మని కొందఱు పండితు లభిప్రాయపడుచున్నారు.

3. ఈ సభ దేవదానవ మానవ శిల్పకల్పనా కల్పితమై యుండుటచే నిది యపూర్వమైనది.

4. సభ యందు మయుఁడు చేసిన శిల్పచమత్కారము లపూర్వములు; అప్రతి మానములు. అవి మయుని శిల్పకలాకుశలత్వమునకు తార్కాణములు

5. సభాభవన నిర్మాణమునకు ముందు, నిర్మాణానంతరమును భవననిర్మాత యగు మయుఁడు ధర్మరాజు చేత సత్కృతుండయినాఁడు.

6. స్ఫటికమణులతోఁ, స్వర్ణమయ స్తంభములతోఁ గట్టఁబడిన మయసభ హస్తినా పురమునందు తాదృశమైన సభా నిర్మాణమునకు రాజులకు, నిర్మాతలకు స్ఫూర్తి నిచ్చినది.

7. మహాభారతకాలమున రాజులు శిల్పకళాభిమానులై సంప్రదాయభేదములను పాటింపక, సౌందర్యదృష్టికే ప్రాధాన్యమొసఁగుచు శిల్పకళలను ప్రోత్స హించుచుండిరని తెలియుచున్నది.

# ధృతరాష్ట్ర మహాసభాభవనము

స్థూణా సహస్రైర్ బృహతీం శతద్వారాం సభాం మమ।
మనోరమాం దర్శనీయా మాశు కుర్వంతు శిల్పినః॥

—వ్యా. భా. సభా. 49-48.

వేయి స్తంభములు, నూఱు ద్వారములు గల మనోహరమైన సభాభవనము నొక దానిని సత్వరముగ నిర్మింపవలయు నని ధృతరాష్ట్ర మహారాజు శిల్పుల నాజ్ఞాపించినాఁడు.

## నిర్మాణహేతువు

ఈ పరిణామమునకు మూలకారణము మయసభయే.

మయకృతశిల్పచమత్కృతుల చేత వంచితుఁడైన దుర్యోధనుఁడు "సకల జనమనోనయనోత్సవంబయిన తత్సభాలక్ష్మి తన మనోనయనంబుల కగ్నిజ్వాలయుం బోలె మహాదాహంబు సేయుటయు సంతప్తుండై[1]....సకలసుఖోపభోగవిముఖుం డయి యెవ్వరి తోడం బలుకకున్న" తన్నోదార్చెడి శకునికి దుర్యోధనుం డిట్లనియె.

"నీవును జూచి తట్టి సభ నేని వినంబడ దే యుగంబులన్
భూవలయంబులో నిది యపూర్వము సర్వమనోజ్ఞ మిష్టభో
గావహ మేక్రియం బడసెనయ్య మహాత్ముఁడు దాననేమి సం
భావితభాగ్యుఁడయ్యెను ప్రభాకరతేజుఁడు ధర్మజుం డిలన్.[2]

.... .... .... ....

అతులపరాక్రమార్జితము లైన ధనంబుల పేర్మిఁ జేసి యు
న్నత మగు చున్న పాండునరనాథతనూజుల లక్ష్మి నా కస
మ్మత మయి సూ పెలింగె విను మాతుల మానధనాఢ్యు లైన భూ
పతి సహియింప నోపునె సపత్నుల వృద్ధియు నాత్మహానియున్

1. నన్నయ. భార. సభా. ౨-౬౮
2. ... అదే ... 2-95

వ. "ఏమి సేయుదము పాండవులక్ష్మి యెవ్విధంబున మనకపహరించికొననగు" ననిన దుర్యోధనునకు శకుని ధృతరాష్ట్రినను జ్ఞానము వడయుఁడు నది సమకూరు నని వానిం దోడ్కొని ధృతరాష్ట్రు నొద్దకుఁ జని దుర్యోధనుని దుస్థితిని తెలిపెను.

దుర్యోధనుఁడు ధర్మజుని రాజసూయాధ్వరవిశేషములను మయసభ యందు తాను బొందిన పరాభవమును, పాండవుల రాజ్యలక్ష్మి వైభవమును వర్ణించి చెప్పి

"కష్టపురుష నట్టు లొరుల పేర్మిఁ జూచు చుండఁ బెద్దయు నే నోప"నని వాపోయెను.

అంతట శకుని "మాయాదురోదరవ్యాజమున పాండవుల లక్ష్మి నపహరించి యిత్తు" నని ధైర్యము చెప్పెను.

దుర్యోధనుఁడు శకునిమతంబున కొడంబడవలయు నని తండ్రిని ప్రార్థించెను; "దీని కొడఁబడవేని నేఁడ యీక్షణమ సర్వభక్షుచే భక్షితుండ నగుదు" నని బెదరించెను.

ధృతరాష్ట్రుఁ డదిరిపడి "దుఃఖవివశాత్ముఁడయ్యె నెద నది యుచితముగా దని వగచుచు నాత్మజున కాహ్లాదముగా" ద్యూతార్థము సభాభవననిర్మాణమున కాజ్ఞాపించెను.

## సహస్రస్తంభ సభాభవనము

"అప్పుడు వేవురుశిల్పాచార్యుల రావించి కనకరత్నఖచిత స్తంభసహస్రంబులను విచిత్రద్వారశతంబును వివిధరత్నరుచిర ప్రదేశంబునుం జేసి రమ్యంబుగా నొక్క సభ నిర్మింపంబనిచె" నని నన్నయ వ్రాసినాఁడు.

[నన్నయ. సభా. 2-139]

ఈ సభాభవననిర్మాణమును గూర్చి ధృతరాష్ట్రుఁడు రెండు పర్యాయములు చెప్పి నట్లు మూలము నందున్నది.

మొదట దుర్యోధనుని దుఃఖోపశమనార్థము ధృతరాష్ట్రుఁ డిట్లాజ్ఞాపించెను.

స్థూణాసహస్రైర్ బృహతీం శతద్వారాం సభాం మమ।
మనోరమాం దర్శనీయా మాశు కుర్వంతు శిల్పినః॥
తతః సంస్తీర్య రత్నైస్తాం తక్ష ఆనాయ్య సర్వశః।
సుకృతాం సుప్రవేశాం చ నివేదయత మే శనైః॥
దుర్యోధనస్య శాంత్యర్థ మితి నిశ్చిత్య భూమిపః॥

—వ్యా. భా. సభా. 49—48, 49 *

"రాజశిల్పులు వేయి స్తంభములు, నూఱు ద్వారములు, చక్కని ప్రవేశ ద్వారము గలిగి మనోహరమయిన మహాసభాభవనమును శీఘ్రముగా నిర్మింప వలయును. పిమ్మట వివిధ దేశము లందలి మణికారకులను (తక్షకులను) బిలిపించి, సభాభవన మంతయు రత్నఖచితము గానింపవలయును. ఈ పని త్వరగా పూర్తి చేసి నాకు తెలుపుఁడు"—అని.

ధృతరాష్ట్రుఁ డిట్టి యాజ్ఞలతో దుర్యోధనుఁడు శాంతించుననుకొనెను. కాని యాతఁ డూరడిల్ల లేదు. మయసభా ప్రలంభనమును మరల మరల జ్ఞాపకము చేసికొని, దురోదరార్థము సభాభవనము త్వరగా నిర్మింప నాజ్ఞాపింపు మని ధృతరాష్ట్రు నర్థించెను.

సభాం క్షిప్రం త్వమిహాజ్ఞాపయస్వ।

వ్యా. భా. —సభా. 56. 13

"* Let artificers be employed to erect, without delay, delightful and handsome and spacious palace with an hundred doors and a thousand columns. And having brought carpenters and Jouiers, set ye Jewels and precious stones all over the walls."

— P. C. Roy - Mbh-Sabha-Ch. 49.

ఇట తక్షు లనగా కాష్ఠశిల్పులనియు, సూత్రధారు లనియు పి. సి. రాయ్ అనువదించినాఁడు.
డా॥ సాతవలేకర్ "మణికారకు" లని సందర్భోచితముగా ననువదించినాఁడు.
దీనిని బట్టి మహాభారతకాలమున తక్షకులే మణికారకులు గూడ నైయుండు రని తెలియవచ్చును.

విధి యనుల్లంఘనీయ మని ధృతరాష్ట్రుడు సభానిర్మాణమున కాజ్ఞాపించెను. ఈ మారు సభారచనమునకు కొన్ని సూచనలు చేసెను.

## తోరణ స్ఫాటికము

సహస్ర స్తంభాం హేమవైడూర్యచిత్రాం।
శతద్వారాం తోరణస్ఫాటికాఖ్యామ్॥*
సభా మగ్ర్యాం క్రోశమాత్రాయతాం మే।
తద్విస్తారా మాశు కుర్వంతి యుక్తాః॥

— వ్యా.భా. సభా. 56-18

"సభాభవనము నందలి సహస్ర స్తంభములు స్వర్ణమయములై వైడూర్యము లతో చిత్రముగ నలంకరింపఁబడవలయును. దానికిఁగల నూఱు ద్వారములు నట్లే యుండవలయును. సింహద్వారము — తోరణ ద్వారము — స్ఫటికమణులతో నిర్మింపఁబడవలయును. ఈ సభాభవనమునకు "తోరణస్ఫాటిక" మని పేరు పెట్టవలెను.

సభాభవనము ఒక క్రోశము (2 మైళ్ళు) పొడవు, అంతే వెడల్పు గలిగి చతురస్రాకారముగా నుండవలయును. ఈ పని యంతయు శీఘ్రముగా జరుగ వలయును."

## దక్షులైన శిల్ప పండితులు

ఈ విధముగా ధృతరాష్ట్రునిచేత నాజ్ఞాపితు లయిన శిల్పులు సందియములు లేక సభానిర్మాణమునకుఁ గడగిరి.

శ్రుత్వా తస్య త్వరితా నిర్మిశంకాః
ప్రాజ్ఞా దక్షా స్తాం తదా చక్రు రాశు।

* " to be called the cry tal-arched palace"

—P C. Roy

సర్వద్రవ్యాన్యుపజహ్రుః సభాయాం
సహస్రశః శిల్పినశ్చైవ యుక్తాః॥
కాలేనాల్పేనాథ నిష్ఠాం గతాం తాం
సభాం రమ్యాం బహురత్నాం విచిత్రామ్।
చిత్రైర్హైమై రాసనై రభ్యుపేతా
మాచఖ్యుస్తే తస్య రాజ్ఞః ప్రతీతాః॥*

— వ్యా.భా. సభా 56 — 19, 20

ప్రాజ్ఞులును దక్షులును నైన వేలకొలది శిల్పులు శీఘ్రముగ సభాభవనమును నిర్మించి, యందుండదగిన సమస్త ద్రవ్యములను సమకూర్చి రాజు నొద్దకు వచ్చి సభాభవనము బహురత్నములతో రమ్యముగను విచిత్రముగను నిర్మింపబడిన దనియు, చిత్రమయిన సువర్ణమయాసనములతో నిండియున్న దనియు విన్నవించిరి.

ధృతరాష్ట్రుఁ డంతట విదురుని బిలిపించి,

"అనుపమరత్నకాంచన చయాంచిత మీ సభ"[1] దీని దర్శనం

బనుఁ దనపుండు దానుఁ దనతమ్ములు నిందుల కేగుదెంచి చూ

చినఁ గడు సంతసం బగు విశిష్టజనస్తుత నీవు వానిఁ దో

డ్కొని చనుదెమ్ము ఘనసురసఖున్ బుధబంధుజనానురంజనున్.

* "Hearing those words of his, thousands of artificers endued with wisdom and skill soon erected the palace with the greatest alacrity and having erected it brought thither every kind of article."

– P.C. Roy, Mbh. Sabha Ch. 56-P 154

1. వ్యా.భా. సభా. 56-22

సభేయం మే బహురత్నా విచిత్రా
శయ్యాసనై రుపపన్నా మహార్హైః।
సా దృశ్యతాం భ్రాతృభిః సార్ధమేత్య
సుహృద్ద్యూతం వర్తతా మత్ర చేతి॥

ఇట్టి విచిత్రరత్నసభావేదికాతలంబున నతండును దుర్యోధనుతోడం బ్రొద్దుపోక సుహృద్ద్యూతంబుఁ బ్రవర్తించు" నని చెప్పి ధర్మరాజాదులను బిలిచికొని వచ్చుటకు పంపినాఁడు. [నన్నయ. భార. సభా. 2.152, 153]

ధర్మజుఁడు వచ్చి యా సభాభవనమును జూచి మెచ్చుకొనినాఁడు.

ఆ ధృతరాష్ట్రుచేసిన యనర్ఘమణిప్రకారానుబద్ధ శో
భాధృతి నొప్పుచున్న సభ పార్థివముఖ్యుఁడు ధర్మజుండు దు
ర్యోధనుఁ డర్థిఁ జూపఁగ సహోదరవీరులుఁ దానుఁ జూచి ల
క్ష్మీధరమూర్తి యెంతయును మెచ్చె మనంబునఁ దద్విభూతికిన్.

—నన్నయ. భార. సభా. 2-162

## హస్తిన యందలి ధృతరాష్ట్రు సభాభవన విశేషములు

1. సభాభవనము చతురస్రాకారముగ నున్నది. పొడవు వెడల్పులు క్రోశ మాత్రము. [క్రోశ మనఁగా 500 దండములు] ఇది మయసభ కంటె చిన్నది.

2. ఈ సభాభవననిర్మాణము నందు స్తంభములకు ప్రాధాన్యమీయఁబడినది. ఇది ఆర్యశిల్పసంప్రదాయము. దీనికి వేయి స్తంభములు, నూఱు ద్వారములు. మిత్రావరుణుల సభాభవనము వేయి స్తంభములతో నిర్మింపఁబడి నట్లు ఋగ్వేదము నందు వర్ణింపఁబడినది.

రాజానా వనభిద్రుహా ధ్రువే సదస్యుత్తమే।
సహస్రస్థూణ ఆసాతే॥ —ఋగ్వేద. 2-41-5.

3. మయసభస్ఫటికమణిమయ మని విన్న ధృతరాష్ట్రుఁడు తన సభకు "స్ఫాటికతోరణ" మను పేరు పెట్టవలె నని చెప్పినాఁడు. అనఁగా తన

సభ కూడ మయసభ వలె మణిమయముకావలె ననియు సింహద్వారము స్ఫటికమణిమయాలంకృతము కావలె ననియు నాశించినాఁడు. కావున నిర్మాణము నందు మయశిల్పపద్ధతి యనుసరింపఁబడినది. ఇది ఆసురీ పద్ధతి. అనఁగా ద్రవిడ శిల్ప సంప్రదాయము.

దీనిని బట్టి హస్తినాపురము నందలి యీ సభాభవనమును నిర్మించిన శిల్ప పండితులు ఆర్యద్రావిడశిల్పసంప్రదాయములు పాటించి రని తెలియుచున్నది.

))0((

# గృహాలంకరణశిల్పము

మహాభారతకాలమున జనులు సంతోషసమయము లందు తమ గృహములను తోరణాములతో చక్కగా నలంకరించుకొనుచుండిరి.

పాండవాగమనము విని వారణావతపురజనులు తమతమ గృహములను కలువదండలతో నలంకరించికొనిరి. ముంగిళ్ల ముందు చందనకస్తూరీమిశ్రితజలములను జల్లుకొని కర్పూరరంగవల్లులు పెట్టికొనిరి.

.... .... .... ....

కలయంగ గృహములఁ గలువడములు[1] కడు
వెలసిల్లె నంబరతలము గప్పి
మలయజమృగమదావిలసలిలంబుల
నిమ్మగా నార్ద్రీకృతమ్ము లయిన

యంగణముల నొప్పెఁ గర్పూర రంగవల్లు
లంగనలు గయిసేసి యుత్తుంగహర్మ్య
తలము లెక్కిరి తత్పురీవిలసనంబుఁ
జూచు పాండుకుమారులఁ జూచు వేడ్క

—నన్నయ. భార. ఆది. 6-149

కృష్ణుఁడు హస్తినాపురము వచ్చుచున్నాఁడని విని దుర్యోధనుఁడు పరిచారకుల నిట్లాదేశించినాఁడు.

అలుకుఁడు మృగమదమున, ముగ్గులు పెట్టుఁడు గప్పురమునఁ గుంకుమమున గోడలు పూయుఁడు, మణిదామకములు గట్టుఁడు పెద్దకూటమున సొంపారన్

మఱియు నగళ్లెల్లను శోభిల్ల నలంకారంబు సేయుండు.

1. కలువడములు : ఉత్సవాదులందు ధ్వజస్తంభాదులకు వ్రేలఁగట్టెడు కలువపూదండలు, ప్రాలంబమాలికలు.

పెనుపుం జతురత మెఱయఁగ
మన యింటను దుస్ససేను మందిరమున శో
భనశిల్పము లొనరింపుఁడు
చనుఁడు వృకస్థలము నందుఁ జప్పరము విడన్

—తిక్కన. భార. ఉద్యోగ. 3.152-4.

## మణికుట్టిమములు

కుట్టిమ మనఁగా ఱాతికట్టడపునేల, తిన్నె.

శిలారత్ననిబద్ధభూమి, నెలకట్టు– అని సూర్యరాయాంధ్రనిఘంటువు.

మణికుట్టిమ మనఁగా మణిస్థగిత మయిన భూమి.

మణిభూమికాకర్మ చతుష్షష్టికళలలో నొకటి-అని వాత్స్యాయనుఁడు చెప్పినాఁడు.* గ్రీష్మర్తువు నందు శయనాపానకార్థము మరకతాదిమణులు పఱవఁబడిన భూమి యని వ్యాఖ్యాత వివరించినాడు.

హస్తిన, కాంపిల్యనగరము, ఇంద్రప్రస్థము, విరాటనగరము మున్నగు రాజధానీనగరములందు మణికుట్టిమములున్నవి.

వాత్స్యాయన: కామసూత్ర. 1-3.16.

* "మణిభూమికా కృతకుట్టిమా భూమిః గ్రీష్మే శయనాపానకార్థమ్
తస్య మరకతాదిభేదేన కరణమ్" — జయమంగళ వ్యాఖ్య.

"Floor decoration with coloured stones and gems".
— Dr. B.N. Vasu—Kamasutra of Vatsyayana

"An inlaid or paved floor, ground paved with small stones". — Dr. V.S Apte-SSED,

"ఈ మునిపల్లె నుండు టిది యేల కరం బనురాగ మొప్పఁగా
భామిని నాకు భార్యవయి భాసురలీల నశేషరాజ్యల
క్ష్మీమహనీయసౌఖ్యముల మేలుగ నందు మనిందిరేందుపా
దామలతుంగహర్మ్యముల హారి హిరణ్మయకుట్టిమంబులన్"

—అని దుష్యంతుఁడు శకుంతల నర్థించినాఁడు.

[నన్నయ. భార. ఆది. 4-54]

ఇట మనోహరము లయిన కుట్టిమములు హిరణ్మయము లని వర్ణింపబడినది.

ద్రౌపదీస్వయంవరసందర్భమున నిర్మింపఁబడిన 'సమాజవాటము' నందును మణికుట్టిమము లున్నవి.

సువర్ణజాలసంవీతైః మణికుట్టిమభూషణైః ।

—వ్యా. భా. ఆది. 184 - 20

ధర్మజుని రాజసూయము చూడ వచ్చిన రాజు లుండుటకుఁ గట్టించిన గృహముల యందును మణికుట్టిమము లున్నవి.

సువర్ణజాలసంవీతాన్ మణికుట్టిమభూషితాన్. ।

—వ్యా. భా. సభా. 34 - 21

హస్తినాపురము నందు ధృతరాష్ట్రుఁడు కట్టించిన సభాభవనము నందును మణికుట్టిమములు గలవు.

"అయ్యపూర్వసభామణికుట్టిమంబున నందఱు సుఖాసీనులయిరి"

—నన్నయ. భార. సభా. 2 - 163

విరాటరాజాంతఃపురము నందును మణికుట్టిమములు గలవు.

ఉత్తర బృహన్నలను బిలిచికొనివచ్చుటకు నర్తనశాల కేగునపుడు,

"అడుగుల మనుగాంతి నయ్యెడఁ బద్మరా
గంబుల నెఱకట్టుకరణి నొప్పె".

—నని వర్ణింపఁబడినది. —తిక్కన. భార. విరాట. 4 - 26

ఈ వర్ణనములను బట్టి మహాభారతకాలము నందు రాజభవనములెల్ల మణికుట్టిమములతో నొప్పుచున్నట్లు తెలియుచున్నది.

# రత్న వేదికలు

రత్నవేదిక లనఁగా రత్నములతో – రాలతో – కట్టఁబడిన యరుగులు.

మహాభారతకాలము నందు భోగలాలసులైన భూపతులకు ప్రత్యేకముగా క్రీడామందిరములు, వాని ముందు రత్నవేదికలు నుండెడివి.

విచిత్రవీర్యుఁడు కాశీరాజదుహిత లయిన యంబికాంబాలికలను వివాహమయి.... .... ....

"అమలసుధారమ్యహర్మ్యతలంబుల
నవకుసుమామోదనందనములఁ
గృతకాద్రికందరక్రీడాగృహాంగణ
వివిధరత్నోపలవేదికలను.... ...."[1]

రమియించుచు కాలము గడపినాఁడు.

సురపతి "హిమవదచలకందరారచిత రత్నవేదికాతలంబున సింహాసనాసీనుండయి యున్న యాదిదేవునిగనెను."[2]

ఇంద్రప్రస్థపురము నందలి భవనములు,

"శశికాంతవేదిపృథుకుంజగళజ్జలనిర్ఝరంబుల"[3] నొప్పుచున్నవి.

రైవతకాచలకందరము,

"విమలవిద్రుమవజ్రవిచిత్రవేదికారాజిఁ"[4] గరంబురమ్యమైయున్నది.

1. నన్నయ. భార. ఆది. 4-217.
2. —ఆదే— 7-272.
3. —ఆదే— 8-72.
4. —ఆదే— 8.171.

అప్పర్వతము నందు కృష్ణార్జును లిద్దరు,

"నొక్క విమలమణివేదిక"[1] యం దభిమతసంభాషణముల నుండిరి.

కృష్ణార్జునులు ఖాండవవనసమీపంబున, "నొక్క చందనలతాభవనచంద్ర కాంతవేదియందు"[2] మందశీతలసురభిమారుతం బనుభవించుచు నిష్టగోష్ఠా వినోదంబుల నుండిరి.

ధర్మజుఁడు "విచిత్రరత్నసభావేదికాతలంబున"[3] దుర్యోధనునితో సుహృద్ద్యూతంబునం బ్రవర్తించు నని ధృతరాష్ట్రుఁడు విదురునితోఁ జెప్పెను.

శక్రపురి యగు నమరావతి యందును మణిమయవేదిక లున్నవి.

"మందాకినీతీరమణిమయవేదికలయందును[4] ఐంద్రికాసుందరంబులైన సికతాతలంబులను మఱియు నిర్జరవిహారస్థానంబుల ననవరతసురతకేళిసౌఖ్యాంబుధి నోలలార్పు" మని యూర్వశి యర్జుననర్థించినది.

ఈ విధముగా రత్నవేదికలు 1. యువతీయువకులు రతిక్రీడలఁదేలుటకు 2. స్నేహితు లిష్టకథావినోదములఁ బ్రొద్దుపుచ్చుటకు 3. జూదములాడుటకు నుపయోగపడుచుండెడి వని తెలియుచున్నది.

1. నన్నయ. భార. ఆది. 8-177.
2. —అదే— 8-233.
3. నన్నయ. భార. సభా. 2-153.
4. నన్నయ. భార. అరణ్య. 1-363.

# చతుశ్శాలా గృహములు

చతుశ్శాలం చతుర్ద్వారై రళిందైః స్సర్వతోముఖమ్।
నామ్నా తత్ సర్వతోభద్రం శుభం దేవనృపాలయే ॥

—మత్స్యపురాణ. 252 - 1

చతుశ్శాల మనఁగా నాలుగు ద్వారములును, నలుప్రక్కల అళిందములు (చిన్నగదులు లేక వసారాలు) గల గృహము. దీనికి సర్వతోభద్ర మని పేరు.

చతుశ్శాలము = నాలుగిండ్ల భవంతి[1] - నలుదిక్కుల నభిముఖముగా నడుమ నెడము విడిచి కట్టిన యిల్లు. —సూర్యరాయాంధ్రనిఘంటువు.

మహాభారతకాలమున జనులు సాధారణముగా చతుశ్శాలాగృహము లందు నివసించుచుండిరి.

మిథిలానగరమున ధర్మవ్యాధుని నివాసస్థానము చతుశ్శాలా గృహమే. కాని అది యొక హర్మ్యముగా వర్ణింపఁబడినది.

ధర్మవ్యాధుఁడు కౌశికుం డను బ్రాహ్మణుని '......అభ్యంతర గృహంబునకు రమ్మని యతనిం దోడ్కొనిచని, మనోహరంబై చతుశ్శాలంబై వివిధసౌరభసంవాసితంబైన హర్మ్యంబు నందు మహితాసనాసీనులైన తన జననీ జనకులం జూపె''

—ఎఱ్ఱన — అరణ్య — 5 - 14

ఈ హర్మ్యము నందు దేవపూజార్థము, శయనార్థము వేఱు వేఱు గదు లున్నట్లు మూలము వలనఁ దెలియుచున్నది.

.... .... .... .... ....

ఇత్యుక్తః స ప్రవిశ్యాథ దదర్శ పరమార్చితమ్।
సౌధం హృద్యం చతుశ్శాల మతీవ చ మనోరమమ్।

1. చతుశ్శాలమ్ = A Square of four brildings,
A quadrangle enclosed by four buildings.
V. S. Apte S S D

దేవతాగృహసంకాశం దైవతైశ్చ సుపూజితమ్ ।
శయనాసనసంబాధం గంధైశ్చ పరమైర్వృతమ్ ।

—వ్యా. భా. వన. 214.4,5,6.

వారణావతమునందు పాండవు లుండుటకు ప్రత్యేకముగా నిర్మింపఁబడిన లక్కయిల్లు చతుశ్శాలాగృహమే.

## లాక్షాగృహము

శిల్పిభిః సుకృతం హ్యాప్తై ర్వినీతై ర్వేశ్వకర్మణి ।
విశ్వస్తం మామయం పాపో దగ్ధుకామో పురోచనః ।

వ్యా. భా. ఆది. 145 - 16

ధృతరాష్ట్రుఁడు పాండవులను వారణావతమునకుఁ బంపుట కంగీకరించినంతనే దుర్యోధనుఁడు తనకు విశ్వాసపాత్రుఁడయిన పురోచనుని బిలిపించి వానితో రహస్యముగా నిటు చెప్పినాఁడు.

"అలఘుతేజుల వారణావతమన్ పురంబునఁ బాండవే
యులఁ బ్రియంబున నుండఁ బంచె గుణోత్తరుండు కురుప్రభుం
డలయ కిప్పుడ నీవు మున్ జని యందు వారికి నుండఁగా
నిలయముల్ రచియింపు నీదగు నేర్పుఁ జూతము చెచ్చెరన్".

"నాకు పరమ విశ్వాసవిషయుండ నీవొక్కరుండవ యిది యనన్యవిషయం బయిన కార్యంబు (అప్రమత్తుండవు) కావున నీవ దీనింజేయవలయు.... నేఁడ చని వారణావతంబున లాక్షాసర్జకరస మిశ్రంబై ఘృతతైలార్ద్రింబయిన మృత్తికాపుంజంబున నొక్క చతుశ్శాల విశాలంబుగా నాయుధశాల సమీపంబున మనోహరంబుగా నవిరళసుధాధవళితంబుగా నిర్మించి యందుఁ బాండవుల నునిచి ... ....పగలు పంచత్వం బెఱింగి రమ్ము."-అని పంచెను.

—నన్నయ. భార. ఆది. 6.139-40

పురోచనుఁడు ధృతరాష్ట్రుని కొలువునం దొక సచివుఁడు.[1] గృహనిర్మాణ శిల్పము నందునేర్పరి. అనఁగా కార్యనిర్మాణకర్త. తనకు పరమవిశ్వాస పాత్రుఁడు. కావుననే దుర్యోధనుఁ డాతని కీ పని నప్పగించినాఁడు. పురోచనుఁడు నిర్మింపవలసిన చతుశ్శాల యెట్లుండవలయునో, యా నిర్మాణమునం దేయే వస్తువుల నుపయోగింపవలయునో దుర్యోధనుఁడే చెప్పినాఁడు.

మూలము నం దిట్లున్నది.

తత్ర గత్వా చతుశ్శాలం గృహం పరమసంవృతమ్ ।
నగరోపాంత మాశ్రిత్య కారయేథా మహాధనమ్ ।
శణ సర్జరసాదీని యాని ద్రవ్యాణి కానిచిత్ ।
ఆగ్నేయాన్యుత సన్తీహ తాని తత్ర ప్రదాపయ ॥
సర్పిస్తైలవసాభిశ్చ లాక్షయా చా ప్యనల్పయా ।
మృత్తికాం మిశ్రయిత్వా త్వం లేపం కుడ్యేషు దాపయ ।
శణం తైలం ఘృతం చైవ జతుదారూణి చైవ హి ।
తస్మిన్ వేశ్మని సర్వాణి నిక్షిపేథాః సమంతతః ॥

—వ్యా. భా. ఆది. అ 144 శ్లో. 8-11

నీవు వారణావతమునకుఁ జని యా నగరము చివర మనోహరమయిన చతుశ్శాలాగృహమును నిర్మింపవలయును. అందు జనము, మద్దిచెట్టు, బదనిక మున్నగు నగ్నిసందీపకద్రవ్యముల నుంపవలయును. నేయి, నూనె, వస, లక్క మట్టితోఁ గలిపి లేపనము చేసి గోడలకుఁ బూయవలయును. — జనపనార, నూనె, నేయి, లక్క, దారువు మున్నగు పదార్థములను గృహము నం దంతటను నిక్షేపింప వలయును.

1. చూడు :- వ్యా. భా. ఆది 144 - 2
"స పురోచన మేకాంత మానీయ భరతర్షభ ।
గృహీత్వా దక్షిణపాణౌ సచివం వాక్యమబ్రవీత్"॥

దుర్యోధనుఁ డొకానొక సచివుని బిలిపించి యిట్లు చెప్పినాఁడనఁగానది రాజాజ్ఞగానే భావింపవలయును. కావుననే, "పురోచనుం డతి త్వరితగతి నరిగి దుర్యోధను కఱపిన రూపున వారణావతంబున లాక్షాగృహంబు రచియించుచుండె."

—నన్నయ. భార. ఆది. 6 - 142

కొన్నాళ్లకు పాండవులు, "వారణావతంబు సొచ్చి సర్వాలంకారసుందరంబైన రాజమందిరంబున నున్న కొన్నిదినంబులకుం బురోచనుండు దన చేసిన చతుశ్శాల సకలజననయనాభిరామంబైన దానిం జూపినం జూచి పాండుసుతులు సంతసిల్లి పురోచన శిల్పాచార్యులం బూజించి పుణ్యాహపురస్సరంబుగా గృహప్రవేశంబు చేసిరి.

—నన్నయ. భార. ఆది 6-150

వ్యాసభారతము వలన మఱికొన్ని విశేషములు తెలియుచున్నవి.

వారణావతము వచ్చిన పాండవులు మొట్టమొదట బ్రాహ్మణ గృహములకు, తరువాత వరుసగా రాజోద్యోగుల గృహములకు, వైశ్యశూద్రగృహములకుఁ జని సత్కారములందుకొనిరి. పిమ్మట పురోచనపురస్సరముగా విశ్రాంతి గృహమునకుఁ జనిరి.

తే ప్రవిశ్య పురీం వీరాస్తూర్ణం జగ్ము రథోగృహాన్ ।
బ్రాహ్మణానాం మహిపాలరతానాం స్వేషు కర్మసు ॥
నగరాధికృతానాం చ గృహాణి రథినాం తదా ।
ఉపతస్థుర్నరశ్రేష్ఠా వైశ్యశూద్రగృహాణ్యపి ।
అర్చితాశ్చనరైః పౌరైః పాండవా భరతర్షభ ।
జగ్ము రావసథం [1] పశ్చాత్ పురోచనపురస్సరాః ॥

— వ్యా. భా. ఆది. 146 . 6-8

ఈ "ఆవసథము" నే నన్నయ రాజమందిరముగా వర్ణించినాఁడు.

1. ఆవసథః = A dwelling place; A resting place, asylum.

# మాయాగృహము

పాండవులా రాజమందిరము (విశ్రాంతిభవనము) నందు పదిరాత్రులు గడపిన పిమ్మట పురోచనుఁడు తాను పాండవుల కొఱకు సకలజననయనాభిరామముగా నిర్మించిన చతుశ్శాలను వారికిఁ జూపఁగా గుహ్యకులు కైలాసమును వలె పాండవులా చతుశ్శాలాగృహమును ప్రవేశించినారు.

దశరాత్రోషితానాం తు తత్ర తేషాం పురోచనః ।
నివేదయామాస గృహం శివాఖ్యం[1] మశివం తదా ॥
తత్ర తే పురుషవ్యాఘ్రా వివిశుః సపరిచ్ఛదాః ।
పురోచనస్య వచనాత్ కైలాస మివ గుహ్యకాః॥

—వ్యా. భా. ఆది. 146–10, 11.

ఆ చతుశ్శాలాగృహము పేరు "శివము." కాని యది యమంగళకరమైనది. నన్నయ దీనిని "మాయాగృహ"మనినాఁడు.

"అంతం బరాభిప్రాయమాయోపాయప్రయోగవిదుండైన ధర్మతనయుండు దాని కృత్రిమరమణీయత నుపలక్షించి యల్లన భీమున కిట్లనియె.

ఈ గృహకుడ్యంబులు లా
క్షా గర్భము లాజ్యతైలగంధులు మఱి శ
స్త్రాగారసమీపము మా
యాగృహ మగు నిది యవశ్య మాగ్నేయంబై."

నన్నయ. ఆది. 6-150, 151.

మూలమునం దిట్లున్నది.

జిఘ్రాణోఽస్య వసాగంధం సర్పిర్జతువిమిశ్రితమ్ ।
కృతం హి వ్యక్త మాగ్నేయ మిదం వేశ్మ పరంతప ॥
శణసర్జరసం వ్యక్త మానీయ గృహకర్మణి ।
ముంజబల్వజవంశాదిద్రవ్యం సర్వం ఘృతోక్షితమ్ ॥

1. శివ మిత్యాఖ్యామాత్రం అర్థత స్త్వశివం మరణార్థం కృతత్వాత్ ॥
— నీలకంఠ.

శిల్పిభిః సుకృతం హ్యాప్తై ర్వినీతై ర్వేశ్మకర్మణి ।
విశ్వస్తం మామయం పాపో దగ్ధుకామః పురోచనః ॥

వ్యా. భా. ఆది. 146. 14_16.

సర్పిర్జతుమిశ్రితమై వసాగంధయుక్తముగా నున్న యీ గృహ మాగ్నేయము. అగ్నిదాహమున కనుకూలముగ నున్నది. ఈ గృహనిర్మాణము నందు నేతితోఁ దడుపఁబడినలక్క, మద్దిచెట్టు బదనిక, జనుము, ముంజగడ్డి, మొదవగడ్డి, వెదురుగడలు మున్నగు నగ్నిసందీపకద్రవ్యము లుపయోగింపఁ బడినవి. దీనికి నిప్పంటింపవలెనను దురుద్దేశముతోడనే పురోచనుఁడు గృహశిల్పము నందు నేర్పరులును, విశ్వాసపాత్రులు నగు శిల్పుల చేత నిట్టి (మాయా) గృహమును గట్టించినాఁడు.

శస్త్రాగారము ప్రక్కనే గల యీ లాక్షాగృహము చుట్టు ప్రహరి యున్నది. దానికి ప్రవేశనిర్గమనముల కొకే మార్గము గలదు. కాని వెలుపలికి పోవుటకు వేఱు మార్గము లేదు.

సమృద్ధ మాయుధాగార మిదం తస్య దురాత్మనః ।
వప్రాంతం నిష్ప్రతీకార మాశ్రిత్యేదం కృతం మహత్ ॥*

వ్యా. భా. ఆది. 147-13.

పాండవు లిట్టి చతుశ్శాలా గృహమున షణ్మాసము లుండిరి.

## సురంగమార్గము

విదురుఁడు దుర్యోధనుదుర్మంత్ర మంతయు నిమ్మగా నెఱింగి దానిని వమ్ముచేయు నుపాయ మాలోచించి, కడు విశ్వాసి యగు నొక్కఖనకు నతికుశలుం బంపఁగా వాఁడు, పాండవులు

"లక్కయిల్లు వెలువడు నట్లుగా నొక్క బిలంబు నెవ్వరు నెఱుంగకుండం జేసి వారల కెఱింగించిన భీముండు దాని నిమ్మగా శోధించి యెఱింగియుండె"

—నన్నయ. ఆది. 6.158

---

*వప్రాంతం ప్రాకారములకు నిష్ప్రతీకారం బహి
ర్నిర్గమనప్రకారశూన్యమ్ ॥ —నీలకంఠ

లాక్షాగృహగర్భము నుండి త్రవ్వఁబడిన యీ సురంగమార్గమన్యులకు గోచరము గాకుండ భూమితో సమానముగ నుండునట్టి కవాటముతోఁ గప్పఁబడినది.

పరిఖాముత్కిరన్ నామ చకార చ మహాబిలమ్॥
చక్రే చ వేశ్మనస్తస్య మధ్యేనాతిమహద్బిలమ్।
కపాటయుక్త మజ్ఞాతం సమం భూమ్యాశ్చ భారత॥

—వ్యా. భా. ఆది 147-16, 17

లక్కయింటి నుండి పాండవు లీ సురంగమార్గము నుండియే తప్పించుకొని పోయిరి.

## ఈ వర్ణనములవలనఁ దెలియఁదగు విశేషములు

మహాభారతకాలమున జనులు సాధారణముగా నాలుగిండ్ల భవంతులతో నివసించుచుండిరి.

ఈ యిండ్లగోడలు మట్టితో నిర్మింపఁబడుచుండెడివి. పై కప్పునకు కర్ర దూలములు, వెదురుగడలు, ముంజగడ్డి మొదలగు పదార్థముల నుపయోగించుచుండిరి.

ఇంటిచుట్టు ప్రవేశనిర్గమనముల కొకేమార్గము గల ప్రాకారములు నిర్మించుకొనుచుండిరి.

గృహములకు వెల్లవేసికొనుచుండిరి. శుభప్రద మయిన పేర్లు పెట్టుకొనుచుండిరి.

గృహనిర్మాణశిల్పమునందు నేర్పరు లయిన శిల్పులు ఒకానొకశిల్పాచార్యుని పర్యవేక్షణములో పనిచేయుచుండిరి.

గృహనిర్మాణము పూర్తియైనంతట శిల్పాచార్యుని పూజించి పుణ్యాహవచన పురస్సరముగా గృహప్రవేశము చేయుచుండిరి.

))o((

# క్రీడా గృహములు

పాపబుద్ధి యందుఁ గృతనిశ్చయుండై దుర్యోధనుండు ఒక్కనాఁడు జల క్రీడావసరంబున

వేడుక నొక్కరుండు శతవీరకుమారులతోడఁ జల్లు పో
రాడి జయించి యందఱ ననంతపరిశ్రమ పారవశ్యముం
గూడి ప్రమాణకోటి ననఘుండు సమీరణనందనుండు మే
యాడక నిద్రవోయె శిశిరానలముల్ పయి వీచుచుండగన్.

ఆ పవనజు నతిఘనలతి
కాపాశావలుల నంటఁ గట్టించి మహా
కోపమున గంగమడువునఁ
ద్రోపించె సుయోధనుండు దుష్టాత్ముండై.

— నన్నయ. భార. ఆది. 5 - 162-71

వ్యాసభారతమునం దీ ఘట్టమున దుర్యోధనుఁడు జలక్రీడార్థము గట్టించిన క్రీడాగృహవిశేషములు వర్ణింపఁబడినవి.

# ఉదక క్రీడనము

తతో జలవిహారార్థం కారయామాస భారత।
చైలకంబల వేశ్మాని విచిత్రాణి మహాన్తి చ॥
సర్వకామైః సుపూర్ణాని పతాకోచ్ఛ్రాయవంతి చ।
తత్ర సంజనయామాస నానాగారాణ్యనేకశః॥

ఉదకక్రీడనం నామ కారయామాస భారత।
ప్రమాణకోట్యాం తం దేశం స్థలం కించి దుపేత్య హ॥*

—వ్యా. భా. ఆది. 138- 31-33

దుర్యోధనుఁడు గంగాతీరమున "ప్రమాణకోటి" యనుచోట జలవిహారార్థము అర్థభాగము జలపూర్ణముగా తక్కినది భూభాగముగా నుండు నట్లు "ఉదకక్రీడన" మను క్రీడాగృహమును గట్టించినాఁడు. దాని చుట్టు విశాలములు, విచిత్రములు నైన పటకుటీరములు వేయించినాఁడు వాని పయి పతాక లెగుర వేయించినాఁడు.

జలవిహారార్థ మరిగిన రాజకుమారు లుండుటకు సకల సదుపాయములు గల వసతి గృహములను గట్టించినాఁడు.

ఈ విధముగా జలక్రీడోత్సవమునకుఁ గావలసిన యేర్పాట్లు చేసి దుర్యోధనుఁడు పాండవులను ప్రమాణకోటికిఁ దోడుకొని పోయినాఁడు. వా రచటి యుద్యానశోభను తిలకించి "యుదకక్రీడనము" ప్రవేశించిరి.

రాజకుమారు లందరు నచటఁ గూర్చుండి మాటాడుకొనుటకు ఉపస్థాన గృహము లున్నవి. వాని యందుఁ గూర్చుండి యా ప్రదేశము నంతయుఁ జూచుటకు వీలుగా గవాక్షము లున్నవి. ఆ క్రీడాగృహము నందు వలసినచోటికిఁ గొని పోఁదగిన జలయంత్రము లున్నవి. క్రీడాగృహకుడ్యములకు సౌధకారులు వెల్ల వేసినారు. వాని పై చిత్రకాదులు వివిధచిత్రములు గీసినారు. ఆ ప్రదేశ మంతయు దిగుడుబావులతో పద్మాకరములతో నిండి యున్నది.

వివిశంతి స్మ తదా వీరాః సింహా ఇవ గిరేర్గుహామ్॥
ఉద్యానమభిపశ్యంతో భ్రాతరః సర్వ ఏవ తే॥ 39

ఉపస్థానగృహైః శుభ్రై ర్వలభీభిశ్చ శోభితమ్।
గవాక్షకై స్తథా జాలై ర్యంత్రైః సంచారికై రపి॥ 40

* ప్రమాణకోట్యాం గంగాయాః ప్రదేశవిశేషే।
స్థలం కించిత్ అర్ధం జలేఽర్ధం స్థలే చ క్రీడాగారమ్॥ 33॥

—నీలకంఠ

సమ్మార్జితం సౌధకారై శ్చిత్రకారైశ్చ చిత్రితమ్।
దీర్ఘికాభిశ్చ పూర్ణాభి స్తథా పుష్కరిణీభిర్వా॥ 41

—వ్యా. భా. ఆది. 128 39-41.

ఈ విషయము లెవ్వియు నన్నయ వర్ణింపలేదు.

## విహార యాత్రలు : విశ్రాంతి గృహములు

వేసవిలో వేటలాడి విశ్రమించుటకు వీలుగా యమునానది మధ్యమున విశ్రాంతి గృహములు నిర్మింపఁబడినవి. అట్టి నిర్మలహర్మ్యములలో వేసవి దినములు గడుపుద మని యర్జునుఁడు కృష్ణుని ప్రార్థించినాఁడు.

జలరుహనాభ! రమ్యగిరిసానువనంబుల వేటలాడుచున్
జలుపుద మీ నిదాఘదివసంబుల నీవును నేను నున్మిష
న్నలినరజస్సుగంధియమునాహ్రదతుంగతరంగసంగతా
నిలశిశిరస్థలాంతరవినిర్మితనిర్మలహర్మ్యరేఖలన్.

—నన్నయ, భార. ఆది. 8-232

హ్రద మనఁగా ఏటినడుమ లోఁతుగల చోటు. అచ్చటి జలతరంగములతోఁ గూడిన గాలి చల్లఁగా నుండును. అట్టి చల్లనిగాలి తగులు తావులం దీ హర్మ్యములు నిర్మింపఁబడినవి.

* 1. ఉపస్థానగృహైః యత్ర రాజానం కార్యిణః కూరాణ్యోపతిష్ఠంతి
తైర్గృహైః। వలభీభిః ఉభయతో నమత్ పక్షాభిః
స్తంభశాలాభిః యంత్రైః జలయంత్రైః శతధారాభిః।
యతో యుగపచ్ఛతం ధారా ఉచ్ఛలంత్యో నీహారీభూయ
భవనోదరం వ్యాప్నువంతి సాంచారికైః సంచారయోగ్యైః॥

— నీలకంఠ

2. "On entering they saw that the architects handsomely plastered the walls and the ceilings and that painters had painted them beautifully".

—P C Roy, Mbh–Sec 128

మూలము నం దీ విహారస్థలవర్ణనము విపులముగా నున్నది.

విహారదేశం సంప్రాప్య నానాద్రుమ మనుత్తమమ్।
గృహై[1] రుచ్చావచై ర్యుక్తం పురందరపురోపమమ్॥
భక్ష్యై ర్భోజ్యైశ్చ పేయైశ్చ రసవద్భి ర్మహాధనైః।
మాల్యైశ్చ వివిధై ర్గంధై ర్యుక్తం వార్ష్ణేయ పార్థయోః।
వివేశాంతఃపురం తూర్ణం రత్నై రుచ్చావచైః శుభైః॥
యథోపజోషం సర్వశ్చ జనశ్చిక్రీడ భారత।
వనే కాశ్చి జ్జలే కాశ్చిత్ కాశ్చిద్ వేశ్మసు చాంగనాః।
యథా యోగ్యం యథాప్రీతి చిక్రీడుః పార్థకృష్ణయోః॥

—వ్యా. భా. ఆది. 223.18-22.

కృష్ణార్జునులు మిత్రమండలితో విహారస్థలమున కేగినారు. అది నానావిధ వృక్షరాజములతోడను, చిన్నవియు పెద్దవియు నగు భవనములతోడను మహేంద్ర పురము వలె నున్నది. అంతట వారు వివిధరత్నాలంకృతమయిన యంతఃపురము ప్రవేశించి యథేచ్ఛగా విహరించిరి.

కృష్ణుఁడు పాండవకార్యార్థంబుగా హస్తినకు వచ్చుచున్నాఁడని తెలిసికొని యాతనికి వలయు పూజలాచరించుటకు సంవిధానంబు సేయు మని ధృతరాష్ట్రుఁడు పలుకఁగా దుర్యోధనుఁడు పరిచారకులను బిలిపించి వృకస్థలము నందుఁ జప్పరములు నిర్మింప నాజ్ఞాపించెను.

"పెనుపుం జతురత మెఱయఁగ
మనయింటను దుస్ససేనుమందిరమున శో
భనశిల్పము లొనరింపుఁడు
చనుఁడు వృకస్థలమునందుఁ జప్పరములిడన్."

1. గృహైః మధ్యే యమునం నిర్మితైః క్రీడావాప్యాదియుక్తైః॥

—నీలకంఠ

"అవి పేఁడుఁబట్టుగాఁ దగియెడు పట్టని పలికి వాసుదేవుండు రేపకడయ వచ్చునంతకు మున్న యింతయుం గావింప వలయు నని పనిచెను."

—తిక్కన. భార. ఉద్యోగ. 3-154, 5.

ఇట చప్పరము లనఁగా గుడారములు, పటగృహములు.

మూలము నం దిట్లున్నది.

సభావాస్తూని రమ్యాణి ప్రదేష్టు ముపచక్రమే।
తతో దేశేషు సర్వేషు రమణీయేషు భాగశః।
సర్వరత్నసమాకీర్ణా సభాశ్చక్రు రనేకశః॥
ఆసనాని విచిత్రాణి యుక్తాని వివిధై ర్గుణైః।
.... .... ....
విశేషతశ్చ వాసార్థం సభాం గ్రామే వృకస్థలే।
విదధే కౌరవో రాజా బహురత్నాం మనోరమామ్॥

—వ్యా. భా. ఉద్యోగ. 8.12-16.

ఇట సభాశబ్దము విశ్రాంతిగృహము-మార్గశాల యను నర్థము నం దుపయోగింపఁబడినది.

ఈ విశ్రాంతిగృహములు (సభలు), చప్పరములు, విచిత్రాసనములు నిర్మించువారు శిల్పు లని వేఱుగా చెప్పనక్కఱ లేదు గదా !

## మార్గశాలలు (Rest-Houses)

మహాభారతకాలమున పథికుల మార్గాయాసాపనయనము కొఱకు మార్గమధ్యమున మార్గశాలలు – విశ్రాంతి గృహములు-నిర్మింపఁబడుచుండెడివి.

శల్యుఁడు పుత్త్రమిత్త్రసమేతముగా నానాసేనాతిసంకులముగాఁ గదలి పాండవు లున్నయెడకు నిత్యప్రయాణంబుల నడచి వచ్చుచున్నాఁ డని విని దుర్యోధనుఁడు వాని కొఱకు మార్గమధ్యమున విశ్రాంతిగృహములు నిర్మింపించినాఁడు.

ఇంతయును విని కౌరవాధీశ్వరుండు
దక్షులగు నా ప్తజనములఁ దత్క్షణంబ
మద్రనాథుని చనియెడు మార్గమునకుఁ
బుచ్చి యెడ నెడ నతులవిభూతి మెఱయ.

అరుదారుమేలుక ట్లాయితంబై చూడ
నొప్పారి తను పగు చప్పరములుఁ[1]
బరపైన చెలువంబు గరగరికయుఁ దియ్య
తెలినీరుఁ గలిగిన దీర్ఘికలును
జొడవైన ముప్వంచఁ[2] బొలుచు నట్లుగ నేనుఁ
గులకు గుఱ్ఱములకుఁ గొట్టములును
ముందర బయలైన చందంబుఁ జతురాభి
మతమైన యాస్థానమండపములు

బియ్యములును నేయుఁ బెరుఁగును గూరగా
యలును వంటకట్టియలును గడ్డి
కవణములును బెల్లుగా నొడఁగూర్చి ని
గూఢవృత్తిఁ దానుఁ గూడ నడచె.

—తిక్కన. భార. ఉద్యోగ 1-92, 93

దుర్యోధనుఁ డీ పను లన్నియు "దక్షులగు నా ప్తజనముల" చేతఁజేయించినాఁ డని తిక్కన వ్రాసినాఁడు.[3]

1. మేలుకట్టు = ఉల్లడ, వితానము
ఉల్లడ = పందిరి లోనగు వాని లోపల, మీఁద గట్టెడు మేలుకట్టు.
చప్పరము = పందిళ్లు, గుడారములు (పటకుటీరములు)

2. ముప్వంచ = (మూఁడు + పంచలు) మూఁడుపంచలు;
మూఁడు పంచలు గలది. (శ.ర.)

3. తిక్కన. భార. ఉద్యోగ. 1-92
ఇట, "కౌరవాధీశ్వరుడుఁ దక్షులగు నా ప్తజనముల ... ..."
అని "డు" తరువాత అరసున్న యుండవలయు నేమో!

కౌరవాధీశ్వరున కాప్తులయిన దక్షులు తక్షులే. (శిల్పులే). పందిళ్లు వేయువారు వితానములు రచించువారు, గజశాలలు, హయశాలలు, ఆస్థానమండపములు మొదలగు నవి నిర్మించువారు, బావులు త్రవ్వువారు శిల్పులే కదా!

ఈ పనులన్నియు చేసినవారు శిల్పు లని మూలము నందు స్పష్టముగనే యున్నది.

కారయామాస పూజార్థం తస్య దుర్యోధన స్సభాః।
రమణీయేషు దేశేషు రత్నచిత్రా స్స్వలంకృతాః॥

శిల్పిభి ర్వివిధై శ్చైవ క్రీడా స్తత్ర ప్రయోజితాః।
తత్ర మాల్యాని మాంసాని భక్ష్యం పేయం చ సత్కృతమ్।

కూపాశ్చ వివిధాకారా మనోహర్షవివర్ధనాః।
వాప్యశ్చ వివిధాకారా ఓదనాని గృహాణి చ॥

—వ్యా. భా. ఉద్యోగ. అ 7–శ్లో 8-10.

ఇట సభా శబ్దము మార్గశాల యను నర్థము నందు ప్రయోగింపఁ బడినది.*

'ఇవ్విధంబున విడిదల పయనంపుసంపదలు పొంపిరివోవం దనకు సమకట్టిన సమస్తవస్తువుల యవైకల్యంబునకు శల్యుండు సంతుష్టాంతరంగుండై యున్న సమయంబున .... .... కౌరవేశ్వరుం డతనికిం బొడసూప నిదియ సమయం బని సముచిత ప్రకారంబునఁ దన్నెఱింగించికొని వినయంబునఁ గనిన నతండును సంభ్రమంబున గాఢాలింగనంబు సేసి కనకాసనంబున నునిచి యింతయు నిమ్మహాత్ము నుద్యోగంబున నయ్యెం గావలయు నని తలంచి విస్మయం బంది నీ కెయ్యది యిష్టంబు గోరుమిచ్చెద' నని నాఁడు.

—తిక్కన. భార. ఉద్యోగ.1-94.

ఈ విధముగా దుర్యోధనుఁడు శిల్పులద్వారమున తన కార్యమును, రాజకీయ ప్రయోజనమును, సాధించికొనినాఁడు.

* సభా = A house for lodging and accommodating travellers. (Monier Williams = S. E. D.)

# ప్రేక్షాగారము

రంగభూమౌ సువిపులం శాస్త్రదృష్టం యథావిధి
ప్రేక్షాగారం సువిహితం చక్రుస్తే తస్య శిల్పినః॥

—వ్యా. భా. ఆది. 134-11.

"ధృతరాష్ట్రుఁడు కుమారుల విద్యాసందర్శనరంగంబు రమ్యంబుగాఁ జేయింపుమని విదురుం బంచిన నతండు వల్లెయని—

శాస్త్రవిహితప్రమాణోపేతవృత్తాయామంబును,
నపాకృతవృక్షగుల్మవల్మీకంబును,
నంగీకృతపూర్వోత్తరప్లవంబును,
నమీకృతనిమ్నోన్నతప్రదేశంబును,
దూరీకృతకంటకపాషాణశకలంబును,
విరజీకృతరజోధూసరస్థలంబును,
విరచితబహువిధప్రేక్షాగారమంచకంబును,
నానాధ్వజనవపల్లవతోరణచందనమాలాలంకృతద్వారదేశంబును,
ప్రతిదిశనిర్వర్తితశాంతికబలివిధానంబునుంగాఁ

జేయించి నట్లు నన్నయ వర్ణించినాఁడు.

—నన్నయ, భార. ఆది. 6. 2-4

మహాప్రాజ్ఞుఁ డయిన భారద్వాజుఁడు భూమాపనము చేయించినట్లును, రాజశిల్పులు ప్రేక్షాగారమును నిర్మించి నట్లును మూలము నందు వర్ణింపఁబడినది.

(చూడు : వ్యా. భా. ఆది. 134. 8-11.)

## భూమాపనము

భారద్వాజో మహాప్రాజ్ఞో మాపయామాస మేదినీమ్।
సమా మవృక్షాం నిర్గుల్మా ముదక్ప్రస్రవణాన్వితామ్॥1

1. ఉదక్ప్రస్రవణాన్వితామ్ = ఉదక్‌నిమ్నాం॥ —నీలకంఠ

ప్రేక్షాగారనిర్మాణమున కనువైన భూమిని ద్రోణాచార్యుఁడే నిర్ణయించి మాప నము చేయించినాఁడు.

ఈ భూమి ఉత్తరదిక్కు-వాటముగా (ఉదక్ ప్రస్రవణాన్వితమ్) గల దని వ్యాసభారతము నందుండఁగా నది యీశాన్యదిక్కు- వాటముగా (అంగీకృతపూర్వోత్తర ప్లవము) గల దని నన్నయ వ్రాసినాఁడు.

నన్నయ యిట్లు మార్చి వ్రాయుటకు కారణము దేశాచారము కావచ్చును. లేదా నన్నయకు లభ్యమైన మహాభారతప్రతిలో నట్లుండి యుండవచ్చును.

శిల్పశాస్త్రము ప్రకారము ఉత్తర పూర్వోత్తరప్లవములు రెండును శ్రేష్ఠ మయినవే.

పూజ్యా లాభకరీ నిత్యం పుత్రపౌత్రవివర్ధినీ।
కామదా భోగదా చైవ ధనదా చోత్తరప్లవా॥
నరసౌఖ్యసతీ సత్యసౌభాగ్యదివివర్ధినీ।
ధనార్థైశ్వర్యసంపన్నా ధర్మదేశానకప్లవా॥

—అపరాజితపృచ్ఛా. 51-21,22. *

## వాస్తుశాంతి

ఒకానొకశుభనక్షత్రయుక్తమయిన శుభతిథి యందు భారద్వాజుఁ డాభూమి యందు వాస్తుదేవతాబలి-పూజాదికము లొనరించినాఁడు.

తస్యాం భూమిం బలిం చక్రే తిథౌ నక్షత్రపూజ్యితే॥

బలి యనఁగా పూజ. ఇట వాస్తూపశమనార్థముచేయు వాస్తోష్పతిపూజ.

దీనినే నన్నయ 'ప్రతిదిశవిర్వర్తితనిశాంతికబలివిధానముగా' వర్ణించినాఁడు.

సమస్తనిర్మాణములకు ముందు వాస్తుశాంతి చేయునాచార మతిప్రాచీన కాలము నుండియు నున్నది.

---

* చూడు : భువనదేవః అపరాజితపృచ్ఛా-
ఓరియంటల్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ బరోడా. 1959

# ప్రేక్షాగార నిర్మాణము : శాస్త్రి దృష్టి

వాస్తుపూజానంతర మా విశాలమయిన రంగభూమి యందు రాజశిల్పులు శాస్త్రదృష్టవిధానమున చక్కని ప్రేక్షాగారమును నిర్మించి నట్లు వ్యాసభారతము నందు వర్ణింపఁ బడినది.

రంగభూమౌ సువిపులం శాస్త్రదృష్టం యథావిధి॥
ప్రేక్షాగారం సువిహితం చక్రుస్తే తస్య శిల్పినః।
రాజ్ఞః సర్వాయుధోపేతం స్త్రీణాం చైవ నరర్షభ॥ *
మంచాంశ్చ కారయామాసు స్తత్ర జానపదా జనాః।
విపులా నుచ్ఛ్రయోపేతాన్ శిబికాంశ్చ మహాధనాః॥

—వ్యా. భా. ఆది. 134.10-12.

రాజశిల్పులు చక్కని ప్రేక్షాగారమును నిర్మించి యందు సర్వాయుధములు పొందుపఱచిరి. అట్లే మరియొక యగారమును రాణివాసము కొఱకు ప్రత్యేకముగా నిర్మించిరి. రాజపురుషులు, రాజపరివారము, రాజాంతఃపురకాంతలు కూర్చుండుటకుఁ దగిన యాసనములు కల్పించిరి.

జానపదులు కూర్చుండుటకు మంచెలు, ధనికులకొఱకు ఉన్నతములయిన శిబికాసనములు నిర్మింపఁబడినవి.

* రాజ్ఞః స్త్రీణాం ప్రేక్షార్థ మాగారమ్ మంచాశ్చ ఇతరేషామ్।
ప్రేక్షార్థం రంగభూమౌ చక్రు రితి ద్వయోః సంబంధః॥

—నీలకంఠ, [చిత్రశాలాప్రతి]

"The artificers of the king built thereon, a large and elegant stage according to rules laid down in scriptures. And it was furnished with all kinds of weapons. And they also built another elegant hall for the lady spectators. And the citizens constructed many platforms, while the wealthier of them pitched many spacious and high tents all around".

—P. C. Roy Mbh, Adi Sec. 136

ఇట శాస్త్ర మనఁగా శిల్పశాస్త్ర మని వ్యాఖ్యాతలు వివరించినారు.[1]

శిల్పశాస్త్రము విశ్వకర్మకృత మని జగద్విదితము.

విశ్వకర్మచే నిర్దేశింపఁబడిన ప్రమాణలక్షణముల ననుసరించియే సకలవిధ ప్రేక్షాగారములు నిర్మింపవలయు నని భరతముని చెప్పినాఁడు.

ప్రమాణం యచ్చ నిర్దిష్టం లక్షణం విశ్వకర్మణా ।
ప్రేక్షాగృహాణాం సర్వేషాం తచ్చైవ నిబోధత ॥

— భరత - నాట్యశాస్త్ర. 2-16.

ప్రేక్షాగారము, నర్తనశాల, రంగవాటము, సమాజవాటము నను నవి యొకే కోవకు చెందిననిర్మాణములు.[2]

ప్రేక్షాగారములను దీర్ఘచతురస్రాకారములుగను, చతురస్రాకారములుగను, త్రికోణాకృతులుగను నిర్మింపవచ్చు ననియు, నవి 108, 64, 32 మూరల పొడవు గలిగియుండవచ్చు ననియు నాట్యశాస్త్రమునందుఁ జెప్పఁబడినది.

(చూడు : భరత - నాట్యశాస్త్ర. 2. 13-15)

ప్రేక్షాగారము "శాస్త్రవిహితప్రమాణోపేతవృత్తాయామంబుగా" నిర్మింపఁబడిన దని నన్నయ వ్రాసినాఁడు.

1 Cf : E.W. Hopkins = The Great Epic of India. P. 11
"Architectural sastras are mentioned in I-134.10-11.

2 Cf :- E. W. Hopkins : The Great Epic of India. P. 57
"A dance hall, Nartanasala, nartanagara is mentioned in IV–22.3,16 and a Prekshagara a 'hall for seeing' is made according to Sastra rule in I–134. 10, 11. a temporary affair for a joust helped out with manchas' a Samajavata (a more elaborate) in I-185–16, while spectators' arena "Prekshah.... ....rangavata iva in III. 20–27 are alluded to.

వృత్తాయామ మనఁగా నర్ధచంద్రాకృతి కావచ్చును. లేదా కుక్కుటాండా కృతి కావచ్చును.

ఆకృతి యేదైనను అదిశిల్పశాస్త్రసమ్మతమైనదనుట నిర్వివాదాంశము.

"ధృతరాష్ట్రుఁడు గాంధారీపురస్సర దేవీశతపరివృతుండై వివిధభూషణ విభూషితానేక విలాసినీనివహంబుతోఁ జనుదెంచి విలంబితకదంబక స్థూలముక్తాఫలదామ రమణీయంబై, యాబద్ధమరకత వజ్రవైడూర్య పద్మరాగ ప్రవాళప్రభా ప్రకర వ్యతికర విరచితాపూర్వసురచాపచారు గౌరవంబై యతిమనోహారంబైన శాతకుంభమయ ప్రేక్షాగారంబున నున్న

అందుఁ గరమొప్పి సుందరీబృందమఖిల
రత్నరాజిత కనకధరాధరేంద్ర
కందరాంతరమున నున్న సుందరాప్స
రాళనాంగనాబృందంబు ననుకరించె.

—నన్నయ. భార. ఆది. 6-4.

మూలమునం దిట్లున్నది.

తస్మిం స్తతోఽహని ప్రాప్తే రాజా స సచివ స్తదా ।
భీష్మం ప్రముఖతః కృత్వా కృపం చాచార్యస త్తమమ్ ।
ముక్తాజాలపరిక్షిప్తం వైడూర్యమణిశోభితమ్ ।
శాతకుంభమయం దివ్యం ప్రేక్షాగార ముపాగమత్ ॥
గాంధారీ చ మహాభాగా కుంతీ చ జయతాంవర ।
స్త్రియశ్చ రాజ్ఞః సర్వాస్తాః సప్రేష్యాః సపరిచ్ఛదాః ॥
హర్షాదారురుహుర్మంచాన్ మేరుం దేవస్త్రియోయథా ।

— వ్యా. భా. ఆది. 134.13-16.

కుమారాస్త్రవిద్యాప్రదర్శనవిశేషములను వివరించుటకు, గాంధారీధృతరాష్ట్రుల చెంత విదురుఁడు గూర్చుండెను.

విదురో ధృతరాష్ట్రాయ గాంధార్యాః పాండవారణిః
న్యవేదయేతాం తత్సర్వం కుమారాణాం విచేష్టితమ్॥

—వ్యా. భా. ఆది. 134-35

బ్రాహ్మణులు, బంధుమిత్రులు, మంత్రులు, సామంతరాజులు, నాయక పైతాళికులు "తమ తమ నియమితస్థానము లందుండిరి,"

ఇది విద్యాసందర్శనరంగము.

## అస్త్రవిద్యాప్రదర్శనరంగము

భేర్యాదిమంగళవాద్యములు మ్రోగినవి.

"అట్టి యవసరంబున నాచార్యుండు శుక్లాంబరాభరణమాల్యానులేపనయజ్ఞో పవీతపలితకేశశ్మశ్రుశోభితదేహుండై రంగమధ్యమున" నిలిచినాఁడు....

(నన్నయ.భార. ఆది. 6. 9.)

అట్లు నిలిచి యస్త్రవిద్యాగురువు వారంగమధ్యము నందు దేవతాపూజఁ గావించి నాఁడు.

స యథా సమయం చక్రే బలిం బలవతాంవరః ।

—వ్యా. భా. ఆది. 134-21.

ఇది నాట్యప్రదర్శనమునకు ముందు నాట్యాచార్యుఁడు చేయు రంగదైవత పూజ వంటిది.

ఇది భూమాపనసమయమునందుఁ జేయఁబడిన పూజ (బలి) కంటె భిన్న మైనది.

నన్నయ యేలనో ఈ విషయము చెప్పలేదు. కాని బ్రాహ్మణుల పుణ్యాహ వచనముల విషయము చెప్పినాఁడు.

అగణ్యబ్రాహ్మణవరేణ్యపుణ్యాహవచనానంతరమున. "రాజకుమారులు, ధర్మజ ప్రముఖులు జ్యేష్ఠానుపూర్వంబుగా వచ్చి, రంగమధ్యమున నిలిచి, యాచార్యా నను మతంబునఁ దమ తమ విద్యలు చూపఁ దొడఁగిరి.

(నన్నయ. భార. ఆది. 6-9, 10)

ఈ రంగస్థలమున కొక ప్రవేశద్వారము గలదు. అది నానాధ్వజనవపల్లవ తోరణచందనమాలాంకృతము 1

అస్త్రవిద్యావైచిత్ర్యంబు మెఱసి గదాఖడ్గాదివివిధాయుధదక్షతం జూపి యర్జు నుండు జనుల కాశ్చర్యంబు సేయుచున్నంత కర్ణుండు నిజవిద్యాకౌశలంబు మెఱయ నమకట్టి రంగద్వారమున నిలిచి భుజాస్ఫాలనంబు చేసినాఁడు.[2]

"తద్ద్వారంబు వీక్షించుచు" జనులెల్లంగడు సంభ్రమించిరి.[3]

కర్ణుండును జనుల నందఱ నదల్చి చొత్తెంచి రంగమధ్యమున నిలిచినాఁడు. అంతట కర్ణార్జునులకు ద్వంద్వయుద్ధము జరిగినది.

ఈ రంగస్థలము నందే కర్ణున కంగరాజ్యపట్టాభిషేకము జరిగినది.

ప్రేక్షాగారవర్ణనమున వ్యాసభారతము నందు

రంగ (ఆది 135-1, 3, 4, 10, 15; 136-1, 16)

రంగభూమి (ఆది 134-10) రంగమధ్యమ్ (ఆది. 134-20)

రంగాంగణ (ఆది. 135-1) రంగమండలమ్ (ఆది. 136-10)

అనుపదములు,

నన్నయభారతము నందు

విద్యాప్రదర్శనరంగము (ఆది. 6-4)

అస్త్రసందర్శనరంగము (ఆది. 6-61)

రంగద్వారము (ఆది. 6-28) రంగభూమి (ఆది. 6-38)

రంగమధ్యము (ఆది. 6-9,10, 17, 32) అనుపదములు ప్రయోగింపఁబడినవి.

1. నన్నయ. భార. ఆది. 6-4.

2. నన్నయ. భార. ఆది. 6—28 = వ్యా భా. ఆది. 135-27.

3. ,, 6—29 = ,, 135-29.

ప్రేక్షాగారవర్ణనము వలనఁ దెలియనగు ముఖ్యాంశములు.

మహాభారతకాలమున రాజకుమారు లస్త్రశస్త్రవిద్యల నభ్యసించుటయే కాక పెద్దల ముందు తద్విద్యాప్రదర్శనము లొనంగుచుండిరి.

విద్యాప్రదర్శనమునకు, సందర్శనమునకు ననుకూలముగా రాజశిల్పులు శిల్ప శాస్త్రానుసారము ప్రేక్షాగారములు నిర్మించుచుండిరి.

ప్రేక్షాగారనిర్మాణమునకు ముందు వాస్తూపశమనార్థము వాస్తుపూజ చేయు చుండిరి.

ప్రదర్శకులు రంగప్రవేశము చేయుటకు ముందు "రంగపూజ" గావించు చుండిరి.

పట్టాభిషేకాదిశుభకార్యములు కూడ నిట్టిప్రేక్షాగారములందే జరుగుచుండెడివి.

))0((

# స్వయంవర రంగము

స్వయంవరం తు రాజన్యాః ప్రశంసంత్యుపయాంతి చ।

— వ్యా. భా. ఆది. 102-16.

బ్రాహ్మంబు మొదలుగాఁగల యెనిమిది వివాహముల యందు క్షత్రియులకు గాంధర్వరాక్షసంబు లుత్తమంబు లనియు, స్వయ వరంబున జయించి వివాహం బగుట యత్యుత్తమం బనియు భారతము నందుఁ జెప్పఁబడినది.

స్వయంవర మనఁగా నవివాహిత యగు రాజకన్య స్వయముగా తనకు నచ్చిన రాకుమారుని గాని, విద్యాబలపరాక్రమస్పర్ధలలో గెలుపొందిన వీరుని గాని వరించుట.

మహాభారతకాలమున రాజులు కొందఱు తమ పుత్రికలకు స్వయంవరోత్సవ ములు ప్రకటించి రాజపుత్రుల నాహ్వానించుచుండిరి.

## కుంతీ స్వయంవరము

కుంతిభోజుఁడు కుంతీస్వయంవరోత్సవమును ప్రకటించి నరాధిపుల నాహ్వానించినాఁడు.

కుంతీదేవి స్వయంవరరంగమధ్యము నందున్న పాండురాజును జూచి హృదయమునం దాకులపాటు చెంది, సిగ్గుతో పుష్పమాలను పాండురాజు మెడలో వైచినది.

తతః సా కుంతిభోజేన రాజ్ఞాహూయ నరాధిపాన్।

పిత్రా స్వయంవరే[1] దత్తా దుహితా రాజసత్తమ॥

1. స్వయంవర : Self-choice; the election of a husband by a princess or daughter of Kshatriya at a public assembly of suitors (Mbh)

తతః సా రంగమధ్యస్థం తేషాం రాజ్ఞాం మనస్వినీ।
దదర్శ రాజశార్దూలం పాండుం భరతసత్తమమ్॥
.... .... ....
తాం దృష్ట్వా సానవద్యాంగీ కుంతిభోజసుతా శుభా॥
పాండుం నరవరం రంగే హృదయేనాకులాభవత్।
తతః కామపరీతాంగీ సకృత్ ప్రచలమానసా॥
వ్రీడమానా స్రజం కుంతీ రాజ్ఞః స్కంధే సమాసజత్।

—వ్యా. భా. ఆది. 112.3-8.

ఇట రంగ[1]మనఁగా స్వయంవరరంగము, స్వయంవరోత్సవ నిర్వహణార్థము తాత్కాలికముగా నిర్మింపఁబడిన రంగవాటము. ఇది యించుమించుగా ప్రేక్షాగారము వంటిదే.

## దమయంతీస్వయంవరము

దమయంతి నలుఁ డను ధరణినాథు నంద బుద్ధి నిలిపి యున్న దని విని భీముఁడు తత్స్వయంవరవ్యాజమున ధరావలయము నందలి రాజన్యులను, నానావిషయాధీశ్వరులను రావించినాఁడు. ఆ స్వయంవరమునకు లోకము నందలి మనుజేశ్వరులే కాక యమరవరులును విచ్చేసిరి.

దమయంతీస్వయంవరరంగము బంగారుస్తంభములతో నిర్మింపఁబడినది. తోరణాదులతో చక్కఁగా నలంకరింపఁబడినది. స్వయంవరమునకు వచ్చిన పృథివీపతు లెల్లరు స్రగ్ధరులు. మణికుండలధారులు నై సముచితాసనముల యందాసీను లయిరి.

1. రంగ : A place for public amusement or for dramatic exhibition, theatre, play-house, stage, arena, any place of assembly. (Mbh)

—*M. M. Williams, SED.*

కనక స్తంభరుచిరం తోరణేనవిరాజితమ్।
వివశుస్తే నృపా రంగం మహాసింహా ఇవాచలమ్॥
తత్రాసనేషు వివిధేష్వాసీనాః పృథివీక్షితః।
సురభిస్రగ్ధరాః సర్వే ప్రమృష్టమణికుండలాః।

వ్యా. భా. వన 57. 3, 4.

అంతట దమయంతి పుష్పమాలతో రంగస్థలము ప్రవేశించినది.

దమయంతీ తతో రంగం ప్రవివేశ శుభాననా॥ —వన. 57-8

"దమయంతి సితపుష్పదామాభిశోభితహస్తయై చనుదెంచి....
యమ్మహోత్సవదర్శనాగతరాజన్య నివహంబు నీక్షించి....
పుణ్యశ్లోకుఁడయిన నలు ధర్మవిధానంబున వరియించి
తదీయస్కంధమున సుగంధికుసుమదామకంబు వెట్టినది."

—నన్నయ. భార. ఆరణ్య. 2. 54, 55.

ఇట్లపూర్వస్వయంవరలబ్ధయైన దమయంతిని నలుఁ డత్యంత విలాసముతో వివాహమైనాఁడు.

## ద్రౌపదీ స్వయంవరరంగము

ద్రౌపదీస్వయంవరము నం దస్త్రవిద్యాప్రదర్శనము గలదు.

"వైహాయసంబైన వరమత్స్యయంత్రంబు
నివ్విల్లు మోపెట్టి యెవ్వఁడేను
శరముల నేయు నశ్రమమున నతఁడ నా
తనయకు వరుఁడగు ధర్మయుక్తి"

నని ద్రుపదుఁడు చాటించినాఁడు.

ఆ యాఘోషణము విని యుర్వీశులెల్ల...."ద్రుపదపుత్రీస్వయంవరరంగమునకు ననిరి రమణతోడ".

ద్రౌపదీస్వయంవరరంగమత్యంతమనోహరముగావర్ణింపఁబడినది.

"అదియును బురంబుపూర్వోత్తరదిగ్భాగంబునం
జందనోదకసంసిక్తసమీకృతస్థలం బయి,
యగాధోన్నతపరిఖాప్రాకారంబులను, విశాలద్వారతోరణం
బులను, గైలాసశైలవిలాసాపహాసిభాసురగగనతలోల్లేఖి
శిఖరరమ్యహర్మ్యతలంబును, బహుప్రకారంబులైన
సారువులనుంజేసి యొప్పుచున్న నందు యథాస్థానంబుల
నానాదేశాధిపతులనుండం బనిచి ద్రుపదుండు వారల
నెల్లరం బూజించె"— —నన్నయ. భార. ఆది. 7-166, 167

ఈ ద్రౌపదీస్వయంవరరంగమే వ్యాసభారతము నందు సమాజవాటముగా వర్ణింపఁబడినది.

౦)(౦

# సమాజవాటము (Amphitheatre)

సమాజవాట మనఁగా సామాజికులు (ప్రేక్షకులు) జనసమూహములు కూర్చుండి యేదేని ప్రదర్శనమును చూచుటకు వీలుగా చుట్టు వెలుగు వేసిన చోటు.

ఇందు విద్యాప్రదర్శనము చేయు భాగ మొకటి. ఇది రంగస్థలాంతర్భాగము విద్యాప్రదర్శనము చూచు సామాజికులు కూర్చుండు భాగ మింకొకటి. యావరణమున కంతటికి సమాజవాట మని పేరు.

వ్యాసభారతము నందలి సమాజవాటవర్ణనము సుదీర్ఘమును సుందరమునై యానాటి శిల్పుల శిల్పకళాచాతుర్యమును వెల్లడించుచున్నది.

ప్రాగుత్తరేణ నగరా ద్భూమిభాగే సమే శుభే।
సమాజవాటః శుశుభే భవనైః సర్వతోవృతః॥
ప్రాకారపరిఖోపేతో ద్వారతోరణమండితః।
వితానేన విచిత్రేణ సర్వతః సమలంకృత॥ః
తూర్యౌఘశతసంకీర్ణః పరార్ధ్యాగురుధూపితః।
చందనోదకసిక్తశ్చ మాల్యదామోపశోభితః॥

కైలాసశిఖరప్రఖ్యై ర్నభస్థలవిలేఖిభిః।
సర్వతః సంవృతైః శుభ్రైః ప్రాసాదైః సుకృతోచ్ఛ్రితైః॥
సువర్ణజాలసంవీతై ర్మహాసనపరిచ్ఛదైః।
స్రగ్దామసమవచ్ఛన్నై రగురూత్తమవాసితైః॥
హంసాంశువర్ణై ర్బహుభి రాయోజనసుగంధిభిః।

అసంబాధశతద్వారైః శయనాసనశోభితైః।
బహుధాతుపినద్ధాంగై ర్హిమవచ్ఛిఖరైరివ॥

తత్ర నానాప్రకారేషు విమానేషు[1] స్వలంకృతాః।
స్పర్ధమానా స్తదాఽన్యోన్యం నిషేదుః సర్వపార్థివాః।
.... .... .... ....
మంచేషు చ పరార్థ్యేషు పౌరజానపదా జనాః।
కృష్ణాదర్శనసిద్ధ్యర్థం సర్వతం సముపావిశన్॥

— వ్యా. భా. 185.16-26

ఈ వర్ణనము వలన నన్నయ భారతానువాదము నందు లేని మఱి కొన్ని విశేషములు తెలియుచున్నవి.

సమాజవాటము నందు రాజకుమారులు విడిదిచేయుటకు వీలుగా నెత్తైన యేడంతస్తుల మేడలు (విమానములు) నిర్మింపఁ బడి యున్నవి. వాని నెక్కుటకు చక్కని మెట్లున్నవి. ఈ ప్రాసాదముల గవాక్షములు సువర్ణజాలశోభితములు. వాని కుడ్యములు మణికుట్టిమమండితములు. ఒక్కొక్క మేడకు నూరేసి విశాలము లయిన ద్వారము లున్నవి. వాని యందు వివిధ ధాతువులతో నిర్మింపఁబడిన శయనాసనము లమర్పఁబడియున్నవి.

ఈ విమానవిశేషములు నన్నయానువాదము నందు లేవు.

## సమాజవాట ముఖద్వారము

ద్రౌపదీస్వయంవరరంగము (సమాజవాటము) కాంపిల్యనగరమున ఈశాన్య దిగ్భాగము నందు నిర్మింపఁబడినది.

రంగప్రవేశమునకు మార్గమెక్కడున్నది ? నన్నయ చెప్పలేదు. వ్యాస భారతము నం దిట్లున్నది.

1. విమానేషు = సప్తభూమిగృహేషు — నీలకంఠ

Vimana = a type of angular building.

—Dr. P.K. Acharya : A Dictionary of Hindu Architecture.

తతః పౌరజనా స్సర్వే సాగరోద్ధూతనిస్వనాః।
శిశుమారశిరః ప్రాప్య న్యవిశంస్తే స్మ పార్థివాః॥
—వ్యా. భా. ఆది. 185-15,16*

శిశుమారశిర శ్శబ్దము కొన్ని ప్రతులలో శింశుమారశిరస్సు గానున్నది.[1]

శిశుమార (శింశుమార) శిర స్సనఁగా ఈశాన్య దిక్కును నర్థము చెప్పి, పుర జనులు, రాజులు నీశాన్యదిక్కును జేరి సమాజవాటము నందు ప్రవేశించుచుండి రని వ్యాఖ్యాతలు వివరించినారు.

ఈ వ్యాఖ్యానముల ననుసరించి యనువాదకర్తలు సమాజవాటమున కీశాన్య దిక్కున ముఖద్వారము గల దనియు తద్ద్వారమున పౌరులు, రాజులు నందు ప్రవే శించుచుండి రనియు వ్రాసినారు.[2]

విదిక్కుల యందు ముఖద్వారము నుంచుట శాస్త్రసమ్మతము కాదు. అది యొక విషయము.

* వ్యా. భా. ఆది. 186-15, 16 చిత్రశాలా ప్రతి- [గోరఖ్‌పూర్ ప్రతి]
"శిశుమారో జలజంతుః తదాకార స్తారానమూహాత్మకో విష్ణుః తస్య శిరః ప్రదేశే ఐశాన్యాం దిశి అత ఏవ సా అపరాజితాదిక్, తాం దిశం ప్రాప్య న్యవిశన్."
—నీలకంఠ

1. వ్యా. భా. ఆది. 185-16. [వావిళ్ళప్రతి]-ప్రథమ సంపుటము. పు 381.
"శింశుమారో జలజంతుః తదాకారో జ్యోతిశ్చక్రచాలకో విష్ణుః శింశుమార శ్రీప్రనాభి హితంశిః। తస్య విష్ణురూపిణః శింశుమారశిరః ఈశానీదిక్. తాం దిశం ప్రాప్య న్యవిశన్."

2. చూడు : 1) చతుర్వేది ద్వారకాప్రసాద శర్మ. హిందీమహాభారత. సం 1. పు 607

2) P.C. Roy. Mbh-Sce 187. P. 525

"And the monarch entered the grand amphitheatre by the North-Eastern Gate".

శింశుమార మనఁగా మకరము, మొసలి 2. నీరుకోతి (సూ.ని)శింశుమార శిర మనఁగా మొసలితల. శిల్పశాస్త్రమునందు మొసలితలయు, చేపతోకయు గల జలజంతువులచే నలంకరింపఁబడిన తోరణద్వారము.

ఈ శ్లోకము నందు "శింశుమారశిర"శ్శబ్దము "మకరతోరణ" మునకు పర్యాయపదముగా ప్రయోగింపఁబడిన దనియు నది భారతీయస్థాపత్యమునందు ద్వార తోరణశిల్పముగా ప్రాచీనకాలము నుండియు ప్రసిద్ధిఁ గాంచిన దనియు వాసుదేవ శరణ్ అగ్రవాలా వివరించినాఁడు*

సముద్రఘోషవలె కోలాహలము చేయుచు పౌరులును, పార్థివులును "శింశు మారశిర" ద్వారమును(మొసలిమొగమును చేపతోకయును గల జలజంతువులతో నలం కరింపఁబడిన తోరణద్వారమును) సమీపించి తద్ద్వారము గుండ సమాజవాటమును ప్రవేశించినా రని యీ శ్లోకార్థము.

పరిశోధకచక్రవర్తియు బనారసు హిందూ విశ్వవిద్యాలయ వాస్తుశిల్పశాస్త్ర శాఖాధ్యక్షుఁడు నయిన వాసుదేవ శరణ్ అగ్రవాలా యొసఁగిన వివరణము పరమ ప్రామాణికముగా భావింపఁదగును.

*1. Cf : V. S. Agrawala – Studies in Indian Art. P. 98

"Simsumarasirah" has besn used as a Synonym for "makaratorana", the well known motif of the ancient gateway's in Indian Architecture. The verse says: the citizens clamorous like the surging sea, as well as the other kings approached the 'Simsumarasirah' (the architrave of the gateway adorned with fish-tailed crocodile) and thence entered the arena."

2. Cf : A. D. Pusalkar : Studies in Epics and Puranas of India. P. 131.

His (V. S. Agrawala's) 'Simsumarasirah' disputes the reading 'Simsumarapuram in the critical edition, (I-176-15) and maintains the reading Simsumarasirah' on the ground that Simsumarasirah means makaratorana, "the architrave of the gateway adorned with fish-tailed crocodile".

భారహూత్ నందలి మకరతోరణద్వారశిలాశిల్పమునకు మూలము వ్యాస భారతము నందు వర్ణింపఁబడిన "శింశుమారశిరస్తోరణద్వారమే యైయుండు ననియు శుంగకాలము నందు[1] శిలాశిల్పముగా వెలసిన పూర్వ మనేకశతాబ్దముల నుండియు దారుశిల్పముగా ప్రాచుర్యము నొందియుండు ననియు పండితు లూహించుచున్నారు.[2]

మహాభారతము నంతలి యీ శింశుమారశిరస్తోరణప్రసక్తి వలన మకరతోరణ[2] నిర్మాణ మీదేశమునం దతిప్రాచీనకాలము నుండి యున్న దని తెలియుచున్నది.

# రంగమండపము

అవతీర్ణా తతో రంగం ద్రౌపదీ భరతర్షభ॥

—వ్యా. భా. ఆది. 184.11.

పాంచాలరాజతనయ సితపుష్పమాల చేకఁగొని రంగమధ్యంబున నిలిచినది.[3]

రంగమండపమే కళ్యాణవేదికయు, నస్త్రవిద్యాప్రదర్శనశాలయును.

ఆ వేదికయందొకప్రక్క ద్రుపద పురోహితుండు కృతపరిస్తరణుఁడై వివాహోపకరణచయముతో అగ్నిముఖముచేసి వేల్వ మొనసియున్నాఁడు.[4] ఆ యగ్ని సమీపమున గంధపుష్పధూపదీపార్చితంబైన విల్లును, నమ్ములును పైపాయసంబైన కనకమత్స్యయంత్రమును గలవు.[5] అచటనే అస్త్రవిద్యాప్రదర్శనము జరుగును.

1. శుంగులు క్రీ.పూ. 183 సం. రాజ్యస్థాపనము చేసి నట్లు చరిత్రకారులు చెపుచున్నారు.

2. V. S Agrawala : Studies in Indian Art. P. 98.

"......The literary tradition of the 'makaratorana' or 'Simsumarasirah' antedates our knowledge of it in the lithyc art of SUNGA Period by several centuries; it is preceded by works in wood."

3, 4 : నన్నయ. భార. ఆది. 7-168.

5, అదే 7-169, 170

ధృష్టద్యుమ్నుఁ డా రంగమధ్యమునకేతెంచి, మూఁగిన రాజలోకంబు నెల్లం జూచి వారలకు లక్ష్యమును జూపి

"ఈవిల్లు మోపెట్టి యేనుబాణముల నీ యంత్రమత్స్యంబు నేసినవాఁడ
భావజప్రతిమఁ డిబ్బాలకుఁ దగినపతి యిది మునిశక్తిఁ బడసిన విద్య
గావున మీరిప్డు గావింపుఁడిదియ ఘనతర కార్ముకకౌశలోన్నతియు
లావును గలవారలకు నవసరము లలితయశంబుఁ గల్యాణంబుఁ బడయ"

—అని ప్రకటించినాఁడు.[1]

రాజపుత్రు లెల్ల నవ్విల్లు మోపెట్ట నోపక నివృత్తులయిరి.

అంత నయ్యర్జునుండు నవ్వింటిసమీపంబునకు వచ్చి .... జనులాశ్చర్యంబునం జూచుచుండ నేనమ్ముల నమ్మత్స్యయంత్రంబు నాక్షణంబ యురులనేసెను.[2] ద్రుపద రాజాత్మజ తనచేతి సితపుష్పదామకమున ధనంజయుఁ బూజించె.[3]

తరువాత ధౌమ్యపురోహితుఁడు వివాహప్రయుక్తమంత్రాహుతులతో వేల్చి ముందఱ ధర్మపుత్రునకు ద్రుపదరాజపుత్రిం బాణిగ్రహణంబుసేయించి ...క్రమం బున భీమార్జుననకులసహదేవులకుం బాణిగ్రహణంబు సేయించెను.[4]

ఈ వర్ణనములను బట్టి మహాభారతకాలమున క్షత్రియులలో స్వయంవర వివాహములు జరుగుచుండెడి వనియు, వానిని నిర్వహించుటకు సమాజవాటము వంటి స్వయంవరరంగములు నిర్మింపఁబడుచుండెడి వనియుఁ దెలియుచున్నది.

ఈ స్వయంవరరంగములను నిర్మించువారు, వానిని చక్కగా నలంకరించు వారు శిల్పులే యని వేఱుగాఁ జెప్పనక్కఱలేదు.

1. నన్నయ. భార. ఆది. 7-168, 170
2 అదే 7-183
3 అదే 7-189
4 అదే 7-284

# నర్తనశాల

మహాభారతకాలమున ప్రేక్షాగారముల వంటి ప్రదర్శనశాలలేకాక నాటక ప్రదర్శనానుకూలములగు రంగశాలలు, నర్తనశాలలు కూడ నున్నవి.

కద్రూవినతలు, "నాటకప్రయోగంబునుం బోలె ఘనరసపాత్రశోభిత రంగ రమ్యంబై" యొప్పుచున్న మహోదధిని జూచినట్లు వర్ణింపఁబడినది.

నన్నయ భార. ఆది. 2-27.

సౌంభకవిమానారూఢుఁడై యాకసము నందు నిలిచి యుద్ధము చేయుచున్న సాల్వుని పై కృష్ణుఁడు దివ్యబాణములు వేయఁగా సాల్వుఁడు సౌంభకముతో క్రోశము దూరము పైకెగిరినాఁడు. రంగవాటము నందలి ప్రేక్షకుల వలె కృష్ణుని సైనికు లాదృశ్యము నుజూచిరి

తత స్తే ప్రేక్షకాః సర్వే రంగవాట ఇవ స్థితాః॥

—వ్యా. భా. వన. 20-27.

రంగవాటమనఁగా నాటకాదు లాడెడిచోటు. An area, a place enclosed for plays, dancing etc.

విరాటనగరమున రాచనగరు నందు నర్తనశాల యున్నది. ఆ నాట్య మందిరము నందు విరాటరాజపుత్త్రిక ఉత్తర బృహన్నల వద్ద నాట్యవిద్య నభ్య సించినది.

"అందియల మొరపంబున కరుగుదెంచి
ప్రోది రాయంచ రయమునఁ బోవు నవ్వి
ధంబు దగ నభ్యసించు చందమునఁ దోన
చనఁగ నుత్తర నర్తనశాల కరిగె."

"మెఱుఁగు మొగిలు సొచ్చు తెఱఁగున
నాట్యమందిరము సొచ్చి తనదు గురువు కడకు నరిగె"

వనియు తిక్కన వర్ణించినాఁడు.[1]

నర్తనశాలకు సంగీతనిలయ మనియుపేరు.

బృహన్నల "సంగీతనిలయంబు" వెలువడి వచ్చినాఁడు.[2]

ఆ నర్తనశాల రాతిగోడలతో, కుట్టిమములతో పెద్ద పెద్ద స్తంభములతో నిర్మింపఁబడినది. దానికి ముఖమండపము, ప్రాగ్ద్వారము, రంగమండపము గలవు. మండపాభ్యంతరభూమియందు విరాటరాజనందన లీలాపర్యంక మున్నది.

భీముఁడు నాట్యశాలకుఁ జని నర్తనాగారంబు ముఖభాగస్థలంబు సేరి,

ధ్వాంతాకారితకుడ్యకుట్టిమ ఘన స్తంభావలీరూపమున్
భ్రాంతాదిప్రవిభాగబోధరహితప్రాగ్ద్వారమున్ గాతర
స్వాంతత్రాసకరంబునై దురభివేశం బైన యా లోను ని
శ్చింతుండై వతి కేలు పట్టికొని చొచ్చెన్ భీముఁ డత్యుగ్రతన్.

ఇట్లు సొచ్చి తటియం జని మధ్యదేశంబున విరాటనందన లీలాపర్యంకం బరసి .... తా నా తల్పంబున నుండె.[3]

కీచకుఁ డా రంగాగారము సేరవచ్చి, "మండపాభ్యంతరభూమిఁ జొచ్చి" నాఁడు.[4]

తిక్కన విరాటపర్వమునందు,

నాట్యశాల (2-324)

నర్తనాగారము (2-326), రంగాగారము (2-330) నర్తనశాల (3-2, 4-21)

1. తిక్కన. భార. విరాట. 4-26, 27.
2. అదే 4-32.
3. అదే 2. 324-328
4. అదే 2, 330-331

నృత్తశాల (3-4) నాట్యమందిరము (4-27)
సంగీతనిలయము (4-32) అను పదములను ప్రయోగించినాఁడు.

వ్యాసభారతవిరాటపర్వము నందు

నర్తనశాల (22-3.)
నర్తనాగారము (22-16, 25, 26, 27, 39; 24-17, 18)
వేశ్మ (22-40)

అనుపదములు ప్రయోగింపఁబడినవి.

ఈ వర్ణనములను బట్టి మహాభారత కాలమున భారతదేశమునందు నాటక రంగస్థలములు, నర్తనశాలలు నున్న వని తెలియుచున్నది.

నాట్యశాలలు, నాటకశాలలు నిర్మించువారు శిల్పులే.

,-(o)-,

# ఏకస్తంభహర్మ్యము

ప్రాసాదం కారయామాస ఏకస్తంభం సురక్షితమ్.

—వ్యా. భా. ఆది. 42-29.

"మదీయజనకు నవమానించిన పరీక్షితుండు నేఁడు మొదలుగా సప్తదివసంబులలోనఁ దక్షకవిషాగ్నిదగ్ధుఁడై యమసదనంబున కరిగెడు" మను శృంగి శాపమునకు వెఱచి పరీక్షిన్మహారాజు మంత్రివర్గముతో విచారించి యాత్మరక్షయం దప్రమాదుండై.

సకలోర్వీశుఁ డతిప్రయత్నపరుఁడై సర్వక్రియాదక్ష త
క్షకకోటుల్ పనిసేయఁగా ఘనతరైకస్తంభహర్మ్యంబుఁ ద
క్షకభీతిన్ రచియింపఁ బంచి దృఢరక్షన్ దానిలో నుండెఁ బా
యక రాత్రిందివజాగరూకహితభృత్యామాత్యవర్గంబుతోన్.

—నన్నయ. భార. ఆది. 2-183

ఏకస్తంభహర్మ్య మనఁగా నొకేస్తంభము పయి నిర్మింపఁబడిన పెద్దమేడ. అది యొక శిల్పచమత్కారము. అట్టి ఘనతరైకస్తంభహర్మ్యమును వారము దినముల లోపల నిర్మింపవలయు నన్న శిల్పకళాకుశలులయిన శిల్పులు పెక్కుమంది పని చేసిననే కాని వలను పడదు. కావుననే నన్నయ "సర్వక్రియాదక్షతక్షకకోటుల్ పనిసేసి" రని మూలాతిశాయిగా వర్ణించినాఁడు.

తక్షకు లనఁగా దారుశిల్పులు. దారుశిల్పులచే నిర్మింపఁబడినది కనుక ఏకస్తంభహర్మ్యము దారుశిల్పము.

దేవీభాగవతము నందీ ప్రాసాదము సప్తభూమిగృహముగా వర్ణింపఁబడినది.

కారయిత్వాఽథ ప్రాసాదం సప్తభూమిక ముత్తమమ్॥

—దేవీభాగ. 3-9-42.

ఆ ప్రాసాదమెట్టిదయిన నేమి? శాపగ్రస్తుండైన పరీక్షిన్మహారాజుతో నయ్యేకస్తంభహర్మ్యము దక్షకవిషాగ్నిదగ్ధమై పోయినది.

పరీక్షిన్మహారాజు పాండవుల యనంతరము కలియుగారంభమున [క్రీ. పూ. 3101.] పట్టాభిషిక్తుఁ డయినాఁడు[1]. కావున కలియుగారంభమున శిల్పులు పెద్ద పెద్ద మేడలు సైతము దారువులతో నిర్మించుచుండిరని తెలియుచున్నది.

1. Cf. Dr. D. S. Triveda : Indian Chronology.

# సమీక్షణము

మహాభారతము నందందు పురగోపురములు, దుర్గములు, సభాభవనములు, భాండాగారాయుధాగారములు, రాజప్రాసాదములు, శాలాభవనములు, ప్రేక్షాగారరత్నాగారములు, సమాజవాటము, క్రీడాగృహములు, విశ్రాంతిగృహములు మొదలగు నిర్మాణవిశేషములనేకములు శిల్పసుందరముగా వర్ణింపఁబడినవి.

మహాభారతేతిహాసమున వర్ణింపఁబడిన పురగోపురాదులన్నియు నేకకాలమున నిర్మింపఁబడినవి కావు. అవి యా యా కాలము లందు ప్రసిద్ధులయిన శిల్పాచార్యులచే నిర్మింపఁబడినవి.

పురగృహనిర్మాణముల యందు భారతీయశిల్పు లనుసరించిన పద్ధతులేవి ? వానికి మూలమయిన శిల్పసంప్రదాయము లేవి ? యను ప్రశ్నము లుదయించును.

కౌరవపాండవులకు సమకాలీను లయిన శిల్పాచార్యులలో దేవశిల్పి విశ్వకర్మ, అసురశిల్పి మయుఁడు, మానవశిల్పి పురోచనశిల్పాచార్యుఁడు - అనువారు ప్రముఖులు. తక్కిన శిల్పుల నామధేయములు తెలియవచ్చుట లేదు.

మహాభారతకాలము నాటికి శిల్పకళ లందు దైవాసురమానవసంప్రదాయ భేదము లున్నట్లు తెలియుచున్నది.

పురవర్ణనములను పరిశీలించినచో నా పురము లన్నియు నొక నిర్దిష్ట మయిన నగరరచనాప్రణాళిక (Town Planning) ననుసరించి నిర్మింపఁబడి నట్లు తోఁచును. కొన్ని పురములు చతురస్రాకారములు, ద్వారకాదులు దీర్ఘచతురస్రాకారములు. హస్తినాపురము షట్పదోపేతము. అయోధ్యాపుర మష్టాపదాకారము

గోపురములు ద్వారతోరణయుక్తములు. విశాలము లయిన రాజమార్గముల కిరుప్రక్కల పణ్యస్థానములు గలవు

సాధారణముగా జనులు చతుశ్శాలాగృహము లందు నివసించుచుండిరి.

మహాభారతకాలమున నగరములలో హర్మ్యప్రాసాదములే కాక సప్తభూమి గృహము (విమానము) లుండుట విశేషము.

మయసభానిర్మాణ మొక యపూర్వశిల్పకళాసృష్టి.

ఏకస్తంభహర్మ్య మింకొక నిర్మాణవిశేషము.

ఇవి యన్నియు మహాభారతకాలము నందలి జనుల శిల్పకళాభిమానమునకు, ఆ నాటి శిల్పుల శిల్పకళావైదుష్యమునకు నిదర్శనము.

ఈ విధముగా పరిశీలించినచో మహాభారతకాలమున స్థాపత్యకళ సర్వతోముఖవికాసము నందియున్న దని నిస్సంశయముగాఁ జెప్ప వచ్చును.

—)o(—

# అనుబంధములు

## 1. సింధునాగరకత - హరప్పాసంస్కృతి

మన ప్రాచీనవాస్తుశిల్పవిజ్ఞానమునకు, భారతీయశిల్పుల ప్రజ్ఞావిశేషములకు ప్రత్యక్షప్రమాణముగా నిలిచిన మొహంజొదారో, హరప్పా నగరములను గురించి తెలిసికొనవలసిన యవసర మెంతేని గలదు

క్రీ. శ. 1922 సం॥ నుండి పురావస్తుశాస్త్రజ్ఞులు సింధుమైదానములో జరిపిన త్రవ్వకములలో మొహంజొదారో, హరప్పాయను ప్రాచీననగరములు బయలుపడినవి. మొహంజొదారో (మృతులదిబ్బ) సింధురాష్ట్రము నందలి లార్ఖానాజిల్లాలో సింధునది పశ్చిమతీరమున నున్నది. హరప్పా పంజాబు రాష్ట్రమునందు మాంట్‌గోమరీజిల్లాలో రావి నదీతీరముననున్నది. వాని మధ్యదూరము 400 మైళ్లు.

ఈ పురావస్తుపరిశోధనకార్యక్రమమును నిర్వహించిన సర్ జాన్ మార్షల్ 1924 లో నిట్లు వ్రాసినాడు.

"క్రీ. పూ. మూడువేలసంవత్సరములకు పూర్వమే పంజాబు సింధుప్రాంతమునందలి ప్రజలు చక్కగా నిర్మింపబడిన నగరములలో నివసించుచుండిరి. వారు ఉన్నతప్రమాణములు గల శిల్పకళాచాతుర్యముతో పరిణతి చెందిన సంస్కృతి గలిగియుండిరి. వారి లిపి చిత్రలిపి."-అని

ఈ శిథిలనగరముల వాస్తుశిల్పకళావిశేషములను బట్టియు నగరరచనాప్రణాళికను బట్టియు, గృహోపకరణములు, ఆయుధములు మొదలగు వస్తుసామగ్రిని

1. Cf : Archaelogy in India. P - 28.
(Publications Division. Ministry of Information and Broadcasting. Govt. of India).
"In 1924, Sir John Marshall wrote :
Now, at a single bound, we have established the fact that in the third millennium before Christ, and even before that the peoples of Punjab and Sind were living in well-built cities and in possession of a relatively mature culture with a high standard of art and craftmanship and a developed system of Picto-grafic writing"

బట్టియు, దేవతామూర్తులు, ఆభరణములు మున్నగు శిల్పకళాఖండములను బట్టియు తత్తన్నిర్మాణరీతులను బట్టియు నీ రెండు నగరములు నొకే నాగరికతకు నెలవు లనియు, ఒకానొక మహాసామ్రాజ్యమునకు ముఖ్యపట్టణములై యుండు ననియు శాస్త్రజ్ఞు లూహించుచున్నారు.1

మెసపొటోమియా లోని ఊర్, నినెవా నగరములతో పోల్చిచూచిన సింధు లోయ యందలి నగరములు నిర్దిష్టమయిన నగరరచనాప్రణాళిక ననుసరించి నిర్మింప బడినట్లు స్పష్టమగుచున్నది.

అతిప్రాచీనకాలమునుండియు శిల్పులు మొట్టమొదట భూమిని పరీక్షించి, దిక్సాధనముచేసి, నిర్మాణయోగ్యమగు స్థలమును నిర్ణయించి దానిని ఏకాశీతిపద వాస్తువుగనో చతుష్షష్టిపదవాస్తువుగనో విభజించి దాని యందు వాస్తుపురుషుని వాస్తుపురుషాంగదేవతలను భావించి వాస్తూపశమనార్థము వాస్తుపూజ కావించి నిర్మాణమునకుఁ గడగుచుండిరి. ఈ కార్యక్రమమును నిర్వహించి వాస్తుదేవతాబలి చేయువాడు ముఖ్యశిల్పియే.2

క్రీ. పూ. నాలుగువేల సం॥ప్రాంతములో నిర్మింపఁబడిన మొహంజొదారో నగరనిర్మాత లీపద్ధతినే పాటించినట్లు తెలియుచున్నది.3

1. Cf : V.D. Mahajan = Early History of India.
"According to V. Gordon childe, the civilisation of Harappa, Mohenjodaro and Chanhudaro "is astonishingly homogeneous; all the specific idiosyncrasies of architecture and town planning, of metal tools and weapons, of ornaments and beads, of art and epigraphy noted at Mohenjodaro recur at Harappa".

2. Cf : (i) G. K. Pillai : The way of the Silpis. P-48.
"the offering is done by the chief silpi"
(ii) Viswakarma prakasika (iii) Agnipurana.

3. Cf : Ibid P-54.
"they-the town planners of Mohenjodaro - followed the system of squaring the field and the true orientation of silpis in laying out the then new town of Mohenjodaro, sometime in the fourth Millennium B. C."

# పురదుర్గములు

మొహంజొదారో హరప్పాలలో రెండు ప్రధానభాగములు కనిపించును. పశ్చిమమున మెరక ప్రాంతము, దుర్గము. తూర్పున పల్లపుప్రాంతము పౌరజనా వాసము.[1]

ఇవి అష్టముఖదుర్గములు. మొహంజొదారో పురదుర్గము మానసారముని చెప్పిన "ద్రోణకము" వంటి దని డా॥ పి. కె. ఆచార్య తెలిపినాడు.[2]

కోటగోడ పచ్చియిటికలతోను, గోడపైభాగము కాల్చినవండుటిటుకలతోను కట్టబడినది. గోడ మందము పునాదులవద్ద 13.5 మీటర్లు (44 అ.) ఉన్నది. అది పైకి పోను పోను సన్నగిల్లుచున్నది.

ప్రభుత్వభవనములు, తదితరముఖ్యమయిన భవనములు కోటలో నెత్తైన వేదికలపై నిర్మింపబడినవి.

ఈ శిధిలనగరముల యందలి కట్టడములు మూడు విధములుగా నున్నవి 1) నివాసగృహములు. 2) విశాలభవనములు 3) పౌరనిర్మాణములు.

సామాన్యుల నివాసగృహములు రెండేసి గదులు గల చిన్నయిండ్లు. ఇండ్లన్నియు నొకే పద్ధతిలో నిర్మింపబడుట యొక విశేషము.

సంపన్నులగృహములు ఐదారు గదులు గలిగిన మండువా లోగిళ్లు. అనగా చుట్టును గదులుండి మధ్యలో ఖాళీస్థలము గల శాలాగృహములు.

ఈ విధముగా మధ్యఖాళీస్థలము (పెరడు) విడిచి చుట్టును కావలసినన్ని గదులు నిర్మించుకొనుట బాబిలోనులో వలె సింధులోయలోను గృహనిర్మాణమునందు ముఖ్యలక్షణముగా నున్నది.[3]

1. భారతదేశ చరిత్ర : సంస్కృతి. ప్రథమభాగము. పు. 17, 18
   తెలుగు అకాడమీ–ప్రచురణ. హైదరాబాదు. 1977
2. Cf : THE VEDIC AGE – ed. R. C. Majundar.
   Appendix–Ch. IX P. 549
   Dr. Acharya considers Mohenjodaro, with its irregular shape, to correspond with the Dronaka fortress of the Manasara plans"-
3. Ibid : P. 174
   "The open court was the basic feature of the house planning in the Indus Valley as in Babylon."

మొహంజొదారో నగరము నందలి ప్రధానవీధులు ఉత్తర - దక్షిణములుగను ఉపవీధులు తూర్పు-పడమరలుగను ఒకదానినొకటి సమకోణములుగా ఖండించుచు నగరమును చిన్న చిన్న పేటలుగా గృహసముదాయములు (Blocks గా విభజించుచున్నవి. అవి అపటి వాతావర్ణమున కనుకూలముగ నుండి పరిశుద్ధవాయు ప్రసరణమునకు దోహదము చేయుచున్నవి. *

వీధు లన్నియు 14 నుండి 33 అడుగుల వైశాల్యము గలిగి శకటములు, రథములు పోవుటకు వీలుగా నున్నవి. అన్నిటికంటె తూర్పువీథి విశాలమై రాజవీథి యనఁదగియున్నది. దీని వెడల్పు 10 మీటర్లు (33 అ. ; పొడవు 800 మీటర్లు (2640 అ.)

వీథుల కిరుప్రక్కల గృహములున్నవి. అవి కాల్చిన యిటుకలతో కట్టబడినవి. కొన్ని రెండంతస్తులమేడలు, మూడంతస్తుల మేడలు గలవు. ప్రతి గృహమునకు ఒక బావి, స్నానముల గది యున్నది.

గృహముల నుండి మురికి నీరు తూముల ద్వారా వీథులలో భూగర్భము నందు గల మురికికాల్వలలో గలియుచున్నది. ఈ భూగర్భప్రణాళికల ద్వారా నగరము నందలి మురుగంతయు నగరము చివర గల నదిని జేరుచున్నది.

* 1. Cf :- Archaeology in India . P. 36.
Published by Director, Publications Division.
Ministry of Information & Boroadcasting.
Govt. of India New Delhi.

"The excavations at Harappa and Mohenjodaro brought to light many interesting facts including the design and lay-ont of the cities with streets and lanes cutting one another at right angles, their drainage system"

2. Cf :- V. D Mahajan Early History of India. P. 40.

"According to Meakay, the roads were so arranged that the prevailing winds could work as a sort of suction pump thereby cleaning the atmosphere automatically. They cut each other at right angles,"

ఈ మురికికాల్వలు పురవీథుల మధ్య భూగర్భము నందొకటి రెండడుగుల లోతున ఇటుకలతో నిర్మింపఁబడినవి. ఈ కాలువలు శుభ్రము చేయుట కక్కడక్కడ మనిషిదూరుటకు వీలుగా రంధ్రములమర్పబడినవి.

ఈ విధముగా నారోగ్యసూత్రములు పాటించుచు, విశాలమయిన వీథులతో, చక్కని పారిశుధ్యప్రకల్పనప్రక్రమముతో నిర్మింపఁబడిన మొహంజొదారో శిల్ప లనుసరించిన నగరరచనావిధానము తాత్కాలీన నాగరకతాప్రపంచము నం దద్వితీయ మనియు నపూర్వ మనియు పురాతత్త్వవిదులు భావించుచున్నారు.[1]

ఇచట గృహములకు, తదితరనిర్మాణములకు కాల్చిన యిటుక లుపయోగింపఁబడినవి. ఈ యిటుకలలో కొన్ని 51.5 సెం.మీ. పొడవు, 26 5 సెం మీ. వెడల్పు 9 సెం మీ. మందము గలిగియున్నవి.

# బృహత్ స్నానవాటిక

మొహంజొదారో శిథిలములలో నెల్ల చమత్కారజనకమైన నిర్మాణము జలచికిత్సాకేంద్రము వలె నున్న బృహత్స్నానవాటిక. ఇది 180 అ. పొడవు; 108 అ. వెడల్పు గలిగి దీర్ఘచతురస్రాకారముగ నున్నది.

ఈ స్నానవాటిక మధ్య 39 అ. పొడవు, 23 అ. వెడల్పు, 7-9 అ. లోతు గల అనావృతపుష్కరిణి యున్నది. ఈ కొనేటికి నలుప్రైపుల వసారా లున్నవి. దక్షిణదిక్కున సోపానములు, అటు నిటు చిన్నగదులు, ఉత్తరదిక్కున వావర్ పెద్దగదులు; తూర్పుదిక్కున చిన్నగదులు, అం దొకగదిలో బావి యున్నవి.

1. Cf : The History and Culture of the Indian people- THE VEDIC AGE. ed. R. C. Majundar,

"The eloborate drainage system is a unique feature of the Indus Valley Civilisation, the like of which has not yet been found in any other city of the same antiquity."

బావి నుండి కోనేటి లోనికి నీరు పంపుటకు ఏర్పాటున్నది. వేడి నీటిని గూడ పంపుట కేర్పాటు లున్నట్టుతెలియుచున్నది. ఈ స్నానవాటిక సింధుప్రజల నిర్మాణ కౌశల్యమునకు గీటురాయి.*

ఐదువేల సంవత్సరముల క్రితము నిర్మింపఁబడిన యీ స్నానవాటిక నేటికిని చెక్కు చెదరకుండుట యీ కట్టడముల గట్టిదనమును ఆనాటి శిల్పుల పనితనమును చాటి చెప్పుచున్నది.[1]

చూడు :- 1) భారతదేశ చరిత్ర : సంస్కృతి. ప్రథమభాగము.
తెలుగు అకాడమి. హైదరాబాదు.

2) Cf :- Dr.B.G. Gokhale = Ancient India-History and Culture.
This Great Bath, says Sir John Marshall "appears to have been a vast hydropathic establishment and the most imposing of all the rewains uneasthed at Mohenjodaro; has the over all measurement of 180 ft. long and 108 ft. broad. Its plan is simple; in the centre an open quadrangle with varandahs on its four sides, and at the back of the three of the varandahs various gollories and rooms; on the south, a long gallery with a small chamber in each corner; on the east a single range of small chambers, including one with a well; on the north a group of several halls and fair sized rooms. In the midst of the open quadrangle is a large swimming bath some 39 feet long by 23 feet broad and sunk about 8 feet below the paving of the court, with a flight of steps at either end, and at the foot of each a low platform for the convenience of the fathers who might otherwise have found the water too deep."

3) Cf :- Radha Kumud Mookerji : Hindu Civilization.
Part I. P. 14

1. Cf :- An Advanced History of India. PP. 16-17
ed. R. C. Majundar, H. C. Raychoudhuri & Kalikinkar Datta.
"The most imposing structure in the city is the Great Bath.... ---- ---- ---- ....The solidity of the construction is amply borne out by the fact that it has successfully withstood the ravages of five thousand years.

ఈ స్నానవాటికకు నైరుతి మూలగా నొక ఉష్ణవాయుస్నానాగారమున్నది. దాని యందు 5 అ. ఎత్తుగా ఇటికలతో నిర్మింపబడిన యరుగులు, వాటి ప్రక్క నిలువు గొట్టములు చాల గలవు. మొహంజొదారోలో ఇట్టి నిర్మాణమే మఱియొకటి గలదు.

దీనిని బట్టి సింధుప్రజలకు ఉష్ణవాయుస్నాన విధాన ప్రయోజనములు తెలిసి యుండు నని యూహింపబడుచున్నది.[1]

ఈ స్నానవాటికానిర్మాణము నందు శిల్పులు పాటించిన సూత్రమును వివరించుచు గోవిందకృష్ణపిళ్లై యిట్లు వ్రాసినాడు.[2]

పొడవు = వెడల్పు + 2/3 వెడల్పు.

$180 = 108 + \frac{2}{3} \times 108$

$180 = 108 + 72.$

బాగుగా యోచించినచో ఇట పొడవు వెడల్పుల నిష్పత్తి 5:3 అని తెలియ వచ్చును.

కోనేటి నిర్మాణము నందును ఇంచుమించుగా ఇదే సూత్రము పాటింపబడి నది. దీని పొడవు, వెడల్పు, లోతుల నిష్పత్తి 5:3:1. అని తెలియవచ్చును

1. Cf :- The History and Culture of the Indian People -THE VEDIC AGE., ed. R.C. Majundar. PP. 175-6.
   "Near the South West corner of the Great Bath is a hammam or hot air bath. It has a number of rectangular platforms of brick about 5 feet high, having a series of vertical chases sunk in their sides. There is another similar building at Mohenjodaro which shows that the Indus people understood the principle of hypocaust and had Turkish baths."
2. Cf :- G.K. Pillai :- The Way of the Silpis. P. 75
   "The construction of the swimming-bath reflects great credit of the engineering of those days."

మొహంజొదారో, హరప్పా నగరములలో ధాన్యాగారములు కలవు.

మొహంజొదారో లో ధాన్యాగారము 45 × 22.5 మీటర్లు [148 అ. × 74అ] పొడవు – వెడల్పులు గలిగి దీర్ఘచతురస్రాకారముగనున్నది. ఇట పొడవు – వెడల్పులు 2:1 నిష్పత్తిలో నున్నవి.

హరప్పాలో ధాన్యాగారము 50 7 × 40.5 మీటర్లు [169 అ. × 135 అ.] పొడవు – వెడల్పులు గలిగియున్నది. ఇట పొడవు – వెడల్పుల నిష్పత్తి 5:4. ఇందు ఆరేసి చావళ్ళుగల రెండువరుసల కట్టడములు గలవు. ఇది చాలాక్లిష్టమైన నిర్మాణము.

మొహంజొదారోలో 230 × 70 అ.పొడవు – వెడల్పులుగా గల కట్టడ మొకటి గలదు. ఇది ప్రార్థనామందిరము (College Building) కావచ్చును. 80 అ × 8] అ. పొడవు-వెడల్పులు గలిగి పెక్కు స్తంభములతో నిర్మింపబడిన మండపము పురపాలకసంస్థ కార్యాలయము కావచ్చును.

ఈవిధముగా సింధునగర శిథిలముల నన్నింటిని పరిశీలించినచో నాకాలమునం దచట నివసించిన ప్రజలు ప్రాచీనకాలము నం దెందును గనరాని సకలసౌకర్యములు గల నగరములలో సుఖజీవనమును గడుపుచున్నారనుటలో సందియము లేదు.

కావున సింధునాగరకతాకాలము నాటికి వాస్తుశిల్పము - స్థాపత్యకళ – పరాకాష్ఠ నందిన దని నిర్ణయింపవచ్చును.

---

1. Cf :- An Advanced History of India. PP. 17-18
   ed. R.C. Majundar. H.C. Ray Choudhuri & Kalikinkar Datta

   "On the whole, the ruins leave no doubt that there was on this site a large, populous and flourishing town whose inhabitants freely enjoyed, to a degree unknown elsewhere in the ancient world, not only in Sanitary Conveniences but also the luxuries and comforts of a highly developed municipal life. We must conclude that the art of building had reached a high degree of perfection."

సింధునాగరకతాక ర్తృత్వమును గురించి భిన్నాభిప్రాయము లున్నవి.

సింధునాగరకత — హరప్పా సంస్కృతి ఆర్యనాగరకతా సంస్కృతుల కంటె భిన్నమయిన దనియు, అది అత్యంతప్రాచీన మయినదనియు, అదియే మూలభారతీయనాగరకత (Proto - Indian Civilisation) అనియు కొందరు చరిత్రకారులు భావించుచున్నారు.[1]

"ఇవి (మొహంజొదారో హరప్పానగరములు) మన వాస్తుశాస్త్రప్రాభవమునకు ప్రబలనిదర్శనము లయియున్నవి. భారతీయుల ఔన్నత్యమును సహింపలేని చరిత్రకారులు ఈ శిథిలనగరములను ప్రాగ్వైదికఅనార్యసభ్యత లోనివిగా చెప్పి వితండవాదములు చేయుచున్నారు కాని భారతీయవిద్వాంసులు ఈ హరప్పాసంస్కృతి వైదికసంస్కృతికి ఆధునికరూప మనినిర్ధారించి వీని కాలము క్రీ.పూ. నాలుగు వేల సంవత్సరములయి యుండు నని తేల్చినారు".[2]

క్రీ.పూ. మూడు నాలుగు వేల సంవత్సరముల క్రితము సింధులోయలో నివసించిన ప్రజలు పరిణతి చెందిన సంస్కృతి గలవార నియు వారి పై భారతీయార్యుల (వైదికార్యుల) ప్రభావ మావంతయు లే దనియు సర్ జాన్ మార్షల్ తెలిపినాడు.[3]

---

1. చూడు :- భారతదేశచరిత్ర-సంస్కృతి. ప్రథమ భాగము. పు. 17
తెలుగు అకాడమీ ప్రచురణ. హైదారాబాదు

2. చూడు :- గడయారం రామకృష్ణశర్మ : మన వాస్తుసంపద. పు 7
(quoted from PROTO INDIAN RELIGEON by Dr. S. Sreekanta Sastry.)

3. Cf :- Archaelogy in India : P 32 Pub. Govt., of India.

"Referring to the excavations carried out at Mohenjodaro, Sir John Marshall said :

"They exhibit the Indus peoples of the fourth and third (correctly third and second) millennia B. C., in possession of a highly developed culture in which no vestige of Indo-Aryan influence is to be found.'

ఋగ్వేదము నందు సింధునాగరకతాప్రబంధబంధురములగు పురదుర్గవర్ణనము లున్నవి. అవి ముఖ్యముగా దస్యు-దాసజాతుల పురదుర్గములు.

1. పురదుర్గములు, విశాలనగరములు [ ఋ, 1-41-3; 1- 89-2 ]
2. శత స్తంభపురములు; నూరేసి గోడలు గలవి. [ఋ. 1-166-8; 7.15-14]
3. ఆయసీపురములు; ఇనుముతో కట్టబడినవి. [ఋ. 1-58-8; 2.20-8 ]
4. అశ్మమయపురములు; రాళ్ళతో కట్టబడినవి. [ఋ. 4-30-20 ]
5. శారదీపురములు : [ఋ. 1-131-4; 1-174.2 ]
   వరదలు మున్నగు ఉపద్రవము లు వచ్చినపుడు తలదాచు కొనుటకు వీలయిన శరణాలయములు.

ఆర్యదైవ మయిన యింద్రుఁడు దివోదాసు పక్షము వహించి దస్యులనోడించి వారి ఆయసీపురములను, అశ్మమయీపురములను, శారదీపురదుర్గములను ధ్వంసము చేసి పురందరుఁడై నాఁడు.

దస్యూన్ పురఆయసీర్ని తారీత్॥ ఋ. 2.20-8

శతమశ్మమయీనాంపురామింద్రోవ్యాస్యత్।
దివోదాసాయదాశుషే॥ ఋ 4-30-20

ఆర్యేతరజాతుల నాగరకతావైశిష్ట్యమును, తన్నాశనమును దెలుపు నీ వర్ణనములు మొహంజొదారో-హరప్పా నగరావశేషములను దలపింపఁజేయుచున్నవి.

ఈ వర్ణనములు సింధులోయలోగల పట్టణనాగరకతను సూచించుట లేదా? యని రాధాకుముద్ ముఖర్జీ ప్రశ్నించినాఁడు.1

1. Cf :- Radha Kumud Mookerji = HINDU CIVILIZATION Part I. P P 29-30.

"As regards the material aspects of non-Aryan civilization, the Rigveda refers to towns and forts, broad (prithvi) and wide (urvi)....of hundred pillars (satabhuji), built of stone (asmamayi), to autumnal (saradi) forts a refuge against inundations, and to hundred cities in a non-Aryan Kingdom. Even the vedic God Indra is designated for the occasion as Purandara, "Taker of cities"! Does not all this seem appropriate reference to the city civilisation of the Indus valley ?"

సింధులోయలో స్థిరనివాసము లేర్పరచుకొని విశాలములయిన పురదుర్గము లతో నాగరకజీవనము గడుపుచున్న యాదిమజాతులు.

నల్లని శరీరము గలవారు. [కృష్ణత్వక్, కృష్ణా, కృష్ణగర్భా][1],
పొట్టిముక్కు గలవారు [అనాసః][2];
వైదిక సంస్కృతముకంటె భిన్నమయిన భాషమాటాడువారు [మృధ్రవాచః][3]

వీరి యాచారవ్యవహారము లార్యధర్మము కంటె భిన్నమైనవి.

అసుర పణి దస్యుదాసాదిజనులెల్లరు.

1) వైదిక కర్మ రహితులు. [అకర్మా ... ఋ 10_22.8

2) ఇంద్రాది వైదికదేవతలను పూజింపనివారు.
[అదేవయుమ్ ... ఋ 8_70_11

3) యజ్ఞయాగాది క్రతువులు చేయనివారు.
[అయజ్వానమ్ — ఋ 8-70_11;
అయజ్ఞాన్ — ఋ. 7-6-3;
అక్రతూన్ — ఋ 7-6-3
అయజ్యూన్ — ఋ. 7_6 3

4) అనాచారులు. [అవ్రత. ఋ 1-130_0

1. ఋగ్వేద. 4-16-13; 6-47-21; 1-101-1
"పంచాశత్ కృష్ణాని వపః సహస్రాత్కం నపురోజరిమా విదర్త్సం."

2. ఋగ్వేద -5-29-10.
అనాసో దస్యూన్రమృణో వధేన
ని దుర్యోణ ఆవృణఙ్ మృధ్రవాచః॥

The non-Aryan is dark-skinned as well as noseless (anasa) or snubnosed like the Dravidian He is of hostile speech (Mridhravak) i.e., speaking a language Madically different from Vedic Sanscrit.
—R. K. Mookerji.

3. ఋగ్వేద. 5-29-10; 7-6-3; 1-174-2

5) అన్యధర్మము ననుసరించువారు. [అన్యవ్రతమ్. ఋ. 8-70-11
ఇంద్రాదివైదికదేవతలను పూజింపనివారు.
[అదేవయుమ్. ... ఋ 8-70-11]

6) శివలింగపూజ చేయు వారు
[శిశ్నదేవాః. ఋ. 10-99-3; ఋ. 7-2 -5;]

7) క్షుద్రదేవతారాధనచేయువారు
[మూరదేవాః ఋ. 10-87-2; ఋ. 7-104-24]

ఈ విధముగా వైదికధర్మకర్మహీనులను, బుద్ధిహీనులను, మానవత్వము లేని వారిని, అన్యధర్మము ననుసరించు దస్యుఃను దాసులను వధింపు మని వేదర్షులు ఇంద్రుని ప్రార్థించినారు.

అకర్మా దస్యు రభినో అమంతు రన్యవ్రతో అమానుషః।
త్వం తస్యామిత్రహన్ వధ ర్దాసస్య దంభయ. – ఋగ్వేద 0.22.8

ఋగ్వేదము నందలి యీ వర్ణనము లించుమించుగా సింధుప్రజల స్వరూప స్వభావములకు సరిపడుచున్నవి.[1]

కావున దృఢమయిన పురదుర్గములు కలిగియున్నట్లు ఋగ్వేదమునందు వర్ణింపఁబడిన దస్యు-దాసాది జాతులే ఆర్యుల కంటె ముందు సింధులోయప్రాంతము నందున్న ప్రజ లని చెప్పవచ్చును.[2]

1. Cf :- Radha kumud Mookerji = HINDU CIVILIZATION P. 29.

"If (Rigveda) mentions some significant characteristics of non-Aryan culture which recall and resemble those of the Indus. Thus the non-Aryan is described as speaking a strange language [mridhravak,] not following vedic rituals [akarman], gods [adevayu], devotion [abrahman] sacrifices [ayajvan], or ordinances [avrata], but following their own system [anyavrata[. And besides these negative characterizations, the Rigveda also mentions a positive characteristic of the non-Aryan viz. that he was a phallus-worshipper. [Sisnadevah].

2. Cf :- V. D. Mahajan = Early History of India. P. 49

ఆర్యుల కంటె ముందె అస్సీరియాదేశము నుండి వలసవచ్చి ఆర్యధర్మము కంటె భిన్నమయిన అసురధర్మము ననుసరించునట్టి అసురులే-అస్సీరియనులే-సింధు నాగరకతాప్రవర్తకు లని బెనర్జీ శాస్త్రి భావించినాడు[1]

మహాభారతము నందు పేర్కొనఁబడిన దానవులే మొహంజొదారో-హరప్పా నగరనిర్మాత లని డా॥ పి. సి. సేన్‌గుప్త వ్రాసినాఁడు.[2]

అసురు లన్నను దానవు లన్నను ఒక జాతి వారే. వీరెల్లరు సురవిరోధులు

అసురాదైత్యదైతేయా దనుజేంద్రారి దానవాః।
శుక్రశిష్యా దితిసుతాః పూర్వదేవా స్సురద్విషః॥

— అమరకోశము

ఋగ్వేదము నందు పేర్కొనబడిన పణ్యసురదస్యుదాసాదులు ఆర్యశత్రువులు వీరే. ఆర్యులనఁగా దేవతలు, వారి శత్రువులు దస్యులు.

హరప్పాసంస్కృతి నిర్మాతలు ఆర్యేతరు లనియు, ప్రధానముగా ద్రవిడ వారై యుందురనియు ఆర్. సి. మజుందార్ వంటి సుప్రసిద్ధ చరిత్రకా అభిప్రాయము.[3]

---

1. Cf :- The VEDIC AGE P. 254 ed Majundar

"Benerji Sastri considers the Asuras as immigrants from Assyria. the followers of Asura cult who preceded the Aryans in India and were the authors of the Indus Valley Civilisation"

2. Cf :- A. D. Pusalkar : Studies in Epics and Puranas in India. P. 153.

"P. C. Sen Gupta identifies the Danavas in Mahabharata with the builders of Mohenjodara and Harappa."

3. చూడు :- భారతదేశచరిత్ర-సంస్కృతి. ప్రథమభాగము. పు. [illegible]
సం॥ ఆచార్య రామాయణం నరసింహారావు. తెలుగు అకాడమీ.

ప్రాచీనకాలమున సింధులోయలో నివసించిన ప్రజలు ద్రవిడభాష మాటాడు చుండి రనియు, వారు పూర్వద్రావిడు లనియు కె.యం. మున్షీ కూడ వ్రాసినాఁడు.[1]

సింధునదీప్రాంతనగరములు ద్రవిడజనావాసము లయినచో ఆ నగర నిర్మాతలు ద్రవిడశిల్పసంప్రదాయమును పాటించిన యసురశిల్పు లనియు చెప్పవచ్చును.

ఆర్యుల సాంకేతికపరిజ్ఞానము, రథ శస్త్రాస్త్రనిర్మాణాదికము, ముఖ్యముగా త్వష్టృదేవునకుఁ దదనుయాయులకు సంబంధించిన దనియు వారే సింధునాగరకతా స్రష్టలై యుందు రనియు డి.డి. కోశాంబి వ్రాసినాఁడు.[2]

## మొహంజొదారో

శ్రీకృష్ణుఁడు సౌంభకనగరమును దగ్ధము చేయుట ఆర్యులు మొహంజోదారో వంటి నగరములను ధ్వంసము చేయుటయే యని ప్రబోధచంద్ర గుప్త అభిప్రాయము.[3]

1. Cf :- K. M. Munshi : Foundations of Indian Culture. P. 14.

   "The Early Dravidians, who arrived in India prior to 2000 B. C., possessed a highly developed material culture, as would appear from their early speech forms and the finds in Mohenjodaro, Harappa and Lothal. They had forts, publicbaths, shipping activities, international commerce, a special feature inherited by the Later Dravidians of the historical period."

2. Cf :- D. D. Kosambi : The Culture and Civilisation of Ancient India. P. 80.

   "Techonology amounted mostly to the construction of chariots, tools and weapons of war; it belonged primarily to the God Tvastri and his followers both seemingly of Indus origin."

3. Cf :- Probodha Chandra Gupta = Ancient Indian Chronology P. 24

సౌంభకము మయనిర్మితము.1 కావున మొహంజొదారో కూడా మయ నిర్మిత మని చెప్పవచ్చును. కాని మొహంజొదారో అనుచోట నొకదానిపై నొకటి యేడు నగరములు నిర్మింపఁబడినట్లు పురాతత్త్వ శాస్త్రజ్ఞులు కనుగొనినారు. ఈ యేడింటిలో నేది మయనిర్మితమో తేల్చి చెప్పుట కష్టము.

శిల్పశాస్త్రవేత్తయైన శుక్రాచార్యునకు మొహంజొదారో శిల్పమునకు సన్నిహితసంబంధమున్న దని జి.కె. పిళ్లై తెలిపినాఁడు.

శుక్రుఁడు ద్రవిడుడు కనుక మొహంజొదారో శిల్పము ద్రావిడ సంప్రదాయమే.2

# హరప్పా

ఇది అతి ప్రాచీన నగరము. ఋగ్వేదమునందు "హరియూపియా" యని పేర్కొనఁబడిన నగరమిదే.3 [ఋగ్వేద. 6-27-5]

హరప్పానగరము దనుసంతతియైన దానవులకు నెలవు. ఈ హరియూపీయుల చరితము మహాదానవేంద్రుఁడయిన వృషపర్వునితో మొదిలిడియున్నది4 కావున వృషపర్వుని పురమే హరప్పాయై యుండవచ్చును

మహాశిల్పాచార్యుఁడయిన శుక్రాచార్యుఁడు వృషపర్వుని కొలువునందున్న వాఁడు. మయుఁడును వృషపర్వునికి సభాభవనము నిర్మింపఁదలపెట్టినాఁడు.

1. భాగవతమహాపురాణము
2. Cf :- G. K Pillai=The Way of the Silpis. P. 248
   "Sukra was undoubted a Dravidian;
   so was Mohenjodaro's Art."
3. చూడు :- గడియారం రామకృష్ణశర్మ = మన వాస్తుసంపద.
4. Cf :- S. B. Roy—"The Lost Civilisations"—article in SUNDAYSTANDARD. Dated 30-11-1975.
   Vijayawada ed.
   "Danavas : They are called Danaus in the Rig Veda being the progeny of the matriarch Danu. They were the Hariyupians and began their career with Vrishaparva, a Junior contemporary of King Pururavas."

"తొల్లి వృషపర్వుండను దానవేంద్రున కొక సభ నిర్మింప సమకట్టి
వివిధ రత్నమయంబులయిన యుపకరణంబు లొడఁగూర్చి బిందు
సరంబను కొలన సంగ్రహించినాఁడ" నని మయుఁడే చెప్పినాఁడు.
(నన్నయ. భార. సభా. 4-56)

హరప్పా నగరమును పాలించిన రాజులలో కులితర పుత్రుఁడయిన శంబరుఁడు గొప్పవాఁడనియు, నతఁడు క్రీ.పూ. 2000 సం॥ ప్రాంతమున నున్నాఁడనియు చరిత్రకారులూహించుచున్నారు.[1]

ఇంద్రుఁడు శంబరాదుల నోడించినట్లు భారతమునందు గలదు.

"ఈ రథ మెక్కి తొల్లి యమరేంద్రుఁ డనేకసహస్ర దే
వారుల వృత శంబరబలాదుల నుద్ధతులన్ జయించె...."
(నన్నయ. భార. అరణ్య 4-56)

ఇంద్రుఁడు దివోదాసు పక్షమున పోరాడి శంబరుని తొంబది తొమ్మిదిపురములను ధ్వంసము చేసినట్లు ఋగ్వేదమునందు వర్ణింపఁబడినది.

దివోదాసాయ నవతించ నవేంద్రః
పురో వ్యైరచ్ఛంబరస్య॥ — ఋ 2-19.6

పురందరుడు ధ్వంసము చేసిన శంబరాసురుని పురములలో హరప్పా నగర మొకటై యుండవచ్చును.

హరప్పా వద్ద నొకదానిపై నొకటి ఆరు నగరములు నిర్మింపఁ బడినవి.

హరప్పానగర రచనా ప్రణాళికకు మూలము తమ శిల్పకళా కౌశలము వలన పైవత్వము నొందిన ఋభువులు నిర్మించిన చతుచ్ఛిద్రచమసము. ఈ ఋభు దేవతలను, వారి ప్రజ్ఞావిశేషములను కీర్తించిన వేదర్షులలో నొకఁడయిన దీర్ఘతముఁడు క్రీ.పూ. 2350 సం॥ ప్రాంతమునం దున్నవాఁడు.

1. Ibid :-

"The greatest king of the Hariyupia was perhaps shambar, son of Kulitara, who lived and ruled around 2000 B. C.

కనుక హరప్పానగరనిర్మాణ ప్రణాళిక క్రీ. పూ. 2550 సం॥ నాటిదను పురాతత్త్వవిదులవాదము బలపడుచున్నది.[1]

ఋభువులు శిల్పకళానైపుణ్యము నందు గురువును మించిన శిష్యులు. వీరికి శిల్పవిద్యాగురువైన త్వష్ట శుక్రాచార్యుని తనయుడు. త్వష్ట కుమారు లయిన మయవిశ్వకర్మలు వీరికి సమకాలికులు.

## శిల్పాచార్య పరంపర

సకలదైత్యదానవగణోపాధ్యాయు డయిన శుక్రాచార్యుడు శిల్పశాస్త్ర ప్రవర్తకుడు. శుక్రాచార్యుని నలువురుకొడుకులలో త్వష్ట యొకడు. మయవిశ్వకర్మలు త్వష్టకుమారులు.

శిల్పశాస్త్రప్రవర్తకు లయిన వీరెల్లరు క్రీ. పూ. మూడవ సహస్రాబ్ది ప్రారంభము నందున్నట్లు తెలియుచున్నది.[2]

---

1. Ibid :- "Harappan city planning was due to a four-slitted tool whose copious use is evident in the relics. It was called the 'chamasa' and the credit for making a four-slitted chamasa is given in Rig Veda to the Ribhus, the skilled-artisans who were deefied the praise of the Ribhus as semi-divine beings was sung by Dirghatamas (C. 2350 B. C.). This is corroborated by the fact that the Harappan town planning began somewhere in 2550. B. C"

2. Cf :- G. K. Pillai = The Way of the Silpis. PP. 280-1. "Maya is a great authority on silpa sastra———Tvastar is a son of the great Sukra, another great authority on silpa sastra, therefore he must have lived at the early part of the the third millennium B. C. He had a son called Visvakarma. If it was the Visvakarman, who came to be known as Visvakarma of the silpi ancestry, and as the father and son being descended from Sukra, it can be assumed that the Silpi craft has its origin in the name of the great Masters of the Art."

క్రీ. పూ. 3500 సం॥ ప్రాంతమున భారతీయశిల్పులు, గణితశాస్త్రజ్ఞులు బాబిలోనియాకు వలసపోయియుండవచ్చును. అది అసంభవము కాదు. వారును, మొహంజొదారో - హరప్పానగరములను నిర్మించిన శిల్పులు, వారి సంతతియు సమీపవర్తు లనియు, సమీపవర్తు లనియు, నాకాలమున బాబిలోనియాకు, సింధునగర ములకు మధ్య రాకపోకలున్న వనియు రూఢి యగుచున్నది[1]

ఈ విషయముల నన్నింటిని పరిశీలించిచూడఁగా, మొహంజొదారో-హరప్పా నగరనిర్మాత లయిన శిల్పులలో ప్రప్రథముఁడు శుక్రాచార్యుఁ డనియు, తదనంతరము త్వష్ట, మయుఁడు, వారిశిష్యప్రశిష్యులు నాయాకాలములందు శిథిలములైన నగరము లను పునర్నిర్మించియుందు రనియు నూహింపవచ్చును.

శుక్రాచార్యుఁ డసురగురువు కనుక సింధునాగరకతాప్రవర్తకులయిన శిల్పు లెల్లరు నసుర (ద్రావిడ) శిల్ప సంప్రదాయావలంబు లని తెలియుచున్నది.

1. Cf :- G K. Pillai ; The Way of the Silpis : P. 282
"In such an upheaval of science, mathematics and astronomy is it improbable that the Indian Silpis and mathematicians filtered into Babylon ? The Silpis who built Mohenjodaro and Harappa, or their descendants were not very far away from them; and the communication between the Indus valley and Babylon is now an established fact a any rate as late as 3500 B C,"

# 2. గ్రామనగరరచనావిధానము : శిల్పశాస్త్రములు

విశ్వకర్మ, మయుఁడు, మానసారముని, కశ్యపుఁడు, గర్గుఁడు, నారదుఁడు మున్నగు మహర్షులు, వివిధగ్రామనగరలక్షణములను, తద్రచనావిధానములను విపులముగా వివరించియున్నారు.[1]

"విశ్వకర్మవాస్తుశాస్త్రము" నందు పండ్రెండువిధములయిన గ్రామములు, సప్తవిధపట్టణములు, ఇరువదివిధములయిన మహానగరములు, వాని లక్షణములు పేర్కొనఁబడినవి.

గ్రామములు : 12.

| | | |
|---|---|---|
| 1. మండకము | 2. ప్రస్తరము | 3. బాహులికము |
| 2. పరాకగ్రామము | 5. చతుర్ముఖము | 6. పూర్వముఖము |
| 7. మంగళము | 8. విశ్వకర్మ | 9. దేవేశము |
| 11. విశ్వేశము | 1. కైలాసము | 12. నిత్యమంగళము |

వీనిలో "నిత్యమంగళగ్రామము" మహానగరము వలె నున్నది.

చతుర్దిక్షు చతుర్ద్వారం మహాగోపురసంయుతమ్।
మహాపథేన సంయుక్తం పర్వతః పరిఖావృతమ్॥
వీథ్యష్టకసమోపేతమ్ చతుర్భాగసమన్వితమ్।
మఘనన్మిత్రవరుణయక్షాధిపసంయుతమ్॥
సర్వభాగాస్తుల్యమానా సోపవీథ్యాదికీర్తితమ్।....

'మయమతము' నందు

| | | | |
|---|---|---|---|
| 1. దండ | 2. స్వస్తిక | 3. ప్రస్తార | 4 ప్రకీర్ణక |
| 5. నంద్యావర్త | 6. పరాక | 7. పద్మ | 8. శ్రీప్రతిష్ఠితము |

లను నెనిమిది విధములయిన గ్రామ లక్షణములు గలవు.

1. చూడు :- విశ్వకర్మ — విశ్వకర్మవాస్తుశాస్త్రము. (అ. 7.)
మయుఁడు — మయమతము, మయవాస్తు.
మానసారముని - మానసారము.

'మానసారము' నందు

1. దండకము 2. సర్వతోభద్రము 3. నంద్యావర్తము
4. పద్మకము 5. స్వస్తికము 6. ప్రస్తరము
7. కార్ముకము 8. చతుర్ముఖము

అను అష్టవిధగ్రామలక్షములు చెప్పఁబడినవి

'విశ్వకర్మవాస్తుశాస్త్రము' నందు

1. నిగమము 2. స్కంథావారము 3. ద్రోణకము 4. కుబ్జము
5. పట్టణము 6. శిబిరము 7. వాహినీముఖము

—అను ఏడు విధములయిన సామాన్యపట్టణములు, వీని కంటె పెద్దవియగు నిరువది మహానగరములు పేర్కొనఁబడినవి.

మహానగరములు : 20

1. పద్మ 2. సర్వతోభద్ర 3. విశ్వేశభద్ర 4. కార్ముక
5. ప్రస్తర 6. స్వస్తిక 7. చతుర్ముఖ 8. శ్రీప్రతిష్ఠ
9. బలిదేవ 10. పుర 11. దేవ 12. మానుష
13. వైజయంత 14. పుటభేదన 15. గిరి 16. జల
17. గుహా 18. అష్టముఖ 19. నంద్యావర్త 20. రాజధానీ

ఇంకనూ అనేకభేదములు గలవు

ఖేట ఖర్వట ఘోషాభీరాదులు మఱి కొన్ని యున్నవి.

ఇవి కాక ప్రజోపయోగార్థము రాజుల చేత నిర్మింపఁబడు భవనములు కొన్ని చెప్పఁబడినవి.

వానిలో 1. విద్యాభవనములు 2 పుస్తకభాండాగారములు 3. న్యాయ శాలాభవనములు 4. నర్తనశాలలు 5. విశ్రాంతిభవనములు ముఖ్యములు

మహాభారతము నందు వర్ణింపఁబడినపురములు. ప్రాసాదములు వివిధభవనములు వాస్తుశాస్త్రములందుఁ జెప్పఁబడిన యే యే లక్షణముల ననుసరించి నిర్మింపఁబడినవో నిర్ణయించుట కష్టము. కాని యవి యన్నియు శాస్త్ర శాస్త్ర సమ్మతము లని మాత్రము చెప్పవచ్చును.

# మానయోజనము

(మయమతానుసారము)

| | | | |
|---|---|---|---|
| 8 | పరమాణువులు | = | 1 త్రిశరేణువు (త్రిసము) |
| 8 | త్రిశరేణువులు | = | 1 రథరేణువు |
| 8 | రథరేణువులు | = | 1 వాలాగ్రము |
| 8 | వాలాగ్రములు | = | 1 లిక్షము (లీక) |
| 8 | లిక్షములు | = | 1 యూకము |
| 8 | యూకములు | = | 1 యవము (యవ) |
| 8 | యవములు(యవలు) | = | 1 అంగుళము |
| 12 | అంగుళములు | = | 1 వితస్తి |
| 2 | వితస్తులు | = | 1 హస్తము |

| | | |
|---|---|---|
| 24 | అంగుళముల ప్రమాణముగల హస్తము | = కిష్కువు (18 inches) |
| 25 | ,, | = ప్రాజాపత్యము |
| 26 | ,, | = ధనుర్ముష్టి |
| 27 | ,, | = ధనుర్గ్రహము |

| | | | |
|---|---|---|---|
| 4 | హస్తములు | = | 1 దండము, ధనుస్సు, యష్టి |
| 8 | దండములు | = | 1 రజ్జువు |
| 500 | దండములు | = | 1 క్రోశము (2000 హస్తములు) |
| 2 | క్రోశములు | = | ½ గవ్యూతి (4000 హస్తములు) |
| 4 | క్రోశములు | = | 1 గవ్యూతి (8000 హస్తములు) |
| 4 | గవ్యూతులు | = | 1 యోజనము (3200 హస్తములు) |

## కౌటిల్యుని అర్థశాస్త్రము ప్రకారము

| | | | |
|---|---|---|---|
| 12 | అంగుళములు | = | 1 వితస్తి |
| 2 | వితస్తులు | = | 1 అరత్ని |
| 192 | అంగుళములు | — | 1 దండము |
| 10 | దండములు | — | 1 రజ్జువు |
| 1 | రజ్జువులు | = | 1 పరిదేశము |

# 3. వాస్తుపూజ

యః పూజయే ద్వాస్తు మనేకభక్త్యా
న తస్య దుఃఖం భవతీహ కించిత్ ।
జీవత్యసౌ వర్షశతం సుఖేన
స్వర్గే సర స్తిష్ఠతి కల్ప మేకమ్ ॥

— మత్స్యపురాణము.

ఏ మనుజుఁడు భక్తిశ్రద్ధలతో విధ్యుక్తముగా వాస్తుపూజ చేయునో వానికేవిధమయిన దుఃఖమును కలుగదు. అతఁడు నూఱు సంవత్సరములు సుఖముగా జీవించును. అంత్యమున స్వర్గలోకము ప్రాప్తించి యొక కల్పాంత మతఁడు స్వర్గమునందుండును.

"గ్రామనగరదుర్గప్రాసాదాది సమస్తవాస్తునిర్మాణప్రారంభప్రవేశ సమయములందు సకలవిధదోషపరిహారార్థము మోహాము చేతనే మనుష్యుఁడు నిన్ను పూజింపఁడో వానికరిష్టమును, మరణభయమును కలుగును. వాని ప్రయత్నములకు తఱచు విఘ్నములు కలుగుచుండును. వాస్తుపూజచేయని వాఁడు నీ కాహారమగుగాక" యని బ్రహ్మదేవుఁడు వాస్తుపురుషునకు వర మొసఁగినాడు.

"వరం తస్మై నదౌ ప్రీతో బ్రహ్మా లోకపితామహః ।
గ్రామే వా నగరే వాసి దుర్గేవా పత్తనేఽపి వా ॥
ప్రాసాదే చ ప్రపాయాం చ జలోద్యానే తథైవ చ ।
యస్త్వాం నపూజయే న్మర్త్యో మోహా ద్వాస్తువరప్రభో ।
అశ్రియం మృత్యుమాప్నోతి విఘ్న స్తస్య పదే పదే ।
వాస్తుపూజా మకుర్వాణ స్తవాహారో భవిష్యతి ॥

— విశ్వకర్మప్రకాశిక అ 1. శ్లో 15-17

గృహారంభకాలమునను, అపూర్వ, సుపూర్వ ద్వంద్వాది త్రివిధ గృహ ప్రవేశసమయములందును, ద్వారాభివర్తనము నందును, ప్రతిసంవత్సరారంభము నందును, యజ్ఞాదియందును, పుత్రజన్మము నందును, ఉపనయన వివాహాది మహోత్సవసమయములందును, మహోత్పాతములు సంభవించినపుడు తచ్ఛాంతి కొఱకును వాస్తుపురుషుని పూజింపవలయును.

వాస్తుపూజాం ప్రకుర్వీత గృహారంభే ప్రవేశనే ।
ద్వారాభివర్తనే చైవ త్రివిధే చ ప్రవేశనే ॥
ప్రతివర్షే చ యజ్ఞాదౌ తదా పుత్రస్య జన్మని ।
వ్రతబంధే వివాహే చ తథైవ చ మహోత్సవే ॥
జీర్ణోద్ధారే తథా శైలన్యాసే చైవ విశేషతః । ....
అన్యైశ్చైవ మహోత్పాతైర్దూషితే శాంతి మాచరేత్ ॥

— విశ్వకర్మప్రకాశిక. అ 1. శ్లో 18-23

ముఖ్యముగా సూత్రపాతము, భూమిశోధనము, ద్వారస్థాపనము [స్తంభా రోపణము] శిలాన్యాసము, గృహప్రవేశము అను పంచవిధవాస్తుకర్మము లందును వాస్తుయజ్ఞము (వాస్తుపూజ) చేయవలయు నని చెప్పఁబడినది.

భవనపురసురాణాం సూత్రణే పూర్వముక్తః ।
కథిత ఇహ పృథివ్యాః శోధనే చ ద్వితీయః ।
తదను ముఖనివేశే స్తంభసంరోపణే స్యాత్ ।
భవనవిశనకాలే పంచధా వాస్తుయజ్ఞః ॥

— వాస్తురాజవల్లభము 1 . 27

వాస్తువునకు (భూమికి) అధిదైవతము వాస్తోష్పతి. కావున వాస్తుయజ్ఞము నందు వాస్తోష్పతి సూక్తముతో హోమముచేయుట పరిపాటి. అథర్వణ పద్ధతి ప్రకారము బృహచ్ఛాలాకర్మమునందు ముఖ్యముగా స్తంభారోపణ సమయమునందు వాస్తోష్పతి సూక్తముతో పాటు అథర్వణ వేదోక్త శాలాసూక్తమునుగూడ పఠింతురు[1]

1. Cf :- Maurice Bloomfield = Hymns of the Atharva-Veda P. 343 "The hymn A V. 3-12 is receted while the (central post) is being fixed and erected"

# వాస్తుపూజావిధానము

ఏకాశీతిపదం కుర్యా ద్వాస్తువిత్ సర్వవాస్తుషు ।1
ఆదౌ సంపూజ్య గణపం దిక్పాలాన్పూజయే త్తతః ॥
ధరిత్ర్యాం కలశం స్థాప్య మాతృకాః పూజయే త్తతః ।
నాందీశ్రాద్ధం తతః కుర్యాత్ పుణ్యా నభ్యర్చయే త్తతః ॥
అగ్నిస్థాపనార్థం తు మేఖలాత్రయ సంయుతమ్ ।
కుండం కుర్యా ద్విధానేన యోన్యాకారం విశేషతః ॥
స్థండిలం వా ప్రకుర్వీత మతిమాన్ సర్వకర్మసు ।
పదస్థాన్ పూజయేత్ సర్వాన్ పంచత్రింశ త్తథైవ చ *

—విశ్వకర్మ ప్రకాశిక అ 5. 48-51

సర్వవాస్తుకర్మల యందును వాస్తుశాస్త్రవేత్త భూమిని ఏకాశీతి (81) పద వాస్తువుగా విభజించి, వాస్తుమధ్యమున తొమ్మిది పదములు బ్రహ్మకు, తక్కిన వానిని శిఖ్యాది పంచత్రింశత్ వాస్తు పురుషాంగదేవతలకును కల్పించి వాస్తుపురుష వికల్పనము చేయవలెను.

మొట్టమొదట గణపతిపూజ, తరువాత దిక్పాలపూజ, మాతృకాపూజ, నాందీ ముఖశ్రాద్ధము చేసి పుణ్యపురుషులను పూజింపవలయును.

అగ్నిసంస్థాపనకొఱకు మేఖలాత్రయముతో కూడిన యోన్యాకార కుండమును శాస్త్రోక్తముగా నిర్మింపవలెను. లేదా సర్వపూజా కర్మములకు నుపయుక్త మగు స్థండిలమును నిర్మించి దానిపై పంచత్రింశద్దేవతలను పూజింప వలయును.

వాస్తుమండలమధ్యమందు గల తొమ్మిదిపదములలో బ్రహ్మను 'ఆబ్రహ్మన్ బ్రాహ్మణ' (యజు. వా. సం. 22.22) అను మంత్రముతో పూజింపవలెను తరువాత వాస్తుదేహస్థితదేవతల నెల్లరను పూజింపవలెను.

1. ఏకాశీతిపదవాస్తుమండల చక్రమును 194 పుటలో చూడనగును.

* మఱియొకచోట శిఖ్యాది నలుబదియైదుగురు దేవతలను పూజింపవలెనని చెప్పఁబడినది.

శిఖ్యాది పంచచత్వారింశత్ దేవతాః తత్రపూజయేత్॥

—వి. ప్ర. అ. 5—107

# వాస్తుపురుషుని వివిధాంగములందు భావింపఁదగు దేవతలు

| | | | |
|---|---|---|---|
| 1 | శిరము | అగ్ని | 1 |
| 2 | నేత్రద్వయము | దితి, పర్జన్య | 2, 3 |
| 3 | కర్ణద్వయము | జయంత, అదితి | 4, 5 |
| 4 | ముఖము | వాయువు | 6 |
| 5 | దక్షిణభుజము | రవి | 7 |
| 6 | వామభుజము | సోముఁడు | 8 |
| 7 | వక్షస్థలము | మహేంద్ర, చరక, ఆపవత్స, ఆప | 9, 10, 11, 12 |
| 8 | దక్షిణ స్తనము | అర్యముఁడు | 13 |
| 9 | వామ స్తనము | పృథివీధర | 14 |
| 10 | దక్షిణబాహువు | సత్య, భృశ, నభ, వాయు, పూష | [15-19] |
| 11 | వామబాహువు | యక్ష్మ, రోగ, నాగ, ముఖ్య, భల్లాట | [20-24] |
| 12 | కరకఫోణి | సావిత్ర, సవిత, రుద్ర, శిశధర | [25-28] |
| 13 | హృదయము | బ్రహ్మ | 29 |
| 14 | వగల - దక్షిణ | వితథ, గృహక్షత | 30, 31 |
| | - వామ | శోష, అసుర | 32, 33 |
| 15 | ఉదర | మిత్ర, వివస్వాన్ | 34, 35 |
| 16 | మేఢ్రమధ్యము | ఇంద్ర, జయ | 36, 37 |
| 17 | ఊరు - దక్షిణ | యమ | 38 |
| | - వామ | వరుణ | 39 |
| 18 | జంఘలు | గంధర్వ, భృంగ, మృగ | 40, 41, 42 |
| 19 | చరణములు | దౌవారిక, సుగ్రీవ, పుష్పదంత | 43, 44, 45 |

చూడు :- సమరాంగణసూత్రధారః ॥అ. 14.

# కలశపూజ

కలశమును స్థాపించి యందు వరుణనావాహనము చేసి, పూజింపవలెను. కలశమును పుణ్యతీర్థజలములతోను, సర్వబీజములతోను, సర్వౌషధములతోను, నవరత్నములతోను, గంధములతోను, పంచపల్లవములతో, పంచకషాయములతో, పంచమృత్తికల తోను శుద్ధోదకముతోను నింపవలెను.

శిఖ్యాది నలుబదియైదుగురు దేవతలను ఆవాహన మొనరించి పూజింపవలెను. తరువాత విద్యుక్తముగ సమంత్రకముగ హోమముచేసి, హోమాంతమందు భక్ష్య భోజ్యములను వాస్తుదేశమున బలి నొసగవలెను. స్విష్టికృద్ హోమము చేసి పిదప పూర్ణాహుతి మొనర్చి తరువాత వాస్తుమండలగతదేవతలకు బలిదానము లొసఁగవలెను.

కర్తా జనితరోమాంచ స్తేభ్యః కుర్యా న్నమస్క్రియామ్
నివేద్య వాస్తోష్పతయే భూతేభ్యశ్చ తతో బలిమ్॥

స. సూ. అ. 35-25.

యజమానుఁడు శుద్ధోదకస్నానమొనర్చి వాస్తుమండలమధ్యమున బ్రహ్మ స్థానమునందు భూదేవిని పూజించి, తరువాత సర్వదేవతా మయుఁడగు వాస్తుపురుషుని స్వనామమంత్రములచే ధ్యానావాహనాది పూజలొనరింపవలెను పిమ్మట ప్రజాపతి నావాహనము చేసి పూజింపవలయును.

సర్వదేవమయం వాస్తుదేవమయం పరం ।
తతః స్వనామమంత్రేణ[1] ధ్యాత్వా తత్ర చ పూజయేత్ ॥

1 ఆ యా దేవతలకు సంబంధించిన వేదమంత్రములు.
వాస్తుపురుషుఁడు = [ఋగ్వేద. 7-54]
"వాస్తోష్పతేః ప్రతిజానీ హ్యస్మాన్"—ఇతి
ప్రజాపతి [యజుర్వేద-వా.సం. 22-22]
"ఆబ్రహ్మన్ బ్రాహ్మణ"—ఇతి.
విశ్వకర్మ [ఋగ్వేద. 10-81, 82]
"య ఇమా భువనాని జుహ్వత్"—ఇతి,

తతః చతుర్ముఖం దేవం ప్రజేశం చాహ్వయే త్తతః ।
గంధాదిభిశ్చ తం పూజ్య ప్రణమ్య చ పునః పునః ॥
వాస్తుపురుషనమ స్తే స్తు భూమిశయ్యారతః ప్రభో ।
మద్గేహే ధనధాన్యాది సమృద్ధిం కురు సర్వదా ॥

విశ్వకర్మప్రకాశిక అ 5.184-5

ఇట ప్రజాపతి యన విశ్వకర్మయని గ్రంథాంతరముల వలనఁదెలియుచున్నది.

మండలం వాస్తునో మధ్యే గోమయేన ప్రకల్పయేత్ ।
కలశం తత్ర విన్యసేత్ సప్రసూనం సకాంచనమ్ ॥
వాస్తుదేవా స్తతః కల్ప్యా యథా స్థాననియోగతః ।
సధూపై ర్వివిధై ర్మాల్యై రర్ఘ్యం పశ్చాన్నివేదయేత్ ॥
అర్చయేద్ విశ్వకర్మాణం మాల్యై ర్ధూపై ర్విలేపనైః ।
భక్ష్యైః ఫలై ర్బహువిధై పూజయేత్ సుసమాహితః ॥

—సమరాంగణసూత్రధారః ॥అ, 38. 2-4

ఈవిధముగా భూదేవిని, వాస్తుపురుషుని, బ్రహ్మను, విశ్వకర్మను పూజించి గుణాన్వితుఁ డయిన సూత్రధారుఁడు (శిల్పి) శాస్త్రోక్తముగా స్నానమండపము నుండి శిలను గొనివచ్చి, దిక్సాధన చేసి, గృహమధ్యమందు గాని, ఈశాన్యదిక్కున గాని స్వర్ణకుద్దాలముతో బొడ్డులోతుగ త్రవ్వి శిలను స్థాపించిన శుభములు కలుగును.

ఇదే విధముగా వాస్తుశాస్త్రప్రకారము స్తంభద్వారాదిరోపణములు చేయ వలయును.

ఇతి వాస్తు విధాం స్తు కృత్వా తాం స్నానమండపాత్ ।
సమానీయశిలాం తత్ర సూత్రధారో గుణాన్వితః ।
తత్ర దిక్సాధనం కుర్యాత్ గృహమధ్యే సుసాధితే ।
ఈశానాదిక్రమేణైవ స్వర్ణకుద్దాలకేన తు

ఖనిత్వా కోణభాగే తు మధ్యే చైవ విశేషతః ।
నాభిమాత్రే తథా గర్తే శిలానాం స్థాపనం శుభమ్।

— విశ్వకర్మప్రకాశిక అ 5. 189-192

వాస్తుపూజానంతరము స్థపతులను పూజింపవలయును.

యజ్ఞాంతే ఆప్లుతాన్ వస్త్రా నాచార్యాయ నివేదయేత్ ।
దైవజ్ఞశ్చ తతస్తోష్యః స్థపతీన్ వైష్ణవా నపి.........
శిల్పివర్గాం స్తు సంతోష్య దానమానై స్తథైవ చ ।
సంప్రాప్నోతి నరో లక్ష్మీం పుత్రపౌత్రధనాన్వితామ్ ॥

—విశ్వకర్మ ప్రకాశిక అ 6-258-62

వైదికార్యులు గృహప్రవేశసమయము నందు వాస్తూపశమనము చేయుచుండి రని ఋగ్వేదము నందలి వాస్తోష్పతి సూక్తము వలనఁ దెలియుచున్నది.

గృహప్రవేశసమయమున యజమానుఁడు నూతనగృహమధ్యమునందు స్థాలీపాకముచేసి వాస్తోష్పతి సూక్తము నందలి నాలుగు ఋక్కులతో హోమము చేయవలయు నని ఆపస్తంబగృహ్యసూత్రములందుఁ జెప్పఁబడినది.

"మధ్యేఽగారస్య స్థాలీపాకం శ్రపయిత్వా,
వాస్తోష్పతీ ప్రతిజానీహ్యాస్మా నితి చతసృభిః
ప్రత్యృచం హుత్వా......" — 2-9-9-4.

రామాయణకాలము నందు జనులు గృహప్రవేశసమయమునందు వాస్తుశాంతి చేయుచుండి రని వాల్మీకి రామాయణము వలనఁ దెలియుచున్నది.

చిరంజీవులుగా నుండఁగోరు మనుజులు గృహప్రవేశమునకుముందు వాస్తుశాంతిచేయవలయు నని శాస్త్రములు చెప్పుచున్నవి. కావున నీ శాలాధిష్ఠానదేవతకు జింకమాంసము నర్పించి తర్పణముచేయుద మని రాముడు లక్ష్మణునకుఁజెప్పినాఁడు.

ఐణేయం మాంసమాహృత్య శాలాం యక్ష్యామహే వయం।
కర్తవ్యం వాస్తుశమనం సౌమిత్రే చిరజీవిభిః ॥
మృగం హత్వాఽఽనయక్షిప్రం లక్ష్మణేహ శుభేక్షణ ।
కర్తవ్యం శాస్త్రదృష్టో హి విధిధర్మ మనుస్మర॥

—వా. రా. అయోధ్య. స. 56-22,23

వాస్తూపశమనము చేయుట కర్తవ్యము కనుక తమ నివాసార్థము చిత్రకూటము నందు తాము నిర్మించికొనిన పర్ణశాలను ప్రవేశించుటకు ముందు రాముఁడు వాస్తుదేవతా పూజ-బలి-వైశ్వదేవబలి రుద్రవిష్ణ్వాదిదేవతార్చనలు కావించి నట్లు వాల్మీకిరామాయణమునందు వర్ణింపఁబడినది.

ఇష్ట్వా దేవగణాన్ సర్వాన్ వివేశావసథం శుచిః।
బభూవ చ మనోహ్లాదో రామస్యామితతేజసః॥
వైశ్వదేవబలిం కృత్వా రౌద్రం వైష్ణవ మేవ చ।
వాస్తుసంశమనీయాని మంగలాని ప్రవర్తయన్।

— వా. రా. అయోధ్య. స 56. 30-31

మహాభారతకాలమున ప్రజలు వాస్తుశాంతి-బలివిధానములను పాటించుటయే కాక శిల్పాచార్యులను సత్కరించుచున్నట్లు మహాభారతము నందలి యింద్రప్రస్థాది పురవర్ణనముల వలన స్పష్టమగుచున్నది.

గృహప్రవేశసమయము నందు వాస్తుపూజచేసిన మనుజులకు ఆరోగ్యము, పుత్రపౌత్రులు, ధనధాన్యములు కలుగు ననియు, నట్లు చేయనివానికి నానావిధక్లేశములు రోగములు కలుగు ననియుఁ జెప్పఁబడినది.

ఏవం యః కురుతే సమ్యగ్వాస్తుపూజాం ప్రయత్నతః
ఆరోగ్యం పుత్రపౌత్రాది ధనధాన్యం లభేన్నరః ।
వాస్తుపూజన మకృత్వా యః ప్రవిశే న్నవమందిరే ॥
రోగా న్నానావిధాన్ క్లేశా నశ్నుతే సర్వసంకటమ్ ॥ [1]

1. చూడు :- వాస్తురత్నాకర - విన్ధ్యేశ్వరీ ప్రసాద ద్వివేది.
చౌఖా బా ప్రచురణ వారణాసి.

వాస్తుశాంతి కంటె ముందు గ్రహశాంతియుఁ జేయవలయును. దానివలన గ్రహదోషములు తొలఁగి కోరికలు నెఱవేరును.

> కార్యారంభేషు సర్వేషు నవవేశ్మప్రవేశనే ।
> గ్రహశాంతిం విధానేన కృత్వాఽభీష్టం సమశ్నుతే ॥ 1

ఈ విధముగా గృహనిర్మాణప్రారంభప్రవేశాదులందు వాస్తుపూజ చేసి శిల్పులను సత్కరింపని మనుజుఁడు ఏడు జన్మములు కుష్ఠురోగపీడితుఁడై యుండు ననియు తుదకు నరకమనుభవించు ననియు చెప్పఁబడినది.

> వాస్తుపూజావిహీనశ్చ సూత్రధారైర్వినా తథా ।
> సప్తజన్మ భవేత్ కుష్ఠీ స కర్తా నరకం వ్రజేత్ ॥ 2

వాస్తుపూజాప్రాశస్త్య మిట్లు వేదములందును, పురాణేతిహాసములందును శిల్పశాస్త్రగ్రంథములందును ఉగ్గడింపఁబడుటచేత భారతీయులు నేటికిని గృహారంభ ప్రవేశసమయములందు వాస్తుశాంతిచేసి వాస్తు శిల్పులను పూజించి సత్కరించు చున్నారు.

---

1. 2 :- చూడు :- వాస్తురత్నాకర — సం॥ వింధ్యేశ్వరీప్రసాద ద్వివేది. చౌఖాంబా ప్రచురణ. వారణాసి.

# వాస్తోష్పతి సూక్తము

వశిష్ఠర్షిః। వాస్తోష్పతి ర్దేవతా ।

వాస్తోష్పతే ప్రతిజానీ హ్యాస్మాన్త్స్వావేశో అనమీవో భవా నః ।
యత్త్వేమహే ప్రతి తన్నో జుషస్వ శం నో భవ ద్విపదే శం చతుష్పదే ॥ 1
వాస్తోష్పతే ప్రతరణో న ఏధి గయస్ఫానో గోభి రశ్వేభి రిందో
అజరాసస్తే సఖ్యే స్యామ పితేవ పుత్రాన్ ప్రతి నో జుషస్వ ॥ 2
వాస్తోష్పతే శగ్మయా సంసదా తే సక్షీమహి రణ్వయా గాతుమత్యా ।
పాహి క్షేమ ఉత యోగే వరం నో యూయం పాత స్వస్తిభిః సదా నః। 3

—ఋగ్వేద 7-54

1. ఓ గృహమును రక్షించెడి దేవుఁడా। నీవు మమ్ములను తెలిసికొనుము. మాకు మంచి నివాసస్థానము నొసఁగెడి వాఁడవుగనుక (స్వావేశః), రోగము లేకుండఁ జేసెడి వాఁడవుగను (అనమీవః), అగుదువు గాక। నిన్ను ఏ ధనము కొఱకు యాచించుచున్నామో ఆ ధనము మా కొసంగుము. మా పుత్రపౌత్రు లయిన జనుల కొఱకు (ద్విపదే), పశుపుల కొఱకు (చతుష్పదే) సుఖము నిమ్ము.

2. గృహమును రక్షించెడి దేవుఁడా। నీవు మాకు వృద్ధి నొందించెడి వాఁడవుగను (ప్రతరణః), మా ధనమును పెంపొందించెడి వాఁడవుగను (గయస్ఫానః), అగుము. చంద్రుని వలె సంతోషము నిచ్చెడి దేవుఁడా। నీ స్నేహము కలిగినచో మేము పశువులతోను, గుఱ్ఱములతోను ముసలితనములేనివారము (అజరాసః) అగుచున్నాము. తండ్రి పుత్రులను వలె మమ్ము కాపాడుము.

8. గృహమును రక్షించెడి దేవుఁడా। సుఖము గలిగించెడి దానిని (శగ్మయా) రమణీయ మైన దానిని (రణ్వయా), ధనము గలదానిని (గాతుమత్యా), నీ చే నొసఁగబడిన గృహమును మేము చేరుచున్నాము (సక్షీమహి): ఉన్నదానిని కాపాడుట యందు (క్షేమే), లేని దాని నిచ్చుట యందు (యోగే) సమర్థుఁడ వైన నీవు మా కోరిన ధనమును కాపాడుము. సదా శుభములతో రక్షింపుము.

# అథర్వణవేదోక్త

## శాలా సూక్తము

ఋషి=బ్రహ్మా; దేవతా = శాలా; వాస్తోష్పతిః

ఇహైవ ధ్రువాం ని మినోమి శాలాం క్షేమే తిష్ఠాతి ఘృతముక్షమాణా।
తాం త్వా శాలే సర్వవీరాః సువీరా అరిష్టవీరా ఉప సం చరేమ॥ 1
ఇహైవ ధ్రువా ప్రతి తిష్ఠ శాలేఽశ్వావతీ గోమతీ సూనృతావతీ।
ఊర్జస్వతీ ఘృతవతీ పయస్వత్యుచ్ఛ్రయస్వ మహతే సౌభగాయ॥ 2
ధరుణ్యసి శాలే బృహచ్ఛందాః పూతిధాన్యా।
ఆ త్వా వత్సో గమేదా కుమార ఆ ధేనవః సాయమాస్పందమానాః॥ 3
ఇమాం శాలాం సవితా వాయు రింద్రో బృహస్పతిర్ని మినోతు ప్రజానన్।
ఉక్షంతూద్నా మరుతో ఘృతేన భగో నో రాజా ని కృషిం తనోతు॥ 4
మానస్య పత్ని శరణా స్యోనా దేవీ దేవీభిర్నిమితాస్యగ్రే।*
తృణం వసానా సుమనా అసస్త్వమథాస్మభ్యం సహవీరం రయింధా॥ 5
ఋతేన స్థూణామధి రోహ వంశోగ్రో విరాజన్నప వృజ్క్ష్వ శత్రూన్।
మా తే రిషన్నుపసత్తారో గృహాణాం శాలే శతం జీవేమ శరదః సర్వవీరాః॥ 6
ఏమాం కుమారస్తరుణ ఆ వత్సో జగతా సహ।
ఏమాం పరిస్రుతః కుంభ ఆ దధ్నః కలశైరగుః॥ 7
పూర్ణం నారి ప్ర భర కుంభమేతం ఘృతస్య ధారామమృతేన సంభృతామ్।
ఇమాం పాతౄనమృతేనా సమజ్గ్ధీష్టాపూర్తమభి రక్షాత్యేనామ్॥ 8
ఇమా ఆపః ప్ర భరామ్యయక్ష్మా యక్ష్మనాశనీః।
గృహా నుప ప్ర సీదా స్యమృతేన సహాగ్నినా॥ 9

—అథర్వవేద. 3-12.

---

* మానస్యపత్ని = మాననీయస్య వాస్తోష్పతేః పత్ని—సాయణ.

Cf :- Maurice Bloomfield = Hymns of the Atharva-Veda.
దేవీ = ఉజ్యాలీవాలీ ఊ; దేవీభిః = దేవైః — దేవతాగ్రోం,
విశ్వకర్మాపురుషోం కర్కే; నిమితా = మాపీహుఈ;
—క్షేమకరణదాస్ త్రివేదీ — అథర్వవేదభాషాభాష్యము. పు. 44

# శాలా సూక్త వినియోగము

వాస్తుయజ్ఞము నందు శాలాసూక్తపఠన మొకభాగము. అథర్వపద్ధతి బృహచ్ఛాలాకర్మము నందువాస్తోష్పతిసూక్తముతో పాటు స్తంభారోపణ (ద్వారస్థాపన) సమయమునందు శాలాసూక్తము పఠింపఁబడును. మంత్రార్థములు తెలిసికొన్నచో నీ మంత్రపఠన ప్రయోజనావసరములు తెలియఁగలవు.

అథర్వణవేదోక్తశాలాసూక్తమునకు భావార్థ మీ క్రింద నీయఁబడినది.

శాలాసూక్తము. [అథర్వ. 3.12]

ఋషి=బ్రహ్మ; దేవత=శాలా,వాస్తోష్పతిః।

ఛంద త్రిష్టుప్, జగతీ, బృహతీ.

1. ఇక్కడ నేను స్థిరమయిన గృహమును నిర్మించుచున్నాను. అది దృఢమైన అధిష్ఠానముపై ఘృతపరిస్రుతమై నిలుచుగాక !

ఓశాలా ! దీని యందు రోగరహితులు, పరాక్రమవంతులు నగువీరులు నివసింతురుగాక !

2. ఓ శాలా! నీవు అశ్వములతో గోవులతో సత్యసంధులతో స్థిరముగా నుందువుగాక ! అన్నము, నేయి, పాలు మొదలగు పదార్థములతో సకలసంపత్సమృద్ధికరముగా నుందువు గాక !

3. ఓ శాలా ! నీవు వేదాదివిద్యలు, ధనధాన్యములు నొసఁగుదువుగాక ! సాయం సమయమునకు పసిబిడ్డలు, బాలురు, ధేనువులు నిన్నుఁజేరవత్తురుగాక !

4. ఈ శాలను నిర్మాణవిధు లెఱిఁగిన సవితేంద్రవాయుబృహస్పతులు నిర్మించినారు. మరుత్తులు జలముతో ఘృతముతో అభిషేచనము చేయుదురుగాక ! రాజైన భగుఁడు మాకృషి కార్యమును సఫలముచేయుగాక !

5. ఓ వాస్తోష్పతిపత్నీ [శాలాదేవతా] నీవు మొదట విశ్వకర్మలచే నిర్మింపబడితివి. ప్రాణుల కాశ్రయమిచ్చు దేవివై సుఖదాయినివై మా ముందు నిలిచినావు. నీవు తృణవసనవై మాకు ప్రసన్నురాల వగుము. మాకు వీరపుత్రులను, ధనము నొసఁగుము.

6. ఓ వంశమా! సత్యస్వరూపముతో స్తంభములపై నెక్కి ప్రచండరూపముతో ప్రకాశించు నీవు మా శత్రువులను దూరముగా తఱుముము. ఓ శాలా! ఈ గృహము నందుండు పురుషుఁడెప్పుడును దుఃఖితుఁడు కాఁగూడదు. మేము సకల వీరులతో నూఱు శరత్తులు జీవింతుము గాక!

7. ఈ శాలకు పసిబిడ్డలు, యువకులు, గమనశీలముగలధేన్వాదులతో గోవత్సము వచ్చినది. ఈ శాలకు పెరుగుకుండలతో రసపూర్ణమైన కుంభము వచ్చినది.

8. నరులకు మేలుచేయు నో గృహపత్నీ! అమృతముతో, ఘృతధారలతో నిండిన పూర్ణకలశమును గొనిరమ్ము. ఈ సుధారూపజలమును పానప్రియుల కొసఁగుము.

ఈ శాల ఇష్టాపూర్తములను [యజ్ఞాన్నదానాది శ్రౌతస్మార్తకర్మలను] రక్షించు గాక!

9. రోగరహితములు, రోగనాశకములు నయిన యీ జలములను నేను గొని తెచ్చుచున్నాను. మృత్యువును దూరము చేయు అన్నఘృతదుగ్ధాది సామాగ్రితోను (అమృతేన) అగ్నితోను నేనీ గృహమును ప్రవేశించు చున్నాను.

అమీవహా వాస్తోష్పతే విశారూపాణ్యావిశన్ I
సఖా సశేవ ఏధి నః॥

.. ఋగ్వేద. 7 55.1

రోగనాశకుఁడవు, అనేకరూపములుధరించువాఁడవు నైన ఓ వాస్తోష్పతీ! నీవు మాకు శుభములు గూర్చు స్నేహితుఁడవు కమ్ము!

# అవలోకితగ్రంథపట్టిక


## తెలుఁగు.

శ్రీమదాంధ్ర మహాభారతము. [కవిత్రయము వారిది]

1) వావిళ్లరామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, మదరాసు.

2) రామా అండ్ కో., ఏలూరు.

3) బాల సరస్వతీ బుక్ డిపో, కర్నూలు.

## సంస్కృతము.

1) శ్రీమద్భారతమ్-వేదవ్యాసప్రణీతమ్. తెలుఁగు లిపి. మూఁడు సంపుటములు. వావిళ్లరామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, మదరాసు.

2) శ్రీమహాభారతమ్_సటీకమ్-నీలకంఠటీక- చిత్రశాలాప్రెస్, పూనా. 1930.

3) శ్రీమహాభారతమ్-మూలమాత్రము, గోరఖ్‌పూరు ప్రతి

4) శ్రీమహాభారత సభాపర్వ. మూల సంస్కృతశ్లోక-హిందీ టీకా సహితము, డా॥ పం. శ్రీపాద దామోదర సాతవలేకర్, స్వాధ్యాయమండల్. పారడీ.

5) సభాపర్వవ్యాఖ్యానమ్-జ్ఞానదీపికా-దేవబోధటీక- భండార్కర్ రిసెర్చి ఇన్స్టిట్యూట్-పూనా.

## హిందీ

1) హిందీ మహాభారత - వచనానువాదము —చతుర్వేదీ ద్వారకా ప్రసాద్ శర్మ రామనారాయణలాల్ పబ్లిషర్, ఇలాహాబాద్.

2) మహాభారత కాలీన సమాజ్-సుఖమయభట్టాచార్య. — లోకభారతీప్రకాశన్_ఇలహాబాద్.

ఆంగ్లము

1) The Mahabharata of Krishnadwaipayana Vyasa.
Tr. English Prose by Pratap Chandra Roy,
Datavya Bharata Karyalaya, Calcutta.

2) Thh Mahabharata-English Tr.
C. Rajagopalachari, Bharatiya Vidya Bhavan, Bombay.

3) The Great Epic of India-
-E. W. Hopkins—Putni Pusthak, Calcutta.

4) India of the Vedic Age-J. Talboys Wheeler
Cosmo Publications, Delhi

5) The Mahabharata - A criticism
By C. V. Vaidya. A. J. Combridge & Co., Bombay

## వైదిక గ్రంథములు

అథర్వవేదము :

1. సాయణభాష్యము – చౌఖాంబా సంస్కృత సీరీజ్-వారణాసి
2. క్షేమకరణదాస్ త్రివేది. భాషాభాష్యము, దయానందసంస్థాన్, ఢిల్లీ
3. శ్రీరామశర్మ ఆచార్య-సంస్కృతసంస్థాన్, బరేలీ
[హిందీ అనువాదము]

ఋగ్వేదము :

1. సాయణ భాష్యము. చౌఖంబాసంస్కృత సీరీస్, వారణాసి
2. దయానంద సరస్వతి. భాషాభాష్యము, దయానందసంస్థాన్, ఢిల్లీ
3. శ్రీరామశర్మ ఆచార్య. సంస్కృతసంస్థాన్, బరేలీ.
(హిందీ అనువాదము)

కృష్ణ యజుర్వేదము :

1. తెలుగు లిపి మైసూరు ప్రతి

2. కృష్ణయజుర్వేదీయతైత్తిరీయ సంహితా।
సాయణాచార్య విరచిత భాష్యసమేతా।
ఆనందాశ్రమ సంస్కృత గ్రంథావళిః॥
3. తైత్తిరీయ బ్రాహ్మణము. తెలుగులిపి, మైసూరు ప్రతి

శుక్ల యజుర్వేదము :

1. దయానంద సరస్వతి భాషాభాష్యము. ఢిల్లీ

సామవేదము :

1. దయానంద సరస్వతి భాషాభాష్యము. ఢిల్లీ
సామవేద సుబోధినీ పద్ధతిః — చౌఖాంబా సంస్కృత సీరీజ్-వారణాసి
సంస్కార విధిః — దయానంద సరస్వతి — దయానందసంస్థాన్. ఢిల్లీ-5
వేదోంకాయథార్థ స్వరూప్. పం. ధర్మదేవ్ విద్యామార్తండ.
— దయానంద సంస్థాన్. నఈ ఢిల్లీ-5
మనుస్మృతి - కుల్లూకభట్టవిరచిత వ్యాఖ్యతో - వావిళ్ళప్రతి

## పురాణేతిహాస గ్రంథములు

నాగర లిపి :

1. అగ్ని పురాణము చౌఖాంబా ప్రతి — వారణాశి
2. గరుడ పురాణము ,, ,,
3. దేవీ భాగవతము ,, ,,
4. పద్మ పురాణము (పంచ ఖండములు)
గురుమండల్ సీరీజ్. కలకత్తా
5. బ్రహ్మాండ పురాణము — మోతీలాల్ బనార్సీదాస్ - వారణాశి
6. భాగవత మహాపురాణము. శ్రీధరీయ వ్యాఖ్యాసహితము. బొంబాయి
.... గోరఖ్‌పూర్ ప్రతి (మూలమాత్రము)
7. స్కాంద పురాణము - బొంబాయి ప్రతి
నాగరఖండము, ప్రభాసఖండము, కాశీఖండము

8. హరివంశము – పూనా ప్రతి

9. వాల్మీకి రామాయణము. ఆంగ్లానువాద సహితము. గోరక్‌పూర్ ప్రెస్

తెలుగు లిపి :

1. మత్స్య పురాణము. నివృత్తి వీరాస్వామి పరిష్కృతము

2. విష్ణుపురాణము — వ్యాఖ్యాసహితము — వావిళ్ళప్రతి

3. హరివంశము — ఉత్తరభాగము. ఎఱ్ఱాప్రెగడ - వావిళ్ళప్రతి

# శిల్పశాస్త్ర గ్రంధములు

సంస్కృతము :

1. అపరాజిత పృచ్ఛా : భువనదేవాచార్య
గయక్వాడ ఓరియంటల్ సిరీస్. 115

2. కాశ్యపశిల్పము : కశ్యప బ్రహ్మ ప్రణీతమ్
ఆనందాశ్రమం-పూనా

3. రూపమండనము : మండన సూత్రధారః

4. వాస్తురత్నాకరః : సం విందేశ్వరీ ప్రసాద్ ద్వివేది. వారణాశి

5. విశ్వకర్మ వాస్తుశాస్త్రమ్ : విశ్వకర్మ ప్రణీతమ్
సం. కె. వాసుదేవశాస్త్రి

6. విశ్వకర్మ ప్రకాశిక : విశ్వకర్మ ప్రణీతమ్
....ఖేమరాజ్ శ్రీకృష్ణదాస్ - బొంబాయి

7. విష్ణుధర్మోత్తర పురాణమ్ : (చిత్రసూత్రమ్)
....సం॥ డా. అశోక్ ఛటర్జీశాస్త్రి. వారణాశి

తెలుగు

1) గార్గేయాగమము. గర్గమహర్షి. సం. జిల్లెళ్ల వీరబ్రహ్మాచార్యులు

2) గుప్తవాస్తు. దోగిపర్తి స్వామి గుప్త సిద్ధాంతి, ఏలూరు.

3) మయమతము. మయకృతము-వావిళ్లప్రతి

4. మానసారము. [గ్రామ లక్షణము – నగర విధానము]
సం. జిల్లెళ్ళ వీరబ్రహ్మాచార్యులు

5. మన వాస్తుసంపద. గడియారం రామకృష్ణశర్మ
....ఆంధ్రప్రదేశ్ లలితకళా అకాడమి, హైదరాబాదు

6. విశ్వకర్మ ప్రకాశిక. విశ్వకర్మ ప్రణీతము, రాజమండ్రి

7. శిల్ప దర్శనము — డా॥ కొండూరు వీరరాఘవాచార్యులు, తెనాలి

హిందీ :

1. భారతీయ వాస్తుశాస్త్ర ప్రతిమా విజ్ఞాన. డా॥ ద్విజేంద్రలాల్ శుక్లా
2. యంత్ర సర్వస్వము — విమాన శాస్త్రము. భరద్వాజ ముని.
3. భారతీయ విద్యా — డా॥ శ్రీధర్ భాస్కర్ వర్ణే.ర్
.... భారతీయ విద్యాభవన్, బొంబై

విశ్వబ్రాహ్మణ ధర్మ ప్రబోధక గ్రంథములు :

1. విశ్వకర్మ బ్రాహ్మణ వంశాగమము. (తెలుగు)
వడ్డెపాటి నిరంజనశాస్త్రి

2. శ్రీ విశ్వకర్మాన్వయ ప్రదీపికా [కన్నడభాషా ప్రతి]
సం. జి. జ్ఞానానంద

3. జాంగిడ్ బ్రాహ్మణ్ నిదేశికా [హిందీ]
ఆనందస్వరూప్ భరద్వాజ, ఢిల్లీ

4. శిల్పీ బ్రాహ్మణ్ [హిందీ] స్వామీ రామేశ్వరానందజీ ఆచార్య
సంస్కృత విద్యాలయ, ఘరౌండా. జి. కరనాల్, పంజాబ్

5. శ్రీ విశ్వకర్మా మహాపురాణ్ [హిందీ తాత్పర్య సహిత]
సం॥ జయకృష్ణశర్మా గురుదేవ్, శిల్పశాస్త్ర ప్రకాశన్ భండార్, డేహరీ

6. సుధార మంజరీ — రామకుమార్ విశ్వకర్మా, వారణాశి

7. ప్రబోధ తరంగములు [1-7] విశ్వబ్రాహ్మణ ధర్మపీఠము, నూజివీడు
8. విశ్వశిల్పి – మాసపత్రిక [తెలుగు] నరసరావుపేట, గుంటూరుజిల్లా
9. విశ్వశిల్పి – మాసపత్రిక [హిందీ] పట్నా, బీహారు రాష్ట్రము

నిఘంటువులు :

1. అమరకోశము
2. మేదినీకోశము
3. వైజయంతి
4. నానార్థ రత్నమాల
5. శబ్దార్థ చంద్రిక
6. శబ్ద రత్నాకరము
7. శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు

## Books on Vedic Literature


1. Hymns of the Atharva Veda – Maurice Bloomfield
Motilal Banarsidas – Varanasi

2) Black Yajur Vead : (Krishna Yajurveda Taittiriya Samhita) Tr. A.B. Keith, Motilal Banarsidas-Varanasi

3) Brihat Devata. Tr. A.B. Keith, Motilal Banarsidas

4) Further Lights on the Vedas
T.V. Kapali Sastry–Aravindasramam, Pondicheri

5) The Hymns of the Rigveda. Tr. Ralph T.H. Griffith
Choukhamba Sanscrit Series, Varanasi

6) The Hymns from Rigveda. ed – Peter Son – Bombay

7) The Call of the Vedas. A.C. Bose
Bharatiya Vidya Bhavan, Bombay

8) The Vedas (Harmony, Meditation and Fulfilment)
Jeanine Miller, B.I. Publications, New Delhi

9) The Doctrine of the Mystics (Hymns to the Mystic Fire)
Sri Aurobindo Ghosh, Aurobindasramam, Pondicheri

10) The Texts of the White Yajurveda
Tr. Ralph T.H. Griffith – Chowkhamba, Sanscrit Series

# Books on Arts


1) Arts and Crafts of India and Ceylon
... Ananda K. Coomara Swamy

2) Art Today. ed. Faulker, Ziegfeld & Hill

3) Beginnings of Buddhistic Art. N. Foucher

4) The Art of Indian Asia - compiled and edited by
Joseph Campbell

5) The Culture and Art of India
.... Radha Kumud Mookerji

6) Development of Hindu Iconography
.... Jitendra Nath Benaragea

7) Silpa Sastra - Hindu Achievements in Aeronautics &
Fine Arts - D.N. Sukla

8) Indian Architecture (Buddhist and Hindu Periods)
....Percy Brown

9) Iconography of Buddhist & Brahmanical Scriptures in
Decca Musium - N.K. Bhatta Sali

10) Indian Handi Crafts - Publications Division, Ministry
of Information & Broadcasting, Govt. of India

11) The Structural Temples in Gujarat
Dr. Kantilal F. Sompura

12) Studies in Indian Art - Dr. V. S. Agrawala

13) Mechanical Contrivances in Ancient India
Dr. V. Raghavan

14) The Way of the Silpis - G. K. Pillai

15) Archaeology in India. Director Publications Divi -
sion - Ministry of Information and Broadcasting
Govt of India, New Delhi

16) Architect and Architecture : Then and Now.
....Sris Chandra Chatterjee, C.E.
University of Calcutta-1948

17) Evolution of the Hindu Temple and other Essays
.... Vasudeva S Agrawala. Prithvi Prakasan, Varainas

18) The Heritage of Indian Art. V.S. Agrawala
19) An Encyclopaedia of Hindu Architecture
.... Prasanna Kumar Acharya, Allahabad
20) A Dictionary of Architecture. P.K. Acharya
21) The Culture and Civilisation of India.-D.D. Kosambi
22) All about Hindu Temples. Swami Harshananda
.... Sri Ramakrishna Ashrama, Mysore
23) A hand book of South Indian Images. T.N. Srinivasan
Tirumala Tirupati Devasthanams, Tirupati

## Books on Culture and Religion

1) A Cultural History of India. ... ed. A.L. Basham
2) The Cultural Heritage of India. ....R.K. Mission
3) The Civilisation of Ancient India ....Louis Renou
4) Comparative Aesthatics ....vol II.
.... Dr. Kanti Chandra Panday
5) Encyclopaedia of Religion and Ethics
.... ed. James Hastings
6) Facets of Indian Culture ....R. Srinivasan
7) Foundations of Indian Culture ....Sri Aurobindo
8) Hindu Sastras and Samskaras ... A.V.K. Iyer
9) Hindu Polity & Political Theories Part-I
.... Narayana Chandra Bhadhopadhya
10) Hindu America .... Chaman Lal
11) The History of Aryan Rule in India ....H B Havell
12) Glimpses of Ancient India. ....Dr. Radha Kumud Mookerji
13) Hindu Civilization ....Dr. Radha Kumud Mookirji
14) The story of Civilisation Part-I Our Oriental Heritage
.... Will Durant
15) Immortal India Vol I .... J. H. Dave
16) India's Past ... A A Macdonell

17) India in the time of Patanjali ....Dr. Balinath Puri

18) Indian Education .... P.E. Keay

19) India in Kalidasa .... B.S. Upadhyaya

20) India – A Synthesis of Cultures ....Kewal Motwani

21) Philosophies of Life – Heinrich Zimmer ....ed. Joseph Campbell

22) Social and Religious Life in Grihya Sutras .... V. M. Apte

23) The Three Aptyns and their Descendants .... C. Ramachari

24) Yogic Powers and God Realisation ....V.M. Bhatt

25) Studies in Skanda Purana Part-I....Dr A B.L. Awasthi

26) Gods and Heros of the Greeks ....H.P. Rose

27) Foundations of Indian Culture ....K M. Munshi

28) The History and Culture of the Indian people- The Vedic Age .. ed. A.C. Majundar

29) Early History of India ....V. D. Mahajan, S. Chand & Co.,

## Dictionaries & Lexicans

1) Encyclopaedia Britanica

2) Encyclopaedia of Religion & Ethics

3) Sanscrit – English Dictionary ....Sir Monier Monier Williams

4) Students Sanscrit English Dictionary ....V. S. Apte

ఇవి కాక యిందు పొందుపఱుపని యనేక సంస్కృతాంధ్ర భాషా (హిందీ గ్రంథములు, ఆంగ్లగ్రంథములు, పత్రికలు సందర్భానుసారముగా నాయా చోట్ల పథస్సూచికలుగా నుటంకింపఁబడినవి.

# సవరణలు

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 2 | 13 | సాథు | సాధు |
| 6 | 11 | కల్పయంతి | కల్పయంతి |
| 11 | 4 | ధేపై | దేపై |
| 13 | 8 | మథుర | మధుర |
| | 22 | అధిశాయి | అధిధాయి |
| 14 | 10 | ఇంద్రాగ్ని... సోఖ్యం | ఇంద్రాగ్నీ....సోమ్యం |
| 16 | 21 | మర్శ్యకృత్ | మర్మ్యకృత్ |
| 29 | 21 | యన్నిదృశ్యతే | యన్నదృశ్యతే |
| 54 | 4 | వర్థకీన్ | వర్ధకీన్ |
| 61 | 9 | విశ్వరూపాయా | విశ్వరూపాయ |
| 62 | 25 | నిష్టద్దైన | నిష్ఠద్దైన |
| 63 | 6 | స్తిమితాగ్రతారై | స్తిమితోగ్రతారై |
| 70 | 21 | నందలి ప్రాచీన | నం దలిప్రాచీన |
| 72 | 4 | మధ్వా నవాయుజః | మధ్వా న వాజయుః |
| | 14 | ఋగ్వేద 1-18 12 | ఋగ్వేద 1-122-14 |
| 80 | 17 | మథురాంశ్చ | మధురాంశ్చ |
| 96 | 28 | Synomymons | Synonymous |
| 98 | 4 | ఇమాం సాత్వా | ఇమాం పాత్వా |
| 108 | 15 | వేశ్వని | వేశ్మని |
| 115 | 19 | రవ్యముగా | రమ్యముగా |
| 118 | 17 | వేశ్మప్రఘాణ | వేశ్మప్రఘాణప్రపా |
| 120 | 6 | వాసుపరిగ్రహాన్ | వాస్తుపరిగ్రహాన్ |

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 133 | 6 | ప్రతియమా | ప్రతియయా |
| | 11 | ఇవోదిత | ఇవోదితః |
| 136 | 20 | చేసికొనుచదుంరు | చేసికొనుచుందురు |
| 143 | 19 | నది | నదీ |
| 150 | 9 | సముంతతః | సమంతతః |
| | 10 | నభసీవ....విచరంత్యో | నభసీవ....విచరంత్యో |
| 163 | 15 | త్వష్టప్రజాపతేః పత్రో | .... ప్రజాపతేః పుత్రో |
| 168 | 21 | స్త పతిః | సపత్రీః |
| 169 | 8 | స్థాణునక్రఝషాకులామ | స్థాణునక్రఝషాకులామ్ |
| 179 | 12 | పతుష్పథము | చతుష్పథము |
| 185 | 12 | కధిక, రక్ష | కధికరక్ష |
| 186 | 3 | సముధూచ్ఛిష్ట | సమధూచ్ఛిష్ట |
| | 23 | క్షేద్రం మధు | క్షౌద్రం మధు |
| 191 | 13 | మహాత్మ్యము | మాహాత్మ్యము |
| 203 | 6 | పాసాద | ప్రాసాద |
| 204 | 11 | దటీ యవచ్చు | దటీయవచ్చు |
| 205 | 1 | రదశాలలు | రథశాలలు |
| 205 | 3 | హస్తిసూత్రాణ్యశ్వ సూత్రాణి | హస్తిసూత్రాణ్యశ్వసూత్రాణి |
| 214 | 22 | రధశాలలు, రధధ్వనులు | రథశాలలు రథధ్వనులు |
| 215 | 5 | రధశాలాసు | రథశాలాసు |
| 2 9 | 12 | ర్నగాకారైర్ | ర్నగరాకారైర్ |
| 221 | 16 | రాజానావనద్రుహో.... | రాజానావనభిద్రుహో ధ్రువే |
| 221 | 22 | Owe | Our |

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 222 | 16 | మహాదిష్ఠాన.... త్రిశ్యంతోపాన | మహాధిష్ఠాన.... త్రింశత్సోపానవేదికామ్ |
| 223 | 3 | కలాపములపట్టులు | కలాపములకాటపట్టులు |
| 225 | 21 | శక్రస్య | శక్రస్య |
| 231 | 14 | వరుణస్వామితప్రభా | వరుణస్యామితప్రభా |
| 233 | 20 | చితమగ | చిత్రముగ |
| 235 | 9 | యిట్టిదని తెలం గెలుగంగ | యిట్టిదనిదానితెలంగెలుగంగ |
| 240 | 22 | వృత్తయః | వృత్తయః |
| | 25 | Calestial | Celestial |
| 242 | 8 | యశస్వినీ | యశస్వినీమ్ |
| | 9 | సర్వరత్నం | సర్వరత్న |
| 243 | 11 | నోవి | నోలి |
| 244 | 6 | ప్రముతాని | ప్రయుతాని |
| 247 | 11 | పరిక్షేత్ర | పరిక్షేత |
| 261 | 20 | వైచిత్ర్యము | వైచిత్ర్యము |
| 262 | 14 | యమోనోక్తా | మయేనోక్తా |
| | 19 | thosand | thousand |
| | 23 | మయేనాక్తాః | మయేనోక్తాః |
| 263 | 14 | సత్కృతుండయి | సత్కృతుండయి |
| | 17 | మణిముదికా | మణిముద్రికా |
| 264 | 4 | భ్రాహ్మణులకు | బ్రాహ్మణులకు |
| | 5 | సంపధాయము | సంప్రదాయము |

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 267 | 2 | సహస్రార్ ... మవ | సహస్రార్ ... మమ |
| | 22 | Jouiers | JOINERS |
| 275 | 3 | మణికటిమము | మణికుట్టిమము |
| 276 | 10 | జంద్రికాసుంద రంబు | జంద్రికాసుందరంబు |
| 279 | 9 | నగరో ప్రాంత | నగరోపాంత |
| | 14 | జముదారూణి | జతుదారూణి |
| | 15 | నర్మాణి | సర్వాణి |
| 281 | 4 | నా వారికి | వారికి |
| | 8 | వ్యాఘ్రు | వ్యాఘ్రా |
| | 21 | సర్పిర్జతు మిశ్రితమ్ | సర్పిర్జతు విమిశ్రితమ్ |
| | 22 | వ్యల్తి | వ్యక్త |
| | 24 | మంజ | ముంజ |
| 282 | 2 | హ్వాప్తై | హ్యాప్తై |
| | 5 | గంథయుము | గంధయుక్తము |
| | 9 | సందీషక | సందీపక |
| | 26 | ప్రాకారము :కు | ప్రాకారమూలమ్ |
| 283 | 6 | కపాటయు | కపాటయుక్త |
| 285 | 2 | భారర | భారత |
| 286 | 2 | శ్చికకార్యై | శ్చిత్రకార్యై |
| 288 | 5 | చప్పరము | చప్పరము |
| 292 | 18 | పూజ్యితే | పూజితే |
| 294 | 26 | alulded | alluded |

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 299 | 5 | స్వయ వరంబున | స్వయంవరంబున |
| 307 | 2 | శి ్పమునకు | శిల్పమునకు |
| | 4 | వెలసిన | వెలయుటకు |
| | 20 | literar | literary |
| | 22 | lithve | lithic |
| 320 | 13 | rewains uneasthed | remains unearthed |
| | 18 | gollories | galleries |
| | 26 | fathers | bathers |
| 325 | 26 | Madically | radically |
| 326 | 13 | ఋగ్వేద 0-22-8 | ఋగ్వేద. 10-22-8 |
| 328 | 6 | శస్త్రా స్తనిర్మాణాదికము | శస్త్రాస్త్రనిర్మాణాదికము |
| 3.9 | 20 | Undoubted | Undoubtedly |
| 330 | 11 | వృత | వృత్ర |
| 332 | 5 | సమీవవర్తు | సమీపవర్తు |
| | 20 | a | at |
| 333 | 17 | మఘన | మఘవ |
| 334 | 6 | లక్షములు | లక్షణములు |
| | 22 | విద్యాభపనములు | విద్యాభవనములు |
| | 26 | శాస్తు | వాస్తు |
| 335 | 13 | ప్రాజాపత్యము | ప్రాజాపత్యము |
| | 22 | కౌటల్యుని | కౌటిల్యుని |
| | 27 | 1 రజ్జువులు | 2 రజ్జువులు |
| 336 | 15 | వాస్త పురుషనకు | వాస్తుపురుషునకు |

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 336 | 16 | నదౌ | దదౌ |
| 337 | 28 | అధర్వణ | అథర్వణ |
| 338 | 21 | పూజింపవలెసు | పూజింపవలెను |
| 340 | 7 | విద్యుక్తముగ | విధ్యుక్తముగ |
| 341 | 22 | విధానస్తు | విధానస్తు |
| 342 | 3 | స్ధాపనం | స్థాపనం |
| | 14 | సూ_ము | సూత్రము |
| 343 | 8 | ప్రవేశించుటకు | ప్రవేశించుటకు |
| 344 | 5 | కృత్యాఽభీష్టం | కృత్యాఽభీష్టం |
| 345 | 2 | వాస్త్రాష్పతి | వాస్తోష్పతి |
| | 5 | వాస్త్రాష్పతీ | వాస్తోష్పతే |
| 346 | 3 | వాసోష్పతిః | వాస్తోష్పతిః |
| | 12 | మానస్య | మానస్య |
| | 13 | స్వభ్యం....రయింథా | స్మభ్యం....రయిం దాః |
| | 23 | వాసోష్పతేః | వాస్తోష్పతేః |
| | 27 | అథర్వవేచ | అథర్వవేద |
| 347 | 2 | వాసోష్పతి | వాస్తోష్పతి |
| | 23 | కాశయమిచ్చు | కాశ్రయమిచ్చు |

పయి పట్టికలో కొన్ని సవరణలు చూపితిమి. మా దృష్టి గోచరముకానివి మఱికొన్ని యుండవచ్చును. సహృదయులు వానిని సవరించుకొని చదువుకొన ప్రార్థన.